# తాళ్ళపాక పద సాహిత్యం

**ఐదవ సంపుటం**

అన్నమయ్య ఆధ్యాత్మిక గ్రంథాలయం,

గుంటూరు

రేకు: 0301-1 సాళంగనాట సంపుటం: 11-001

పల్లవి: నీ విన్నిటా నేర్పరివి నే నంతేసి నేరను
మోవి గిరపే నింతె ముంచి యేమి సేసేరా

చ. 1: కప్పురము నోటి కిచ్చి కాఁక లెల్లా రేఁచేవు
యెప్పటివాడవె కావా యేరా నీవు
అప్పటి మంచివాఁడవై యానలు వెట్టుకొనేవు
రెప్ప లెత్తి చూచే నింతె రేసు లేమి సేసేరా

చ. 2: అంచెలను విడె మిచ్చి ఆసలు వుట్టించేవు
మంచి చుట్టుమవె కావా మాకు నెప్పుడు
లంచము మో విచ్చె నంటా లావులనె పెనఁగేవు
మంచానకుఁ దీనే నింతె మరి యేమి సేసేరా

చ. 3: గందవొడి మీద జల్లి కాగిలించుకొనేవు
అందగాఁడవె కావా అన్నిటా నీవు
పొందుల శ్రీవెంకటేశ భోగించితివి నన్ను
మందెమేళా లాడే నింతె మరి యేమి సేసేరా

రేకు: 0301-2 పాడి సంపుటం: 11-002

పల్లవి: ఏమి బాఁతి నే నీకు యిటు నాకె దక్కితిని
దోమటి నిందుకె పో నీ తొత్త నైతి నేను

చ. 1: మన్నించి విచ్చేసితివి మా యింటికి నేఁడునీవు
కన్నుసన్న నేసితేనె కా దన వైతి
పిన్నదాన నవక నా ప్రియమె చేకొంటివి
యిన్నేసి నావలపుల కెల్లా లోనైతివి

చ. 2: తప్పక చూచినంతలో దగ్గరి కూచుండితివి
కప్పురవిడె మిచ్చితేఁ గైకొంటివి
చెప్పినట్టల్లాఁ జేసి చేఁతలకు గురైతివి
యిప్పుడు నా యంకెలకు యియ్యకో లైతివి

చ. 3: గక్కనఁ గాగిలించితే కన్నులు దేలించితివి
పక్కన నా రతులకు భ్రమసితివి
యిక్కువ శ్రీవెంకటేశ యిందునె నన్ను గూడితి
మిక్కిలి నాయెడ కూనుమేలువాఁడ వైతివి

రేకు: 0301-3 హిజ్జిజి సంపుటం: 11-003

పల్లవి: నీ వోజగా దిది ని న్నెఱఁగనా
బూవపుసరసా లేల పూఁచ వచ్చేవూ

చ. 1: అంగనమొగము చూచి అప్పటప్పటికి నాతో
యెంగిలిమాటలు నేర్చి యే లాడేవు
సంగడి జాణతనాలు సతు లెల్ల నాడఁగాను
జంగిలివలపు లేల చల్ల వచ్చేవూ

చ. 2: తరుణి అప్పణగొని తమకించి నాతోడ
యెరవుల నవ్వులు నీ వేల నవ్వేవు
వరుస వంతులవారి వాసుల గొంత రేఁచుక
పొరుగు పొరచు లేల పుయ్య వచ్చేవూ

చ. 3: యింతి కైదండ వట్టుక యిప్పు డిట్టె నామీఁద
యింతలోనె నీ చేయి యేల వేసేవు
బంతినె శ్రీవెంకటేశ పై కొని నన్ను గూడితి
దొంతరరతుల కేల దొమ్మి సేసేవూ

రేకు: 0301-4 సాళంగం సంపుటం: 11-004

పల్లవి: ఆవధరించవయ్య అనుమాన మిఁక నేల
చివురుఁజేతులనె సేసెవెట్టీ నిదివో

చ. 1: కాంత మోవివిందు వెట్టి కన్నులనవ్వుఁజూపుల
వింతలుగ గప్పురపువిడే లిచ్చి
పొంతనె సరసముల పువ్వుబాసికేలు గట్టి
చింత దీర చెనకుల సేస వెట్టీ నిదివో

చ. 2: పక్కనఁ దనతొడలఁ బానుపు వరచి నీకు
గక్కన మోహా లనేకట్నా లిచ్చి
వెక్కసపుఁ దమకాల వియ్యము లట్టె యంది
చిక్కని చనుగుబ్బలనేస వెట్టీ నిదివో

చ. 3: దొమ్మిఁ గాఁగిటనే గురుతుల సొమ్ము లెల్ల నించి
నెమ్మది నానందముల నెలవుకొని
కొమ్మ శ్రీవెంకటేశుఁడ కూడె నిన్ను మేడలోన
చిమ్ముఁజెమటల ముత్తేలసేస వెట్టీ నిదివో

రేకు: 0301-5 ముఖారి సంపుటం: 11-005

పల్లవి: ఆయము లీఁక నిద్దరి కంటుఁ గాక
చేయివల్ల నుండ నేలె చేఁతల యాతనికి

చ. 1: నిగ్గుల నాతఁ డన్నియు నీకెతోఁ జెప్పఁగాను
యెగ్గు లేల పట్టేవె యేమే నీవు
సిగ్గులు నిను రేఁచితె చింతఁ బొరలేదానవు
దగ్గరి కూచుండ నేలె తమకపాతనివి

చ. 2: నెమ్మది నీమోము చూచి నీవిభుఁడె నవ్వఁగాను
యెమ్మె లేల సేసేవె యేమే నీవు
కమ్మ నీకు మొక్కి తేనె కాఁక రేఁగేదానవు
చెమ్మఁజెమ టార్చ నేలె సేవల నాతనికి

చ. 3: వెకలి శ్రీవెంకటాద్రివిభుఁ డిట్టె కూడఁగాను
యెకసక్కే లే లాడేవె యేమే నీవు
వొకటొకటికి నీవు వొరసెటిదానవు
మొకమిచ్చ లాడ నేలె మొదలె యాతనిని

రేకు: 0301-6 రామక్రియ సంపుటం: 11-006

పల్లవి: దండ నుంటే గైకోఁడు దవ్వుల నుంటేఁ బైకొను
చండి సేసేది అతని సాజమే కాదా

చ. 1: పెనఁగి కానకుంటేను పిలువ నంపు నని
మొనసి నీతో నంటి మొదలే కాదా
పొనిఁగి మీరు నాకు బుద్ధి చెప్ప రాకు మని
మనుపనె చెలులాల మొక్కితి గాదా

చ. 2: మంకుతోడ నూరకుంటే మాటలాడించు నని
అంకెల నీతో నవ్వితి నందుకే కాదా
వంక లొత్తి మాకు మీరు వలపు రేఁచకు మని
పొంకాన మీదాన నని పొందైతిఁ గాదా

చ. 3: యింటిలో నే నూరకుంటే యీడకే విచ్చేసు నని
దంటనై సన్న సేసితి దానికే కాదా
అంటుక శ్రీవెంకటేశుఁ డలమె దూరకుడని
జంటై మీ సమ్మతినె చక్క నుంటిఁ గాదా

రేకు: 0302-1 నాదరామక్రియ సంపుటం: 11-007

పల్లవి: చవులు వేరె వేరె సరసులకు వలపు
యువిదలకుఁ బతుల కొక్కటే వలపు

చ. 1: కనుకలివేళను కలుగు నొక్కవలపు
వినుకలిఁ బొడమేది వేరె వలపు
అనఁగి పెనఁగేవేళ నదియు నొక్కవలపు
వొనరినప్పు డిన్నియు నొక్కటే వలపు

చ. 2: సరస మాడెటివేళ సంగతౌ నొక్కవలపు
సరి నెడమాటలది జంటవలపు
తెరమరఁగున నుండి తేలించే దొకవలపు
వొరసి మర్మ మంటితే నొక్కటే వలపు

చ. 3: వుపరతి సమరతి నుండు నొక్కవలపు
యెపుడూనుఁ దలపోఁత లేకవలపు
రప మై శ్రీవెంకటేశ రతి నన్నుఁ గూడితివి
వుపమించి చూడ నింతా నొక్కటే వలపు

రేకు: 0302-2 సామంతం సంపుటం: 11-008

పల్లవి: ఓర్చుక నావద్ద నున్నాఁడవు
తేర్చి నాగుణము తెలిసితివా

చ. 1: నెలఁత నీకు నటు-నేర్పిననేర్పుల
మలకలమాటలు మఱచితివా
పలుకవు మాతోఁ బలుమారు నవ్వేవు
కెలయ కిందుకనె గెలిచేవా

చ. 2: వనిత నీకు నటు వంతులు వెట్టిన
మనసులో పనులు మఱచితివా
పెనఁగక నాతో బ్రియములు చూపేవు
ననుపు లిందుననె నడపేవా

చ. 3: కాంత నీవు ననుఁ గలయు మనిన యల
మంతనపురతులు మఱచితివా
యింతట శ్రీవెంకటేశ్వర ననుఁ గూడితి
సంతత మిట్లనె జరుపేవా

రేకు: 0302-3 శుద్ధవసంతం సంపుటం: 11-009

పల్లవి: అందాఁకా నీకు మొక్కుతా నంతా నింతా నుండేఁ గాక
యిందరిలోఁ బదరితే నిది సిగ్గు గాదా

చ. 1: ఆవల నీ వొకతెతో అట్టె మాటలాడఁగాను
చేపట్టి తియ్యగ బోతే సిగ్గు గాదా
వావిరి నాపెయు నీవు వసంతము లాడఁగాను
యీ వేళ నీ మోము చూచి దిది సిగ్గు గాదా

చ. 2: కోరటు పరాకై నీవు కొమ్మను గూడుండగాను
చేరి నీతో నవ్వఁబోతే సిగ్గు గాదా
గారవించి యాపెతోయాకతము నీ వాడఁగాను
యీరీతి దగ్గరితేను యిది సిగ్గు గాదా

చ. 3: అక్కడిరతుల నీవు అలసి వుండేవేళ
చెక్కులు నే నొక్కితేను సిగ్గు గాదా
గక్కన శ్రీవెంకటేశ కలసితి విటు నన్ను
యిక్కడ నవి దడవే దిది సిగ్గు గాదా

రేకు: 0302-4 మధ్యమావతి సంపుటం: 11-010

పల్లవి: కాంతలకుఁ బతులకు కల సాజమె యిది
వింతదాననా నీకు వెర పేలమ్మా

చ. 1: కందువకు దీసేది కన్నుల నదలించేది
యిందరికి గలదె యే మమ్మా
యిందుకుఁగా నాతఁడు యెగ్గు వట్టీనా నిన్ను
విందుల వెరపు చల్లీ వెర పేలమ్మా

చ. 2: పెనఁగితేఁ దిట్టేది బెరసితే మెచ్చేది
వనితల కీపాటి వలె నమ్మా
చన విచ్చె నాతఁడు సలిగె గలదు నీకు
వెనక ముందరి కింక వెర పేలమ్మా

చ. 3: కూడి యిట్టె చొక్కేది గురుతులు నించేది
పాడి పంత మెక్కె నీకు పైపై నమ్మా
వోడక శ్రీవెంకటేశుఁ డురమున బెట్టె నిన్ను
వేడుకకు వెల లేదు వెర పేలమ్మా

రేకు: 0302-5 రామక్రియ సంపుటం: 11-011

పల్లవి: సిగ్గరి చెలులము నీచిత్తము వచ్చునో రాదో
యొగ్గులు తప్పు లెంతుము యింతేసికి నోప

చ. 1: చనవు లెల్ల నెరపి సలిగెలఁ బొరలుచు
ననుపు నీ కాపె సేసీ నాయెదుటనె
మనసు వచ్చు నీ కది మాకు నిన్ను నన నేల
చెనకి యింకా బనులు నేయించుకో నీవు

చ. 2: తగులాలు చెప్పుకొని దండ నుండి కుంచ వేసి
నగీ నాపె నీతోను నాయెదటనె
జిగి నీకు బ్రియ మిది చింతలు రేఁచఁగ నేల
వొగరు లే కింకా నందె వోలలాడు నీవు

చ. 3: అంటి మేను దాఁకించి ఆకుమడిచి నీ కిచ్చి
నంటు సేసీ నీతోను నాయెదుటనె
గొంటవై శ్రీవెంకటేశ కూడితిని నన్ను నిట్టె
దంటతనమున నవి తలఁచుకో నీవు

రేకు: 0302-6 కేదారగౌళ సంపుటం: 11-012

పల్లవి: వెలఁది నీరతుల వీఁగ దిఁక
నిలవున నెమ్మెలు నెరపకు వయ్యా

చ. 1: పలుమరు నీతో పంతము లాడఁగ
చెలియకుఁ గచుములు చేఁ గెక్కే
చలమునఁ బై కొని సాములు సేయఁగ
మొలకలపులకలు మొన లాయ

చ. 2: సరసము నీపైఁ జల్లఁగ జల్లఁగ
వరుస గోరికొన వాఁ డెక్కే
సరుగఁ గూరిమి గొసరఁగఁ గన్నుల
నిరతపు మెఱుఁగులు నిండె నవే

చ. 3: వొప్పుగ మేనులు వొరయఁగ మీకును
చిప్పిలుఁ జెమటల చిత్తు కెక్కే
అప్పుఁడ శ్రీవెంకటాధిప కూడితి
కప్పురగందికి కళ లవె మించే

రేకు: 0303-1 వసంతవరాళి సంపుటం: 11-013

పల్లవి: పంతపువా రెల్ల నిటువలె మొక్కేరా
యింత నీవు నావలె యెన సుండేరా

చ. 1: యీకడ తమ అంకెల కింతె కాక కాంత లెల్ల
నీ కిచ్చకము లాడేరా నేనె కాక
మేకొని మీఁద మిక్కిలి మేనరికపువా రింతె
నాకొలఁది నీసేవకు నన్నుఁ బోలేరా

చ. 2: వలచినవారు తమవైపులె చూతురు గాక
నెల వై నిన్ను మెచ్చేరా నేనె కాక
వొలసి యిందరు నీ నవ్వులతోడివా రింతె
నలువంక నీపట్టుకు నన్నుఁ బోలేరా

చ. 3: పచ్చిగా గూడినవారు పరవశు లింతె కాక
నిచ్చ నిన్నుఁ జొక్కించేరా నేనె కాక
యిచ్చఁ గూడితి శ్రీవెంకటేశ నన్నుఁ బరు లెల్ల
నచ్చుల నీలాగులకు నన్నుఁ బోలేరా

రేకు: 0303-2 హిందోళవసంతం సంపుటం: 11-014

పల్లవి: ఆపాటి కాపాటి అంతే చాలు
యేపొద్దు నీజాడ లెల్ల నెరఁగనా నేను

చ. 1: ప్రేమము లేనిమాట పెదవిపైనె వుండు
కామించని చూపు లెల్లఁగడల నుండు
ఆముకొని తలపోఁత లాతుమలోననె వుండు
యేమిటికి నును ముట్టే వెరఁగనా నేను

చ. 2: తమి లేనిపొందికలు తనువుమీఁదనె వుండు
కొమరాఁక లెల గోరికొనల నుండు
అమరని సరసాలు ఆసాసలై యుండు
యిముడకు మమ్ము నందతే నెరఁగనా నేను

చ. 3: అంకెకు రానివేడుక లరమరపుల నుండు
లంకె గానపెనఁగులు లావుల నండు
పొంకపు శ్రీవెంకటేశ భోగించితివి నన్ను
యింకా నేల అనుమానా లెరఁగనా నేను

రేకు: 0303-3 పాడి సంపుటం: 11-015

పల్లవి: ఊరకుండవయ్యా నీవు వువిదతో మారాడక
ఆరయ నొొచ్చము లేదు అంగనల కెపుడు

చ. 1: యే మాడిన నాఁటదాని కెగ్గులేదు తప్పు లేదు
నేమాన నూరకుండిన నేరమి లేదు
దోమటిగాఁ జూచినాను దొరతన మై తోఁచు
వేమారు నవ్విన నవి వేడుకలై నిలుచు

చ. 2: తల వంచుకుండినాను తగ్గు లేదు మొగ్గు లేదు
పలుకక వుండినాను భయము లేదు
బలుములై చూపినాను పంతము లై రతి కెక్కు
పెలుచుఁజేత సేసినా ప్రియము లై తగులు

చ. 3: మించి కాఁగిటఁ గూడిన మితి లేదు మేర లేదు
యించుక గుట్టున నున్న యెరవె లేదు
అంచల శ్రీవెంకటేశ అంగనఁ గూడితి విట్టె
మంచముపైఁ గూచుండిన మర్మము లై మించును

రేకు: 0303-4 బౌళి సంపుటం: 11-016

పల్లవి: ఎందు వొయ్యే మిఁకనూ యెరిఁగేము గాక నిన్ను
కందువలనె తెలిపేఁ గానీవయ్య యిపుడు

చ. 1: యింతుల తిట్లకును యెగ్గు వట్టేవారె కాక
సంతసించి నవ్వు నవ్వేజాణ లెవ్వరు
అంతలోనే నని వచ్చే వాయము సోఁక నాడి
పంత మెల్లఁ గనుకొనే పదవయ్య లోనికి

చ. 2: కొమ్మల సణఁగులకు గోర సేసేవారె కాక
సమ్మతించి మెచ్చు మెచ్చేజాణ లెవ్వరు
కమ్మర దీకోనేవు నీకడమ లెల్లాఁ బాపి
నమ్మి నీవోపిక చూచేఁ బదవయ్య లోనికి

చ. 3: మగువల మేకులకు మట్టుపడేవారె కాక
జగములోఁగా దనేటిజాణ లెవ్వరు
నిగిడి శ్రీవెంకటేశ నిన్ను నేనె కూడితిని
పగటు లేరుపరచేఁ బదవయ్య లోనికి

రేకు: 0303-5 కేదారగౌళ సంపుటం: 11-017

పల్లవి: చిత్త మెట్టుండెనో నేఁడు చేసిన నాచేఁతలకు
అత్తి మొక్కి అందుకె నీ వానలు వెట్టితిని

చ. 1: యీడు జోడై కూడి నీవె యిచ్చినచనవునను
ఆడినట్టె ఆడి నిన్ను నలయించితి
జాడతోడి నా వొళ్లి జవ్వనమదమునను
వోడక నీ వంటితేను వోప నంటిని

చ. 2: మంతనము లాడినట్టి మందెమేళముననె
పంతములే నీ యడకుఁ బచరించితి
అంతగా నీ విచ్చినట్టి అతిరాజసమునను
సంతసాన నీకు మంచము దిగ నైతిని

చ. 3: మదనకేలిఁ జొక్కించి మన సిచ్చినందువంక
పదిమారులును నిన్నుఁ బచ్చి సేసితి
యిదె శ్రీవెంకటేశ్వర నీ వెనయుపరవశాన
వుదుటు మీరఁగ నీవురముపై నెక్కితి

రేకు: 0303-6 శ్రీరంగం సంపుటం: 11-018

పల్లవి: ఎందరి భ్రమించితివో యిటువలెనే
యెందును నీ మర్మ మిది యెరఁగ మైతిమిరా

చ. 1: మచ్చికల నీతోడ మాటలాడి నిన్నటి
మచ్చరపుటుకలు మరచితిని
మచ్చుట నీవిటువంటి మెకమాయకాఁడ వౌత
యిచ్చలోన నేము తొల్లె యెరఁగ మైతిమిరా

చ. 2: పక్కన నిన్ను దగ్గరి పంతపుమాట లెల్ల
మక్కళించి యాడ నీతో మరచితిని
గక్కన నీ వింతతమకములు నేరుచుకొంట
యిక్కువగా నేఁడు నేము యెరఁగ మైతిమిరా

చ. 3: పెనఁగి పెనఁగి నీతోఁ బెట్టుకొన్నవొట్లెల్ల
మన సిచ్చి కూడి నే మరిచితిని
ననిచి శ్రీవెంకటేశ నాఁటఁకీడ వవుత నిన్ను
యెనసినవేళ నేమీ నెరఁగ మైతిమిరా

రేకు: 0304-1 లలిత సంపుటం: 11-019

పల్లవి: ఇంక నేఁటి బిగువు యేల నీకును
వంక లొత్త నొరగులౌ వాసిమీఁదను

చ. 1: తిలకించి నీచేఁతకు తిట్టు కేల మానును
చలిమి బలిమిఁ గల జవరాలు
అలుగ నీకుఁ దగదు ఆయములు సోఁక నాపె
ఆలమి లోనికి దీసె నందుమీఁదను

చ. 2: చెనకే నీ మాటలకు చేయి చాఁచ కేల మాను
మనసు మర్మము గన్న మదిరాక్షి
పెనఁగ నీకుఁ దగదు ప్రేమములు రేఁగ నాపె
అనువుగగా కళ రేఁచె నందుమీఁదను

చ. 3: కూడిన నీకూటమికి కొన కెక్క కేల మాను
సూడుఁ బాడు నెరింగిన సుదతీమణి
యీడనె శ్రీవెంకటేశ యెనసి నిన్నిదె యాపె
ఆడుకోలు చెల్లించె నందుమీఁదను

రేకు: 0304-2 మంగళకౌశిక సంపుటం: 11-020

పల్లవి: చేసినంతే చేఁతగాక చెలు లెల్లా నీపట్టుకు
తాసువలె మెలఁగితే తగ వెటిఁగేవా

చ. 1: వద్దనుండి నీ కాపె వలపులు రేఁచఁగాను
బుద్ది చెప్పితే వినేవా పొరుగువారు
వుద్దండానవె నిన్ను వొడివట్టి తియ్యఁగాను
కొద్ది నుంటి వింతే కాక గుణ మెరిఁగేవా

చ. 2: నలుగడ నాకె నీతో నవ్వు లట్టె నవ్వఁగాను
పిలిచినాఁ బలికేవా పెరవారు
చలము సాదించి నిన్ను సరిఁ గాఁగిలించు కొఁగా
కలయ వచ్చేవు గాక కరఁగేటి వాఁడవా

చ. 3: రతులచవులు చూపి రచ్చ నిన్ను వేయఁగా
యితవు సేసితేఁ జవులా యింటివారు
మితి మీరి నేఁ గూడఁగ మెల్లనె శ్రీవెంకటేశ
తతిఁ జేకొంటివి గాక తగిలేటివాఁడవా

రేకు: 0304-3 సామంతం సంపుటం: 11-021

పల్లవి: ఊడిగపువారము నీ కొప్పించేము లోనిమాట
వేడుకఁ దెలుసుకొమ్మీ వేరె వేరె నీవు

చ. 1: చిలుకలు వలికీని చెవి యొగ్గి వినవయ్య
కలువలు వికసించెఁ గై కోవయ్య
చెలిమి సేసీఁ దీగెలు చేత నందుకొనవయ్య
వెల నీకుఁ జెప్పరాని విన్నప మిదయ్యా

చ. 2: జక్కవలు మెదలీని సరవులు చూడవయ్య
నిక్కెను మేఘ మదివో నీ వంటవయ్య
మిక్కి లద్దాలు మెరిచీ మించి నీడ చూడవయ్య
వెక్కసపు గుట్టుతోడి విన్నప మిదయ్య

చ. 3: వెన్నెల గాసీఁ జంద్రుఁడు వెలయఁగ మెచ్చవయ్య
సన్నల మోవిపండు చవి గొనవయ్య
నిన్ను శ్రీవెంకటేశుఁడ నీరాణివాసము గూడె
వెన్నవంటి మెత్తని విన్నప మిదయ్యా

రేకు: 0304-4 సాళంగనాట సంపుటం: 11-022

పల్లవి: ఏఁటివో నీకే తెలుసు నివి యిన్నియు
మాటు లేని నీగుణాలు మట్టు లేనివె

చ. 1: తేనెలు గారెడిమాట తేరకొన నాడేవు
కానుక వట్టిటిచూపు కడు జల్లేవు
లోనైరినీ కిందుకే లోకములో చెలు లెల్ల
వీనుల నీసుద్దు లైతే వినఁ గొత్తలె

చ. 2: కడు నీవినయుములు కస్తురివంటివె
బడిబడి నీవలపు పాలవంటిదె
విడువరు ని న్నిందుకే వీదివీదిసతు లెల్ల
తడవతే నీవిధాలు తమకించేవే

చ. 3: చెలఁగి నీకూటములు జిగు రయి అంటుకొను
అలరు నీముచ్చటలు ఆనందాలు
కలసితి విదె శ్రీవెంకటగిరీశ్వర నన్ను
బలు నీ మన్ననలు పైపై భాగ్యాలె

రేకు: 0304-5 నాదరామక్రియ సంపుటం: 11-023

పల్లవి: ఇందరము నెరిగితి మిఁక నేలా
సందడి సవతులలో సరి నుండుఁ గాకా

చ. 1: నిక్కి నిక్కి చూచి యాపె నీతో నేల సన్న సేసీ
రక్కసితనము మాని రమ్మన రాదా
దక్కి వున్నాఁడవు నీవు తనపాలిటికిఁ దొల్లె
వెక్కస మై నే నుండితే వెర పేల తనకు

చ. 2: అంత నింత నుండి నీతో ఆపె యాల నవ్వీని
వంతుకు నీతోఁ బెనఁగ వచ్చుఁ గాక
వింతవాఁడవా నీవు వేరు నే మింతే కాక
యింతేసి పనులు సేసె యిఁక నేల వెఱపూ

చ. 3: పొరుగుపొంతల నాపె పూఁచి ని న్నేల కూడీని
సిరులు నీసొమ్ము గాఁగఁ జేసుకో రాదా
యిరవై నన్నుఁ గూడితి విదె శ్రీవెంకటేశుఁడ
తెరవాసె వెర పేల తెల్ల మాయఁ బనులు

రేకు: 0304-6 మెంచబౌళి సంపుటం: 11-024

పల్లవి: అతఁడెంత నీ వెంత ఔ నవునే
ఘాతఁ బెద్దరిక మింతాఁ గట్టుకొంటివే

చ. 1: పంతము లన్నియును నీపతిపైనె నెరుపేవు
పొంతల నిన్నే మని పొగడుదునే
అంతటి నీకొనగోరు అతనిపై మోపితిని
దొంతరమొనలు చూప దొడ్డదానవే

చ. 2: చలము లితనిపైనె సాదించ నేరిచితివి
నిలిచె నింత లాభము నీవద్దనే
పిలువఁగానె పెనఁగి బీరమునుఁ జూపితిని
కలికితనము లిందె కైకొంటివే

చ. 3: యేతు లెల్ల శ్రీవెంకటేశ్వరునికె చూపేవు
నీతి నడచేవారిలో నీవే కదె
యీతల మామాటలకు నితని నిట్టె కూడితి
పోతరించి యిన్నిటా నీపుణ్య మాయఁ గదవే

రేకు: 0305-1 భైరవి సంపుటం: 11-025

పల్లవి: సిగ్గు వడ దప్పటినాచిత్తము నన్నుఁ గొసరీ
అగ్గలపుచనవులు అప్పిచ్చినవారమా

చ. 1: కరుణించి నీవు నన్నుఁ గాఁగిలించుకొంటి గాక
వరుసల మాపై నంత వల పున్నదా
సొరిది మన్నించి నన్నుఁ జూచితి వింతె కాక
సరవితో నే నీకుఁ జక్కనిదాననా

చ. 2: సేస వెట్టినవాఁడ వై చేకొంటివి గాక నాతోఁ
బాసి వుండనంత నాపైఁ బరా కున్నదా
బాస దప్పనందుకుఁగా పక్కన నవ్వితి గాక
ఆసలఁ బెనఁగ నీకు నందరిలోవారమా

చ. 3: నీవు ధర్మపుణ్యానకు నెల వై కూడితి గాక
దావతి నానలు వెట్టఁ దగ వున్నదా
శ్రీవెంకటేశ నన్నుఁ జెనకి మెచ్చితి గాక
వావులు చెప్పఁగ నీతో వడి మేనవారమా

రేకు: 0305-2 దేసాక్షి సంపుటం: 11-026

పల్లవి: ఇతరులే మెరుగదు రేమని చెప్పఁగ వచ్చు
పతులకు సతులకు భావజుఁడే సాక్షి

చ. 1: తలఁపు గలిగితేను దవ్వు లేమి నేరు వేమి
అలరి సమ్మతించితె నడ్డాఁక లేమి
కొలఁది మీరినప్పుడు కొంచ మేమి దొడ్డ యేమి
నెల విచ్చి యేకతానఁ జేసినది చేఁత

చ. 2: యిచ్చకమె కలిగితే యెక్కు వేమి తక్కు వేమి
హెచ్చినమోహములకు నెగ్గు సిగ్గేది
పచ్చి యైనపనులకు పాడి యాల పంతమేల
చెచ్చెరఁ దమకుఁ దాము చెప్పినది మాట

చ. 3: అన్నిటా నొక్కటియైతే నైన దేమి కాని దేమి
యెన్నికల కెక్కితేను యీడు జోడేది
వున్నతి శ్రీవెంకటేశుఁ డొనగూడె నేర్పు లివి
కన్నెలుఁ దాఁ గూడిన గతులే సంగతులు

రేకు: 0305-3 కాంబోది సంపుటం: 11-027

పల్లవి: ఎవ్వరీ బుద్దులు విన రెందాఁకాను
యివ్వల జాగరా లున్నా రెందాఁకాను

చ. 1: చక్కెరమోవులు వాడె సరసములలోనవె
యెక్కడి ఆలుకలు మీ కెందాఁకాను
ముక్కున నూర్పులు రేఁగె ముట్టీముట్టుక తొల్లె
యిక్కువ పంతములు మీ కెందాఁకాను

చ. 2: కన్నులఁ గావులు గప్పె కందువనవ్వులలోనె
యెన్నేసి వొట్లు వెట్టే రెందాఁకాను
తన్నుఁ దానె చెవరించె తనువుల నిద్దరికి
యిన్నిటా మీ మతకము లెందాఁకాను

చ. 3: మోమునఁ గళలు రేగె ముంచినసిగ్గులలోనె
యేమిటికి ననుమానా లెందాఁకాను
వేమారుఁ గూడితిరి శ్రీవెంకటేశుఁడును నీవు
యీ మాట లందరుఁ జెప్పే రెందాఁకాను

రేకు: 0305-4 సౌరాష్ట్రం సంపుటం: 11-028

పల్లవి: ఏల బుద్దులు చెప్పేరె యెందాఁకా నితనికి
తాలిమి గలితే నేమె తగ వెరిఁగేము

చ. 1: తలఁ పాకచో నుండఁగ తనపైకి దీసుకొని
బలిమి నేయఁగఁ బోతే పచ్చి దోఁచును
పెలుచుఁ జిత్త మాతనిఁ బెనఁగి యేమి సేసినా
చలములు రేఁగుఁ గాని చవి చాలదు

చ. 2: అవ్వల మాటలాడఁగ నందుకెతా మాటాడితె
పువ్వక పూచినట్టు పుల్లఁబారును
రవ్వగా నాతని నెంత రతలకుఁ దీసినాను
నవ్వుఁ బాటై యిందరిలో నారటిలునూ

చ. 3: యెందొ యెదురు చూడఁగా నెదిటికిఁ బోతేను
సందడి యనుచు మతి సమ్మతించదు
చెంది యింత చెప్పఁగాను శ్రీవెంకటేశుఁడు గూడె
మందలించి యివి యల్లా మచ్చికల కెక్కును

రేకు: 0305-5 పాడి సంపుటం: 11-029

పల్లవి: ఇంకా నేల నాచేతి యెడమాటలు
అంకెకు వచ్చున్న వాఁడు ఆడనె నీ వాడవే

చ. 1: తుచ్చము లే మాడితవో దూరు లెంత దూరితవో
ముచ్చట దీరఁ బతికి మొక్కవే నీవు
పచ్చిగా నీ మంచముపై పవళించి వున్నవాఁడు
యిచ్చకపుప్రియములు యేకతానఁ జేయవే

చ. 2: యే మని చెప్పించితివో యెంతేసి పెనఁగితివో
మోము చూచి వొక్కమాటు మొక్కవే నీవు
చే ముట్టక నీవద్దనె సిరసు వంచుకున్నాఁడు
కామించి యాతనిమతి కరఁగించఁగదవే

చ. 3: నవ్వులేమి నవ్వితినో నాలి యెంత సేవితివో
మువ్వంక నందుకుఁ దగ మొక్కవే నీవు
యివ్వల శ్రీవెంకటేశుఁ డిరవుగ నన్నుఁ గూడె
రవ్వలు సేయక లోలో రతుల మొప్పించవే

రేకు: 0305-6 బౌళి సంపుటం: 11-030

పల్లవి: కన్నవారిదె కాదా కందికుడు మన్నమాట
యెన్నఁడు జెప్పఁగ విని యెరఁగవో కాక

చ. 1: మక్కువ నీ రమణుఁడు మాయింటికి వచ్చె నంటా
యెక్కువతోఁ బిలవ నీ వేల వచ్చేవే
వొక్కరు నోచినసొమ్ము లొకరికి నేల వచ్చు
పక్కనఁ గైకొన్న వారిభాగ్య మింతే కాక

చ. 2: నాఁడు నీ వడిగేసొమ్ము నాకుఁ దెచ్చి యిచ్చె నంటా
వాఁడిమి నీ వేల యింత వాదించేవే
వేఁడయెట్టిమానిబంక వెట్టిమాన నేల యంటు
పోఁడిమి జేసినవారిపుణ్య మింతే కాక

చ. 3: నీ వరు సై వుండఁగాను నేఁడు నన్నుఁ గూడెనంటా
శ్రీవెంకటేశ్వరు నేల చిమ్మి రేఁచేవే
దేవర వర మిచ్చితే తేరకాఁడు పూజరి
భావించి తొల్లిటి దానఫల మింతే కాకా

రేకు: 0306-1 దేసాళం సంపుటం: 11-031

పల్లవి: మాతో నేల తన కింత మచ్చరాలు నీవె
పోతరించినయాపెకు బుద్దిచెప్ప రాధా

చ. 1: పక్కన నీతో నేను పదరి నవ్వితి నంటా
అక్కడనుండె సణఁగు లాపె ఆడీని
తక్కి చలిమి బలిమి తన కింత గలితేను
చిక్కించుక నిన్నేమైనాఁ జేయఁగ వలెఁబో

చ. 2: మంచముపై నీవు నేను మరిగి వున్నారమని
యించుకంత చూడ నోప కీసడించీని
నించి తన కంతేసి నేరుపే కలిగితేను
అంచల నిన్ను రప్పించి అదలించవలెఁ బో

చ. 3: కందువ నీవు నన్నుఁ గాఁగిట గూడితి వంటా
చెంది లోలోనే తాను చిన్నఁ బోయ్యీని
యిందుకు శ్రీవెంకటేశ యిన్నిటా తా జా ణైతేఁ
బొంది యిచ్చకము నేసి పొదుగఁగ వలెఁబో

రేకు: 0306-2 రామక్రియ సంపుటం: 11-032

పల్లవి: చిత్తగించు నీకు నేఁ జెప్పినదాననా
యిత్తల నంతేసి నీ వెఱఁగనివాఁడవా

చ. 1: నీవు మన్నించదాన నీకు వలచినదాన
యీవల నల్లది నాతో యీడుజోడుదా
వావాత నావాదు నీవు వహించుకో కుంటేను
చేవలు మీరి నిన్ను మోచినదాఁకా రాదా

చ. 2: సేస వెట్టితిని నీవు చేయి చాఁచితి నేను
వాసితో నల్లది నాతో వంతు వచ్చేదా
బాసతో నాకుఁగా నీవు పట్టి పెనఁగ కుండితే
ఆసల నాస లని అందాఁకా రాదా

చ. 3: దక్కితివి నీకు నాకు తగు లైతి నే నీకు
మొక్కక అల్లది నాతో మొన చూపేదా
యిక్కువఁ గూడితివి నన్నిట్టె మెరయించకుంటే
నిక్కి శ్రీవెంకటేశ్వర నిన్ను ముట్టి రాదా

రేకు: 0306-3 వరాళి సంపుటం: 11-033

పల్లవి: అంత సేసినవాఁడవు పంత మీవయ్య
చెంతల నీకుఁ బ్రియము చెప్ప దిదివో

చ. 1: చెక్కులు నొక్కిననొక్కు చిత్తమెల్లఁ బులకించి
మక్కువకామిని నీతో మాట లాడదు
అక్కడ నవ్వినవ్వు ఆయ మెల్లఁ గాఁడి పారి
చొక్కుచు నిన్నుఁ దప్పక చూడ దిదివో

చ. 2: సరస మాడినచేఁత సందుసందులనుఁ జిక్కి
వొరయుదు చన్నుల ని న్నూరికె చెలి
యిరవుగాఁ జూచినచూ పెదలోనఁ బాయదు
తెరమరఁ గెంతైన దియ్య దిదివో

చ. 3: బిగియించిన కాఁగిట ప్రియముల తల కెక్కి
వెగటుసంతోసముల విఱ్ఱవీఁగీని
నిగిడి శ్రీవెంకటేశ నీ వింతలోఁ గూడఁగాను
తగిలిన రతులకె తమకించీ నిదివో

రేకు: 0306-4 శ్రీరాగం సంపుటం: 11-034

పల్లవి: చలువలు వేండ్లు జరపఁగ నేటికి
నెల వగు మేలే నించఁగ రాదా

చ. 1: మోహము చెలిపై ముంచినవాఁడవు
దాహపువిరహము తర వేల
సాహసి మొదలనె చలముల కోపదు
యీహల నీవే యెఱుఁగుదు వికను

చ. 2: చేసన్నలనే చెనకినవాఁడవు
వాసులు సతిపై వంచుదురా
ఆసలనే కడు నలసిన దిందాఁక
ఆ సుద్దులు మ మ్మడుగకు మికమ

చ. 3: కాఁగిట నంగనఁ గలసినవాఁడవు
మాఁగినసిగ్గులు మరి యాల
చేఁగ దేర్చె నిదె శ్రీవెంకటేశ్వర
వీఁగక ననుపులు విడుమాకు మికనూ

రేకు: 0306-4 మాళవిగౌళ సంపుటం: 11-035

పల్లవి: వలెఁగా వేసాలు వద్దన్న మానఁడు
యెలయింపులమాటల నెంత సేసినె

చ. 1: కన్నుల నే మొక్కితేను కాఁక రేల రేఁగీనా
యిన్నిటాఁ జేతులు మోపి యేల చూపీనే
వెన్నెలబయట నుంటె వెత రేల రేఁగీనె
నిన్న నేటనె కతలు నేరిచేఁదాఁ గదవే

చ. 2: పొలసి నే నగితేను పులక లేల పుట్టీనె
యెలమిఁ జూడు మ నెన లేల పెట్టినె
చిలుకలు వలికితే చింత లేల పొడమీనె
మలక లెల్లఁ బెనచేమాయకాఁడు గదవే

చ. 3: గక్కునఁ గాఁగిలించితె కడుఁ జెమరించ నేలె
మిక్కిలి గోర నూరిచి మీఁదఁ జిమ్మీనె
యెక్కువ శ్రీవెంకేశుఁ డెనసె నన్నిటా నన్ను
చక్కరసరసముల జాణకాఁడు గదవే

రేకు: 0306-5 భైరవి సంపుటం: 11-036

పల్లవి: దైవము సేసిన మాయ తగ నింతేసి కాఁబోయి
నీవొళ్లికల్ల గాదు నిజమె యీమాఁట

చ. 1: చెప్పేవు సలిగెలు సేసేవు చేఁతలు
అప్పుడు ఆతఁడు నిన్ను నంటె నంటాను
కప్పురపుఁబడి తోడికాంత రెల్లా నుండఁగాను
దెప్పరపువారికి యీ తెక్కు లేల వచ్చును

చ. 2: సారె సారె నవ్వేవు సంగడిఁ గూచుండేవు
దూరి ని న్నాతఁడు కాలు దొక్కె నంటాను
చేరినట్టి సేసపాల చెలు లెల్ల నుండఁగాను
పోరచిసతుల కేల బూటకాలు వచ్చునూ

చ. 3: పెంచేవు పగటులు పెనచేవు వాపులు
ముంచి యొండొకమాటు ముట్టె నంటాను
యెంచఁగ శ్రీవెంకటేశు నింటిదాననేఁ గూడితి
పంచల నుండేవారికి బద్దు లేల వచ్చును

రేకు: 0307-1 హిజ్జిజి సంపుటం: 11-037

పల్లవి: ననుబోఁటి చెలు లెల్లా నవ్వరా నిన్ను పతి
చెనకినదాఁకా గుట్టు నేయంగ వలదా

చ. 1: కనుసన్న సేసితేనె కరఁగితి రమణుఁడు
తనువు సోఁకితే నెంత తమకింతువో
యెనసెటివేళనె యిన్నియు నయ్యీఁ గాక
అనువు నీ ప్రియములు అందరిలో వలెనా

చ. 2: మాటలాడినంతలోనే మరుగుగొంటి వాతఁడు
నాటఁగ నవ్వితే నెంత నయ మవుదువో
పాటించి యేకతమందె పచ్చి దేరీఁ గాక నీవు
వాల మైన సరసాలు వాకిటనె వలెనా

చ. 3: యిక్కువఁ గూడినంతలో యిచ్చితివి చన వెల్ల
మొక్కితే విభుని కెంత మోహింతువో
మక్కువ శ్రీవెంకటేశ్వమహిమ లీడేరుఁ గాక
చెక్కులు నొక్కక తొల్లె సిగ్గు లింత వలెనా

రేకు: 0307-2 ఆహిరి సంపుటం: 11-038

పల్లవి: ఇప్పటనుంటియు నేల యెరవు నేయకు వమ్మ
తప్పు లెల్ల వొప్పులుగా దగఁ జేసేఁ గాని

చ. 1: మచ్చిక నీ మాటతఁడు మన సొగ్గి వినీ నదె
విచ్చనవిడిని విన్నవించ వమ్మా
చెచ్చెర యీవేళ నీకుఁ జెల్లి నంతాఁ జేయవమ్మ
మచ్చరపు మా సుద్దులు మరి చేప్పేఁ గాని

చ. 2: నెలవై నాయకుఁడదె నీవంక చూచీని
సొలసి చక్కఁదనాలు చూపవమ్మా
బలి మెంత గలిగినాఁ బచరించవమ్మ యిట్టె
చలము వెనక నేనె సాదించేగాని

చ. 3: చేయి చాఁచి నీమీఁద జెనకేననీ యాతఁడు
ఆయ మెరిఁగి సరసా లాడవమ్మా
యీయెడ శ్రీవెంటేశుఁ డింత సేసీ నిన్ను గూడె
చాయ లేల సన్న లేలసంత మయ్యేఁ గాని

రేకు: 0307-3 ముఖారి సంపుటం: 11-039

పల్లవి: అందరుఁ జెప్పేరు విను అది దగవా
యిందరిలో బొంకను నీ కిది దగవా

చ. 1: చేరి గొల్లెతలు నీతో చీఁకటితప్పు సేసితే
ఆరితేరి నవ్వితివి అద దగవా
చీరలు దీసితి వట చేరి కొలనిదరిని
యీరీతి నింతటిదొర విది దగవా

చ. 2: చెలఁగి వుట్లపై దాఁచిన వెన్నలునుఁ బాలు
అలమి ఆరగించితి వది దగవా
కలపితి వట వారికట్టినదూడల నాల
యిలపై నీ వుద్దండాలు యింత దగవా

చ. 3: చక్కిలాలు నురుగు సతులు దాఁచిన వెల్ల
అక్కరఁ గైకొంటి మాట అది దగనా
గుక్కక శ్రీవెంకటాద్రికోమలపుకృష్ణుఁడవై
యెక్కి వేసాలు సేసే విది దగవా

రేకు: 0307-4 సాళంగం సంపుటం: 11-040

పల్లవి: నీవు నాతఁ డొక్కటె నేము నీవారమె
వోవరి లోననే వుండి వొడఁబా ట్లేఁటికే

చ. 1: మొక్కిన నీ మొక్కు లెల్ల మొదలి పెండ్లివిడేలు
చిక్కని నీనవ్వులె నేసపాలు
తక్కినసుద్దు లేఁటికి తగు లాయఁ బను రెల్ల
యిక్కడి కక్కడి కింక నెడమాట లేఁటికే

చ. 2: చూచినచూపులు నీకు చుట్టుపుసమ్మంధాలు
తాచినగంధాక్షతలు తలపోఁతలు
చేచేత మీ కిద్దరికి చేసిన చేఁతలు దక్కె
యేచ యిందరునుఁ జెప్పే యియ్యకో ళ్లేఁటికే

చ. 3: కలసినకలయిక కందువసోబనములు
పలుసంతసాలె మీ మీ బాసికాలు
యెలమి శ్రీవెంకటేశు నిటు నీవె కూడితివి
యెలయింపుఁ జెలులచే నెగపోఁత లేఁటికే

రేకు: 0307-5 రామక్రియ సంపుటం: 11-041

పల్లవి: ఇచ్చకము సేయ వచ్చే వే మందును
బచ్చెన సటకాఁడవు భళరా మెచ్చితిని

చ. 1: చేయి వట్టి పెనఁగేవు చెక్కు నొక్క వచ్చేవు
యీయెడ నీతో నింక నే మందును
చాయలకె నవ్వేవు సరసము లాడేవు
పాయపువగకాఁడవు భళరా మెచ్చితిని

చ. 2: చెలఁగి విడె మిచ్చేవు చెమటలు దుడిచేవు
యెలయింపు నీచేఁతల కే ముందును
వలపులు చల్లేవు వద్ద నిట్టె కూచుండేవు
బలిమి మాయకాఁడవు భళరా మెచ్చితిని

చ. 3: చన్నులపయి నొరగేవు సారె గాఁగిలించేవు
యేన్నేసి నీ వినయాలు యే ముందును
యిన్నిటా శ్రీవెంకటేశ యిట్టే నన్నుఁ గూడితిని
పన్నినగండికాఁడవు భఁళరా మెచ్చితిని

రేకు: 0307-6 శంకరాభరణం సంపుటం: 11-042

పల్లవి: తక్కినసుద్దులు తడవ మికఁ
చొక్కులఁ బెట్టుచు సొలయకువయ్యా

చ. 1: చెల్లుగడి గని చేసినచేఁతలు
చల్లనిమాటల సడి వాసె
తొల్లిటిదాననె తొడిఁబడఁ జెక్కులు
యిల్లిదె నొక్కే విదేఁటికయ్యా

చ. 2: పన్నిన మాయలఁ బాసినకాఁకలు
కన్నుల నవ్వుల కసి దీరె
చిన్నదాననె చేతికి లోనె
చన్నులు ముట్టేవు సట లేలయ్యా

చ. 3: అండనె కాఁగిట నలసిన అలయిక
నిండు మోవితేనెలఁ దేరె
వెండియు నిటు శ్రీ వెంకటేశ నమ
మెండుగఁ గూడితి మెచ్చితి నయ్యా

రేకు: 0308-1 మాళవి సంపుటం: 11-043

పల్లవి: ఇందుకుఁగా వట్టి వాదు లిఁక నీతో నేలయ్యా
పొందు లెల్లఁ జేకొంటిమి పొద్దున రావయ్యా

చ. 1: నీచేత మాటలకు నీకన్నుల తేటలకు
యేచి లోనైనవారికి నేల కోపము
పూచినట్టె వుండుఁ గాని పున్నమినాఁటివెన్నెల
చూచితేఁ బువ్వులు లేవు సోద్య మింతే కాని

చ. 2: సేసేటి నీ మేకులకు సెలవుల నవ్వులకు
ఆసపడ్డవారము మా కలు కేఁటికి
పూసినట్లనె వుండు పుప్పొడి పై రాలితేను
వోసరి గందమువలె వొళ్ల నేమ నంటదు

చ. 3: నిక్కపు నీ సేసలకు నిండిన నీ కాఁగిటికి
చిక్కినవారము మాకు చింత లేటికి
యిక్కువ శ్రీవెంకటేశ యేక మైతివి వలపు
లెక్కకు వచ్చినట్టుండు లేదు మితి మేరా

రేకు: 0308-2 నాదరామక్రియ సంపుటం: 11-044

పల్లవి: ఏమయ్య నీ దొరతన మిటువంటిదా
నీ మనసు నాపై బత్తి నే నెరగనా

చ. 1: ఆపె నిన్ను వెడమాట లాడఁగాను విని నీవు
యేపున నూరకుండితి వేమయ్య
నీ పొందు లిటువంటివా నిన్నిందరుఁ గనరా
వో పో నమ్మినదాని నొప్పగింతురా

చ. 2: వోరతోడ నాపె సేసే వుద్దండా లెల్లాఁ జూచి
బీరాన నీవు వచ్చి పెనఁగ వద్దా
నేరపు లేనివాఁడవా నీ వెరఁగవా యిన్ని
కోరి నీవే గతి యంటే కూడుక రావలదా

చ. 3: పొంచి యాపె చేసేసుక పోఁగా నేఁ డా గర్వ మెల్ల
తుంచి వేయకుంటె నది దోసము గాదా
మించి శ్రీవెంటేశుఁడ మే లిచ్చి నన్నుఁ గూడితి
తెంచి నా పగ లన్నియుఁ దీరిచితి విపుడు

రేకు: 0308-3 పాడి సంపుటం: 11-045

పల్లవి: మాన వెప్పుడును నీ మాయ లెల్లాను
నానిన నా ననుపులు నవ్వించీఁ గాని

చ. 1: వాలుకరెప్పలు నీపై వంచి నే నెంత లోఁచినా
తాలిమె చూపుదు గాక తత్తరించేనా
వాలాయించి రాతిగుండెవాఁడ వౌత యెఋఁగుదు
పాలుమాలిన నా యాస పాయ నీదు గాని

చ. 2: ఆయములు సోఁక మాటలాడి యంత కొసరిన
చాయకాఁడవె కాక సమ్మతించేవా
కాయకపు నీసరిత గట్టిగా నే నెరుఁగదు
పాయపు నా వేడుకలు పై కొలిపీఁ గాని

చ. 3: చిమ్ముచు నీ కాఁగిటిలో చేత లెంత నేసినాను
కుమ్మరించి నాతోను నీ గుట్టు చెప్పేవా
కమ్మటి శ్రీవెంకటాద్రి కడపరాయఁడవై
నెమ్మది గూడితి విదె నిజమాయఁ గాని

రేకు: 0308-4 సాళంగం సంపుటం: 11-046

పల్లవి: ఇటువంటి తగవులే యెక్కడ చూచినను
నటనలు బూమిలోన నడచీ నయ్యా

చ. 1: కన్నుల నవ్వినందుకు కాఁతాళించే వేమయ్య
యెన్ని కెగాఁ దిట్టితే నీ వేమి నేతువో
వున్నతి నెవ్వరుఁ దమ వొళ్లికల్ల చూచుకోరు
యిన్నిటాఁ దమ్ము సోఁకితే యెగ్గు పట్టఁ జూతురు

చ. 2: పైకొని మాటాడితేనె పగ చాటే వేమయ్య
యీకడ చెత నంటితే యేమి సేతువో
ఆకడఁ దమచేఁతలు అందము లనుకొందురు
లోకు లవి గాదంటే లోఁచి నా దడుతురు

చ. 3: మొక్కి మొకము చూచితే మొరయుచు జంకించేవు
యిక్కువ గోర గీరితే నేమి సేతువో
మక్కువ శ్రీవెంకటేశ మంచివాఁడ వై కూడితి
తక్కక వా రిది గంటే దంటవు నీ వందురు

రేకు: 0308-5 రామక్రియ సంపుటం: 11-047

పల్లవి: ఎక్కినవానికిఁ జూడ యేనుగ గజ్జెయుండు
వెక్కస మై వెలువ వేవేలు సేసునయ్యా

చ. 1: నన్ను నాడుకోఁ గాని నాయంతటిది లేదు
వున్నత మయిన నీవూడిగానకు
పిన్నదాని కింత నీవు పెద్దరికము గట్టితి
విన్ని నీ పెద్దరికమే యెంచి చూడవయ్యా

చ. 2: వెల్లవిరి సేయఁ గాని వెలితి లేదు నాకు
వెల్లనె రతుల నిన్ను మెప్పించేయందుకు
చెల్లబడి సేసితివి జిగి నీ యాఁటదానిని
కల్ల గా దివెల్లను నీ ఘనతే కాదా

చ. 3: ఆన వెట్టుకోఁ గాని అన్నిటా జాణను నేను
మెనాన నీపాదాలు మెక్కేయందుకు
పూని శ్రీవెంకటేశుఁడ భోగించితి విటు నన్ను
యీ నగవు లీ సంతోస మిది నీదె సుమ్మీ

రేకు: 0308-6 కేదారగౌళ సంపుటం: 11-048

పల్లవి: అప్పటినాతో నేల అమరమాట లాడేవు
తిప్పరాని నీవలపు దిష్టమై వుండఁగను

చ. 1: కప్పురవిడె మిచ్చితే కార మై తోఁచెగా
చొప్పుగ నీమో మాపె చూడకుండఁగా
దప్పి దేరే మోముతోడ దగ్గరి నే నుండఁగాను
చిప్పిల నీ మే నెల్లఁ జెమరించెఁగా

చ. 2: వొగిఁ బన్నీరు చల్లితే వులివెచ్చ దోఁచెఁగా
నగి నగి ఆపె నీతో నాలి నేయఁగా
చిగురుచిత్తముతోనె చేత నిన్ను నంటఁగాను
మొగచా టై రతు లెల్ల మొన చూచెఁగా

చ. 3: గందము వుయ్యగ నీకు కడుఁ బచ్చి దోఁచెఁగా
ముందరనే ఆపె నీకు మోవి యియ్యఁగా
యిందులోనె శ్రీవెంకటేశ నే నిన్నుఁ గూడితి
యిందరిలోనె నాపొందు యితవాయఁగా

రేకు: 0309-1 మంగళకౌశిక సంపుటం: 11-049

పల్లవి: విచ్చేయు మాయింటి కిట్టె వింతవాఁడవా
వచ్చిదేరెఁ బను లెల్ల పైపై నీవల్లనే

చ. 1: యిచ్చక మై యుండేవాడ వెగ్గు లేల పట్టేవు
నచ్చుల నే తిట్టినాను నవ్వవలెఁ బో
చెచ్చెర నా కెల వలచితి నని యందువు
యెచ్చు కుందు లాయ మాట యిదివో నీ వల్లనే

చ. 2: చుట్టము వైనాఁడవు సోలి చిన్నఁ బో నేల
అట్టె నే రాకు మనిన నంటవలెఁ బో
దట్టముగ నాకుఁగా వ్రతము వట్టితి నందువు
వెట్టిపొందు లెల్లాను వెలసె నీవల్లనే

చ. 3: తగులు గలవాఁడవు తడఁబాటు లేఁక నేల
మొగము నేఁ జూచిలేను మొక్కవలెఁ బో
నిగిడి శ్రీవెంకటేశ నీవు నేనుఁ గూడితిమి
తెగనిమహిమ లెల్లఁ దెలిసె నీవల్లనే

రేకు: 0309-2 శంకరాభరణం సంపుటం: 11-050

పల్లవి: మెత్తనిమనసుదాన మేలు దాఁచ నే నేర
కొత్తగా నింతేసికిని గురి యైతి నయ్యా

చ. 1: సిగ్గుపడి నీ వుండఁగ సెలవుల నవ్వు వచ్చీ
వొగ్గి మాటాడిన నవ్వు లొగి వచ్చీని
నిగ్గుల నీ రెంటికిని నీ మోవియే సాక్షి
యెగ్గులు న న్నేల పట్టే వేమి సేతు నయ్యా

చ. 2: తలవంచు కుండినాను దయ నాకుఁ బుట్టీని
అలసి చూచిన దయ అట్టె పుట్టీని
మొలచి యీ రెంటికి నీ మోముకళలె సాక్షి
కులికి మమ్మేల యింత గోర నేనే వయ్యా

చ. 3: వూరకే నీ వుండినాను వొనరీని వలపులు
ఆరీతి నుండినా ఘన మయ్యీ వలపు
యీరీతి నీ చక్కఁదన మీ రెంటికిన సాక్షి
చేరు శ్రీవెంకటేశ మెచ్చి కూడితి వయ్యా

రేకు: 0309-3 భైరవి సంపుటం: 11-051

పల్లవి: నీవు మంచవాఁడవె నే నెట్టుండితి నేమి
యీ విధము లెరఁగక యెడ్డదాన నైతిని

చ. 1: నిండిన నీతలపోఁత నే నెరఁగఁగా నావద్ద
నుండఁగా నావాఁడ వని వుంటిఁ గాని
యెండమావులనీళ్లు యేరు లంటా నుండి నట్టు
కొండవంటి యాసచేత కూళదాన నైతిని

చ. 2: పంతాలు నే నెరఁగఁగా పలుకక నీ వుండఁగ
అంతలో నా కెదురాడ మాని వుంటిని
బంతినె తెల్లని వెల్లఁ బాలంటా చవి గొన్నట్టు
రంతులబాసలు నమ్మి రాఁపుదాన నైతిని

చ. 3: నీ మోహము లెరఁగఁగా నిక్కము నాకు మొక్కఁగ
అముకొని యెగసక్యా లని వుంటివి
చేముంచి శ్రీవెంకటేశ చెఱకున పండున్నట్టు
కామించి నీవుర మెక్కి ఘనురాల నైతిని

రేకు: 0309-4 కొండమలహరి సంపుటం: 11-052

పల్లవి: కాంతలు పదారువేలు గలవాఁడవు
యెంత నేనే విటు నీతో నెదురాడే దానవా

చ. 1: నన్ను మన్నించ వలసి నాతో నవ్వితిని గాక
యెన్నఁగ నావంటివారు యెంత లేదు
చిన్నఁబోకుండాను నాచెక్కు నొక్కే వింతే కాక
మిన్నక నేర్పుల నిన్ను మెప్పించేదానవా

చ. 2: నామీద కృప గలిగి నను పు సేసేవు గాక
యేమీ నే నిందరిలో నేమి బాఁతి
దీమసము చెడకుండ తివిరి బుజ్జగించేవు
కామించి నీమన సంత కరఁగించేదానవా

చ. 3: కడు నన్ను నేలె నని కాఁగిలించు కొంటి గాక
యెడమని నీరతికి యీడా నేను
బడినె శ్రీవెంకటేశ పాయకుండా మరపేవు
కడ లేనిమోహానకు కాణాచిదానవా

రేకు: 0309-5 సామంతం సంపుటం: 11-053

పల్లవి: మనవి చెప్పితిని మఱవకుమీ
కనుఁగొని నామాఁట కడుమకుమీ

చ. 1: యిచ్చక మాడితి వీడనె వుంటవి
మచ్చిక నా మేలు మఱవకుమీ
వచ్చి వేకేరొకతె వలపులు చల్లిన
పచ్చిదేరి మరి పదరకుమీ

చ. 2: సరస మాడితివి చనవు లిచ్చితిని
మరిగిననాపొందు మానకుమీ
సరిగా మరొకతె సందులు దూరిన
తొరలి యపుడు మరి తొలఁచకుమీ

చ. 3: కలసితి విప్పుడు కాఁగిలించితివి
పొలసి యిట్లనె భోగించుమీ
యెలమిని శ్రీవెంకటేశ్వర మరొకతె
పిలిచితేను మరి పెనఁగకుమీ

రేకు: 0309-6 రామక్రియ సంపుటం: 11-054

పల్లవి: ఈపాటివాఁడవా యిస్సీ నీవు
యేపున నీ దీమసము యేడ నుండె నపుడూ

చ. 1: ఆయము సోఁకినమాట లాపె నీతో నాడఁగాను
కాయ మెల్లఁ గరఁగేవు కాక దేరఁగా
యీయెడ వద్ద నున్నవా రెవ్వ రవుతా నెరఁగవు
చేయి వట్టి తియ్యఁగానె సిగ్గు వడే విపుడు

చ. 2: చిప్పిల సెలవులను చెలి యట్టె నవ్వఁగాను
తప్పక చూచే వక్కడె దైవారుతా
చెప్పి చెప్పి నిన్ను గోరఁ జిదిమినా నెరఁగవు
కొప్పువట్టి తియ్యఁగా కొంకి లోఁగే విపుడు

చ. 3: చెక్కు నొక్కి సతి నీ సేవ లెల్లఁ జేయఁగాను
మిక్కిలి లోలుఁడ వైతి మేర మీరఁగా
కక్క సించి నేఁ గూడితె గక్కన శ్రీ వేంకటేశ
మొక్కుచు నాతో నింతలో ముచ్చటాడే విపుడు

రేకు: 0310-1 రామక్రియ సంపుటం: 11-055

పల్లవి: ఒద్దికతో మము నీవు వూరకె చూడఁగ రాదా
చద్దికి వేడికి మేమే సంతముల లయ్యేము

చ. 1: యిద్దము నేకతము నాయెదటనె ఆడఁగాను
వుద్దంగాలు సేయక యెట్టోరుతు నేను
వొద్ద నీ వుండగా నింతి నొరసితి ననివాదు
వద్దన్నా మానక యేల వహించుకొనేవు

చ. 2: జాఱిక నీవును నాపె సన్నలు సేసుకోఁగాను
చూఱలుగ నెలువలెఁ జూతు నేను
మీఱి నీ మంచముమీఁదిమెలుత నంటితి నని
ఆఱడి నీ వేల ఆపె కడ్డాలు వచ్చేవు

చ. 3: చెక్కు నొక్కి నీవు నది సెలవుల నవ్వుకోఁగా
తెక్కుల నెట్ల సమ్మతింతు నేను
చిక్కించి నిన్నుఁ గూడితి శ్రీవెంకటేశ్వర నేను
కక్కసించితే నాపెకుఁగా నేల మొక్కేవు

రేకు: 0310-2 దేశాక్షి సంపుటం: 11-056

పల్లవి: ఇంతేసి దొరపొందు యెందుకు నైనా వచ్చు
చింత దీర నా మనసు చెలఁగించవయ్యా

చ. 1: పలుమారు నీతోను పలచఁగా నే నవ్వితే
యెలమి నీ చిత్త మిఁక నెట్టుండునో
పిలువఁగ నీతోను బిగిసి వూరకుండితే
అలరి కైకొనని అదియు నెట్టుండునో

చ. 2: పిక్కటిల్ల నీతోను బెరసి మాటలాడితే
యెక్కువ తక్కువలందు నెట్టుండునో
వక్కణించగా నీతో వడి గుట్టున నుండితే
అక్కజపు గర్వమని అదియు నెట్టుండునో

చ. 3: కదియఁగ నీతోను కడు నేఁ గొసరితేను
ఇదె శ్రీవెంకటేశ నేఁ డెట్టుండునో
పొదిగి కూడితి వింకఁ బూఁచి సిగ్గు వడితేను
అదను గా దని సంత మదియు నెట్టుండునో

రేకు: 0310-3 పాడి సంపుటం: 11-057

పల్లవి: చెప్పఁగల మాట లీకఁ జెప్పవయ్య
ముప్పిరి నిందుకె నేను మోము వంచే నయ్యా

చ. 1: చలివేఁడి సటకాఁడ చదురుల జాణకాఁడ
మొలకనవ్వులతోను మొక్కె మయ్య
వలపులయండ గాసీ వాడికవెన్నెల గాసీ
అలరి యిందుకు వెర గందే మయ్యా

చ. 2: వీదుల జాజరకాఁడ వేసాల వేడుకకాఁడ
యీదెస బాయము కాను కిచ్చే మయ్యా
తోదోపువసంత మిదే తొక్కుడుసరస మిదే
ఆదరాన నిందులోనే అలసే మయ్యా

చ. 3: కైకోలు వేగిరకాఁడ కందువల వగకాఁడ
చేకొని నీచెప్పినట్టు సేసే మయ్యా
యీకడ శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
మేకొని యిన్నిటా నిన్ను మెచ్చే మయ్యా

రేకు: 0310-4 కాంబోది సంపుటం: 11-058

పల్లవి: ఓరి నీకు నది యేమి వుండఁబట్టదా
వారి వీరివలె మాట వడిఁబెట్ట వద్దురా

చ. 1: యీసు రేఁచ నేఁటికి యందరిలోపల నిన్ను
వాసి దెచ్చుకొని యెంత వంచఁ జూతునో
రాసి కెక్కితివి తొల్లె రచ్చకూ నెక్కితివి
బేసబెల్లి నా కోపము పెంచ నిఁక వొద్దురా

చ. 2: కన్నుసన్న లేటికి కడు సిగ్గునను నీ
మన్ననఁ గూడి యే మని మాటాడుదువో
వెన్న వేసినవారిని వెస రాఁత వెయ్య రాదు
అన్నిటా జాణఁ జేసితి వటు మీర వద్దురా

చ. 3: దొమ్మి సేయ నేఁటికి తొడిఁబడఁ గాఁగిటి మీ
యిమ్ముల నిన్నలయించి యే ముందునో
నమ్మించి శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి నీవు
సమ్మతించిన మీఁదటఁ జలపట్ట వద్దురా

రేకు: 0310-5 కాంబోది సంపుటం: 11-059

పల్లవి: చలములు మాని అన్నిఁ జవి సేసుకోంటిఁ గాక
తెలివి మొగమునను దేరునా వొరులకు

చ. 1: చిత్తము నొవ్వకుండ చేతుల మొక్కితిఁ గాక
యిత్తల నీ చేసేచేఁత లెన్ని లేవు
వత్తివలె వాడక నీవద్దఁ జెలఁగేఁ గాక
కొత్తలుగ మోము చూడఁ గొలుపుగా యిందుకు

చ. 2: కాఁకలు రేఁగకుండఁగ గానుక లిచ్చితిఁ గాక
యేఁకట నీ పొరపొచ్చే లెన్ని లేవు
ఆఁకలు సేయక నీకు నట్టే నే లో నైతిఁ గాక
పూఁకొన నైన రతికి నుద్యోగము పుట్టునా

చ. 3: తగవులు దప్పకుండ దయతోఁ గూడితిఁ గాక
యెగసక్యాలు నీ వైతె నెన్ని లేవు
ఆగవడి శ్రీవెంటాధిప కూడితి నన్ను
వెగ టైన యిందుమీఁదు వేసటలు పుట్టునా

రేకు: 0310-6 ముఖారి సంపుటం: 11-060

పల్లవి: వట్టి సటలకు నింత వాసు లేల
మెట్టుక వున్నాఁ డతఁడు మేలమాడ రాదా

చ. 1: కూడి వుండినట్టిచోట గోప మేల మంచి
జాడకు వచ్చియు మరిఁ జల మేల
వేడుకలలోపల విసు పేల
వీడె మిచ్చీ నాతఁడు వేగ నందుకోవే

చ. 2: మేర మీర రానీ నీతో మెణ కేల నిన్ను
గారవించఁగా యాడో కత లేల
నేరము లేనివెనక నెగు లేలా నిన్ను
సారెకుఁ జెక్కు నొక్కీని చనవు చేకోవే

చ. 3: మంతన మై యుండఁగాను మరఁగేల
పంత మిచ్చినందుమీఁద బలిమేల
యింతలో శ్రీవెంకటేశుఁడిటు గూడెను
మంతు కెక్కెఁ దొల్లిటిమాట లిఁక నేలే

రేకు: 0311-1 దేవగాంధారి సంపుటం: 11-061

పల్లవి: నీవంటిచిత్తమె నాకు నిలుప రాదా
చేవ దేర నీ యిచ్చలోఁ జెలగే నయ్యా

చ. 1: సంతస మయనవేళ సారె నవ్వ వచ్చుఁ గాక
చింతించే వేళా నట్టే చేకూరునా
పంతపు నీ చేఁతలు నా భావములో నుండఁగాను
చెంత సరస మాడేవు చెల్లు నయ్య నీకు

చ. 2: చెక్కు నొక్కేటట్టివేళ సేదదేర వచ్చుఁ గాక
కక్కసించేటట్టివేళ కై కొలుపునా
వెక్కసపు నీ మాటలు వింటా నే నుండఁగాను
తొక్కేవు పాదము నేకే తోఁచునయ్య యిట్టివి

చ. 3: మించఁ దనిసినవేళ మే మఱవ వచ్చుఁ గాక
అంచఁ దమకపువేళ ననువు లౌనా
యెంచఁగ శ్రీవెంకటేశ యెనసితి విటు నన్ను
నించితి వేడుక లెల్ల నేర్తు వయ్య నీవు

రేకు: 0311-2 మలహరిసంపుటం: 11-062

పల్లవి: విన్నపము లిఁక నేల వేఁడుకో నేల
చిన్ననాఁటి సిగ్గు లెల్ల చిమ్మి రేఁగె నిఁకను

చ. 1: మన్ననలకె మొక్కితి మాటలకే చొక్కితిని
యిన్నేసి నిన్నుఁ దూరఁగ నిఁకఁ జోటేది
అన్నిటా జాణవు నీవు ఆయము లెఱుఁగుదువు
పన్నిన నా జవ్వనము ఫలియించె నిఁకను

చ. 2: నవ్వులనె తనిసితి నయాలనే మొనసితి
యెవ్వరు నేమి చెప్పేరు యెడసుద్దులు
నివ్వటిల్లు విటుఁడవు నిజ మాడ నేరుతువు
రవ్వ లైన నాభాగ్యము రతి కెక్కె నిఁకను

చ. 3: ముచ్చటఁ దొప్పఁ దోఁగితి మోహాన విఱ్ఱవీఁగితి
వచ్చె నాపంతము లెల్ల వాసు లేఁటివి
యిచ్చట శ్రీవెంకటేశ్వర యిట్టె నన్నుఁ గూడితివి
మెచ్చిత మొదలు నిన్ను మే లాయ నిఁకమ

రేకు: 0311-3 దేసాక్షి సంపుటం: 11-063

పల్లవి: ఎంత మొగమాయకాఁడ వే మందు నిన్ను
పంతము నెరపఁ బోయి పైకొంటి నేను

చ. 1: నే నిన్నుఁ గోపగించితే నీవు నవ్వితి వందుకు
మోనాన నంతలోన నే మొక్కే నిదె
ఆనుకొని మేటిదొర వన్నిటికి నేరుతువు
కాని మ్మని యీ పనికె కరఁగితి నేనూ

చ. 2: అవ్వలిమోము నే నైతే నడ్డాలు వచ్చేవు నీవు
మువ్వంక నే నిందుకుఁగా మొక్కే నిదె
రవ్వ సేసి భోగించ రంటికి వత్తువు నీవు
యివ్వల నీ వినయాల కియ్యకొంటి నేను

చ. 3: కడుగుట్టు నేఁ జేసితే కాఁగిలించుకొంటి విట్టె
ముడిదీరె నిటమీఁద మొక్కే నిదె
ఆడరి శ్రీవెంకటేశ అందగాఁడ కూడితిని
జడియక మెచ్చి మెచ్చి సత మైతి నేనూ

రేకు: 0311-4 లలిత సంపుటం: 11-064

పల్లవి: ముంచుకొంటే వలపులు మొగచాటవును
మంచముపై జాగరాలు మరి యేలయ్యా

చ. 1: పచ్చనిచిగురువంటి పళ్లెపు మోవిచెలి
కుచ్చి తేనెలమాటులు కురుసీ నదె
ఇచ్చకానఁ జెవి యొగ్గి యియ్యకొంటి వన్నియును
మచ్చిక నాపైఁ జల్లేవు మరి యేలయ్యా

చ. 2: కలువరేకులవంటి కన్నుల వెన్నెలతేట
పొలితి నేపై దిగఁజోసీ నదె
పొలసి నిలువుననె పూజ గొంటివి నీ వందు
మలసి మాకు మొక్కేవు మరి యేలయ్యా

చ. 3: సారె నిమ్మపండ్లవంటి చన్నులవొత్తులఁ జెలి
కోరిక రతులు నీపైఁ గులికీ నదె
కూరిమి శ్రీవెంకటేశ కూడితివి నన్నునిట్టె
మారు గొసరేవు నీవు మరి యేలయ్యా

రేకు: 0311-5 పాడి సంపుటం: 11-065

పల్లవి: ఏల వొడఁబరచేవు యింతలోననే నన్ను
నాలి సేసి నోతోను నవ్వేదాననా

చ. 1: మన సిచ్చి నీవు నాతో మాట లెల్లాఁ జెప్పఁగాను
విని నవ్వవలెఁ గాక వేసరేనా
చనవు నీ విచ్చితివి సరి గాదా నను నేను
తనియఁగ వలె గాక తప్పు లెంచేనా

చ. 2: చేయి పట్టుకొని నీవు చేఁత లెల్లఁ జేయఁగాను
యీయకొనవలెఁ గాక యీసడించేనా
ఆయాలు సోఁకించితివి ఆరమరచి చొక్కిలి
చాయ నేయవలెఁ గాక సాదించేనా

చ. 3: కందువ నుచిని నీవు కాఁగిలింగి కూడఁగాను
పొందు సేయవలెఁ గాక పొద్దు పుచ్చేనా
ముందె శ్రీవెంటేశ మోహించితి కలసితి
చెంది మెచ్చవలెఁ గాక సిగ్గు పడేనా

రేకు: 0311-6 వరాళి సంపుటం: 11-066

పల్లవి: నీకు నాకు నీపాటి నెయ్యము లెందు గలవె
కాకుగాఁ జేయ నేలోకో కడ నున్నచెలికి

చ. 1: చనవు సేసుక నీతో సారె సారె నవ్వఁగాను
యెన లేనియెగ్గు లెంచీ యీపె నాతోను
వొనర నీ వన్నిటికి నోరుచుక వుండఁగాను
తన కేల వచ్చెనొకో తమక మీచెలికి

చ. 2: పొందు సేసుక నిన్ను పువ్వులనె వేయఁగాను
యిందు కే లడ్డాలు వచ్చీ నీపె నాతోను
సందడి నాచేఁత నీకు సమ్మతులై వుండఁగాను
అంది వాదు లింతోలొకో అండ నున్నచెలికి

చ. 3: కైవసము సేసుకొని కాఁగిట నిన్ను నించఁగా
యీవల పంత మే లాడీ నీపె నాతోను
చేవదేరఁ గూడితిని శ్రీవెంకటేశ నన్ను
యేవ లేల వచ్చెనొకో యెరవులచెలికి

రేకు: 0312-1 శుద్ధవసంతం సంపుటం: 11-067

పల్లవి: నీతోడిచుట్టరికాలు నిజ మాయను
యేతుల నీ జాణతనా లివి నిజ మాయను

చ. 1: వావి గద్దంటాఁ జెప్పి వద్దఁ గూచండి మెల్లనె
నీవు నవ్విన నవ్వులె నిజ మాయను
చేవ దేర బుజ్జగించి చెక్కులు నొక్కిన నేఁటి
కోవరపు నీ చెనకులు నిజ మాయను

చ. 2: గారవించి సందిగొందిఁ గన్నయప్పు డెల్లాను
నేరుపుల నీ మొక్కులు నిజ మాయను
వారివీరిచేత నీవు వడిఁబె ట్టింపినయట్టి
యీరీతినీ పైఁడిలేక లివి నిజ మాయను

చ. 3: కన్నులలె సన్న సేసి కాఁగిలించుకొన్నట్టి
నిన్న మొన్నటి సుద్దులు నిజ మాయను
మన్నించి శ్రీవెంకటేశ మరిగి నన్ను నేలితి
మున్నిటి నీకోరికలు నిజ మాయను

రేకు: 0312-2 మధ్యమావతి సంపుటం: 11-068

పల్లవి: మనసు లొక్కటులైతే మరి యేల మఱఁగూ
పని గలితేఁ జేసే బాయిట నే వేయనూ

చ. 1: నీ కెంత సంతోష మైనా నేడు నా సంతోస మదె
ఆకడ నీవు నవ్వితే నది నానవ్వె
లోకలోడిమాఁట గాదు లోను వెలి నొక్కటె
ఆకె నీడకె తేవయ్యా నవుఁగాము లెంచను

చ. 2: నీవు లెస్స వుండితే నేనె లెస్స వుండిన దది
లావు నీకుఁ గలితే నా లావూ నాదె
కావర మించుకాఁ గాదు కలగుణము నా కిది
వావులు చెప్పుకోరయ్యా వద్దని నే నసను

చ. 3: నీ మేలె నా మేలు నే నేరుపె నా నేరుపు
ప్రేమపు నీ ప్రియమె నా ప్రియ మిదివో
కామించి శ్రీవెంకటేశ గక్కనఁ గూడితి నన్ను
దోమటి దొడికించితే దూరను నే నాపెను

రేకు: 0312-3 రాయగౌళ సంపుటం: 11-069

పల్లవి: ఏల వేగిరపడేర యింతలో మీరు
తాలిమి చూపి యతఁడె దయసేసీఁ గాకా

చ. 1: చనవు లిచ్చినవాఁడు సరవు లేల తప్పునె
మనసు చూడ వలసి మాయలు గాక
నను పై యుండేవాఁడు నవ్వ కేల మానునె
పెనఁగించుకొని తానె బెరసీఁ గాకా

చ. 2: యిచ్చక మాడెటివాఁడు యెగ్గు లేల పట్టునె
ముచ్చట లాడ వలసి మొరఁగీఁ గాక
మెచ్చినట్టివాఁడు మేలు మెరయ కేల మానునె
రచ్చ కెక్కినందాక రాఁపు సేసీఁ గాకా

చ. 3: కలసినయట్టివాఁడు కరఁగ కేలు లండునె
అలపు దేరినదాఁకా ఆలించీఁ గాక
యెలమి శ్రీవెంకటేశుఁడిక నేల లోఁచీనె
చెలఁగి తనబాసలు చెల్లించీఁ గాకా

రేకు: 0312-4 సామంతం సంపుటం: 11-070

పల్లవి: వేసాలవాఁడు గదవే విట్ఠలేశుఁడు
తా వేసారఁ డెందుకు నైనా విట్ఠలేశుఁడు

చ. 1: వేడుకకాఁడు గదవే విట్ఠలేశుఁడు నాకు
వీడె మిచ్చీ నింతనోనె విట్ఠలేశుఁడు
వీడ నాడనీఁడు నన్ను విట్ఠలేశుఁడు అట్టె
వేడెవట్టీ వలపులు విట్ఠలేశుఁడు

చ. 2: వెన్నెలనవ్వులు నవ్వీ విట్ఠలేశుఁడు యాడో
విన్నపము లాలకించీ విట్ఠలేశుఁడు
వెన్నముచ్చిమి విద్యల విట్ఠలేశుఁడు నా
విన్నఁదన మెల్లా బాపీ విట్ఠలేశుఁడు

చ. 3: విరులు నాపైఁ జల్లీ విట్ఠలేశుఁడు కడు
విరివికాఁడు గదవే విట్ఠలేశుఁడు
ఆరిది శ్రీవెంకటాద్రి నందు నిందు నన్నుఁ గూడె
వెరవరి గదవె యీ విట్ఠలేశుఁడూ

రేకు: 0312-5 కన్నడగౌళ సంపుటం: 11-071

పల్లవి: నిన్ను నిచ్చా నా బదుకు నీచేతిది
యిచ్చక మై యెందు కైనా నియ్యకొందు నేనూ

చ. 1: చెక్కు నొక్కినందుకె సేద దేరితిఁ గాక
వెక్కసపుఁజింతతోడ వేగించనా
గుక్కక నీ చేఁతలకు గోపము వచ్చునంతలో
పక్కన వేఁడు కోంటేను పైపై లో నౌదును

చ. 2: చేయి వేసినందుకె సెలవి నవ్వితిఁ గాక
చాయ సేసుక బొమ్మల జంకించనా
మాయపు నీ గుణాలను మారుకొందు నంతలోనె
ఆయములు నీ వంటితే నన్నియు మఱతును

చ. 3: కాఁగిలించుకొన్నందుకె కళల మించితిఁ గాక
చేఁగ దేఁర దల వంచి చెమరించనా
కాఁగి మాటల దూరుదు కరఁగుదు నంతలోనె
ఆఁగి శ్రీవెంకటేశ నిన్నలమి నే మెత్తును

రేకు: 0312-6 శ్రీరాగం సంపుటం: 11-072

పల్లవి: వలపు విసికితేను వాసన గద్దా
చలము సాదించఁ బోతే చవి గావు పనులు

చ. 1: మచ్చిక నీతో నిట్టె మాటలాడినప్పుడె
చెచ్చెర నీ పొందు నేఁ జేసినదాన
కొచ్చి కొచ్చి నన్నేల కొంగు వట్టి తీసేవు
వచ్చినదాననె యాల వడిఁబట్టె వీఁకను

చ. 2: కన్నుఁగొనలను నిన్నుఁ గనుఁగొన్నయప్పుడె
యిన్నిపనులకు నే నియ్యకొందాన
మన్నించి యేకతములు మరి యేల చెప్పేవు
విన్నదాననె తొల్లి వేసరించ కిఁకను

చ. 3: గక్కననె నిన్ను మెచ్చి కాఁగిలించినప్పుడె
గుక్కక రతులలోఁ గూడినదాన
యిక్కువ శ్రీవెంకటేశ యేలితివి నన్ను నిట్టె
దక్కినదాననె తొల్లె దయఁ జూడు మిఁకను

రేకు: 0313-1 బౌళరామక్రియ సంపుటం: 11-073

పల్లవి: ముందటనె నిలుచుండి మొక్కేము గాక
అందముగా మారుమాట లాఁడ గలమా

చ. 1: అంగన నీమోము చూచె నట్టె నీవు చూచితిని
యింగితా లెరుఁగుదురు యిద్దరు మీరు
చెంగట నుండినయట్టి చెలులము నే మెల్ల
సంగ తెరఁగక మాటసరి తియ్యవచ్చునా

చ. 2: వనిత నీతో నవ్వె వడి నీవూ నవ్వితివి
యెనలేని నేరుపరు లిద్దరూ మీరు
పనులు సేసేయట్టి పడఁతులము మేము
వెనక ముందటి మాట విన్నవించ వచ్చునా

చ. 3: సతి నిన్ను గాఁగిలించె సమ్మతించి కూడితివి
యితవు లెరుఁగుదురు యిద్దరూ మీరు
తతి శ్రీవెంకటేశుఁడ తగు మీవారము నేము
మతకాన నిఁక మారుమాట లాడ వచ్చునా

రేకు: 0313-2 గౌళ సంపుటం: 11-074

పల్లవి: ఏమే సంగ తెరఁగ వింతిరో నీవు
ఆమె కులువ చరించ కయ్యో నీవు

చ. 1: సంకె లేక యాతఁడు జాణఁడై తిరుగఁగాను
అంకెలకు వంక లొత్తే వప్పటినీవు
మంకుదానఁ దొలుతనె మారు మలయఁగఁ బైపై
నింకా బుద్దులు చెప్పే వెట్టో నీవు

చ. 2: వొడ్డినందు కెల్లా నాతఁ డోపికతో నుండఁగాను
అడ్డాలు దుడ్డాలు వచ్చే వప్పటి నీవు
వడ్డివారె శిగ్గుతోడి వనితను వానిఁ దెచ్చి
జిడ్డు దేర నవ్వించేవు చీచీ నీవు

చ. 3: బలిమిఁ గాఁగిటఁ గూడి బడలి వాఁ డుండఁగాను
అలపు సొలపుఁ దేర్చే వప్పటినీవు
యెలమి శ్రీవెంకటేశు నెదలోనిదాన నేను
చెలరేఁగించే విన్నిటాఁ జెల్లునె నీవు

రేకు: 0313-3 భైరవి సంపుటం: 11-075

పల్లవి: చెచ్చెర నీవ్రతమే చెల్లెఁ గాక
యిచ్చకురాల నేను యింకా నేడ సుద్దులు

చ. 1: చేసిన నీచేఁతలకు చెక్కు నొక్కేదానఁ గాక
వేసరించి నిన్ను నంత వెంగె మాడేనా
మూసినముత్యమువలె ముంగిటికి వచ్చితివి
యీసులు నీతో నేల యింకా నేడ సుద్దులు

చ. 2: నానాటి నీగుణాలకు నవ్వు నవ్వేదానఁ గాక
కాని మ్మని పగ చాటి కాఁక రేఁచేనా
మోనాన నా యెదుటను మోహము చల్లెటి నీపై
యేనెపము వెట్టఁగల నింకా నేడ సుద్దులు

చ. 3: గక్కనఁ గూడినందుకు కరఁగేటిదానఁ గాక
యెక్కువతక్కువలు ని న్నెంచ వచ్చునా
చిక్కితిని నాపాలికి శ్రీవెంకటేశ్వర
యిక్కడనెవుండు నీవు యింకా నేడ సుద్దులు

రేకు: 0313-4 మాళవిగౌళ సంపుటం: 11-076

పల్లవి: చిత్తము వచ్చినప్పుడు చేర వచ్చే వింతే కాక
యిత్తల నిందరిలోన నేమి బాఁతి నేను

చ. 1: చెక్కులు నొక్కేటివారు సేసలు వెట్టెటివారు
యిక్కువ లంటెటివారు యెందురు నీకు
వెక్కస మీ సందడిలో వేసరించఁ బోతేను
యెక్కడి కెక్కు నావల పేమి బాఁతి నేను

చ. 2: ముచ్చట నుండెటివారు మొగము చూచెటివారు
యిచ్చకా లాడెటివారు యెందరు నీకు
పచ్చిగా నీమూఁకలలో పచరించఁ బోతేను
యెచ్చుటఁ గనేవు గురు తేమి బాఁతి నేను

చ. 3: కమ్మిక కూడెటివారు కాఁకలు చల్లెటివారు
యెమ్మెలు సెరుపేవారు యెందరు నీకు
దొమ్మిలో శ్రీవెంకటేశ తొల్లె నన్నుఁ గూడితివి
యిమ్ములఁ జెయి వట్టెవు యేమి బాఁతి నేను

రేకు: 0313-5 సామంతం సంపుటం: 11-077

పల్లవి: ఇందరు నవ్వే దెరఁగ దెవ్వతో యీపె
యెందు కైనాఁ దానె వచ్చీ నెవ్వతో యీపె

చ. 1: మచ్చికతో నీవు నేను మాట లాడఁగా విని
యెచ్చు కుందు లెంచ వచ్చీ నెవ్వతో యీపె
కుచ్చితాన తనలోన కోపము కొంత వెట్టుక
యిచ్చట మెచ్చులు మెచ్చీ నెవ్వతో యీపె

చ. 2: నగుతా నిద్దరమును ననుపు నటించఁగాను
యెగసక్యములు సేసీ నెవ్వతో యీపె
తగవులు చెప్పుతాఁ గాఁతాళము గొంత రేఁచుక
యెగుసనఁ బెట్టీ రేసు లెవ్వతో యీపె

చ. 3: నెయ్యపు శ్రీ వెంకటేశ నేఁడు మనము గూడఁగ
యియ్యకొని పూఁకోనీ నెవ్వతో యీపె
చయ్యాటా లిన్నియు మాని చవి సేసుక పొదిగి
యెయ్యెడ నున్నదో తాను యెవ్వతో యీపె

రేకు: 0313-6 పాడి సంపుటం: 11-078

పల్లవి: ఆపెమారు విన్నవించే నదివో నేను
చేపట్టిన నీచేతివే సేసెటిపనులు

చ. 1: ఆంగన నీ మాటలకు నాయములు గరఁగెను
పొంగుచునుఁ జెమరించెఁ బులకించెను
చెంగటి సిగ్గుతోడఁ జేరి నీతో మాటాడదు
యింగితాన నీ చేతివే యిటమీఁదిపనులు

చ. 2: నీవు చే చాఁచినందుకె నివ్వెరగులఁ బొందెను
భావము యింత మందె పచ్చి దేరెను
తావుల కోరికల సందడిఁ బడి వున్న దదె
యేవిధాన నీ చేతివే యిటమీఁదిపనులు

చ. 3: ఆడెటి నీ సరసాన కంతరంగము దనిసె
వీడె మందుకొన నిన్నీ వేళఁ గూడెను
జోడై శ్రీవెంకటేశ చొక్కులనె వోలవాడి
యేడ నయినా నీ చేతివే యిటమీఁదిపనులూ

రేకు: 0314-1 రీతిగౌళ సంపుటం: 11-079

పల్లవి: చాయ సేసుకొనుఁ గాక సతుల యడాటాన
పాయపు రమణుఁడైతే పంతము గొనీనా

చ. 1: చెక్కు నొక్కి సేద దేర్చి సేవలు సేసితిని
యెక్కువ తక్కువ లెల్లా నిఁక నేడవే
గక్కన మీరు చెప్పఁగా గాని మ్మంటి మీమాట
అక్కడనె నిలుచున్నాఁ డప్పటిఁదా నేఁటిదే

చ. 2: కొంకు వాయఁ గాఁగిలించి కూరిమి నవ్వు నవ్వి
యింకఁ జెమరించితిని యిఁక నేఁటిదే
మంకుదాన ననే రంటా మారుమాటలాడ మీకు
బింకము లింగా మానఁడు పెనఁగనే వలెనా

చ. 3: మోవి యిచ్చి మొక్కు మొక్కు మోహ మెల్లా జల్లితి
యీవల వట్టిగుట్లు యిఁక నేఁటికే
మే వెంచి శ్రీవెంకటేశు మీ మొకమోటఁ గూడితి
నావాఁడనె అనీఁ దాను నమ్మికలు వలెనా

రేకు: 0314-2 దేసాళం సంపుటం: 11-080

పల్లవి: ముందటికి వెనకకు మొక్కేము నీకు
కందువ లన్నియు నీవె కనుకొమ్మీ యికను

చ. 1: యిచ్చక మాడితి నేడు యింటికి నీవు రాఁగాను
కొచ్చి నిన్న రాకుండఁగఁ గొసరితిని
బచ్చెన వేఁడివలపు పచ్చి దోఁచి చిగురాయ
తచ్చి తొల్లిటియలుక తలఁచకు మిఁకను

చ. 2: కమ్మి నీవు చూడఁగాను కాను కిచ్చితి విప్పుడు
తమ్మిని వేసితిఁ దొల్లి తల వంచఁగా
వుమ్మగిలి నాసరస మొగ రెక్కి నిండఁ బూచె
దిమ్ము రేఁగినచలము తిప్పుకోకు మిఁకను

చ. 3: గక్కన నీవు గూడఁగ గాఁగిలించుకొంటి నిట్టె
మెక్కలాన నల్లప్పుడు మొరఁగితిని
చిక్కన య్యనును నాయఁ జిత్తము శ్రీవెంకటేశ
నిక్కి నీకపటములు నెరపకు మిఁకను

రేకు: 0314-3 బౌళి సంపుటం: 11-081

పల్లవి: చేతికి నీవు లోఁ గాఁగ జెప్పేఁ గాని
యేతులఁ గుచ్చితా లుండె యిందాఁక నాకును

చ. 1: మంతన మాడితిని మగువతో నీ వప్పుడు
పంతము లాడితెనే నీ పడఁతితోడ
యింతలో నీవు రాఁగానె యేకచిత్త మాయఁ గాని
దొంతర చలము లెక్కె తోడఁదోడ నాకును

చ. 2: చేతులు చాఁచితివ చెలియపై నీ వప్పుడు
కాతరాలు రేఁచితి నా కాయములోన
యీతలఁ జెక్కు నొక్కఁగా యియ్యకొంటి నేనన్నియు
వాతులు మోవఁగఁ బొంగె వాసు లెల్ల నాకును

చ. 3: కన్నులచె మొక్కితివి కాంతకు నీ వల్లప్పుడు
సన్నలఁ దిట్టితి నిన్ను సారెకు నేను
అన్నిటా శ్రీవెంటకేశ అలమఁగ మెచ్చేఁగాని
నున్ననిచెమట నిండె నొసలనె నాకునూ

రేకు: 0314-4 రామక్రియ సంపుటం: 11-082

పల్లవి: ఇచ్చకుఁడ విన్నిటాను యే మంటివి
యెచ్చరించే నింతె నిన్ను యే మంటివి

చ. 1: కాంత నిన్నుఁ దెమ్మనఁగఁ గాచుకున్నదాన నేను
యింత వొద్దాయ నింక నే మంటివి
చింతతో నెదురు చూచి సేసవెట్టె నంటా నీకు
యెంత లేదు నీకు బని యే మంటివి

చ. 2: ఆకె నీకడ నున్న అంపఁగా వచ్చితి నేను
యేకచిత్తమున నిట్టె యే మంటివి
లేకలు నీకడ కంపె లేచి విచ్చేయఁగదవయ్య
యేకతాన నప్పుడు నీ వే మంటివి

చ. 3: కొమ్మ లోననుండి వచ్చి కొంగు వట్టి నిన్నుఁ దీసె
యిమ్ముల నీ మొగమాట నే మంటివి
సమ్మ తై శ్రీవెంకటేశ సరుగఁ గూడితి రిదె
యిమ్మనీ విడెము నిన్ను నే మంటివి

రేకు: 0314-5 వరాళి సంపుటం: 11-083

పల్లవి: చూచినవారికి జూడ పోద్యా లివి
యేచినవేడుకె కాని యెంతైనా వీఁగదూ

చ. 1: యెట్టు నమ్మెనో నీ చిత్త మింతి యెవ్వరు చెప్పిన
జట్టిగొన నవ్వుఁ గాని చంచలించదు
మట్టు లేని నీ వెంతమాట పట్టిచ్చితివో
గుట్టుతోనే మెచ్చుఁ గాని కొంతైన వెరవదూ

చ. 2: కలికి నీ నిజ మెట్టు గనెనో నీ సుద్దులకు
చెలరేఁగె వుండుఁ గాని చిన్నఁబోదు
చెలిమి నీ వాపె కెంత చేతికి లో నైతివో
వలపులె చల్లుఁ గాని వసివాడదూ

చ. 3: నీ మర్మ మె ట్టెఱిఁగెనో నెలఁత నీరతులకు
వేమారుఁ బైకొనుఁ గాని వేసారదు
నేమపు శ్రీవెంకటేశ నీ వెంత చొక్కించితివో
ఆమనిభోగమె కాని ఆలయి కెరఁగదు

రేకు: 0314-6 ఆహిరి సంపుటం: 11-084

పల్లవి: చెలులము మా కెప్పుడు సిగ్గె మేలు
సొలసి నిన్నుఁ గన్నుల జూచుటే మేలు

చ. 1: మంచిమాట లాడినాను మర్మములు సోఁకీ నిన్ను
యించుక గుట్టున నుండే దిదె మేలు
అంచెల నీ వాన తీఁగా అట్టె విని చొక్కుకొంటా
వుంచముతో సారె సారె నూఁకొనుటె మేలు

చ. 2: వూడిగాలు సేసినాను వోరసిన ట్లయ్యీని
వోడక కొలిచి నిలచుండుటె మేలు
వేడుక నీవు చేయి వేయఁగా బొగడుకంటా
వాడికెతోడ నీకుఁ గైవస మౌటె మేలు

చ. 3: చేయి పట్టి తీసితేను సేవలు గొన్న ట్టయ్యీని
చాయల నీదాన ననేసలిగె మేల
యీయెడ శ్రీవెంకటేశ యింతలో నన్నుఁ గూడితి
పాయక యిట్ల నుండేభాగ్యమె మేలు

రేకు: 0315-1 భైరవి సంపుటం: 11-085

పల్లవి: సకలాపరాధము శమియించుకోవయ్య
అకలంక మైననీ యానతిలో దానను

చ. 1: చేరి నీ పాదములకు సేవ సేసే నంటినా
నేరుపులు నీ వెరంగనివి లేవు
యేరీతి నైనాను చేయెత్తి మొక్కే నంటినా
కారాణాలు నీ విన్నిఁ గాననవి గావు

చ. 2: మన సిచ్చి నోతోను మాట లాడే నంటినా
వెనక ముందర నీకు వింత గాదు
చనవు మెరసి నీసరుస నుండే నంటినా
వినికిగా నీవు తొల్లి విననిది గాదు

చ. 3: గక్కనఁ గాఁగిట నిన్ను గరఁగించే నంటినా
యిక్కువల నీకు నిది యెరవు గాదు
చిక్కి నన్నుఁ గూడితివి శ్రీవెంకటేశ్వర నేఁడు
పెక్కుసుద్దు లెల్ల నీకు భేదము గాదూ

రేకు: 0315-2 శంకరాభరణం సంపుటం: 11-086

పల్లవి: తెలుసుకో యిఁక నీవు తేటతెల్ల మిగ మమ్ము
తలఁచుకో వారివంటిదాననె యింతనుండి

చ. 1: యిచ్చక మాడేటివారు యిన్నిటా నితవరులు
నిచ్చ బుద్ధి చెప్పేవారె నిష్టూరులు
యెచ్చుకుంద లింతేసి యెరఁగ నైతి నిన్నాళ్లు
తచ్చన నే వారితోదాననె యింతనుండి

చ. 2: మాయలు నేర్చినవారు మహిలోన జాణలు
నాయాలు నడచేవారె నాలికూళలు
బాయలుపందిలి వన్ని భ్రమించ నైతి నిన్నాళ్లు
దాయగత్తెనై వారిలోదాననె యింతనుండి

చ. 3: గక్కన జంకించువారె కందువచనవరులు
చిక్కి లోనై నవారె జిగి వెఱ్ఱులు
యిక్కువ శ్రీవెంకటేశ యెనసితి నేఁడిన్నాళ్లు
తక్కక నీవారిలోదాననె యింతనుండి

రేకు: 0315-3 దేసాళం సంపుటం: 11-087

పల్లవి: ఎన్నడు నీ దయ మాపై నిఁకఁ బెట్టేవు
తిన్నని యెడమాటలఁ దెల్లవార వచ్చెను

చ. 1: కొంగు వట్టినవాఁడవు గుట్టు గొంత నడుపేవు
అంగవించి జాణవు గా వని యందునా
చెంగట నిందరిలోన సిగ్గుపడి వుందానను
వుంగిటి దీరనివేళ నూరడించ వలదా

చ. 2: చెక్కు నొక్కినవాఁడవు చెప్పవు ఆమీఁదిమాట
లెక్కించి నీ ప్రేమ నాపై లే దందునా
తక్కక యాపనులకె తలవంచుకుందానను
అక్కరతో యీవేళ నాదరించ వలదా

చ. 3: యియ్యకొన్నట్టివాఁడవు యెదురు చేయి చాఁచేవు
నెయ్యపు సరసములు నేర వందునా
యియ్యెడ శ్రీవెంకటేశ యిందుకె కూడుందానను
వొయ్యన నీ మన్ననల నోలలార్చ వలదా

రేకు: 0315-4 సామంతం సంపుటం: 11-088

పల్లవి: కంటే సుంకము మరి కానకుంటే బింకము
యింటికాఁడ మాతో మాయ లేల సేసే వీఁకను

చ. 1: కప్పి యాపె తనచేతికానుక నీ కియ్యఁగాను
ముప్పిరి నీ వప్పటి నా మోము చూచేవు
అప్పణ గొంటివా గోపాంగనల కెల్లఁ దొల్లి
యిప్పుడు నాతో మాయ లేల సేసే వీఁకను

చ. 2: పరగి యాపె నీకుఁ బనులు సేయ రాఁగాను
సరి నాకుఁ జేయు మంటా సన్న సేసేవు
పొరుగు పొరచిగా నీ పొలఁతులకుఁ జేయించు
యిరవు నాతో మాయ లేల సేసే వీఁకను

చ. 3: కందువ నాపె నిన్నుఁ గాఁగిలించుకోఁగాను
అంది నన్నుఁ గాఁగిలించి తందులోననె
పొందుమా శ్రీవెంకటేశ భూసతి శ్రీసతి నిట్టె
యిందులోనె నాతో మాయ లేల సేసే వీఁకయ

రేకు: 0315-5 వరాళి సంపుటం: 11-089

పల్లవి: ఎట్టు సేసిన నాతని నేమీ ననకురమ్మ
గుట్టు సేసు కుండితేను గుణవంతుఁ డౌనె

చ. 1: మచ్చరించఁ బని లేదు మాపుదాఁకా బతితోడ
పచ్చి దేర నవ్వితేనె పంత మాడటా
యెచ్చుకుందు లేమి గల్ల నిచ్చగించి గక్కునను
కొచ్చి కౌఁగిలించుకొంటె గుణవంతుఁడౌనె

చ. 2: వెంగె మాడఁ బని లేదు వేవేలైనా నాతని
సంగడిఁ గూచుండితేనె సాధించుటా
సంగతి దప్పినవేళ సరసుని రతులకు
కొంగు పట్టి తీసితేను గుణవంతుఁడౌనె

చ. 3: బాస గొనఁ బని లేదు పైకొని కాఁగిటిలోనె
సేసవెట్టి కూడితేనె చిక్కించుటా
యీసు దీర శ్రీవెంకటేశుఁ గలసితి వింక
గోసనాస గొనంకుంటె గుణవంతుఁడౌనె

రేకు: 0315-6 లలిత సంపుటం: 11-090

పల్లవి: మమ్ము నిన్నిటా నింక మన్నించుఁ గాక
చిమ్ముసిగ్గులఁ దడవు సేయ నేఁటికే

చ. 1: వలపించుకొన్నవాఁడు వాకిటికె వచ్చుఁ గాక
పిలిపించుకొన నేలె పెనఁగ నేలె
చలి వాసినట్టివాఁడు సరసము లాడుఁ గాక
యెలయించి యెడమాఁట లింక నేఁటికే

చ. 2: చేసుకొన్న యట్టివాఁడు చెప్పినట్టె నేసుఁ గాక
మూసి దాఁపిరము లేలె మొరఁగు లేలె
ఆసపడినట్టివాఁడు అండనె కూచుండుఁగాక
వోసరించి మరి కొన్ని వొడఁబా ట్లేఁటికే

చ. 3: చేయి చాఁచినట్టివాఁడు చెనకి కలసుఁగాక
నాయముల వెట్ట నేలె నలన లేలె
యీయెడ శ్రీవెంకటశుఁ డేకమై కూడినవాఁడు
చాయలకు లోలోనిసన్న లింక నేఁటికే

రేకు: 0316-1 శ్రీరాగం సంపుటం: 11-091

పల్లవి: ఏడ దాఁచుకుండెనో యి విందాఁకాను
వాడుదేరె నీవు తనవద్ద నుండఁగాను

చ. 1: సెలవినవ్వులు గారె చెక్కులఁ గళలు దేరె
మలసి చెలితో నీవు మాటలాడఁగా
కలువకన్నులు విచ్చె కతలు చెప్పఁగఁ జొచ్చె
పొలసి పొలసి నీవు బుజ్జగించఁగాను

చ. 2: పొంచినయాసలు రేఁగె పులకలు విఱ్ఱవీఁగె
మంచముపై నుండి నీవు మన సియ్యఁగా
ముంచి పైపైఁ జెమరించె మోహము నీ కొప్పగించె
అంచెల మర్మముల నేఁడట్టె నీ వంటఁగాను

చ. 3: కమ్మరఁ జేతుల మొక్కె కాఁగిట నీకుఁ జొక్కె
వుమ్మగిలురతులు నీ వొసఁగఁగాను
యిమ్ముల శ్రీవెంకటేశ యిన్నిటాను నిన్నుఁ గూడె
సమ్మతించి నీ విట్టె చన వియ్యఁగాను

రేకు: 0316-2 ముఖారి సంపుటం: 11-092

పల్లవి: నయ మిచ్చి మాటలాడ నావంటిదా ఆపె
ప్రియముల బిగువులఁ బెనఁగెడుఁ గాక

చ. 1: గుట్టు దెలిసిన దాపె గొసరునా నిన్ను మరి
వట్టి సణఁగులు చల్లి వంచుఁ గాక
అట్టడి మొదలనె యాఱడి కింక లోఁగీనా
తిట్టులును దీవెనలు దిగఁబోసుఁ గాక

చ. 2: యింతచనవుల దాపె యిచ్చకము లాడీనా
పంతములనె నిన్నుఁ బంగించుఁ గాక
అంతేసి నేరిచినాపె అప్పణ నిన్నడిగీనా
వంతుల వాసులను మోవఁగఁ గూడుఁ గాక

చ. 3: మందెమేళముల దాపె మట్టున నుండునా నిన్నుఁ
గిందుపరచి తాఁ గరఁగించుఁ గాక
పొందితి శ్రీవెంకటేశ పొంచి నన్ను నిఁక నాపె
చందాలను చాయలను సమ్మతించుఁ గాక

రేకు: 0316-3 సామంతం సంపుటం: 11-093

పల్లవి: కాకిబెగడశీరను కాశ వోసినాడు తాను
వాకిటికి వాచ్చినాఁడు వలశితి ననవే

చ. 1: పచ్చనిసాపమీఁదఁ బవళించు మనవే
కుచ్చి మాసూపులు దన్ను గురి దాఁకెను
చెచ్చెరఁ బారుటాకుల చెంచవార మనవే
తెచ్చేను మా దొండపంటితేనె లిదే అనవే

చ. 2: కొండపడ మేడలలోఁ గూరుసుండు మనవే
నిండునెమలిగరులు నెత్తి కెక్కెను
దిండు మా వెలఁగపండ్లు తీపు లెక్క ననవే
అండనె వుందాన తన కప్పగించే ననవే

చ. 3: కొప్పుల మొలల సే కుప్పవడె ననవే
కప్పురపు తనతమ్మ కార మనవే
వొప్పుగా శ్రీవెంకటేశుఁ డొనగూడె ననవే
ముప్పిరి నేమీ నెఱఁగ మొక్కితి నే ననవే

రేకు: 0316-4 సౌరాష్ట్రం సంపుటం: 11-094

పల్లవి: కమ్మరఁ గమ్మరఁ జెప్ప కత లాయనే
చిమ్ముల నీపతి వాఁడె చిత్తగించవే

చ. 1: చెక్కునఁ బెట్టినచేయి చెలువుఁ డింతలో రాఁగా
అక్కజపు నీ సిగ్గు కడ్డ మాయనే
తక్కక పయ్యదలోన దాఁచిన నీ కుచములు
పుక్క టైన జక్కవల పోరు గాయనే

చ. 2: సెలవి నవ్వినవ్వు చేరి నీ పలుకులకు
చలువ లై యడనెడ చవు లాయనే
మెలుపున ముడిచిన మీ టైన నీతురుము
పొలయు తుమ్మిదలకు పూఁ టాయనే

చ. 3: సేసెటి నీ విడెము శ్రీవెంకటేశు కూటమి
వీసరపోక మంచివిందు లాయనే
సేసపాల రతులలో చిప్పిలు నీ కెమ్మోవి
రాసి కెక్కి చిగురులరచ్చ లాయనే

రేకు: 0316-5 నాదరామక్రియ సంపుటం: 11-095

పల్లవి: ఎడమాట లిఁక నేల యెదురుచూపు లేల
తడ వాయ నిన్నిటాను తా నెరుంగానే

చ. 1: మొగము చూచినఁ గాని ముచ్చటలు వాయవు
నగుతా నుండినఁ గాన ననుపు లేదు
తగులాయ మైనఁ గాని తమకము వొడమదు
వగ దీర నాతనివద్ద నుండవే

చ. 2: కందుల లంటినఁ గాని కరఁగవు మర్మములు
మందెమేళ మైనఁ గాని మాఁట లెక్కవు
చెంది చెనకినఁ గాని చిత్తము తనవి లేదు
విందువలె నిఁక వేరె విన్నప మేలే

చ. 3: చెక్కులు నొక్కినఁ గాని చేతులకసి దీరదు
వొక్కచో నుండినఁ గాని వొద్దికగాదు
యిక్కు పెరిగి శ్రీవెంకటేశుఁ డిట్టె నన్ను గూడె
చక్క నాయఁ బను లెల్ల జాణ తా నవునే

రేకు: 0316-6 శంకరాభరణం సంపుటం: 11-096

పల్లవి: ఇంగితాకారము లెత్త నెరిఁగినవాఁడవు
సంగ తాయఁ బను లెల్ల జయవెట్టే మయ్యా

చ. 1: చెలియభారము నీది సిగ్గులు నీ చేతివి
పలువిన్నపము లిఁకఁ బని లే దయ్యా
అలరినే మాడేమాట లన్నియు నీ వాడితివి
చలువాయ మా మనసు సారె మెక్కే మయ్యా

చ. 2: వనితపాలిటి దిద వహించుకో కిఁకఁ బోదు
అనఁగి పెనఁగ నోతో నంత యేలయ్యా
ననుపు లెల్లా నెరపి నమ్మిక నీ విచ్చితివి
తనిసితి మిఁక నీ చేఁతలకు లో నయ్యా

చ. 3: కోమలి మన్నన నీది కోరికె లెల్లా నీవి
వేమరు మండాటాల వింత లే లయ్యా
కామించి శ్రీవెంకటేశ కలసితివి యింతిని
ఆముకొంటి మిఁక నిన్ను నట్టె మెచ్చే మయ్యా

రేకు: 0317-1 శంకరాభరణం సంపుటం: 11-097

పల్లవి: అతివ నిన్నే మనిన నది యెగ్గా
చతురు లైనవారికి చవులే కాదా

చ. 1: కూరిమి గొసరఁగాను కోపముగాఁ జేసుకొంటే
యిరీతిఁ జెలుల కెల్లా నేది గతి
మేర మీరే నవ్వులకే మిక్కిలి బీరా లాడీతే
తారుకాణమోహలకు తగులాయ మేది

చ. 2: చనవు మెరయ రాఁగా సారెకువేసారుకొంటే
వినయపుసతు లెల్ల వేగించు టెట్టు
కనుఁగొనలఁ జూడఁగ కాఁతాళాలు నెరపితే
ననుపుల లోపలికి నయగారా లేవి

చ. 3: కుచ్చి కాఁగిలించుకోఁగా కుచములు నాటె నంటే
ముచ్చటాడేయింతులకు మొదలేది
యిచ్చకుఁడ శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
విచ్చనవిళ్లలోన విన్నవించ నేది

రేకు: 0317-2 శుద్ధవసంతం సంపుటం: 11-098

పల్లవి: చెలులాల మీ రిం తేల చెప్పే రాతనికి బుద్ధి
చలివలపులు చిల్లి జాగులు సేసీనా

చ. 1: సేస వెట్టినట్టివాఁడుచేరి కాఁగిలించుఁ గాక
ఆసలాసలె రేఁచి అట్టె వుండీనా
వాసి వుటించినవాడు వడిఁ జింత మిచ్చుఁ గాక
బేసబెల్లితనమున బిగువు లాడీనా

చ. 2: ససర మాడినవాఁడు చన విచ్చి కూడుఁ గాక
తరఁగుమరఁగు లాడి తక్కి వుండీనా
కరఁగి మెచ్చినవాఁడు కందువకుఁ దీసుఁ గాక
సరవు లెరంగక సాదించీనా

చ. 3: దగ్గరి వచ్చినవాఁడు దయ నాపైఁ జేసుఁ గాక
సిగ్గులు వడుచు వేరె చిమ్మి రేఁచీనా
యెగ్గు దీర శ్రీవెంటేశుడిట్టె నన్నుఁ గూడె
వొగ్గి నా సొమ్మాయఁ గాక వొల్ల ననీనా

రేకు: 0317-3 మంగళకౌశిక సంపుటం: 11-099

పల్లవి: తానె యెరఁగఁడా తనలాగు
మోనాన నే నొక్కమారు మొక్కితేనె చాలునే

చ. 1: పిలువ నేర్చినవాఁడు ప్రియము చెప్ప నేరఁడా
వెలిని లోనను విన్నవించ నోపనే
తలఁపు దెలిసేవాఁడు తమకించ నేరఁడా
పలుమారు నతనిఁ జేయి వట్టి తియ్య నోపనే

చ. 2: ఆయము అంటినవాఁడు అవ్వలిపని నేరఁడా
రేయిఁ బగలు నాతని రేఁచ నోపనే
చాయగా నవ్వినవాఁడు చవి గోన నేరఁడా
పాయపురచన లెల్ల బచరించ నోపనే

చ. 3: కన్నుల జూచినవాఁడు కాఁగిలించ నేరఁడా
వున్నతపుగుబ్బల నే నొత్త నోపనే
యిన్నిటా శ్రీవెంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడెను
వెన్నెలబాయిట నంత వేసరించ నోపనే

రేకు: 0317-4 దేసాక్షి సంపుటం: 11-100

పల్లవి: మాఁటలు నాతో మా కేల
ఆఁటదాని కస రంటీఁ గాని

చ. 1: చెప్పక చెప్పిన చెలివిన్నపములు
ఱెప్పల తుదలనె ఱెట్టించే
వుప్పతించి ని న్నొకటి నాడము
తప్పనిబాసలె తగిలీఁ గాని

చ. 2: అంపక యంపిన అంగన కానికె
ముంపుకుచములనె మొన చూపే
గుంపెనతో నిఁక కూరిమి గొసరము
పెంపువిరహమె పెనగోనీఁ గాని

చ. 3: కూడక కూడిన కోమలికోరికె
వాడుమోవిని వన్నాయి
యీడనె శ్రీవెంకటేశ యేలితవి
వేడుకవలపులె వెతకీఁ గాని

రేకు: 0317-5 హిందోళవసంతం సంపుటం: 11-101

పల్లవి: కడు ముద్దరాలు గన కక్కసించ నోపదు
వడిఁ బెట్ట కిఁక నిట్టె వర మియ్యవయ్యా

చ. 1: నిన్నుఁ జూచి నవ్వు నవ్వి నివ్వెరగుఁ బొందెఁ జెలి
సన్నలు నీకే తెలుసు సరసుఁడవు
విన్నపము నేనే నంటె వెలది చిత్త మెఱఁగ
వున్నతి చెలి మోహము వొప్పు గొనవయ్యా

చ. 2: అప్పసము చేయి చాఁచి ఆయములు గరఁగె యీ
చొప్పు నీవె యెరుఁగుదు సుజాణఁడవు
అప్పటిఁ గొసరే మంటె ఆపెమర్మ మెరఁగము
చిప్పిలువయసు నీకే సెలవు సుమ్మయ్యా

చ. 3: మేరతో దగ్గరుతానె మెచ్చె నిన్నిటా నీకె
ఆ రతి నీ వెరుఁగుదు వధికుఁడవు
కూరిమి శ్రీవెంకటేశ కూడితివి మగువను
నేరుతుమా నే మంత నీనే రక్షించవయ్యా

రేకు: 0317-6 ముఖారి సంపుటం: 11-102

పల్లవి: నీవుసేసిన బాలు నీ వెరఁగవా
రేవగలు నెట్టు వేసరించేము నిన్నును

చ. 1: ఆడినప్పటి మాటలో నర్తము నీ వెరఁగవా
యీడకు వచ్చుండఁగాను యిం తెరఁగవా
వేడుక పడ్డవాఁడవు వెలయించ నెరఁగవా
తోడనెని న్నెందాఁక దూరేము నిన్నును

చ. 2: నవ్వినవ్వులలోని నయము నీ వెరఁగవా
రవ్వ సేసినఁవాఁడవు రా నెరఁగవా
జవ్వనపువాఁడ వాసలు నీ వెరఁగవా
రివ్వలుగ నెందాఁక రేచేము నిన్నుము

చ. 3: యిట్టె చూచినవాఁడవు యిచ్చక మెరఁగవా
జట్టి గొన్నవాఁడవు మెచ్చ నెరఁగవా
నెట్టన శ్రీవెంకటేశ నీవె నన్నుఁ గూడితివి
గుట్టుతోడ నెందాఁకా కొసరేము నిన్నును

రేకు: 0318-1 దేసాక్షి సంపుటం: 11-103

పల్లవి: మందెమేళమె నాకు మన్నింతవు గాన నీతో
యిందుకుఁగా నీవు యెగ్గు లెంచకుమీ అయ్యా

చ. 1: వాలుకరెప్పల వంచి వడి నేఁ గొసరితిని
తాలిమి లేక నీపైఁ దమకించితి
వేళావే ళెరఁగక వేసరించితిని నిన్ను
యీలీల నీచిత్త మెట్టో యెరఁగఁజుమ్మీ అయ్యా

చ. 2: కుచ్చి కుచ్చి నిన్ను సారె గుబ్బల నే నొత్తితిని
తచ్చి తచ్చి నోతోఁ బంతము లాడితి
హెచ్చుగా సెలవి నిన్ను నిందరిలో నవ్వితిని
మచ్చుట నిన్నిటికిగా మొక్కేఁ జుమ్మీ అయ్యా

చ. 3: పాయపుమదాన నిన్నుఁ బట్టి చేతఁ దీసితిని
చాయల సన్నల నిన్ను జంకించితి
ఆయ మెరఁగక నిన్ను నలయించి కూడితిని
మాయల శ్రీవెంకటేశ మానఁ జుమ్మీ అయ్యా

రేకు: 0318-2 దన్నాసి సంపుటం: 11-104

పల్లవి: నీవు చేసినది చేఁత నీకు నడ్డమాడ నేను
పావన మైతిని నీపాలిదాన నేను

చ. 1: యిందరు నెరఁగ నన్ను నిటు మన్నించిన నీవు
మందలించి యిఁక వేరె మానఁ బొయ్యేవా
పొందిన నా పొందు లివె పూఁచి నా మన సుండఁగ
సందేహ మింక నేల సత మైతి నేను

చ. 2: కావలె ననుచు నన్నుఁ గైకొన్నవాఁడవు
వేవేలైన దగ విడిచేవా
నీ వేలివుంగర మిదె నేఁడు నాచేఁ జిక్కినది
దావతి యిఁక నేఁటికిఁ దగు లైతి నేను

చ. 3: కచ్చుపెట్టి నీవు నన్నుఁ గాగిలించినవాఁడవు
యిచ్చకమె నేతు గాక యెర వయ్యేవా
నిచ్చలు శ్రీవెంకటేశ నీకూటమి నాకు నబ్బె
మచ్చుమాయ లిఁక నేల మరిగితి నేను

రేకు: 0318-3 భైరవి సంపుటం: 11-105

పల్లవి: నీ వెరఁగవా తగవు నీకు విన్నవించేమా
వేవేలు సతులోన వెలయించ రాదా

చ. 1: నలుదిక్కులుఁ జూచేవు నాదిక్కు చూడఁగ రాదా
వలపు నీ పై జల్లెటివనిత నేను
పిలిచినవాఁడవు ప్రేమ చూపక మానవు
తొలుతె కాఁగిట నించి దొద్ద సేయ రాదా

చ. 2: కానుక లందేవాఁడవు గక్కన నన్నంట రాదా
పానికుచముల నిమ్మపండ్లదానను
పూని నవ్వినవాఁడవు భోగించక మానవు
నే నడిగినవేళనె నీవు లోఁగ రాదా

చ. 3: కడు నా సోదకాడఁవు కాఁగిలించుకో రాదా
ఆడియాల మైన నీ యాఁటదానమ
యెడయక శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
కడమ లేకుండ నిట్టె గతి గూడ రాదా

రేకు: 0318-4 శ్రీ రాగం సంపుటం: 11-106

పల్లవి: మేలు మేలు రమణుఁడ మెచ్చితి నిన్ను
చాలి నీసేఁతల కెల్ల సంతోసింతు నేను

చ. 1: కలవు నామీఁద బత్తి కన్నులఁ జూచితి విదె
వలచినవలపులు వన్నె కెక్కెను
తలఁపులు దెలియక తమకింతు నింతె కాక
యెలమి నీవల్ల నీవల్ల వెల తించుకంత లేదు

చ. 2: నిక్కమె నీ మాట లెల్ల నేఁ డీడకు వచ్చితిని
తొక్కినపాదపుఁ దొక్కు తుదు కెక్కెను
యెక్కుడు నీ నవ్వులకు నీసడింతు నింతె కాక
యెక్కడా నీవొళ్ల దప్పు లెంచఁ జోటు గలదా

చ. 3: చెల్లెను నీ సేఁత లెల్ల చేపట్టి కూడితి విదె
యెల్లగా నా కోరెకెలు యీడేరెను
కొల్లగా శ్రీవెంకటేశ కొసరుదు నింతె కాక
పొల్లు లేని నీగుణాల పొరపొచ్చ మున్నదా

రేకు: 0318-5 శంకరాభరణం సంపుటం: 11-107

పల్లవి: ఏ మందు నా గుణ మిదె యెంత మెహించితినో
చేముట్టి నీమీఁద నున్నచేయి దియ్యఁ జాలరా

చ. 1: చెప్ప రానిమాట లైన జేసేఁ గాని నీతో
నప్పటి నెదురు మాటలాడ నోపరా
కుప్పళించి పెంజెమట గురిసేఁ గాని నీకుఁగా
తప్ప కిట్టె మోము చూచి తలవంచ నోపరా

చ. 2: నేయ రానిపని కైన చేరి వొడిగట్టేఁ గాని
ఆయెడె నిన్నుఁ బాసే అందు కోపరా
చాయల సరసమున సందడిఁ బొరలేఁ గాని
పాయపుమదాన సిగ్గువడఁగ నే నోపరా

చ. 3: యేకతాన నెందు నైన నియ్యకొనేఁ గాని నిన్నుఁ
గాకుగా మందెమేళాలఁ గప్ప నోపరా
యీకడ శ్రీవెంకటేశ యిట్లాఁ గూడుండేఁ గాని
దాకొని జంకించి నిన్ను తక్కించ నోపరా

రేకు: 0318-6 గౌళ సంపుటం: 11-108

పల్లవి: మోనాన నూరకె నీకు మొక్కేఁ గాక
కానికలు సారె నేమి కప్పు మంపే నీకును

చ. 1: తలఁపు నామీఁద నీకు తగిలి వుండఁగాను
చెలు లేమి విన్నపాలు సేసేరు నీకు
చలిమి బమిలి నాకు సరి గలిగి యుండఁగ
మలసి సొలసి యేమి మాటలాడే నిన్నును

చ. 2: మంతనాన నీవు నాకు మనసిచ్చి యండఁగాను
దొంతులబుద్ధులు యేమి దోఁచీ నీకు
పంత మిచ్చి నీవు నాపై పక్షమై యుండఁగాను
కొంత గొంత యిఁక నేమి గొసరేము నిన్నును

చ. 3: కందువల నీవు నన్నుఁ గాఁగిలించు కుండఁగాను
విందుల నాగుణములు వింతా నీకు
పొందుగ శ్రీవెంకటేశ పూఁచి నన్నుఁ గలసితి
చందముగా యిఁక నేమి జరసేము నిన్నును

రేకు: 0319-1 కాంబోది సంపుటం: 11-109

పల్లవి: ఏమని మెత్తు నిన్ను యింత మేలు చేసితిని
కామిని నామాన మిట్టె కాచితివి నీవు

చ. 1: యెదురు చూడగాఁనె యింతలో విచ్చేసి నీవు
అదన నా చేయి వట్టి ఆదరించితి
వదలుఁ బయ్యదతోడ వసివాడే నన్నుఁ జూచి
పొదిగి పయ్యద గప్పి పొది సేనితివి

చ. 2: మొక్కుకోఁగానె నీకు ముంచి నాకు వర మిచ్చి
చెక్కు నొక్కి బుజ్జగించి సేద దేర్చితి
లక్కవంటి మదితోడ లాచక వుండిన నాతో
ముక్కువలు చల్లి చల్లి మంతన మాడితివి

చ. 3: చేయి చాఁచగానె నన్ను శ్రీవెంకటేశుఁడ కూడి
చాయల నవ్వులు నవ్వి సన్న సేసితి
పాయపువేడుకతోడ పదరుచు నుండేనన్ను
ఆయము లంటుచు మరి అట్టె మన్నించితిని

రేకు: 0319-2 ముఖారి సంపుటం: 11-110

పల్లవి: ఏల మాతోఁ జెల్లఁ బెట్టే వెమ్మెలు నీవు
నాలి నేయ కిఁక నీవు నవ్వు వచ్చీ మాకు

చ. 1: పంత మేల నీవు నాతోఁ బచరించే వప్పటిని
యెంత లేదు ని న్నిందఁరు నెరఁగనిదా
కాంత యైతేఁ జాలు నీవు కడు గుజ్జైనాఁ గాని
చింత దీర భోగించి సేస వెట్టవా

చ. 2: వాసు లేల నెరుపేపు వచ్చి వచ్చి నా ముందర
నీ సుద్దులు మా కెల్ల నేఁడు గొత్తలా
ఆసపడి ఆఁటదాని కడవు లెల్లాఁ దిరిగి
రాసి కెక్కఁ దెచ్చుకొని రవ్వఁ బడవా

చ. 3: కడుఁ బరా కే లయ్యేవు గక్కన ధీరునివలె
ఆడరి శ్రీవెంకటేశ ఆడ వలెనా
మెడఁ గట్టుకొంటి విదె మించి యలమేల్‌మంగను
తొడిఁబడ నన్నుఁ గూడి దొరవై నిలువవా

రేకు: 0319-3 బౌళి సంపుటం: 11-111

పల్లవి: అన్ని నేరిచినవాఁడ వామీఁదు నేరవా
సన్న నేసినవాఁడవు చాయకు రా నేరావా

చ. 1: కాయ మంటినవాఁడవు కప్పురము నోటి కిచ్చి
ఆయములు గరఁగించ నంత నేరవా
సోయగపుచూపులఁ జూచినవాఁడవు నీవు
పాయపుకోరికె లిచ్చి పచరించ నేరవా

చ. 2: నగినవాఁడవు నీవు నానారీతుల నాతో
అగపడి సరసము లాడ నేరవా
మిగుల నాచేఁతలతో మించినవాఁడవు యిట్టె
బిగువుఁగాఁగిటఁ గడు ప్రేమ రేఁచ నేరవా

చ. 3: మెచ్చినట్టివాఁడవు మేకులు సేసి నేసి
యిచ్చగించి కలయఁగ నింత నేరవా
కుచ్చి శ్రీవెంకటేశుఁడ కూడి మన్నించితి విదె
నిచ్చలు నీమేలు నాపై నెరపఁగ నేవరా

రేకు: 0319-4 పాడి సంపుటం: 11-112

పల్లవి: మూసినముత్యవలె మూల లే లోయి
మోస మెట్లాఁ దేరె నిఁక మొరఁగే లోయి

చ. 1: పచ్చికస్తూరిబో ట్టంటి పరిమళించే దెల్లా
మెచ్చులా యిద్దరిలో నీ మేననా వోయి
గచ్చుల నెవ్వ రవుతా కానకుంటి మిందాఁకా
మచ్చెము బాయిటఁ బడె మాటలాడ వోయి

చ. 2: ముడిచివేసే పువ్వులు ముంగిట రాలే దెల్లా
చిడుముడి నెరుల నీ సిరసా వోయి
యెడసి యీగురు తిది యేరుపడ దిందాఁక
ఆడియాలము గంటిమి ఆన లేల వోయి

చ. 3: కుంకుమచెమటబొట్లు కురిసె నీడ నెల్లాను
లంకెలైన నీ చెక్కుల లాగాలా వోయి
అంకెల శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
సంకె లెల్లఁ దేరె నిఁక జాగు లేల వోయి

రేకు: 0319-5 మధ్యమావతి సంపుటం: 11-113

పల్లవి: ఎంతటిదానవు నీవు యేమి చెప్పేము
పంతము లన్నియు దక్కెఁ బలుకు లీడేరెను

చ. 1: చింత లెల్లఁ బెడబాసె చెక్కుచెయి దియ్యవమ్మ
కాంతుఁ డింటికి విచ్చేసె కడమ దీరె
దొంతి నున్నవలపులు తొడికితేఁ జేతఁ జిక్కె
యింతయు నీ మహిమలె యిఁక నేల జాగులు

చ. 2: కోరికలు సమకూడె గోరివాఁత మానవమ్మ
గారవించె నాతఁడు నీ కైవస మాయ
చేరినట్టి జవ్వనము చెల్లుబడి కెక్కె నిదె
నేరు పెల్ల నీ సొమ్మె నీ కేల మరఁగు

చ. 3: తతి వచ్చె కూటమికి తలవంచ నేలమ్మ
అతఁడు శ్రీవెంకటేశుఁ డంకెం గలసె
మతిలోని ముదములు మాటలసోన గురిసె
చతురత నీ పాలాయ సంకేల నీకును

రేకు: 0319-6 సౌరాష్ట్రం సంపుటం: 11-114

పల్లవి: ఏలినవాఁడవు నీవె యే మయ్యా
మేలు నాకు నీవల్ల మీఁద కిక్కి లయ్యా

చ. 1: అందగారి మాట లెల్ల నాడి నన్ను నమ్మించి
కందువకుఁ దీసితివి గదవయ్యా
చెందమ్మిరేకులవంటి చేరఁడేసి నా కన్నుల
కింద కెల్ల గురి యైతి విఁక నీ చిత్త మయ్యా

చ. 2: యింట నూరకుండేదాన నెలయించి నవ్వించి
గంటి సేసితివి మోవి గదవయ్యా
గొంటరి నా చనుఁబువ్వు గుత్తుల పూజలకును
నంటున లో నయితిని నాఁడె కదవయ్యా

చ. 3: కోరి నీవు కాఁగిటిలో గూడినచనవు లెల్ల
గారవానఁ చెల్లించితి గదవయ్యా
యీరీతి శ్రీవేంకటేశ యెనసి నా చిత్తమనే
వూరిలో నెలకొంటివి వొడఁబాటే అయ్యా

రేకు: 0320-1 సామంతం సంపుటం: 11-115

పల్లవి: నాతోనె ఆన తీవయ్య నంటున సంతంసించేను
చేతికి లో నైతి విఁకఁ జేరె నాకు మేలు

చ. 1: చెప్పి నే నంపినమాట చెవుల కిం పాయనా
తప్పులు లేవు గదా ఆతరవాతను
నెప్పున దాఁచఁగ నేల నిన్నుఁ బాయలే నంటి
యిప్పు డిట్టె విచ్చేసితి వియ్యకోలా నీకు

చ. 2: జిగి నా కాకుక నీకు చిత్తము వచ్చెనా నేఁడు
వెగట్లు నీవు గదా వేరె అందు
నిగిడి కొంకఁగ నేల నీబాస దలఁచు మంటి
అగపడితివి నాకు అవునా నా పొందులు

చ. 3: మొక్కిన నా మొక్కు నీకు మొగమోట కెక్కెనా
మొక్కలము లేదు గదా మోహములోన
యిక్కు వెరిఁగి శ్రీవెంకటేశ నన్నుఁ గూడితిని
దక్కితిని యింత నాపై దయ గద్దా నీవూ

రేకు: 0320-2 సాళంగనాట సంపుటం: 11-116

పల్లవి: అప్పటి నాతో నీవు ఆడ వలెనా
కప్ప నేల పచ్చడము కాఁగి లుండఁగాను

చ. 1: తప్పని నీ కృప నాపై తగిలి వున్నది గాన
ముప్పిరి నున్నవి నా మోముకళలు
నెప్పున నీ మహిమకు నేనె తారుకాణ
చెప్ప నేల నిఁక వేరె చేసి చూపఁగాను

చ. 2: చెలఁగు నీ మాటలు నా చెవి సోఁకినవి గాన
పులకలు నా మేనఁ బొది గొన్నవి
అలరు నీ మంచితనాలన్నిటికి నే గురతు
తెలుప వలెనా వేరె దిష్టమై యుండఁగను

చ. 3: అందపు నీ కూటమి నా కమరి వున్నది గాన
సందడించి నాలోని సంతంసా లేల
యిందు మనలో శ్రీవెంకటేశ యివె కారణము
చెందఁగ వలెనా వేర చేకొ నుండఁగాను

రేకు: 0320-3 హిజ్జిజి సంపుటం: 11-117

పల్లవి: చెప్పఁబోతే దనతోను సిగ్గయ్యీ నాకు
యిప్పుడు వద్ద నున్నాఁడు యెచ్చరించరే

చ. 1: చూడఁగానె నా కన్నులు సారిదిఁ జేరఁడే సాయ
యిడఁ దన చక్కఁదన మెంతో కాని
దాడితో నెడతెగదు తనమీఁది తలపోఁత
వేడుకకు వెల లేదు విన్నవించరే

చ. 2: కదిసితే నా చన్నులు కాఁగెఁడేసి కాఁబెరిగె
యిదివో తనభారము యెంతో కాని
వొదగాయఁ దనమీఁద నుదు టైనతమకము
యెదుట నా మోహ మెల్ల నెరిఁగించరే

చ. 3: పైకొనఁగ నాతురుము బారెఁడేసి కొన సాగె
యీ కొలది తననేర్పు యిటు సేసెను
దాకొని శ్రీవెంకటేశు తగు లైనకూటమి
మేకొని నామారు మీరు మెచ్చఁ గదరే

రేకు: 0320-4 గుండక్రియ సంపుటం: 11-118

పల్లవి: సారె నిన్ను వేసరించ సంగతే నాకు
మారాడ నే నాలిసొమ్ము మగనిదె కాదా

చ. 1: నిన్ను వేగిరించేనా నీవె యెఱఁగవా
కన్నుల మొక్కితేఁ దానె కరఁగేవు
చన్నులె గొప్పలు గాని సరి నడుము బడలె
విన్నపము లిఁక నేల వింతదానఁ గాను

చ. 2: చలము సాధించేనా జాణఁడవు గావా
నిటుచుండఁగాఁ గరుణించేవు నీవె
లలిఁ గొప్ప గొప్పగాని లాచి మోము చిన్నఁబోయ
బలిమి చూపఁగ నీతో బంతగత్తెనా

చ. 3: నింద వేసేదాననా నీవు శ్రీవెంకటేశుఁడ
వందాలు సేసుకోఁగానె ఆదరించేవు
కందవకన్నులె గొప్ప గాని పాదాలు సన్నాలు
మందలించి నీతో మారు మలయంగఁ గలనా

రేకు: 0320-5 ఆహిరి సంపుటం: 11-119

పల్లవి: ఇట్టుండ వలదా నీవు యెవ్వతెకు మోహించినా
దట్టముగ నిచ్చితేను తప్పవు నీ బాసలు

చ. 1: ఆపెమాట లైనా నీవు ఆలకించి మా యింటికి
యీ పొద్దు విచ్చేసితివి యెన్నికె గాను
దాపగు సవతులకు దయ పుట్టఁగాఁ గదా
కాపాడితి వీఁక నిన్ను కంటిమి నీ గుణము

చ. 2: అండ నుండి ఆపె నీకు అప్ప ణియ్యఁగా నైనా
గుండె వట్టి నావద్దఁ గూచుండితివి
దండిగ తోడివారు తగవు నడపఁగాఁగా
నిండ నన్ను మన్నించితి నెగెడె నీ పుణ్యము

చ. 3: మొక్కిన యాపెమొక్కు మొగిఁ జిత్తానఁ బెట్టినా
గక్కనఁ గాఁగిటఁ గూడి కైకొంటివి
దిక్కై శ్రీవెంకటేశ యిందిరకు సెలవుగఁగా
మిక్కిలి న న్నేలితివి మెరసె నీ కీరితి

రేకు: 0320-6 వసంతవరాళి సంపుటం: 11-120

పల్లవి: వినవే యెక్కడి సుద్ది వేగ మామాట
మనసులోఁ జల ముంటే మర్మములు మాన్పునా

చ. 1: యెంతేసి మాట లాడిన యెచ్చు కుందు గలిగినా
కాంతలకు మగలకుఁ గలదా వేరు
చింత దీర నావేళకు చెక్కు చేయే మరఁ గింతె
పంతపు నెలవినవ్వు బతిమాలింపించెను

చ. 2: అవ్వలిమోము లై వున్నా నలుకలు ముంచుకన్నా
జవ్వనపువలపుల చవి దప్పినా
దవ్వులై యావేళకు తలవంపులే మరఁగు
చివ్వనఁ గనుచూపులె చెలుములు నేయవా

చ. 3: సిగ్గులు పైకొనినాను చేఁతలు గడు మీరినా
నగ్గళపు రతివేళ నడ్డ మున్నదా
యెగ్గు దీ శ్రీవెంకటేశుఁ డిట్టె నిన్నుఁ గూడె
బెగ్గిలినాఁ దమకము ప్రియములు రేఁచునే

రేకు: 0321-1 మంగళకౌశిక సంపుటం: 11-121

పల్లవి: పడుచుఁజేతలు గావు బాలకృష్ణుఁడు
తొడికీ మోవిపంటికె దుండగపుఁగృష్ణుఁడు

చ. 1: వెన్న చేతఁ బట్టుకొని వేలు చాఁచి వుట్లకు
సన్న చేసీఁ గదవమ్మ జాణ కృష్ణుఁడు
కన్నెలు ద న్నెత్తుకొంటె కాఁగిటిచూపులు చూపీ
యెన్నిట తా నసకాడె యీ కృష్ణుఁడు

చ. 2: అంకెల దొంగెడు తానె అందపుచూపులు చల్లీ
లంకె మగనాండ్లపై లలిఁ గృష్ణుఁడు
పొంకపుచెక్కు గీఁటితె పుక్కిట లోకాలు చూపీ
సంకె లేక యశోదకు సటకాఁడు కృష్ణుఁడు

చ. 3: గొల్లెతలు ముద్దాడితె గురుతు లెల్లా నించె
చల్లచాడెలకాడనె సరి గృష్ణుఁడు
అల్ల శ్రీవెంకటాద్రిని అదె తుంగభద్రదరి
కొల్లలుగా వరా లిచ్చీ గోవిందకృష్ణుఁడు

రేకు: 0321-2 బౌళి సంపుటం: 11-122

పల్లవి: వలెనా యింకా నంత వలపు గలయఁ బెట్ట
సళుపుఁజూపుల నాయ సమతారుకాణలు

చ. 1: చేసినట్టిచేఁత లెల్లఁ జెల్లించ నీవు గలవు
ఆస చూపి నీకు మొక్క నాపె గలదు
యీసు లేక వోరుచుక యియ్యకొన నేఁగలను
రాసి కెక్క నీవు నవ్వు రాకుండునా యిఁకను

చ. 2: పసిఁడిపట్టెమంచము పవళించి వుండఁ గల
దసమున భోగించ నాపె గలదు
పసగా నుండఁగను నా బంగారుమేడ గలదు
వెస సంతంసాల విట్టువీఁగ వద్దా యిఁకను

చ. 3: వుంగరము వేలఁ బెట్ట నొరసి యాపె గలదు
సింగారించుకొనను నీ చేయి గలదు
అంగవించి నిన్నుఁ గూడేయందకు నేనూఁ గలను
చుంగుల శ్రీవేంకటేశ చొక్క వద్దా యింకను

రేకు: 0321-3 వరాళి సంపుటం: 11-123

పల్లవి: సొమ్ము గలవాఁడవు సోఁపు గని యిచ్చె కాఁక
సమ్మతిఁ గాక వంచన సేయ వచ్చునా

చ. 1: సిగ్గువ డుండుత గాక చెనకే నీ చేఁతలకు
తగ్గి తప్పించుకొంటేను తప్పు లెంచవా
వొగ్గి మొదలనె నీకు వొప్పగించిన దీ మేను
దగ్గరి పైకొంట గాక దాఁచ వచ్చునా

చ. 2: మోనాన నుండుత గాక మోహపు నీ మాటలకు
దానికె నే మారాడితేఁ దమకించవా
నానినది మొదలనె నానోరు నీ యెంగిటనె
పూని పట్టుకుందుఁ గాక బొంకె నన వచ్చునా

చ. 3: ఆసతో నుండుత గాక అంటిన నీరతులకు
వీస మంత నే మీరినా వెర గందవా
నీ సొమ్ము మొదలనె నా నెయ్యము శ్రీవెంకటేశ
మూసి దాఁచుకుందుఁగాక మొరఁగఁగ వచ్చునా

రేకు: 0321-4 భైరవి సంపుటం: 11-124

పల్లవి: ఏమో యెరఁగను యోట్టైనాఁ గాని
వేమరు నీ కెక్కినది వేడుక నా బదుకు

చ. 1: చింత దీర నీ మన్నన చెప్పుకొనఁగా విని
పంతపుసతులు పకపక నవ్వేరు
మంతనానా నీచేతలు మరి యే మైనాఁ గలవో
యెంత వలచినది సి గ్గించ దంటానో

చ. 2: సమరతి నీ పాన్పుపై సరి నే నుండఁగాఁ జూచి
జమళిఁ దమలోననె సన్న సేసేరు
అమరదో నీవు నేనూ నంటుకొన్నపొందులు
తమితో నాగర్వ మింత తగ దంటానో

చ. 3: చేరి వేడుకొంటా నే నీ చెక్కు నొక్కఁగాఁ జూచి
సారెఁ దమమెకా లిచ్చలఁ జూచేరు
యీరీతి శ్రీవెంకటేశ యిచ్చఁ గూడితిమి మన
నేరుపుల నన్నిటాను నీవె నే నంటానో

రేకు: 0321-5 కన్నడగౌళ సంపుటం: 11-125

పల్లవి: మరుఁడు సేసేనమాయ మరి తెలియదు గాక
సరవు లిద్దరివిని సరికి బే సాయనా

చ. 1: చనవు సేసుక నిన్ను సరిఁ గొంగు వట్టితిని
యెనసి యింత నేయ నీ యీడుదాననా
పెనఁగ కంతలో నీవు బెరసి లో నైతిని
ననిచి కరణ యింత నా మీఁద నుండెనా

చ. 2: నవ్వు నేసుకొని నీపై నలిఁ జేయి వేసితిని
రవ్వ నిన్నింత నేయ బీరపుదొరనా
చివ్వన నీ వప్పటిని చేరి బత్తి సేసేవు
యివ్వల నీ మోహము నన్నింత దొడ్డ సేసెనా

చ. 3: బలిమి సేసుక నే నీపయిఁ జేయి వేసితిని
కలసితి వింతేసికిఁ గలనా నేను
నెల వై శ్రీవెంకటేశ నీ వింకాఁ జెక్కు నొక్కేవు
సలిగె లిన్నియు నీవె సమ్మతించితివా

రేకు: 0321-6 హిందోళవసంతం సంపుటం: 11-126

పల్లవి: ఏల వెగిరించేవె యీతనితోడ
మూలలనె వుండ నీరె ముచ్చటల మాఁటా

చ. 1: చిత్తము వచ్చినచోట సేసినదె విన్నపము
హత్తి పొసఁగనిచోట ననుమానమె
యిత్తలఁ దన నా సంది యీ రెండుఁ దెలయుదాఁకా
పొత్తులనె వుండ నీరె పొరుగుల మాఁటా

చ. 2: ఆస గలిగినచోట నాడినదె సరసము
వేసట లయ్యినచోట విచారములె
వాసితోఁ దనకు నాకు వైపులు గూడినదాఁకా
మూసినట్టె వుండ నీరె ముందరి ఆమాఁటా

చ. 3: వొడఁబాటు గలచోల నొనగూడి వుండు నవ్వు
వెడవెడ లైనచోట వేరువేరులె
యెడయక శ్రీవెంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె
వొడికమైవుండ నీరె వొరపుల మాఁటా

రేకు: 0322-1 దేసాళం సంపుటం: 11-127

పల్లవి: రసికుఁడ వౌదు పండరంగినాథా నీ
పసలఁ జిక్కిలి మిదె పండరంగినాథా

చ. 1: యివ్వల నవ్వల నేఁడు యిటు నీతో నవ్వి నవ్వి
రవ్వైతిమి గదో పండరంగినాథా
కువ్వ లాయ నీ చేఁతలు గురి యయితి మింతకు
పవ్వళించితిరి మేలు పండరంగినాథా

చ. 2: రుచు లైన నీ మాఁటలె రూఢి కెక్కెంచెను మమ్ము
రచనకాఁడ వో పండరంగినాథా
యిచట నీ రాకలను నెదురు చూపించి మేలె
పచరించితివి బాపు పండరంగినాథా

చ. 3: సారెఁ దీసితివి కొప్పు చన్ను లంటి చూచితివి
రారాదా యిఁక పండరంగినాథా
కూరిమి శ్రీవెంకటాద్రిఁ గూడి చొక్కించితి మమ్ము
పైరు లాయఁ బులకలు పండరంగినాథా

రేకు: 0322-2 శ్రీరాగం సంపుటం: 11-128

పల్లవి: సరనుఁడవు నీ వైతే చదురాలు నీ కాపె
ఆరు దాయ నన్నిటాను అమరు నిద్దరికే

చ. 1: చెప్పఁగలవల పెల్లఁ జెలి నీతోఁ జెప్పి చెప్పి
చెప్పరానిమాటలకు సిగ్గు వడ్డది
చిప్పిలునవ్వులఁ గొంత శిరసువంపులఁ గొంత
అప్పగించీఁ దెలుసుకో అవ్వలివిన్నపము

చ. 2: సేయఁగల వూడిగాలు సేసి సేసి నీ కాపె
నేయరానిచేఁతలకు సిగ్గు వడ్డది
చేయెత్తిఁ మొక్కులఁ గొంత చిమ్మునిట్టూర్పులఁగొంత
కాయము సోఁకఁగ జేసీ కడమ వూడిగెము

చ. 3: చెక్కు నొక్కు నొక్కి యిట్టె శ్రీవెంకటేశ్వర నిన్ను
చెక్కు చేతితోడనె తా సిగ్గు వడ్డది
పుక్కిటి విడేలఁ గొంత పొరచిచేఁతఁల గొంత
గక్కన నీ కంది యిచ్చీ కడమదొడములు

రేకు: 0322-3 పాడి సంపుటం: 11-129

పల్లవి: చెప్పరా దిందాఁక నైతె చెలి యున్న భావము
వుప్పుచిం దినుమడించె నుండ నుండఁగాను

చ. 1: మగువకు నేఁడుగా మనికిత మెల్లఁ బానె
వెగటు వో నీ వింటికి విచ్చేయఁగాను
మొగచాటు లే దాయ ముచ్చట లెల్లఁ దీరె
సొగిసి నీవు మొగము చూడఁగాను

చ. 2: సుదతి కీ వేళ గా షోడశకళలు నిండె
మదనజకనకపు నీవు మన్నించఁగాను
తుదిపదమున కెక్క తుందుడుకు లెల్లఁ బోయ
పొదిగి పట్టి కాఁగిట బుజ్జగించఁగాను

చ. 3: అంగన కిట్టె కా ఆతు మెల్ల జల నాయ
సంగతిగా రతిఁ గూడి చన వియ్యఁగా
చెంగల శ్రీవెంకటేశ చేరఁగలమేలు చేరె
సింగారించి మీఁద చెక్కు నొక్కఁగాను

రేకు: 0322-4 సాళంగనాట సంపుటం: 11-130

పల్లవి: మేలు మేలు బాపు బాపు మెచ్చితి నిన్ను
తాలిమితో నున్నాఁడవు తగవరి వౌదువు

చ. 1: యేకడనో వుంటి వట యే మేమో సేసితి వట
ఆకె నాతోఁ జెప్పనవి ఆ మాటలె
వాకున నాడ నోపక వాసితో నూరకుండితే
నీకు నీకె నవ్వేవు నెరజాణ వౌదువు

చ. 2: మంతనా లాడితి వట మరికొన్ని గల వట
యింతి నాకు మొక్కినది యీ సుద్దికె
అంత నిన్నుఁ బచ్చి సేయ కట్టె అణఁచుకుంటే
దొంత వెట్టేవు సటలె దొరవు నీ వౌదువు

చ. 3: వొడఁబరచితి వట వొక్క టై కూడితి వట
పడఁతి యెచ్చరించె నీ పనులకునె
తడవక నే నుండితె తలపించే నప్పటిని
అడరి శ్రీవెంకటేశ అంతవాఁడ వౌదువు

రేకు: 0322-5 రామక్రియ సంపుటం: 11-131

పల్లవి: ఏనుగలతోడ నేల యేలాటాలు
కానుక లిచ్చె గుట్టు గనుకొనేను

చ. 1: రమ్మన నేఁటికి నిన్ను రాకు మన నేఁటికి
పుమ్మడి నుండె నీ వోజ చూచేను
సమ్మతించఁగా నెట్టొ జగడించఁగా నెట్టొ
నిమ్మపంటిచేతితోడ నివ్వెర గందేనూ

చ. 2: నవ్వు నవ్వ నేఁటికి నాలితన మేఁటికి
దవ్వులనుండె నీ తమి చూచేను
పువ్వు లనఁగా నెట్టొ పూఁప లనఁగా నెట్టొ
ముప్వంక సాసముత్యాల ముగ్గులు వెట్టేను

చ. 3: వొడఁబరచ నేఁటికి వోప నన నేఁటికి
కడలేని మోహముతోఁ గాఁగిలించేను
నడుమనె కూడితిని నమ్మించి శ్రీవెంకటేశ
చిడుముడి నుంగరాలచేతఁ జెక్కు నొక్కేను

రేకు: 0322-6 నాదరామక్రియ సంపుటం: 11-132

పల్లవి: మన మెఱిఁగినవె మాయ లిన్నియును
వెనకసుద్దు లెంచితె వేవేలుఁ గలవూ

చ. 1: మొగము చూచితిఁగా మొక్కితిఁగా నీకు నిట్టె
జగడా లింకా నేల చాలించు
తగవు చెప్పకు మింక తడవ నే నా సుద్ది
వగ లెన్నైనాఁ గలవు వడిఁ దప్పించుకోనూ

చ. 2: నెలవి నవ్వితిఁ గా చెప్పినట్టె వింటిఁ గా
చలము లింకా నేల చాలించు
బలిమి నేయకు మింక పంతము లిచ్చితి తొల్లె
వలపు రేఁచఁగ బోతే వసము గా దిఁకనూ

చ. 3: కన్నుల మెచ్చితిఁగా కాఁగిట నించితిఁగా
సన్నలు చాయలు నిఁకఁ జాలించు
వున్నతి శ్రీవెంకటేశ వొద్దికైతి నీతోను
వన్నెలు వాసులు నెంచ వలెనా యిందులోనూ

రేకు: 0323-1 ముఖారి సంపుటం: 11-133

పల్లవి: ఎంత కెంత సేసేవు యేమమ్మా
చింత దీర నాతనిపైఁ జెయి వేయ వమ్మా

చ. 1: చేతిమీఁది చెక్కి దేల చెలవుఁడు వేఁడుకొనీ
అతనిమాటలు కాని మ్మన వమ్మా
రాతిటనుంటియు జాగరములె సేయఁగఁ బట్టె
యీ తరుణులఁ జూ చైన యియ్యకొన వమ్మా

చ. 2: కొప్పు ముడవ వి దేల కోపము దీర్చె నాతఁడు
చెప్పిన ట్టల్లా నీఁకఁ జేయ వమ్మా
తెప్పలు రిచ్చవడె మీ టేసు లెల్లాఁ జూచి చూచి
చిప్పిల నీ నవ్వులనె సేసవెట్ట మమ్మా

చ. 3: వట్టి మోనా లీఁక నేల వాఁడె సరసము లాడీ
పట్టినచలము మాని పలుక వమ్మా
యిట్టె శ్రీవెంకటేశుఁ డితఁడు గూడె నిన్ను
నెట్టుకొని రతుల నిన్నిటా మెచ్చ వమ్మా

రేకు: 0323-2 దేసాళం సంపుటం: 11-134

పల్లవి: ఏమి చూచుకొన్నాండవో యెఱఁగ నేను
కామించి నీ మన్ననలో కడమలూఁ గానము

చ. 1: దవ్వుల నుండిననన్ను దగ్గరఁ బిలుచుకొంటే
చివ్వన నీకు మేలు చేరదా నేఁడు
రవ్వగానీ కొలువులో రాజసమె చూపఁగాను
యివ్వల నవ్వల నీవు యేమి గట్టుకొంటివి

చ. 2: దట్టపువిరహి నన్నుఁ దప్పక చూచితేను
అట్టె దయ గలవాఁడ వని మెచ్చనా
గుట్టుతోడ నిందరిలో కొంచి కొంచి నవ్వఁగాను
యెట్ట నెదురుకట్ల నందు కెక్కెఁ బనులు

చ. 3: యింటిలో నుండిననన్ను యిటు నీవు గలసితే
జంట వై పొందులు సేయ జాణవు గావా
అంటితివి శ్రీవెంకటాధిప తెరలో నన్ను
వెంట వచ్చి కూడితిని వింత లాయఁ జేతలు

రేకు: 0323-3 సామంతం సంపుటం: 11-135

పల్లవి: కందము నీ సరితలు కడదాఁకాను
యిందరిలో నన్ను మాఁట లేల బొంకే విఁకను

చ. 1: పంతగాఁడ వౌదువు పడఁతి నింత యెంచితి
వంత నీకుఁ బెద్దరిక మైతేఁ జాలు
వంతు లాడేవు పిలువ వచ్చినమాతోనె నీవు
యింత గుండెవాఁడ వైతే నెటు వొయ్యీఁ బనులు

చ. 2: నేరుపరి వౌదువు నెలఁతఁ బాసి వుంటివి
ఆరయ నీ కింత చవు లైఁతే జాలు
చేరువకు వచ్చి లో లో సిగ్గు వడే వప్పటిని
యీ రీతి నుండితేఁ జాలు నీడేరె మోహము

చ. 3: మంచివాఁడ వౌదువు మగువఁ గూడితి విట్టె
అంచెల నీ కిదే పని యైతేఁ జాలు
ముంచిన శ్రీవెంకటేశ మెదలె యిట్టుండ రాదా
యెంచేము నీ గుణములు యే మాయ నిపుడు

రేకు: 0323-4 శుద్ధవసంతం సంపుటం: 11-136

పల్లవి: వేవేలు జాగు లేక విడవయ్యా
యీ వేళ నాకుఁ జన వియ్యవయ్యా

చ. 1: శిర సేల వంచేవు సిగ్గు లేల పెంచేవు
సారిది మా వంక నిటు చూడవయ్యా
మరిగి యున్నదాన మాయ లెల్ల విన్నదాన
యిరవు నేయఁగ నిక నేఁటి కయ్యా

చ. 2: యేడ పరాకై వున్నాఁడ వేమి దలఁచుకొన్నాఁడ
వాడఁగలమాట లెల్ల నాడవయ్యా
మేడెపువల పిదివో మెత్తనిపర పిదివో
వాడిక నీమేలు నాపై వంచవయ్యా

చ. 3: చెక్కు లేల నొక్కేవు చెంది యేల చొక్కేవు
పక్కన యింటిలోనికిఁ బదవయ్యా
యిక్కువ శ్రీవెంకటేశ యెనసితి వింకా నాస
నిక్కి నాకు నన్నిట్టె మన్నించవయ్యా

రేకు: 0323-5 ఆహిరి సంపుటం: 11-137

పల్లవి: వలపులె కాండి పారి వరుస నిద్దరికిని
నిలవుఁదమకములు నీవే యెరుఁగుదువూ

చ. 1: యెన్నఁడొకో నీవు నన్ను యెనసి మన్నించేది
చన్నుల నే నిన్ను నొత్తి సాధించేది
వున్నదాన మేడమీఁద నొంటి నేఁ బొడవునను
సన్న సేసేవు నీ వైతే సారెకు దిగువను

చ. 2: యెప్పుడొకో నా మేను యిటు నీ మేను సోఁకేది
అప్పటి నే మారుకు మా రప్పళించేది
కప్పురపుబాగాలు కట్టివేసితిని నీపై
నెప్పున నందుకొంటివి నిచ్చె నెక్కి నీవూ

చ. 3: యేవేళకో నామంచ మెక్కి నీవు గూచుండేడి
తావుల నేనె నిన్ను దక్కఁ గొనేది
శ్రీవెంకటేశ్వర నిన్ను చేపట్టి యెక్కించుకొంటి
మావి యిచ్చి కూడితిని ముచ్చటతో నీవు

రేకు: 0323-6 కన్నడగౌళ సంపుటం: 11-138

పల్లవి: నీమేలులోనిదాన నీవు మన్నించేటిదాన
దోమటి నన్నియు నీ చేతుల నున్న వికఁను

చ. 1: సేస వెట్టి నవ్వినట్టిచెలియను నేను నాకు
ఆసలు రేఁచితి వీఁక నలయించకు
వాసితో నీ వే మనినా వద్దనేటిదానఁ గాను
దోసముఁ బుణ్యము నీ చేతుల నున్న వీఁకను

చ. 2: యిల్లాల నయినయట్టి యిచ్చకురాల నా
వుల్లము దెలుసుకొంటి వొరసితిని
వెల్లవిరి నీ వెటున్నా వెంగె మాడేదానఁ గాను
తొల్లిటిబాసలు నీ చేతుల నున్న వీఁకనూ

చ. 3: పట్టపుదేవిని నాపంత మెల్లా నీడేరించి
జిట్టిగొంటివి నామాట సమ్మతించితి
గుట్టుతో శ్రీవెంటేశ కూడితివి వింతగాను
తొట్టి నా భోగము నీ చేతుల నున్న దీఁకనూ

రేకు: 0324-1 సాళంగనాట సంపుటం: 11-139

పల్లవి: జయ మాయ నీకు నాపె సరసములూ
నయగారి ముదుయము నారసింహా

చ. 1: మోము చూచి నీతోడ ముచ్చట లాడ వలసి
కోమలి నీ తొడమీఁదఁ గూచున్నది
ఆముకొని అట్టె మాట లాడ వయ్య ఆపెతోడ
నామాట విని యిట్టె నారసింహా

చ. 2: మన్నన నీ యలుకల మంకు దెలవ వలసి
చన్ను లురమునఁ బెట్టి సత మైనది
చెన్నుఁడ వాపె చనవు చెల్లించ వయ్య యిట్టె
న న్నడిగే దింకా నేమి నారసింహా

చ. 3: చేతుల నిన్ను నలమి చెక్కుఁ జెక్కుఁ గదియించి
నీతితో నీ మెడసొమ్మై నెలకొన్నది
యీతల శ్రీవెంకటాద్రి నెనసితి వాపెతోడ
నా తలఁపు లీడేరించి నారసింహా

రేకు: 0324-2 శంకరాభరణం సంపుటం: 11-140

పల్లవి: చెప్ప నే మున్నవి నీ నేసెటిచేఁతలు
అప్పటి కప్పటివేళ అను వింతే కాకా

చ. 1: చేరి మొక్కఁగా నీవు సెలవి నవ్వేవు గాక
వూరకుండవా నీయంత నొగి నిందాఁకా
యేరీ తని యాడ వచ్చు నిటువంటి నీ చిత్తము
వారికి వారికి భాగ్యవశ మింతే కాకా

చ. 2: చెనకఁగా నీ వంతలో చిమ్మి రేఁగే వింతే కాక
తనిసి గుట్టున నుంటేఁ దడవేవా
ఘన మైన నీ మహిమ కానఁగ నెట్ల వచ్చు
గొనకొన్న నీ యిచ్చకొలఁదే కాకా

చ. 3: బలిమి గూడఁగా నీవు పైకొంటి విపుడె కాక
తెలుసుకొంద మ నెంటే తేటపడేవా
నెల వై శ్రీవెంకటేశ నిచ్చళించ నెట్టు వచ్చు
కులికెటి నీ వలపు కొలఁదే కాకా

రేకు: 0324-3 శంకరాభరణం సంపుటం: 11-141

పల్లవి: బడిబడిఁ దిరిగాడీ బాలకృష్ణుఁడు
యెడయనిజాణ గదె యీ బాలకృష్ణుఁడూ

చ. 1: సొక్కుచు సోలుచు వచ్చి సుదతులు యెత్తుకొంటె
పక్కన నవ్వులు నవ్వీ బాలకృష్ణుఁడు
యిక్కువకుఁ జేయి చాఁచీ నేడ నైనాఁ దొంగి చూచీ
యెక్కుడు గామిడి గదె యీ బాలకృష్ణుఁడు

చ. 2: చన్ను లంటి సారె సారె చవిగా ముద్దులు వెట్టి
పన్నీఁ గదె మెహ మెల్ల బాలకృష్ణుఁడు
సన్నలనె మొక్కు మొక్కీ సమ్మతిఁ బయ్యద దీసీ
యేన్నేసి నేరిచినాఁడె యీ బాలకృష్ణుఁడు

చ. 3: నిండుఁగాగిట నించి నేరుపులు పచరించి
బండుమాట లాడీఁ గదె బాలకృష్ణుఁడు
అండనె శ్రీవెంకటాద్రి నాయ మెరిఁగి తాఁ గూడె
యెండ నీడ కన్నులతో నీ బాలకృష్ణుఁడూ

రేకు: 0324-4 రామక్రియ సంపుటం: 11-142

పల్లవి: ఊరకె గుట్టున నీఁక నండవయ్య
యే రీతి కైనా వచ్చు యీ చేఁత లయ్యా

చ. 1: కన్నుల నీవు నవ్వితె గక్కనఁ గోపము వచ్చీ
వున్నతిఁ జలము రేచ కుండవయ్య
వన్నెలు వాసులతోడ వడి బతికేవారము
నిన్నువలెనా నేము నిలవయ్యా

చ. 2: కొంగు వట్టే విట్టె నీవు కొలఁది వీరేను నేను
వుంగిటాయ సరసము లుండవయ్య
కుంగనబీరములు యేగ్గులపుట్టలము నేము
యెంగిలి కోరుతువు నిన్నే మనేమయ్యా

చ. 3: బలిమి సేసేవు నీవు పంతము లెక్కీ నాకు
వొలిసిన వెల్ల నాయ వుండవయ్య
కలతి విట్టె నన్ను కాఁగిట శ్రీవెంకటేశ
చెలిమి మనకు నేఁడు చెల్లునయ్యా

రేకు: 0324-5 నాదరామక్రియ సంపుటం: 11-143

పల్లవి: ఇద్దరు నున్నారు యెదురెదురనె మీరు
బద్దుల మీతో నాడఁ బని లేదుమాకు

చ. 1: సెలవి నవ్వినవ్వు సిగ్గులకు మొద లాయ
పలకు దందుకె నీతోఁ బలుమారును
నెలఁత నెచ్చరించేది నీ చెతిదె యిఁక
బలిమి నేయఁగ మాకుఁ బని లేదు యిఁకను

చ. 2: చెక్కునఁ బెట్టినచేయి చేఁతలకు మూల మాయ
చక్కఁగా నందుకె నిన్ను సారెఁ జూడదు
నిక్కి యాపె బుజ్జగించ నీ చేతదిదె యిఁక
చిక్కించుక నేము బుద్ధి చెప్పఁ బని లేదు

చ. 3: ముంచినవూరుపు లెల్ల మోహానకె తగు లాయ
పంచల నందుకె నిన్నుఁ బాయ నోపదు
కొంచక శ్రీవెంకటేశ కూట మిది నీచేతిదె
మించి యప్పటి నేల మెచ్చేరు చెలులు

రేకు: 0324-6 బౌళి సంపుటం: 11-144

పల్లవి: తానె యెఱుఁగుఁ గాక తరవాతి చేఁతలు
వీనుల మా బుద్ధు లిఁక వినేవా నీ వయ్యా

చ. 1: పైకొని చెలియనీకుఁ గానుక వట్టు కుండఁగ
యేకడో పరా కై వుంటి విందాఁకను
సాకిరి వెట్టెను సన్నీ సరితలు చూడు మంటా
యీకడ నిన్ను నేనే యే మనఁగల నయ్యా

చ. 2: దగ్గరి విన్నపానకు తరుణి గాచు కుండఁగా
వొగ్గక వంటివి తడ వున్నదాఁకాను
యెగ్గు వట్టి మాఁటు నేసి నిటువంటివాఁడ వని
దిగ్గన నీ వోజలు దిద్దేనా నే నయ్యా

చ. 3: లోనికిఁ దీసి ని న్నింతి లోను సేసుకొనఁగాను
మోహనాననే వుంటి వట మొక్కుదాఁకను
పూని శ్రీవెంటేశ నీ పొందిక నాతోఁ జెప్పె
నే ననకున్న నంతేసి నేరవా నీ వయ్యా

రేకు: 0325-1 సామంతం సంపుటం: 11-145

పల్లవి: దగ్గర నున్నా నతఁడు తానె యెరుఁగును
వెగ్గళించకురె మీరు విచారించె నన్నియు

చ. 1: ఆస పడినట్టివాఁడు ఆయములె అంటుఁ గాని
వోసరించి గుట్టుతోడ నూరకుండఁడు
వాసితో నే నుండగానె వల పల్లా గాన వచ్చీ
వేరించకురే మీరు విచారించె నన్నియు

చ. 2: సత మైనయట్టివాడు చనవులె యించు గాని
రతికి నెక్కక వేరె రవ్వ నేయడు
తతి దప్పకుండఁగానె తగ వెల్లా నీడేరీ
వెత సేయకురె మీరు విచారించె నిన్నయు

చ. 3: చెక్కు నొక్కినట్టివాడు చెప్పినట్టె సేసుఁ గాని
తక్కించి వేరె తాను దమకించడు
యిక్కు వెరిగి శ్రీవెంకటేశు డిట్టె కూడె నన్ను
వెక్కసము లాడకురె విచారించె నన్నియును

రేకు: 0325-2 ముఖారి సంపుటం: 11-146

పల్లవి: తమకించఁ దన కేలే తానే నేను
సమకూడేదానఁ గాక సాదించేదాననా

చ. 1: చేసన్న చేసితి నింతే చెక్కులు నొక్కితి నింతే
వాసులు వంతుల కేల వచ్చీనె తాను
రాసి కెక్కె తనమేలు రచ్చ కెక్కె చేఁత లెల్ల
ఆసపడేదానఁ గాక అడ్డ మాడేదాననా

చ. 2: కన్నుల నవ్వితి నింతే కాయము సోఁకొౌతి నింతే
పన్నినవొౌరపు లే పట్టీనె తాను
యెన్ని కాయఁ దనపొందు యిర వాయఁ గోరికలు
మన్ననలోదానఁ గాక మారుకొనేదాననా

చ. 3: సిరసు వంచితి నింతే చేతుల మొక్కితి నింతే
కెరలి నన్నేల గిలిగించీనె తాను
యిరవై శ్రీవెంకటేశుడిన్నిటాను నన్నుఁ గూడె
పెర రేఁచేదానఁ గాక బిగిసేటిదాననా

రేకు: 0325-3 రామక్రియ సంపుటం: 11-147

పల్లవి: కైవస మై తనకు నేఁ గలదానను
తావుల నా మన సెల్ల తా నెఱుఁగునే

చ. 1: పెక్కుసతులు గలిగి పెద్దగా బదుక నీవే
చొక్కపుఁ గన్నుల దన్నుఁ జూచేఁ గాని
యిక్కువ నందరి సొమ్ము లెల్ల ధరించుకో నీవే
చక్కఁగా నేఁ బెట్టినంత సంతోసమూ

చ. 2: వియ్యా లంది పీడుకూళ్లు వేమారుఁ గుడువ నీవే
వొయ్యనె తనకు లో నై వుండేఁ గాని
ప య్యాడినవారిచేతి బాగా లందుకో నీవే
యియ్యకో లై ఆకు మడి చిచ్చేఁ గాని

చ. 3: సమరతి సుపరతి జల్లఁగా వెలయ నీవే
తమితో సేవలు నేసి దక్కేఁ గాని
అమర శ్రీవెంకేటశుఁ డట్టె నన్నుఁ గూడ నీవే
గుమి గూడి నేఁ గూడి గురి యైతి నిపుడూ

రేకు: 0325-4 దేసాళం సంపుటం: 11-148

పల్లవి: కడవారి నీ మా టడుగవే నీవు
వెడగు నీ గుణములు విచారించుకొనవే

చ. 1: నీసవతి నైతిఁ గాక నిన్ను నే మైనా నంటినా
వాసు లెక్కించుక వట్టివా దేలే నీకు
ఆల నిద్దరికిని ఆతఁడే గురుతు గాక
రేసులు పుట్టించి యాల రేఁచేవే మమ్మును

చ. 2: తప్పక చూచితిఁ గాక తడవితినా నిన్ను
వుప్పటించి యంతేసి మ మ్మొురనేవే
తప్పులుఁ దారులు వాప తగ వాతఁడే యెఱఁగు
చప్ప నాయ మానవే నీట లెల్ల నీఁకయ

చ. 3: తెలిసితి నన్నియు నీ తెరువు వచ్చితనా
చలము లిక్కడ నింక సాదించకువే
అలరి శ్రీవెంకటేశుఁ డన్నిటాను నన్నుఁ గూడె
పెలుచవు నిన్నెఱుఁగు పెనఁగ నేమిటికే

రేకు: 0325-5 వంతవరాళి సంపుటం: 11-149

పల్లవి: ఇదివో నా భాగ్యము యేమి చెప్పేనే
ముదముతోఁ దన కొట్టె మొక్కితి నే ననవే

చ. 1: చుట్టమైన యట్టివాఁడు సులభుఁ డైనట్టివాఁడు
దట్టమై నా కిన్నిటాను తానే కదే
పొట్టఁబొరుగున నుండి పొరచి వెట్టంపి నేఁడు
గట్టిగా నింతకరుణ గలదు గా నాకు

చ. 2: అంతరంగ మైనవాఁడు ఆయ మెరిఁగినవాఁడు
చెంతలఁ దానే అని చెప్పేఁ గదే
వంతులు వాసు లెంచక వాకిటికి వచ్చె నేఁడు
యింత మన్నించఁ దాఁ గాక యిఁక నెవ్వరే

చ. 3: వహించుకొనేవాఁడు వద్ద నిట్టె వుండేవాఁడు
విహరించ నా కిన్నటా వెలనె తానె
వహి కెక్క శ్రీవెంకటవల్లభుఁ డితఁడే నన్ను
తహతహ దీరఁ గూడె తగవరి అవుఁ గదే

రేకు: 0325-6 భైరవి సంపుటం: 11-150

పల్లవి: తొల్లో నీకంటే నే దొడ్డదానవా
బల్లిదుఁడ నీవే నన్ను పాలింతువు గాకా

చ. 1: చిత్తము రా నీకు నే సేవ సేయఁ గలనా
సత్తగు నీ దయ నాపైఁ జల్లుదు గాక
నిత్తెము నిన్ను మెప్పించ నేరుతునా యే మైనా
కొత్తగా నన్నిట్టే దిద్దుకొందువు గాకా

చ. 2: యిట్టి దని నీ మహిమ యెరుఁగుదునా నేను
నెట్టన బుద్ధి చెప్ప మన్నింతు గాకా
వొట్టి నీకు విన్నవించ నోపఁ గలనా నేను
వట్టి నీవే తెలుసుక పయికొందువు గాకా

చ. 3: కందువ లెరిఁగి నిన్ను కాంగిలించఁ గలనా
అందాలు సేసుక నీవే అంటుదు గాక
యిందుకే శ్రీవెంకటేశ యియ్యకొని కూడితివి
మందలించఁ గలానా మరుగుదు గాకా

రేకు: 0326-1 సాళంగనాట సంపుటం: 11-151

పల్లవి: రచ్చలఁ బెట్టక యిట్టే రావయ్యా
గచ్చులు మాని యిన్నీఁ గనుకోవయ్యా

చ. 1: పంతము దప్పదు నీతో బలికినమాత్రమున
వంతుకుఁ జెలి కిందులో వాసి వోదు
యింతిచేత నేఁ జెప్పించే యెడమాట లీడ నేల
వింతల నీ సుద్దు లిందే వినుకోవయ్యా

చ. 2: సూటి దప్ప దింతలోనే చూచిన మాత్రమున
ఆఁటదాని కిందుకుఁగా నాస వోదు
కూటమి నాపెచేత గురుతులు పట్టింపించే
దీఁట నైనా నాచేఁతలు తెలుసుకోవయ్యా

చ. 3: ఘనత లేమిఁ దప్పదు కాఁగిలించినంతలోనే
పెనఁగించె ఆపెచేత పెరిమె వోదు
చెనకి కూడితి విట్టే చేరి శ్రీవెంకటేశుఁడ
మన సిచ్చి రక్షించి మన్నించుకోవయ్యా

రేకు: 0326-2 గౌళ సంపుటం: 11-152

పల్లవి: ముంచి నిన్నే మనఁ జాల మొక్కే మయ్యా నీ
మంచితన మెల్లఁ గంటి మరఁగే లయ్యా

చ. 1: యేకతాన నే నిన్ను నే మంటినో యంటా
ఆకడఁ జెలులతోడ నాడుకొనేవు
చేకొలఁది వైన నిన్నుఁ జేసినచేఁతలు మరి
రాకల పోకల నింత రచ్చ వేతురా

చ. 2: తరితీపులను నీపైఁ దమకించితి నంటా
యిరుగుపొరుగు లేల యెరిఁగించేవు
సరసుఁడ వైన నిన్ను చనవునఁ గొసరితే
విరివి గొనుచు వెల్లవిరి నేతురా

చ. 3: గెంటక పెనఁగేవేళ గిలిగించితి నంటా
యింటివా రెల్ల వినఁగ నేల నవ్వేవు
జంటవై శ్రీవెంకటేశ సరి నన్నుఁ గూడితివి
నంటుతమకము లింత నాన వేతరా

రేకు: 0326-3 వరాళి సంపుటం: 11-153

పల్లవి: ఏ మని చెప్పుదు మయ్య యీపె వలపు
నీ మేని రతులఁ జొక్కి నేర మెంచీ నిపుడు

చ. 1: అద్దము చూచి చెలి యంతలేనో నవ్వు నవ్వి
గద్దరిచూపుల నీ మొగము చూచెను
యిద్దరుఁ గూడి యున్నప్పు డెరఁగ దాయనో కాని
చద్దిగురుతులకే సాధించీ నిపుడు

చ. 2: పొలిఁతి బాగా లందుక పుక్కిట నీ విడినట్టి
తొలుతటితమ్మ చూచి తల వంచెను
కలసినప్పటివేళ గతు లెట్టుండెనో కాని
సొలసి యందుకుఁ గానె సూడి వట్టీ నిపుడు

చ. 3: పవళించఁ బోయి నీవే పర మయి వుండఁగఁ జెలి
జవళివేడుకలకు సంతంసించెను
యివల శ్రీవెంకటేశ యే మని మెచ్చెనో కాని
కవ గూడి మన్ననల మించీ నిపుడూ

రేకు: 0326-4 శ్రీరాగం సంపుటం: 11-154

పల్లవి: బలిమి నేయకురే పట్టి పెనఁగకురే
పొలసి పా వచ్చినాఁడు పోనియ్యఁ గదరే

చ. 1: కొసరే మా మాటలు కూరిములో తేటలు
నసలు నేఁ డిం పౌనా నాఁడే కాక
వస మైనాఁ డెవ్వతెకో వలసీ నొల్లము లీడఁ
బొసఁగినా వాని కట్టై పోనియ్యఁ గదరే

చ. 2: రవ్వల మా పిలుపులు రాయిడించే సొలపులు
నవ్వులు నేఁ డిం పౌనా నాఁడే కాక
యేవ్వ తాస యిచ్చునదో యింతకు నేరఁడు తొల్లి
పువ్వువంటిది వలపు పోనియ్యఁ గదరే

చ. 3: తనవోనిరతులనును తలపోఁతమతులును
ననుపు నే డిం పౌనా నాఁడే కాక
యెననెను శ్రీవెంకటేశుఁడింత సేసి నన్ను
పొనిగి పోయినసుద్ది పోనియ్యఁ గదరే

రేకు: 0326-5 ముఖారి సంపుటం: 11-155

పల్లవి: అప్పుడే బలిమి సేసే వందు కేమి
చిప్పిలఁ బనివనిగాఁ జెప్పర నాతోను

చ. 1: వోప నంటాఁ బెనగఁగ వొడివట్టి తియ్యకురా
కోపపుఁ జూపులు కనుఁగొనే వారము
చేపట్టి తీదీపులను చేయి దాఁకు గాలు దాఁకు
ఆఁపి మాట మాటగాఁనె ఆడరా నాతోను

చ. 2: పెడమర లుండఁగాను పేరునఁ బిలవకురా
వడి మురిపెముల గర్వపువారమూ
తడవఁగఁ బలుమారు తప్పు లౌనో వొప్పు లౌనో
నడుమ నవ్వు నవ్వుగ నవ్వరా నాతోను

చ. 3: పవళించి వుండగాను పైపైఁ బడే వ దేమిరా
చివురేచేఁ గల గోరిచేతివారము
యివల శ్రీవెంకటేశ యిట్టె కూడితిని నన్ను
చవిగా ముద్దుముద్దుగాఁ జన వీరా నాకునూ

రేకు: 0326-6 కొండమలహరి సంపుటం: 11-156

పల్లవి: ఇద్దరి మనసులు నేక మైనఁ గా
కొద్దిక విరివో టొనరీనా

చ. 1: చెలువుఁడు యేమో చింతించఁగ నే
కలయు మనుట సంగతు లౌనా
వలవనియలపుతో వడఁబడి యుండఁగ
యెలమి నేఁ జెనకు టిం పవునా

చ. 2: అదె పొడిఁ బడి పతి యసు రుసు రనఁగా
పదరి నేఁ బిలుచట పాడి యౌనా
నిదరుమోముతో నెరి విరి గుండఁగ
గుదిగొని నేఁ బైకొనఁ దగవా

చ. 3: తమకించి యతఁడు దవ్వుల నుండఁగ
జమళిఁ గలయఁ బోతే సర వెవునా
తిమిరి శ్రీవెంకటదేవుఁ డతఁడె నను
ప్రమదమునఁ గలనెఁ బాసీనా

రేకు: 0327-1 శంకరాభరణం సంపుటం: 11-157

పల్లవి: కోపము దీరినమీఁదట గూడేవు గాక
కైపుగ నీ వొల్లిదె కల్ల యనవయ్యా

చ. 1: యే మంటివో కాని యింతి గడుఁ జిన్నఁ బోయ
వేమారు నలుక దీర వేఁడుకోవయ్యా
ప్రేమతో బలిమి నేసి పెనఁగి యేమి నేసితో
వాములుగఁ దిట్టకోనీ వద్దనవయ్యా

చ. 2: యింతిచిత్తము నొవ్వఁగ యెవ్వరిదిక్కు చూచితో
అంతలో దల వంచె లే దనవయ్యా
అంతటఁ బోక నీవు అట్టె యేమి నవ్వితివో
చింతతో లోనికిఁ బోయీ చేరి పట్టవయ్యా

చ. 3: మితియేమి మీరితివో మెలుఁత నిట్టూర్పు నించె
చతురతఁ గరిములు చల్లవయ్యా
తతితో శ్రీవెంకటేశ దగ్గరి కూడితి వాకె
రతి నలనెను మోవిరస మియ్యవయ్యా

రేకు: 0327-2 దేసాళం సంపుటం: 11-158

పల్లవి: ఏల మమ్ముఁ జెనకేవు యెడ్డవా నీవు
వేలఁ జూపేరు నిన్ననె వినుకొన రాదా

చ. 1: యేరా మా కస్తూరిబొట్టు యె ట్టుండె నేమి నీకు
గోర దిద్ద వచ్చేవు కూళవా నీవు
గారవపు నీ మేనఁ గస్తూరి రేక లవిగో
తేరకొన వంక లెల్ల దొద్దుకొన రాదా

చ. 2: చెల్లఁబో నా హారములు చిక్కువడితే నేమి
మల్లాడి దిద్ద వచ్చేవు మంకవా నీవు
చిల్లా పొల్లాయ నీ మెయిఁ జెమటముత్తెము లెల్ల
పెల్లు రేగి నీవె చక్కఁ బెట్టుకొన రాదా

చ. 3: చనుఁగొంగు జారె నంటాఁ జక్క దొబ్బ వచ్చేవు
చనవున నన్నిటాను జాణవా నీవు
చెనకి కాఁగిలించితి శ్రీవెంకటేశ నీవు
ననిచి నీ పచ్చడము నాకు గప్ప రాదా

రేకు: 0327-3 సామంతం సంపుటం: 11-159

పల్లవి: వలపు చప్ప జేసెటివగకాఁడనీ
బలిమి నా మనసుకు బల్ల కట్ట వలెనా

చ. 1: పలికేవు కమ్మటిని పరాకు నయ్యేవు
అలిగినాఁ బోనీవు అదేరా నీవు
పిలిచితే వచ్చినది పెనుఁ దప్పు నావొళ్లఁ
గలదు నీ విఁక నన్నుఁ గాకు నేయ వలెను

చ. 2: పైపైఁ గొంగు వట్టేవు పరులతో నవ్వేవు
వోప నన్నుఁ బోనీవు వోరి నీవూ
పాప మింతే నీవు నేసే భ్రమకు లో నయినది
యేపున నెంతైనాఁ గద్దు యింత సేయ వలెనా

చ. 3: యిచ్చగించి కూడేవు యే మేమో తలఁచేవు
హెచ్చి మూల నుండనీవు యేరా నీవూ
అచ్చపు శ్రీవెంకటేశ అన్ని టాను నిన్ను గూడి
మెచ్చినదె మే లాయ మేకు నేయ వలెనా

రేకు: 0327-4 సాళంగనాట సంపుటం: 11-160

పల్లవి: పొద్దు వోదా తన కేమి పోరు వెట్టి వేగి తేచి
ఉద్దండీఁడు తన కేమి పూరకుండఁ బట్టదా

చ. 1: యెప్పటి కుత్తర మిచ్చే దప్పుడే యిచ్చేఁ గాక
యిప్పటినుండియు మాట లేలే నాకు
కప్పి నిజ మాడు మంటా కమ్మర నానవెట్టిని
తప్పు లౌతా వొప్పు లౌతా నెరఁగఁడా

చ. 2: చేయవలసినప్పుడే చేయి ముంచి చేసేఁ గాక
యీ యెడ నుండియు బంతా లేలే నాకు
ఆయ మంటి వేగిరించి నప్పుడె తనకుఁ దానే
కా యౌతా పండౌతాఁ గనీఁ గాకా

చ. 3: దగ్గరితి మిద్దరము తరవాయి వచ్చీఁ గాక
యెగ్గులు నెమ్ములుఁ బట్ట నేలే నాకు
బగ్గన శ్రీవెంకటాద్రిపతి నన్నుఁ గూడె నిఁక
ముగ్గుపిండి అట్లకు మొద లయ్యీనా

రేకు: 0327-5 లలిత సంపుటం: 11-161

పల్లవి: అన్నియు నేరుచుకొన్నాఁ డలవాటే యాతనికి
యెన్ని యైనఁ గల విట్టే యింటి కింక రావే

చ. 1: వట్టిమాకు లిగిరించు వాఁడు మాట లాడితేను
యిట్టె నన్ను గరఁగించు టేమి సోద్యమే
వెట్టికి వింటేం జాలు వేగాదాఁకఁ జేప్పఁ దాను
బట్టబయ లీఁద నోపఁ బదవే మాయింటికి

చ. 2: ఱాతికి గిలిగింత లౌ బట్టడినవానిచేఁతల
యీతల నన్ను నవ్వించే దేమి సోద్యమే
చేతికి లో నైతేఁ జాలు సేయఁగల ట్టెల్లాఁ జేసి
పోతరించి వున్నవాఁడు పోదమే మా యింటికి

చ. 3: యేరు లైన నెదు రెక్కు యిట్టి వీనిఁ బొడగంటే
యీరీతి మనము వచ్చే దేమి సోద్యమే
చేరినన్ను నిటు గూడె శ్రీవెంకటేశ్వరుఁడు
ఆరె దేరెఁ బిలువవే అతని మాయింటికి

రేకు: 0327-6 లలిత సంపుటం: 11-162

పల్లవి: చక్కని యీా వెన్నుఁడూ సంబటూరి చెన్నుఁడూ
అక్కడ నిక్కడ చూపి ఆసలు రేఁచీని

చ. 1: చెన్నునిఁ జూడఁ గదరే చెలులాల నేఁడు
చిన్ని లేనవ్వులనె చెలరేఁగీని
సన్నలు నేసీ వాఁడె సటకాఁడు నాతో
యెన్నటి కెన్నటి పొందు యిపుడే రేఁచీని

చ. 2: యే మనీనె చెన్నుఁడూ యేకతాన నన్నునూ
దొమిటివావులు నాపైఁ దొరలించీని
కోమలపు చేయి చాఁచీ కొత్తపెండ్లికొడుకు
గామిడితనాల నన్నుఁ గాకలు రేఁచీని

చ. 3: శ్రీవెంకటాద్రిమీద చేరి కూడెఁ జెన్నుఁడు
బావించి పచ్చడము పైఁ గప్పీని
మోవి చూపీఁ గమ్మటి మెక్కళీఁడు వీఁడు
దేవుఁడు గదవే వీఁడు తీపులు రేఁచీని

రేకు: 0328-1 మధ్యమావతి సంపుటం: 11-163

పల్లవి: చెనకితే బిగియఁగ జెల్లదా నేఁడు
జినుగుసిగ్గుల నవ్వు చెల్లదా నీకూ

చ. 1: కాయ మట పాయ మట కడు వలచితి నట
నేయఁగల ట్టెల్ల నీకు జెల్లదా నేఁడు
నాయంతనె వచ్చెనా నాతుల కిదె చాలు
చేయ మీఁ దాయను నేఁడు చెల్లదా నీకు

చ. 2: కలి మట బటి మట కదిసి నవ్వే వట
చెలఁగి నే వే మన్నఁ జెల్లదా నేఁడు
చల మెన్నఁటికె యిఁక సాదించవలెఁ గాక
చెలరేఁగి మాటలాడఁ జెల్లదా నీకు

చ. 3: యిల్లట మంచ మట యేకత మిదే యట
చెల్లఁబో యేమి సేసినఁ జెల్లదా నేఁడు
కొల్లగా శ్రీవెంకటేశ కూడితివి నన్ను నిట్టే
చిల్లరపొందులు మానఁ జెల్లదా నీకూ

రేకు: 0328-2 సాళంగనాట సంపుటం: 16-164

పల్లవి: దేవ నీ చెలువములోఁ దిరమై మిక్కిలి నీ
దేవి చెలువము దెచ్చెఁ దేటతెల్లమిగాను

చ. 1: గరిమ నీ వురము కౌస్తుభమాణికముతో
సరి దూఁగి యెక్కు డాయ సతీమణి
వరుస నీదు బాహువల్లుల నడుమను
పెరిగి నీ లలితాంగి పెద్దరిక మందె

చ. 2: నీలమేఘమువంటి నీ మేనికాంతికి
మేలిమివన్నె దెచ్చె మెరుఁగుఁబోఁడి
పోలింప నీదు తమ్మిబొడ్డుకంటెఁ బొడవున
కాలు దొక్కి నిలిచెను కమలాలయ

చ. 3: అదివో నీ బంగారుహారముల నడుమను
పొదిబంగా రై నిలిచె పుత్తడిబొమ్మ
పొదిగి శ్రీవెంకటేశ భోగించె నీ కాఁగిటికి
అదనఁ బుట్టుభో గాయ నలమేలుమంగ

రేకు: 0328-3 సామంతం సంపుటం: 01-165

పల్లవి: ఈపాటివాఁడవు యేల కొపగించితివి
చేపట్టినటులానె సేయ రాదా

చ. 1: చెక్కు నొక్కకుర నీవు చేయి చాఁచకుర నాపై
చక్క నీ మంచితనాలు చాలుఁ జాలు
పక్కనఁ గోపించ వద్దు పైకొని వేఁడుకో వద్దు
వొక్కమారె యింతేసికి నోపను నేను

చ. 2: కాలు దొక్కకుర నీవు కమ్మటి నవ్వకు నాతో
జాలినీ యిచ్చకములు చాలుఁ జాలు
తాలిమిఁ దిట్టా వద్దు దగ్గరి మొక్కా వద్దు
మేలు మీఁదనె వుండే మేరతో నడవరా

చ. 3: మాటలాడకుర నీవు మాయలు సేయకురా
చాటు వాయ నీవలపు చాలుఁ జాలు
గాఁటపు శ్రీవెంకటేశ కరఁగించి కూడితివి
మేటి నీ గుణములకు మెచ్చితి నే నిదివో

రేకు: 0328-4 సామంతం సంపుటం: 11-166

పల్లవి: తా నేల నిలుచున్నాఁడు తడవుల నుండీని
పానిపట్టి చెలులాల పద మనరే

చ. 1: మనసు రాని తలఁపు మాటలోనె కాన వచ్చు
పెనఁగి యప్పటి వీఁడు పిలిచీఁ గొంతా
ననుపు గల దెల్లాను నవ్వినందే తెలిసితి
పని గద్దు వచ్చేఁ గాని పద మనరే

చ. 2: నెరమెచ్చువలపులు నిలిచినందే తోచె
సరసాన వీఁడె చేయి చాఁచీఁ గొంతా
కరుణ గల దెల్లాను కనుచూపులనె కంటి
పరిణాము మాయ నాకుఁ బద మనరే

చ. 3: కలిగిన తమకము కాఁగిటిలోఁ గానవచ్చె
అలరి తాఁ బెట్టుకొనీ ఆనలూఁ గొంతా
వెల లేని వేడుక శ్రీవెంకటేశుఁ డిటు గూడె
పలుకు లేఁటికి నిఁకఁ బద మనరే

రేకు: 0328-5 శంకరాభరణం సంపుటం: 11-167

పల్లవి: చెల్లఁబో నాకె సుద్దులు చెప్పకువయ్యా
పల్లదాన నీవు నీవే బదుకవయ్యా

చ. 1: యేమయ్యా నేము నీ కేమిటి కయ్యా
నేమాన నీ కిచ్చ లాడ నేరనయ్యా
చేముంచి యాపె కీ మేలు సేయనయ్యా
మోము చూచి సంతంసించి మొక్కేనయ్యా

చ. 2: తలవయ్యా మమ్ము నేల తడవేవయ్యా
నెలవై నే నిజ మాడి నిష్టూరి నింతే
కెలసి యాకెనె బుజ్జగించవయ్యా
వలచి నే నెపుడు నీ వద్ద నుండే నయ్యా

చ. 3: చెల్లు నయ్యా యే మైనాఁ జేయవయ్యా
యెల్లవారివలె నేమీ నెరఁగ నయ్యా
కొల్లగా శ్రీవెంకటేశ కూడితివి నన్ను నిట్టె
తెల్లముగ నీ వెంటఁ దిరిగే నయ్యా

రేకు: 0328-6 సాళంగనాట సంపుటం: 11-168

పల్లవి: దూరఁ బోతేఁ గోపము దొరకు ముక్కున నుండు
వూరకే తోడుక రారే వొడఁబరచేనూ

చ. 1: అవుఁగా దనకురే ఆడినట్టె ఆడనీరే
యివల నేనే చెప్పే నిన్ని బుద్దులు
తివిరి మీ రిందాఁకాఁ దెచ్చినదే మీపాలు
అవల నంతటిమీఁద నాతడు నాపాలు

చ. 2: చేచేతఁ బెనఁగకురే సేసినట్టే సేయనీరే
యేచి నేనే సేవ సేసే నీడుకు నీడు
కాచిన మమ్మిద్దరినిఁ గదియించుట మీ పని
చూచి వానిఁ గరఁగించి చొక్కుట నా పని

చ. 3: పంత మె ట్టైనై వచ్చి బలిమి సేయకురే
మంతనాన మెచ్చు సేసే మంకు లెల్లాను
యింతలో శ్రీవెంకటేశుఁ డిదే కదే నన్నుఁగూడె
వంతులే నీకుఁ జెల్లె వాసి నాకుఁ జెల్లె

రేకు: 0329-1 ఆహిరి సంపుటం: 11-169
పల్లవి: ఇంతి యలిగితేఁ గన యెవ్వరి వసము గాదు
సంతసాన నవ్వేటి సతితోడ నగవూ
చ. 1: యెక్కడ పరాకో యేమి భావించేవో
మొక్కేటిచెలిఁ గాఁగిట ముంచి యెత్తవు
మక్కువ నీకుఁ జాలదో మనసులోఁ గోపమో
నిక్కి చూచేసతితోడ నీ వేమీ ననవూ
చ. 2: సిగ్గు పడ్డ విధమో చెప్పేవారు లేకో
దగ్గరి యున్నసతితోఁ దమకించవు
నిగ్గుల రాజసమో నీ వొళ్లిగుణమో
వెగ్గళించి పిలువఁగ వినియును వినవూ
చ. 3: యేమి దలఁచుకొంటివో యీ వనిత భాగ్యమో
చే ముంచి సరస మాడి చెక్కు నొక్కేవు
కాముఁడు పెర రేఁచెనో కరుణ నీకుఁ బుట్టెనో
నేమపు శ్రీవెంకటేశ నీవే కూడితివి

రేకు: 0329-2 శంకరాభరణం సంపుటం: 11-170

పల్లవి: ఒంటి నన్ను నవ్వ వచ్చి నో యమ్మా
వుంటవింట వేయు మనీ నో యమ్మా

చ. 1: సుద్దు లవి విను మంటా సారిదిఁ జెక్కులు ముట్టీ
వొద్దన్నా మానఁడే వో యమ్మా
గద్దించి యందుకు నేను కడు జంకించఁ బోతేను
వుద్దండపుమాట లాడీ నూరకే వో యమ్మా

చ. 2: బడి బడి రమ్మంటాఁ బట్టఁ బట్టఁ బైకొని
వొడిసీ నీ పయ్యదను నో యమ్మా
తదవకు మని నేను తన్ను నాన వెట్టితేను
ఉడికి తప్పక చూచీ నూరకే వో యమ్మా

చ. 3: పనిమాలి నేఁడే తన పాదుములు గుద్దు మంటా
వొనర బలిమి నేసీ నో యమ్మా
యెనసెను శ్రీవెంకటేశుఁ డిటువలె నన్ను
పుని కై నిలిచితిమి వూరకే వో యమ్మా

రేకు: 0329-3 వరాళి సంపుటం: 11-171

పల్లవి: పలుమారుఁ బెనఁగక పదవే నీవు
నిలుచున్నాఁ డెదుటనే నీ కెంత పగటే

చ. 1: నెట్టుకొని రమణుఁడు నిన్నే తప్పక చూచీ
పట్టినచలము మాని పదవే నీవు
అట్టె దొర యాఁతడు నిన్నడిగే మాటల కెల్ల
యెట్టైన నుత్తర మియ్య వెంత గుండే నీకు

చ. 2: చేపట్టి పెనఁగీని చెలువపు నీ విభుఁడు
పైపయిఁ దప్పించుకోక పదవే నీవు
యేపున నాతఁడె నీయింటికి వచ్చి యుండఁగా
కోపము మానవు యేటి కొత్తలే నీవూ

చ. 3: చింత దీర నాతఁడు చిరునవ్వు నవ్వఁగాను
పంతాలు చెల్ల దింకఁ బదవే నీవూ
అంతలో శ్రీవెంకటేశుఁ డాదరించి నిన్నుఁ గూడె
యెంతటిదానవు నీవు యెదు రేదే నీకు

రేకు: 0329-4 హిందోళవసంతం సంపుటం: 11-172

పల్లవి: అల్లదె నీ రమణి ఆయిత్తమై వున్నది
పెల్లుగ జాజరాడఁ బిలిచీఁ బోవయ్యా

చ. 1: వనితచూపులు కలువల వసంతములు
ఘన మైనమోహము గంధము వసంతము
మనసులో కోరికలు మంచినీళ్ల వసంతము
పెనఁగి జాజరలాడఁ బిలిచీ నయ్యా

చ. 2: కలికినవ్వులు నీకు కప్పురవసంతములు
నిలిచినకళలు వెన్నెలవసంతములు
పలుకులకొసరులు బంగారువసంతము
బెళకక జాజరాడఁ బిలిచీ నయ్యా

చ. 3: కేలు పట్టి తీసినది కెందామరవసంతము
చాలుఁ బులకలు ముత్యాలవసంతము
యీలాగుల శ్రీవెంకటేశ ఆకెఁ గూడితివి
పేలరి య్యై జాజరాడఁ బిలిచీ బోవయ్యా

రేకు: 0329-5 మాళవిగౌళ సంపుటం: 11-173

పల్లవి: నీకే చెల్లుఁ గాని నే నింత కోపను
కాకరితనా లెపుడుఁ గలవే నీకును

చ. 1: రమణితో నొకమాట రతి నాతొ నొకమాట
అమరదు యెన్నఁడు నీ వాడకురా
కమలము వొకకన్ను కలువయు వొకకన్ను
జమళి రండు నడప సాజయే నీకును

చ. 2: కంటే నిందు వచ్చే వాకడిమో మైతే రావు
అంటి నన రాదు మాతో నంత యాలరా
వొంటనిసా మొకటియూ వొగి గరుత్మంతుని
బంటులఁగా గాడిఁ గట్టి పరచేటివాఁడవు

చ. 3: కాఁగిలించే విటు నన్ను కన్ను గిరిపే వాపెతో
దాఁగిలిముచ్చు లాడేవు తగ దేలరా
యేఁగి మింటి కొక కొంగ యెత్తి శ్రీవెంకటగిరి
నాఁగితి రెండు వాదాలు నౌరా నీవూ

రేకు: 0329-6 శంకారాభరణం సంపుటం: 11-174

పల్లవి: ఏ మందునె యిందు కిట్టె నిన్ను
కామిను లిట్లైతే కాలమహి మెట్లో

చ. 1: అతఁడు నాతో నవ్వినట్టినవ్వు నీ మీఁదికి
యేతులకుఁ దీసుకొనే విది మేలే
పోతరించి వుప్పు వేసి పొత్తు గలయ వచ్చేవు
చేతులఁ బట్టఁగ రాదు చెలి కూ ళైతేను

చ. 2: పేరుకొని నన్నతఁడు పిలువఁగ నది విని
యీరీతి నీవే పలికే విది మేలే
నీరువట్టు గొన్నవేళ నెయ్యి వోసే వాతనికి
ఆరయ సిగ్గు లేనియాఁటదె పసురమా

చ. 3: చేయి నాపై వేయఁ బోతే శ్రీ వెంకటపతికి
యీయెడఁ గైదండ ఇచ్చే విది మేలే
పాయక యీ శ్రీవెంకటపతియే నన్నునుఁ గూడె
చాయ యెఱఁగనియట్టి సతియె పో ములుచా

రేకు: 0330-1 ఆహిరి సంపుటం: 11-175

పల్లవి: మూల నున్న వారి మమ్ము ముంగిట వేసితివి
పోళిమి నాఁడువారు నీ పొరు గవుటే దోసమా

చ. 1: వచ్చి వచ్చి చేయి వట్టి వట్టియాన లెల్లఁ బెట్టి
చెచ్చెర న న్నిట్టె లోను సేసుకొంటివి
యిచ్చకుఁడ నన్నువలె నెవ్వతిఁ జేసితివో
యెచ్చి మగనాండ్లకు నీ యింటికి రాఁ బాసెరా

చ. 2: సారె సారె నవ్వు నవ్వి జవ్వాది చెక్కులఁ బూసి
పారి పారి నన్ను నింత భ్రమయించితి
వూరివారి నెల్లా నంతా వోరి కలయఁ గొంటివో
వారించి మానాపతులు వాడ నుంటే నేరమా

చ. 3: మెల్లనె మెల్లనె మొక్కి మేర మీరఁ గాఁగిలించి
కొల్లగా శ్రీవెంకటాద్రిఁ గూడితి నన్ను
వెల్లివలపులు చల్ల వెన్నముద్దకృష్ణుఁడా
గొల్లెతల కెల్ల నీ కుల మౌటే తగులా

రేకు: 0330-2 ముఖారి సంపుటం: 11-176

పల్లవి: నీవే యెరుఁగుదువు ని న్నాతఁడు పిలువఁగ
వావాత నూఁకొనవు వద్దు చల మమ్మా

చ. 1: ముక్కున నూర్పులు రేఁగ ముంజేయి వట్టి పెనఁగీ
వెక్కసపు సంతంటివాఁడు యింత నిన్ను వేఁడుకోఁగ
యెక్కువ నంతటివాఁడు యింత నిన్ను వేఁడుకోఁగ
చిక్క కిట్టె బిగిసేవు చెల్లునా వో యమ్మా

చ. 2: పూవుల కొప్పెల్ల జార పుడిసిట నిన్ను నెత్తె
వోవల పతికి లో నై వుండవే కొంతా
వేవేలు కాంతలవాఁడు వెస నిన్ను బొదుగఁగ
నీ వెం తైనా గుట్టియ్యవు నీకుఁ దగ దమ్మా

చ. 3: తా నాతఁడు నీకు లోనై తమకానఁ గూడఁగాను
ఆన లెల్లఁ బెట్ట వచ్చే వ దేమే యింకా
పూని శ్రీవెంకటపతి భోగించే నిన్ను రతి
కానిమ్మని పాయకువే కలకాల మమ్మా

రేకు: 0330-3 సామంతం సంపుటం: 11-177

పల్లవి: ఇందుకే పో నేను మీ యింటికి వచ్చితి
పొంద కింక నేఁ బోనియ్య నిన్ను

చ. 1: కలికి నీ చూపులు కన్నుల నుండఁగ
నలువంక మమ్ము నాటీ నేలే
పిలువక మమ్ముఁ బిలిచే మోవి
వొలుకుఁదేనెల నూరించీని

చ. 2: బాపు నీ కుచములు పయ్యద నుండఁగ
రేపువలపులు రేఁచీ మమ్ము
నీపైనే వుండఁగ నీ చక్కఁదనము
యేపున నా మన సెలయించీని

చ. 3: చేయి చెక్కుతోడఁ జిమ్మే నీసిగ్గులు
ఆయములు దాఁకీ నద్దో మమ్ము
యీయెడ శ్రీవెంటేశుఁడ నే నిన్నుఁ
బాయక కూడఁగఁ బంత మాడేవు

రేకు: 0330-4 శ్రీరాగం సంపుటం: 11-178

పల్లవి: కొత్త పెండ్లికూఁతురు కొంకు దేరీఁ దేరదు
చిత్తగించి నీ వైనాఁ జేయి వట్టవయ్యా

చ. 1: చిమ్ముచు నీ మోము చూచీ సిగ్గుతో దగ్గరదు
కొమ్మసంగడి నీ వైనఁ గూచుండవయ్యా
కమ్మి నవ్వులును నవ్వీఁ గలసి మాటలాడదు
పమ్మి నీ వైన నాపెతోఁ బలుకవయ్యా

చ. 2: ఆలవట్టము విసరే నంటి ముట్టి పెనఁగదు
తేలించి యాపె వెరపు తెలపవయ్యా
కాలు దొక్కీ నిన్ను నిట్టె కాఁకదేరఁ గలయదు
పోలిమి నీవే కాఁగిటఁ బొదుగవయ్యా

చ. 3: తనలోనె మోహించీ దంటతనము నేరదు
ననుపులే యాకెతోడ నడపవయ్యా
యెనసె శ్రీవెంకటేశ యింతినిన్ను మెల్లనె
మన సిచ్చి యిటులానె మన్నించవయ్యా

రేకు: 0330-5 కాంబోది సంపుటం: 11-179

పల్లవి: చింతలఁ జిగురులు చెనకులఁ జేఁగలు
వంతల నీ చలుములు వద్ద యిఁకను

చ. 1: చెలి నీ సిగ్గు లివిగో సెలవి వెన్నల గాయ
యెలమి బొమ్మలజంకె యెండ గాసీనె
వలచి విభుఁ డిందుకే వాడుచు వాడుదేరీని
కలువ చూపు లయినఁ గప్పవే మీఁదను

చ. 2: మాటలతేనెలోన మధురము గురియఁగ
గాఁటపు నీ బిగువులు కార మయ్యీనె
వీఁటనె విభుఁ డిందుకు వీఁగీని లోఁగీని
పాటల రాగాల చిలుపా లైనఁ బోయవే

చ. 3: కాంత నీ కాఁగి లనేటి కమ్మఁబూఁదిగెఁ బొదిగీ
యింత నీ ముండ్లగోళ్లనేల వొత్తేవే
పంతపు శ్రీవెంకటాద్రిపతి యిట్టె నన్నుఁ గూడె
అంతలో మెత్తనివినయము లైనఁ జేయవే

రేకు: 0330-6 పాడి సంపుటం: 11-180

పల్లవి: విచ్చేయవయ్యా వేఁగుదాఁకా జాగు లేల
కొచ్చి చెలులము నేము కొండేలు చెప్పేమా

చ. 1: ఈకడ నన్నే మడిగే వింటికి విచ్చేసితేను
ఆకెచేతనే వినేవు అప్పుడు నీవు
జోక నిన్నేఁటికో పిలుచుకొని రమ్మనఁగాను
దాకొని వచ్చితి నింతే తలఁ పెరుఁగుదునా

చ. 2: ఆన లేఁటికిఁ బెట్టేవు అండకు నీ వేఁగితేను
కానఁబగీ నన్నియును కాంతవల్లనే
తానె నీ వేడ నున్నా వెదకి తోడి తెమ్మనఁగ
మోనాన వచ్చితి నింతే ముంద రెరుఁగుదునా

చ. 3: కరికరఁ బెట్ట నేల కాంత నీవుఁ గూడితేను
అరయఁగ మంచి వయ్యీ నన్ని పనులు
యిరవై శ్రీవెంకటేశ యింతివద్దఁ గూచుంటివి
సరసా లాడఁగాఁ గంటి సర వెరుఁగుదునా

రేకు: 0331-1 శ్రీరాగం సంపుటం: 11-181

పల్లవి: అయ్యయ్యో భూమిమీఁద నన్నియుఁ గంటిఁ జెరువు
ముయ్య మూకు డడిగేటి మూడులు గలరుగా

చ. 1: కడ నీ చెక్కుల గోళ్ల కాఁడినపో ట్లుండఁగ
నొడిగే నా మాట నీకు నొప్పు లాయఁగా
బడి బడి తల్లిదండ్రి పగ లుండఁగా లంజ
గొడవలకుఁ బెనగే కూళలు గలరుగా

చ. 2: పెక్కు సతులు నీ మోవి పిప్పి నేసి వుండఁగాను
యిక్కడ నే వగచుట హీన మాయఁగా
మిక్కిలి రాళ్ల కోపక మెత్త నైనందు గుద్దలి
యెక్కువ వాఁడి చేసేయెడ్డలు గలరుగా

చ. 3: తగనియెవ్వతో కాలితాఁకులు నీమ్మై నుండఁగ
బిగువు నా చన్నులొత్తు బిరు సాయఁగా
అగపడి శ్రీవెంకటాధిప కూడితి విట్టె
నగవు నిజాలు సేసేనాథులు గలరుగా

రేకు: 0331-2 పాడి సంపుటం: 11-182

పల్లవి: ఎంత గట్టువాయతనమి దేమే వీఁడు
అంతకంత కేమన్నా నస మీఁడే వీఁడు

చ. 1: నిద్దుర కన్నులఁ దేరి నీకంటే లే దంటా
గద్దించి తప్పక చూచీఁ గదే వీఁడు
ముద్దుతో నెగసక్కేల మోవికెంపులు రేఁచితే
వొద్దన లేక వోరిచి వున్నాఁడె వీఁడు

చ. 2: ముక్కున నూర్పులు నీకు ముంచె నంటె లే దంటా
అక్కిలించి లోనోనె ఆఁపీనె వీఁడు
అక్కడ నలసి వచ్చే నందుపై నేఁ బెనఁగితె
అక్కరతో రతులకై ఆసపడీ వీఁడు

చ. 3: చెమటలు తన మేను చెరఁగునఁ గప్పీతేను
అమర ముసుఁగు వెట్టీ నప్పటి వీఁడు
తమితో శ్రీవెంకటేశుఁ దగ నిందుకె మెచ్చితే
భ్రమసినట్లఁ బైపైఁ గూడీ వీఁడు

రేకు: 0331-3 రామక్రియ సంపుటం: 11-183

పల్లవి: సిగ్గరి పెండ్లికొడుకుఁ జేరి చూతము
వొగ్గి సదమదము లై వున్నాఁ డటా

చ. 1: వద్ది కిట్టె రమ్మనరే వచ్చీనో రాఁడో
గద్దరి తన లాగులు కందము నేఁడు
బద్దులో నిజమో కాని పచ్చివెచ్చిచేఁతల
వొద్దకతో బండుబం డై వున్నాఁ డటా

చ. 2: మాట మాట దియ్యరే మన సెట్లున్నదో
గాఁటపు తన విద్యలు కందము నేఁడు
చీటకపుచెమ టట చిల్లుగందా లట
మేటిదొరఁ బిలువరే మెరసీ నటా

చ. 3: ముసుఁగు దెరవరే మొకము చూతము నేఁడు
కసుగాటు చేఁత లెల్లఁ గందము గాని
పసతో శ్రీవెంకటపతి నన్ను నిటు గూడె
నస చేసి నాతోనె నవ్వీ నటా

రేకు: 0331-4 దేసాళం సంపుటం: 11-184

పల్లవి: పెనుఁ బండుగలు సేసి పిలిపించె నిన్నమాపె
పెనఁగీఁజిత్తపు చింత పెనులంపటముల

చ. 1: చెవులఁ బండుగ సేనె చెలి నీ సుద్దులు విని
నవకపు వేడుక నిన్నటిమాపె
తివిరి వేగుదాఁకా దీపాళిపండుగ నేసె
జవకట్టి నినుఁ బాసి జాగరాలను

చ. 2: కన్నులపండుగ సేసె కలికి మేడపై నుండి
నిన్నుఁ దప్ప కిట్టె చూచి నిన్నమాపె
వున్నతి నొక నిమిష ముగాదిపండుగ నేనె
తన్నుఁ దానె తనలోని తమకానను

చ. 3: నిచ్చపండుగలు సేసె నీతోడి మాటలనె
నెచ్చెలి యల్లంతనుండి నిన్న మాపె
పచ్చిగా లక్ష్మిదేవి పండుగలు సేసె నిదె
యిచ్చకుఁడ శ్రీవెంకటేశ నిన్నుఁ గూడెనూ

రేకు: 0331-5 నాగవరాళి సంపుటం: 11-185

పల్లవి: ఎట్టున్నదో నీ మనసు యేమి సేతురా
యెట్ట నెదుటఁ బాయ లే నేమి సేతురా

చ. 1: చూచుదాఁకా వేగిరింత సొంపుగా విభుఁడ నీతో
దాఁచి మాటాడినదాఁకఁ దమకింతును
చేచేతఁ దమకింతు చేరువదాఁకా నిట్లనె
యేచి తమకమే నిండె నేమి సేతురా

చ. 2: అట్టె నీ చెనకులకు నాసగింతుఁ దనివోక
ముట్టి యాసగింతు నీ మోవితేనెకు
గట్టిగా నంతటిమీఁద కాఁగిటికి నాసగింతు
యెట్టైనా నాసలే నిండె నేమి సేతురా

చ. 3: అదన నీ మే నంటి అట్టె పరమశ మవుదు
వదలక కూడి పరవశ మవుదును
పొదలి శ్రీవెంకటేశ పొందితిని నన్ను నిట్టె
యెదిరించెఁ బరవశా లేమి సేతురా

రేకు: 0331-6 శ్రీరాగం సంపుటం: 11-186

పల్లవి: నన్నుఁ బాసి వుండ నేల నాయాలకు రా నేల
వున్నట్లానె వుంటే వొరసేరా నిన్ను

చ. 1: కాంతలఁ దిట్టఁగ నేల కాని కాని వొట్లేల
యింతట నీ గుణము నే నెఱఁగనిదా
పంతపుసాకిరు లేల పతితారుకాణ లేల
వంతన నా వద్ద నుంటే వచ్చీనా నిందలు

చ. 2: పదరి కోపించ నేల బాసలు సేయఁగ నేల
కదిసి నీ మోహము నేఁ గన్నదె కాదా
వదరుఁబెదవు లెండ వాదు లడువఁగ నేల
అదన నావద్ద నుంటే ఆడేరా నిన్నును

చ. 3: నే నెంతైనా నమ్మ నంటా నీకె యలుక లేల
కానీ లేరా యిన్నియు నేఁ గన్నవె కావా
పూని శ్రీవెంకటేశుఁడ వొడఁబరచి కూడితి
నేను నీవూ నిట్టె వుంటే నేఁ డనేరా నిన్మనూ

రేకు: 0332-1 హిజ్జిజి సంపుటం: 11-187

పల్లవి: కాంతలాల యింతులాల కంటిరా యిది
యెంత కెంత కెత్తుకొంటి వెరఁగదా నేను

చ. 1: వొక్కమాట నిన్నంటె వూరివారిపైఁ జుట్టేవు
మిక్కిలి ముడికాఁడవు మేలురా నీవు
మక్కళించి నీ చేఁతలు మాయ వలసి యీరీతి
యెక్క డెక్కడో పెనచే దెరఁగరా నేను

చ. 2: వాదు నీతోఁ బెట్టుకొంటె వాడవారిపై బెట్టేవు
మేదకపుకొయ్య్య వదువు మేలురా నీవు
ఆదెస నీ నేరాలు అందులోనే పులిమేవు
యేది తుది మొద లౌటా నెరఁగరా నేను

చ. 3: పొంచి నీవె కల్ల వంటె పొరుగు కప్పగించేవు
మించెను నీ చలములే మేలురా నీవూ
యెంచి నట్టె శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
యించుకంత కపటము యెఱఁగరా నేను

రేకు: 0332-2 రామక్రియ సంపుటం: 11-188

పల్లవి: వరుస నే నెరుఁగుదు వాని గుణము
కరఁగి నా పేరు వింటే కానుక లందియ్యరే

చ. 1: తగనేఁ గోపగించిన దయ గల దాతనికి
బిగియఁడు వచ్చీఁ గాని పిల్వరే వాని
వొగి నే నంత దిట్టినా వోరువు గ ద్దాతనికి
నగుతా వచ్చీఁ గాని నా పేరు చెప్పరే

చ. 2: మోనాన నేఁ గొసరినా మోహము గ ద్దాతనికి
పేని పట్టి వచ్చీఁ గాని పిల్వరే వాని
పూని నేనెం తలిగినా బుజ్జగించ నేర్చుఁ వాడు
వానికిఁ బొడచూపరే వచ్చీ నిందాఁకలను

చ. 3: ముంపు నే గరివి నైనా మొదల వినయివాఁడు
పెంపున దానె వచ్చీఁ బిల్వరే వాని
యింపుల శ్రీవెంకటేశుఁ డిప్పు డిట్టె నన్నుఁ గూడె
పంపున నీడనె వుండీ పై పైనె మొక్కరే

రేకు: 0332-3 శంకరాభరణం సంపుటం: 11-189

పల్లవి: దొరతో సంగాతము దొరకినపాటే చాలు
వొరసి మీరఁగఁ బోతే నొక్క రీతి నుండునా

చ. 1: యేకతాన లోన నుండి యేల నన్నుఁ బిలిచేవు
వాకిటికి రావయ్యా వలసితేను
చేకొని యొకతె యుంటె సిగ్గుపడి వెళ్లి వచ్చి
కూకులు వత్తులు గాను కూళదానా

చ. 2: మరిగించి మరఁగున మాట లే లాడించేవు
తెర దియ్యవయ్యా అంత తీఁట గలితె
వరుసకు వచ్చినాపె వాదు నాతోఁ బెట్టుకొంటె
విరస మై యూరకుండ వెఱ్ఱిదానా

చ. 3: పట్టెమంచముపై నుండి పైఁ గాలు చాఁచ నేల
యిట్టె వుర మెక్కవయ్యా యింత గలితె
జట్టిగా శ్రీవెంకటేశ సరి నొకతె గూచుంటె
వట్టి యితపు సేసుకో వాసి లేనిదాననా

రేకు: 0332-4 శ్రీరాగం సంపుటం: 11-190

పల్లవి: వలసితే రేపు మాపు వచ్చేవు గాని
అలమి చే యెత్తి మొక్కి అంపించుక రావె

చ. 1: యేడ లేనిమాఁటలు యెందాఁక నైనఁ బెనచి
ఆడెవు మాఁటలు నీవు అతనితోను
తోడ నంపించుక రావె తుద లేదీ యాసలకు
నీ డనపు యెం డనవు నిలుచుండే వీడను

చ. 2: కూరి మెల్లఁ బెట్టి పెట్టి కొనచూపు నాఁటఁ జూచి
ఆరగించఁ బోఁ జాల వాతనిఁ బాసి
యీా రీతి నింత గలితె యింటి కైనాఁ దోడి తేవె
తీరవు మీ ముచ్చటలు దీవెత్తుఁబొద్దాయను

చ. 3: గయ్యాళి వై నవ్వి నవ్వి కాఁగిట బిగించుకొని
యెయ్యెడఁ బోనీవు యేమే యితని
నెయ్యపు శ్రీవెంకటేశు నీవుఁ గూడితివి ఆతఁ
డియ్యడనె వుండీఁ గాని యిల్లు వెళ్ల నీకువే

రేకు: 0332-5 పాడి సంపుటం: 11-191

పల్లవి: ఏమి సేయ వచ్చుఁ గాల మెవ్వరి నెంత సేసునో
నేమాన నవ్వేటి నన్ను నివ్వెర గందించెను

చ. 1: పలుకు బంతపు నన్నుఁ బ్రాయముగ నింత సేసె
చెలుల కెల్లాఁ బ్రియము చెప్పించెను
అలరు రాజసపు న న్నాసలుగా యింత సేసె
నలి రమణునింటికి నడపించెను

చ. 2: వాసితో నుండేటి నన్ను వలపుగా యింత నేనె
వేసాల ఆతని మాటె వినిపించెను
పోసరించి వుండేనన్ను పొందుగా యింత సేసె
పాసితే విరహవేదనపాలు సేనెను

చ. 3: సిగ్గుతో నుండేనన్ను చిత్తమెకా యింత నేనె
తగ్గనితమకములఁ దగిలించెను
వెగ్గళించి యింతలో శ్రీవెంకటేశఁ డిటు గూడె
అగ్గలపు నా రతులె కా అన్ని టాను మించెను

రేకు: 0332-6 సామంతం సంపుటం: 11-192

పల్లవి: కూచుండఁ బెట్టుకొనవే కోప మేఁటికి
కాచుకున్న రమణునిఁ గరుణించ వలదా

చ. 1: నాటుకొన నిన్నుఁ జూచి నవ్వేటిపతితోడ
మాట లాడఁ గదవే మౌన మేఁటికి
ఆఁటదాని కింత యేలె అంతవాఁడు వేఁడుకోగ
కోటి నేరా లేమి గల్గాఁ గూడుకొన వలదా

చ. 2: కొంగు వట్టి నిన్నుఁ దీసి కొసరేటిపతి నిట్టే
సంగడిఁ గాఁగిలించ వేసట లేఁటికి
యింగితాన నొక్కవేళ యిద్దరిలోఁ గలఁగితే
సంగతిఁ జవి సేసుక చన వియ్య వలదా

చ. 3: యిర వై తమ్ములము నీ కింద మనీ నాతఁ డదే
సిర సెత్త గదవే సిగ్గు లేఁటికి
నిరతి శ్రీవెంకటాద్రినిలయుఁడు నిన్నుఁ గూడె
తొరలిన నీరతులఁ దోడు చూప వలదా

రేకు: 0333-1 ధన్నాశి సంపుటం: 11-193

పల్లవి: నేనైతే నేమీ నెరఁగ నీకు నీవే బెదరేవు
తానే బయటఁ బడీని తగని నీచేఁతలు

చ. 1: కొండవంటి దొర నిన్నుఁ గోరి వెంగె మాడుదునా
దుండుగము నీకు నీకే తోఁచీఁ గాకా
అండకు వచ్చి నీ గట్టు అరయఁగ వచ్చితినా
వుండుండి నీకు నీవే వులికేవు గాక

చ. 2: నడుమను నిన్నుఁ జూచి నవ్వులు నవ్వితివా
వడి నీకు నీవే తల వంచేవు గాక
వెడ నీ మేనిచేఁతలు వెదకి చూచితినా
తడవి కప్పుక నీవే దాఁచేవు గాక

చ. 3: నీవు గాఁగిలించుకోఁగా నేరము లెంచితినా
భావించ నీవే సిగ్గు వడేవు గాక
యీవేళ శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
కోవిదుఁడ వై రతిఁ గొంకేవు గాకా

రేకు: 0333-2 బౌళిరామక్రియ సంపుటం: 11-194

పల్లవి: అద్దో మానవుగా అదే మే నీవు
గద్దించి నీవు చూచితే కాళ్లు వణఁకీనా

చ. 1: మచ్చిక నాతఁడు నేడు మా యింటికి వచ్చె నంటా
పచ్చి గొంతా వెచ్చి గొంతాఁ బలికే వేమే
బచ్చెనల నతఁడు నీ సొంగెములో వాఁడై
నెచ్చెలి నీకుఁ గొంకితే నే నీకు వెరతునా

చ. 2: చెప్పి యిందరిలో వాఁడు చేయి నాపై వేసె నంటా
అప్పటనుండి వుడికే వ దేమే నీవు
దెప్పర మాతఁడు నీచేఁ దిట్టించుకొనుఁ గాక
నిప్పువంటిదాన నేను నీచేతఁ బడేనా

చ. 3: గక్కన శ్రీవెంకటాద్రిఘనుఁడు నన్నుఁ గూడితే
పక్కన నాతనిఁ గొంగు వట్టే వేమే
చక్క నీ వండ నుంటె సాదించఁ జెల్లుఁ గాక
యిక్కడ వచ్చే మనేవే యిక నే నోరుతునా

రేకు: 0333-3 దేవగాంధారి సంపుటం: 11-195

పల్లవి: ఈతఁడె నీ కెంత తన విచ్చెనో కాక
యేతుల నీ గుణముల కిందరూను మెత్తురా

చ. 1: పదరి యాతడు నిన్నుఁ బైపైఁ బిలువఁగాను
యెదిటికి రావు లోన నేమి సేసేవే
మదిఁ గోపము గలితె మాటల నాడుదు గాక
కదిసి మోనాన నుంటే గర్వ మనరా

చ. 2: అలరి మాటాడి యాడి యాతఁడు లేప వచ్చితే
యెలమి నిద్దుర బొయ్యే విది యేఁటిదే
చలము నీకుఁ గలితే సాదించవలెఁ గాక
నిలిగి ముసుఁ గిడుటే నిష్టూరము గాదా

చ. 3: శ్రీవెంకటేశ్వరుఁడు చేరి కాఁగిలించుకోఁగా
యీవేళ సిగ్గు వడేవు యిఁకఁ దగునా
వేవేలు గలిగిన వెనకకె చెల్లుఁ గాక
భావించి కూడిన మీఁదఁ బచ్చి దొఁచదా

రేకు: 0333-4 పాడి సంపుటం: 11-196

పల్లవి: మతకాలు నేరిచినమాయదారివి
తతి నీ వడ్డము రాక తలరా వోరి

చ. 1: దవ్వుల నే రాఁగానె తగఁ బలుకరించేవు
యెవ్వతెకు నా రాక యెచ్చరించేవో
అవ్వల నప్పటనుండి అనుమాన మయ్యీ నాకు
పవ్వళించే లోను చూచేఁ బదరా వోరి

చ. 2: యింతట నేఁ జొచ్చి రాఁగా నెదురుగా వెళ్లి వచ్చే
వంత నాకె గోపగించీ నంటానో వోరి
యెంతైన నీవు నన్ను నేమరించఁ జోటు లేదు
చెంత నెవ్వతెఁ దెచ్చితి చెప్పరా వోరి

చ. 3: చేరి నే మంచ మెక్కఁగా చెలులనే పిలిచేవు
వారిలో నాపెఁ గలుపేవగలా యివి
యేరా శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
తేరెఁ బను లింక తెర దియ్యరా వోరి

రేకు: 0333-5 రామక్రియ సంపుటం: 11-197

పల్లవి: అందు కేమి నీవు మాతో నన వలెనా
చందముగ నొడఁబరచఁగ నింత వలెనా

చ. 1: ఈ యడకు రా కుండితే యేడనుండైనా నీకు
చే యెత్తి మొక్కిన దొక సెలవే కాదా
పాయ మెంత వెంచినాను ప్రాణము నీ కొప్పగించి
కాయముతో బదికేది ఘనత నీదే కాదా

చ. 2: కన్నులఁ జూడ కుండినా కడ నీ వార మని
వున్నట్టే వుండుట నీకే వొప్పు గాదా
మన్ననలు దవ్వైనా మనసు నీపైఁ బెట్టి
యిన్నిటా నుండుట నీకు నిది గీర్తి గాదా

చ. 3: మునుపఁ జెప్పంపకున్నా మొక్కలాన నిట్టే వచ్చి
చనవు చేకొనుటే చాలదా మాకు
యెన లేక శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
ననిచితి నిది మీకు నయమే కాదా

రేకు: 0333-6 నాదరామక్రియ సంపుటం: 11-198

పల్లవి: కలఁడుగా యిటువంటి గడుసరి భూమిమీఁద
తెలిసితి మిన్నాళ్లకు దిష్టముగ వీనిని

చ. 1: తగని వెల్లాఁ జేసి తనమాఁటె ఘనము
జిగి నా మొగము చూచీ సిగ్గు వడఁడు
నగువారి నెరఁగఁడు నాపై నానలు వెట్టీ
యెగసక్కేఁడు వీని దెంత నేరుపే

చ. 2: తప్పుజగడాలు రేఁచీ తానె మంచివాఁడు
యిప్పుడె వావులు చెప్పీ యెవగించఁడు
ముప్పిరిఁ దల వంచిన మోవితేనె లియ్య వచ్చీ
చప్పుడు గాకుండాఁ జేరీ జాణ గదే వీఁడు

చ. 3: తమకించు నిన్నటాను తగవరీఁ దానె
అమరఁ గతలు చెప్పీ నందు కాతఁడు
తిమిరి శ్రీవెంకటాద్రి దేవుఁ డిట్టె నన్నుఁ గూడె
సమరతి నిన్నిటాను సరుసుఁడు గదవే

రేకు: 0334-1 సౌరాష్ట్రం సంపుటం: 11-199

పల్లవి: నీ విదె నే నదె నేమ్మదిఁ దానూ నదె
ఆవలి మొగము లేల అద్దరిపా టాయను

చ. 1: వచ్చినట్టిపరాకున వనిత నన్నుఁ గానక
యిచ్చ నీవద్ద గూచుండి యిటు చూచి
యెచ్చరి నీ పే రడిగీ నెరఁగనిదానె వలె
తచ్చన లిం కేల సమతారుకాణ లాయను

చ. 2: యీడ నాగురు తెరఁగ కీపె వచ్చి వోయి నీతో
యేడలేనిముచ్చ టాడె యేకతానను
తోడ నీ వెచ్చరించఁగా తొయ్యలి యామాటలె
యేడో కతలు సేసీ నిఁక నేల బొంకులు

చ. 3: పరపుపై నిద్దరము పవళించు టెరఁగక
యిరవుగఁ గాఁగిలించె నిద్దరి నీపె
గరిమ శ్రీవెంకటేశ కలసితి విట్టె మమ్ము
దరి చేరెఁ బను లెల్ల తన కేల సిగ్గులూ

రేకు: 0334-2 నాదరామక్రియ సంపుటం: 11-200

పల్లవి: నీవల్ల దోసము లేదు నేరము నావొళ్లి దింతే
చేవ దేర నిఁక నీవు సేసినంతాఁ జెల్లురా

చ. 1: కొరి నిన్నుఁ జూచి చూచి కోపగించఁ జాలఁగాని
చేర నీవు రానందుకు చిమిడీరా నా మనసు
వోరి నీవు సేసినందు కొల్లక వుండే నంటే
భారపు నాజవ్వనము పై తరవు వెట్టురా

చ. 2: దీకొని నీ పట్టుకు నేఁ దెగఁ జాలకుందుఁ గాని
కాకరి నీ నవ్వు లెల్లాఁ గాఁడిపారె నన్నునూ
వాకున వెళ్లనా డైనా వడిఁ దీర్చుకొనే నంటే
యీకడ నా మొగమాట మింత సేసె నన్నును

చ. 3: కాఁగిలించి నిన్ను నంత కస్తి నేయ నోపఁ గాని
రాగిన నా వలపులు రాసు లై వున్నవిరా
వీఁగక శ్రీవెంకటవిభుఁడ కూడితి నన్ను
మాఁగి నీ కెమ్మోవి మరిగించెఁ దీపులు

రేకు: 0334-3 కేదారగౌళ సంపుటం: 11-201

పల్లవి: ఇంకమీఁద వచ్చేపని కిప్పు డేఁటికే
మంకు దీరఁ దన్నింతలో మంచివానిఁ జేసేనా

చ. 1: కానీ లేవె తనమాట కల్లనేనా యిందరిలో
నాన నిచ్చి వెనకనె నవ్వేఁ గాక
ఆన లేల పెట్టుకొనీ నంతలోనె లే దంటా
నే నిట్టే యిందుకు తన్ను నిజమరి అనేనా

చ. 2: తడవ నేలె నేను తనగుణా లిందరిలో
వడి వెట్టి మరఁగున వంచేఁ గాని
తొడిఁబడఁ జేయ వట్టీ దోస మన్నా మానఁడు
వొడఁబడి యిందుకే నే నొక్కటి యైతినా

చ. 3: దంట నై యలుగ లేనె తనుఁ గోపించేవేళ
వొంటిఁ జిక్కించుక వేరె వొరసేఁ గాక
యింటిలోన శ్రీవెంకటేశుఁడిట్టె నన్ను గూడె
అంటి ముట్టి తొంటివెంగే లాడక మానేనా

రేకు: 0334-4 బౌళిరామక్రియ సంపుటం: 11-202

పల్లవి: పాప మంటా నోరిచితేఁ బదరీఁ దాను
కోపగించి యెవ్వతె యైనఁ గుమ్మీ లేవే

చ. 1: వంతులకు వచ్చి వచ్చి వలపులే చల్లీని
పంతగాఁడు తన కేమి పని లేదా
యింత గలితె తన్ను యెవ్వ తైనాఁ బట్టుకొని
చెంతనె సదమదము సేసీ లేవే

చ. 2: దీమసాన రతులకు దిట్టి తిట్టి పిలిచీని
బూమిలోన వీని కేమి పొద్దు వోదా
ఆముకొని యింత లేసి ఆసలకు బెనఁగితే
గామిడి యెవ్వతె యైనాఁ గలిగీ లేవే

చ. 3: తొడిఁబడ నవ్వి నవ్వి దొమ్మి సేసి కాఁగిలించి
వొడి వట్టీ వీని కేమి వుండఁ బట్టదా
బడినె శ్రీవెంకటపతి నన్ను నిదె కూడె
కడ నింకా నివ్వ తైన కాచుకుండీ లేవే

రేకు: 0334-5 దేసాళం సంపుటం: 11-203

పల్లవి: కంటిమి నీ సుద్ద లెల్లఁ గానీరా వోరి మా
యింట నున్నప్పుడే నీ యిచ్చలు వోరి

చ. 1: చెక్కు లేల పులకించే జెప్పరా వోరి నాతో
నిక్కి నిక్కి నీ నిజాలె నెరపేవు
యెక్కడికిఁ బోనివాఁడ వేరా వోరి
యిక్కడనె బుసకొట్టేవు యేఁటికిరా వోరి

చ. 2: యేడది కుంకుమపూఁత యీ మేన నోరి
యేడలేనియాచారాలు యీడఁ జేతువు
ఆడి తప్పనివాఁడవు అవురా వోరి
యీడ నీ వెంట వచ్చిన దెవ్వతెరా వోరి

చ. 3: తమకించే వింతలోనె తలరా వోరి నాతో
జమళి నక్క డీ మేలు చల్లేవా వోరి
అమర శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
సముకాన నీ మాఁట సమ్మతించే నోరి

రేకు: 0334-6 హిందోళవసంతం సంపుటం: 11-204

పల్లవి: ఎరవు సేసుకొనేవు యింకా నేలా
సిరసు నీవు వంచితే చేఁత లెల్ల మానునా

చ. 1: సేసకొప్పుతోడిది చెమటముత్యాలది
సేసిన నీ పొందు మాతోఁ జెప్పుకొన్నది
పూసినజవ్వాదిపూఁత బుగులుకొనఁ బయ్యద
వేసిన వల్లెవాటుతో వేలఁ జూపీ నిన్నునూ

చ. 2: దొరతనములది యేతుల చిట్లుగందారిది
మురిపేన నీ దిక్కు మొక మైనది
సురతాంతమున నీ సోఁకినగురుతు లెల్ల
పరగఁ జెలుల కెల్ల బయలు సేసీని

చ. 3: కన్నుల మొక్కులది గయ్యాళి చేఁతలది
తన్నుఁ దానె నిన్నుఁ జూచి తనియనిది
యిన్నిటా శ్రీవెంకటేశ యిటు నీవు గూడఁగాను
పన్ని నీ పరవుమీఁదఁ బవళించినది

రేకు: 0335-1 దేసాక్షి సంపుటం: 11-205

పల్లవి: ఇద్దరి జాడలూఁ గంటి మిప్పుడే నేము
ముద్దులు మోవులు మీలో మోపి గొణఁగితిరి

చ. 1: మంతనాన నోతోడ మాటలాడేవేళ
యింతి బొమ్మముడి వెట్టె నేఁటికో కాని
చెంతల నందుకుఁ గానె చెప్పరాని తిట్టు దిట్టి
అంతలోఁ గాఁగిలించితి వౌ నయ్య నీవు

చ. 2: ఆరజాన నాపె నీకు ఆకు మడి చిచ్చి యిచ్చి
యీరసానఁ గోపగించె నేఁటికో కాని
చేరి నీ వందుకు గానె చేయి వట్టి తోసుకొని
కూరిమి తొడపై నిడుకొంటివయ్య నీవు

చ. 3: మంచముపై నుండి యాకె మలగుపై నొరగుతా
యించుకంత గోర నూఁదె నేఁటికో కాని
చంచుల శ్రీవెంకటేశ సన్నెరిఁగి కూడితివి
మించిన మీ నేరుపులు మే లయ్య నేఁడు

రేకు: 0335-2 ఆహిరి సంపుటం: 11-206

పల్లవి: ఒత్తి నీవు దగ్గరితే నొద్దనదు సతి నిన్ను
చిత్త మెరఁగక గుట్టు సేసీఁ గాని

చ. 1: నిలువెల్లఁ బులకలే నిన్నుఁ జూచేప్పటనుండి
కలికి పయ్యద నట్టె కప్పీఁ గాని
తలఁ పెల్లఁ దమకమే తనకు నీ విటుపై పైఁ
బిలువఁగా నూరకె బిగిసీఁ గాని

చ. 2: వెలియల్ల చింతలే మినుకలి నాటనుండి
తల వంచి నీకుఁ గొంత దాఁచీఁ గాని
పలు కెల్ల దైన్యమే పడఁతి నియ్యెడకు
చలి వేఁడి రాజసాలు జరపీఁ గాని

చ. 3: వయ సెల్ల వలపులే వనిత నిన్నటనుండి
నయము సేసుక నీతో నవ్వీఁ గాని
క్రియ యెరిఁగి కూడితి కెలన శ్రీవెంకటేశ
జయ మందెఁ జెలి నీతో సరసము గాని

రేకు: 0335-3 శంకరాభరణం సంపుటం: 11-207

పల్లవి: ఆడనె ఆకెచే వెంగె మాడించుకోవయ్య్యా
తోడనె నీ సుద్ది విన దోస మయ్యా

చ. 1: చిత్తము రా కొకమాట చిత్తము వ చ్చొకమాఁట
వొత్త నీతో నాడ నే నోప నయ్యా
హత్తిన ఆకెకు నీకే అలవాటు గాని మాకుఁ
దత్తరించి యింత నేయం దగ దయ్యా

చ. 2: కూడినప్పు డొకచూపు కూడనప్పు డొకచూపు
యీడా నాడా రెండూ నెరఁగ మయ్యా
యేడో ఆకెకు నీకు యే మన్న నమరుఁ గాని
వీడుపడ నింత నేయ వెరతు మయ్యా

చ. 3: సంతసించి వొకనవ్వు సంతంసించ కొకనవ్వు
మంతు కెక్కి తొల్లె యివి మానితి మయ్యా
చెంతలఁ గూడితి నన్ను శ్రీవెంకటేశ యాకె
పంత మాడుఁ గాని మాకుఁ బాడి గా దయ్యా

రేకు: 0335-4 హిందోళం సంపుటం: 11-208

పల్లవి: రమ్మనఁగాఁ దనతోనే రా నంటినా
చిమ్ముచు నింత ప్రియము చెప్ప నేలె నాకు

చ. 1: వెల్లవిరిఁ దనమాఁట విన నైతినా నేను
చెల్లఁబో నా కేల సేవ సేసీని తాను
యెల్లవారిఁ దా నేలీ నెవ్వరిఁ బోలుదు నేను
బల్లిదుఁడు నా కేల బాఁతి పడీఁ దానూ

చ. 2: చెప్పిన ట్టెల్లా నేను సేయకుండేదాననా
అప్పటి లేక లేఁటికి నంపీనె తాను
కప్పురపు పడిగల కాంతలు గాచుకుండఁగా
విప్పుచు నాకుఁగా నేల వేగించేనె తానూ

చ. 3: గక్కనఁ దా గూడఁగాను కాదు గూడ దంటినా
ముక్కు మోవ సాగి లెల మొక్కీనె తాను
యెక్కువ శ్రీవెంకటేశుఁ డెననెఁ దా నన్ను నిట్టె
పెక్కు సతులతోనె పెద్ద సేసీఁ దాను

రేకు: 0335-5 సౌరాష్ట్రం సంపుటం: 11-209

పల్లవి: ఇంతకంటె నాతఁడు మ రేమి సేసునే
యింతులాల రమణుని నేల దూరేరే

చ. 1: కన్నుల మెక్కనె పట్టె కాఁకఁల బెనఁగఁ బట్టె
వెన్నెలనవ్వులు నవ్వ వేళ లేదే
పన్ని నెత్త మాడఁ బట్టె పరాకు నేయనె పట్టె
యిన్నిటా జాణఁడు వాని నేల దూరేరే

చ. 2: సరస మాడఁ బట్టె సంగడిఁ గూచుండఁ బట్టె
విరులు ముడువ నైన వేళ లేదే
కురులు దువ్వనె పట్టెఁ గొలువు సేయనె పట్టె
యిర వెరుఁగు నాతఁడె యేల దూరేరే

చ. 3: చొక్కుచు నుండనె పట్టె సుద్దులు చెప్పనె పట్టె
వెక్క సపురతులకు వేళ లేదే
పక్కన శ్రీవెంకటాద్రిపతి నన్ను నిటు గూడె
నిక్కడ నే విన నోప నేల దూరేరే

రేకు: 0335-6 సామంతం సంపుటం: 11-210

పల్లవి: వినవే యీ మాఁట వెలది నీకు నీవె
అనవే నీ నోటనే అందుకు నుత్తరము

చ. 1: పిలిచీఁ గదవె తాను బెట్టుగ సిగ్గు వడఁడు
పిలిచెటిపెద వెందో పిప్పి గట్టెను
కలయు మనీనె కమ్మటిని నన్నును
కలనే తన పురము కాయ గాచె నదివో

చ. 2: నవ్వీఁ గదవె తాను నాతోనుఁ గమ్మటిని
నవ్వేటి తన చెక్కులు నంజు లాయను
పవ్వళించీఁ గదె నా పక్కనె తా నప్పటిని
పవ్వళించే యందె తన పను లెల్లఁ దెలిసే

చ. 3: చేతుల చాచీఁ గదె చేరి నా కాఁగిటికి నా
చేతికి లోనైనవారు చెలులెల్లాను
యీతల శ్రీవెంకటేశుఁ డిప్పు డిట్టె నన్నుఁ గూడె
యీతలాతలిపనులు యెన్ని కాయఁ గదవే

రేకు: 0336-1 సాళంగం సంపుటం: 11-211

పల్లవి: ఇంచుకంతా నెరఁగరు యేఁటిదే మీరు
మంచివారు గలితిరి మానరుగా చెలులు

చ. 1: మంకుల వొట్టు వెట్టుక మాటలాడ మన్నమీఁద
యింకా నామాటలా యెరఁగరటే
అంకెల నన్నుఁ గలయు మనేరు దోసాలకుఁ
గొంకరు అప్పటి మీరు కూళలటే చెలులు

చ. 2: తోడనె వాదు వెట్టుక తొలఁగి వచ్చినమీఁద
యీడా నాడాఁ దగవులా యిదేఁ గొంతా
వీడనీ కాతని నీ వెంటఁ దోడి తెచ్చితిరి
ఆడికెకు వెరవరు హంత లటే చెలులు

చ. 3: యెదురెదురుకట్ల నింతకు వచ్చినమీఁద
అదిమి కాఁగిలింపించే రౌనే మీరు
అదన శ్రీవెంకటేశుఁ డంతలోనే నన్ను గూడె
సదరాన నవ్వేరు జాణలుగా చెలులు

రేకు: 0336-2 సామంతం సంపుటం: 11-212

పల్లవి: చెల్ల బో యిందుకు నేల చిన్నఁ బోయ్యేవు
అల్లాడ నీ కేమైన నది నే నచ్చేరా

చ. 1: సరి నెందు వొయ్యే వంటే సకినాలు వాటించి
తిరిగి తిరిగి వచ్చి తిట్టే వేరా
అరుదు నీ కింతైతే నందు వోయ్యేపనులకు
వెరవుతోడఁ జేటవేలుపులఁ జూడరా

చ. 2: ఆరగించి పొమ్మంటే నదియునుఁ గాని దంటా
గోర సేసి ఆనవెట్టి కోపగించేవు
ఆరయ నీ మనసుకు ననుమాన మైతేను
పోరచి నీ పొరుగునఁ బోచిళ్ళు చల్లరా

చ. 3: వొగి నీకు మొక్కినాను వొకచోటి కేఁగేవేళ
తగ దంటా నీకు నీవే తప్ప నాడేవు
జిగి నన్నుఁ గూడితివి శ్రీవెంకటేశ యిట్టె
పొగరుల నిఁకఁ బోయి పులుగు నర్చించరా

రేకు: 0336-3 బౌళి సంపుటం: 11-213

పల్లవి: నే నెంత చిన్న నైనా నీకే సులభము గాని
పూని నా సరివారికిఁ బొడవే సుమ్మీ

చ. 1: యిచ్చకపుపతివి నీ వే మన్నా నితవే నాకు
కొచ్చి కొచ్చి తిట్టినాను కోప మున్నదా
తెచ్చుకొన్న నీసతులు తేనెల మాఁటాడినాను
మచ్చరములై పెరిగి మర్మములు నాఁటురా

చ. 2: నీఁటున బ్రాణవిభుఁడ నీవేమి సేసినా
వాఁటమై మొక్కుదుఁ గాక వాసి పట్టెనా
నాఁటకపు సవతులు నయగారాలు సేసినా
యీఁటెల పోట్లే కాక యింత కోపేనా

చ. 3: చేరి నన్ను నేలినట్టి శ్రీవెంకటేశ నీవు
యేరీతి నుండినాను యెర వున్నదా
సారెకు నీవు ముట్టినసవతులు వద్ద నున్నా
నీరసమె రేఁగుఁగాని యీయకోలు గాదురా

రేకు: 0336-4 గుండక్రియ సంపుటం: 11-214

పల్లవి: ఛీ ఛీ యిందుకే పో సిగ్గయ్యీ నాకు
యేచి యంతరు మాలిన యీడు జోడు లేలరా

చ. 1: చెప్పిన ట్టెల్లా నేను సేసేఁ గాని యిందరితో
వొప్పగు వరుసవంతు లొల్లరా యింక
యెప్పుడు నీ దీవెనె యిదె నన్ను మన్నించుట
కప్పి వల పెల్ల నొక్కగాడిఁ గట్ట వద్దురా

చ. 2: అంది నీ యా నాజ్ఞలోన నణఁగి వుండేఁ గాని
సందడిలో కొలువులు చాలురా నాకు
ముందు నీవు నావాఁడవె మొక్కేఁ గాని గాజు దెచ్చి
చందపుమాణికముతో సరి సేయ రాకురా

చ. 3: సరుస గూచుండేఁ గాని జంగిలి విడేలలోన
వొరిమెకుఁ జేయి చాఁచ నోపరా నేను
గరిమె శ్రీవెంకటేశ కాఁగిఁట గూడితి విట్టె
పరగఁ దెల్లని వెల్లాఁ బా లంటా నుండకురా

రేకు: 0336-5 శంకరాభరణం సంపుటం: 11-215

పల్లవి: చేరి నీకుఁ దగ బుద్ది చెప్పుఁ గాక
వేరొకతె నీచేత వేఁగఁ బోయీనా

చ. 1: అచ్చట నీ వెవ్వతెనో అంటుకొన్నది చాలక
యిచ్చగించి నాతోఁ జెప్ప విది యొకటె
నిచ్చ నేఁ గాఁగానె కాక నీచేత మరొకతె
వచ్చి వెచ్చి రోఁతలఁ బడఁ బోయీనా

చ. 2: కానకుండ వింతసతి గైకొన్నదిఁ గాక నన్ను
దానిపేర బిలిచేవు తగురా నీవు
కానీరా నాకంటె వేరె గయ్యాళి దొక తైతె
పూనిక నీ సుద్దులకు వోరుచు కుండీనా

చ. 3: వీదిఁ బోయేదానితోడ వెస నవ్వుతాఁ గాక
యీాదెసకుఁ బిలిచేవు యింత వలెనా
వేద దీర నిను శ్రీవెంకటేశ కూడితిని
ఆదరించి వింతది నీ వాడిన ట్లాడీనా

రేకు: 0336-6 ఆహిరి సంపుటం: 11-216

పల్లవి: ఎంత చెప్పినా మాన దిందాఁక నే మెల్ల
పంతపు దమ కోపాలు పచరించఁ బట్టెను

చ. 1: ఆలవట్టము గాలికి అంగన పయ్యద జారి
పాలిండ్లు గాన రాఁగాఁ బతిఁ గాఁగిలించెను
మేలు మేలు దీని నేఁడు మెచ్చవలె నిందుకే
వోలి నూరకున్నవారి నొక్కటిగాఁ జేసెఁగా

చ. 2: కప్పురము నోటి కీఁగా కాంత చలిగొని పతి
కప్పినపచ్చడమే కప్పుకొనెను
కుప్పలుగా దీనినె కొనియాడవలె నేఁడు
తప్పక చూడనివారిఁ దగులుగాఁ జేసెను

చ. 3: పన్నీరు చల్లఁగాను పడఁతిమై పులకించి
తన్నుఁ దానె సిగ్గుపడి తల వంచి నవ్వెను
అన్నిటా మొక్కఁగ వలె నందుకే నేఁడు దీనికి
యెన్నఁగ శ్రీవెంకటేశు నింతినిఁ గూడించెను

రేకు: 0337-1 శంకరాభరణం సంపుటం: 11-217

పల్లవి: అప్పట నుంటిఁ గోప మాఁప లేను
వొప్పుగ నీవే నాకు వొడఁబడఁ జెప్పరా

చ. 1: మేఁటి వై నీవొక్కఁడవే మేడమీఁద నుండితిని
ఆఁటది మాఁటలాడిని ట్టాయ నందు
యేఁటికి బొంకేవు నాతో యెవ్వతెఁ దెచ్చితి వోరి
నాఁటకుఁడ నా మనసు నమ్మించరా

చ. 2: నిద్దిరించి పానుపుపై నీవే యంటా నుంటి
యిద్దరుఁ బవళించినయిర వున్నది
వద్దురా మరఁగు నాతో వనిత నెందు దాఁచితి
గద్దరీఁడ నాలోని కలఁ కెల్లఁ బాపరా

చ. 3: కాఁగిటిలో నీవు నేనుఁ గలసితి మిద్దరము
రేఁగి నీ మేనిపై వింతరేక లున్నవి
దాఁగ నీ పనులు నేఁడు దక్కితి శ్రీవెంకటేశ
పొఁగినజాణఁడ నాతోఁ బలికి మెప్పించరా

రేకు: 0337-2 సామంతం సంపుటం: 11-218

పల్లవి: ఎప్పటి కెప్పటి వాదు లిఁక నేఁటికి
కుప్పలుగాఁ బంత మిచ్చేఁ గూచుండఁ గదరా

చ. 1: ఊరకున్నవారి మమ్ము నుడికించి నవ్వ నేల
ఆరయ నా మాఁటఁ బడి యలుగ నేల
కూరిమి గలుగువారు కొసరితే నే మాయ
మేరతోనె వేఁడుకొంటి మెచ్చి నన్నుఁ జూడరా

చ. 2: చింతతో నుండిన నాపైఁ జేయి చాఁచ రా నేల
యింతలో విదిలించి వేయించుకో నేల
యింతు లైనవా రేమన్నా నే మాయఁ బురుషులకు
రంతు లేల నీకు మెక్కే రారా మా యింటికి

చ. 3: పాయపువారిఁ గూడి పాసి కొంత వేఁచ నేల
సేయరానిచేఁతఁ బడి సిగ్గు లిం తేల
యీయెడ శ్రీవెంకటేశ యిట్టె నే నిన్నుఁ గూడితి
కాయము గాయముఁ గూడె కడమ మా టాడరా

రేకు: 0337-3 గౌళ సంపుటం: 11-219

పల్లవి: తా నెంత నే నెంత తగునా తాను
తేనె పూసి మాటలను తేలించీఁ దానూ

చ. 1: రమ్మనఁగా తనతో నే రా నంటినా నాకు
అమ్మరో ప్రియము చెప్పీ న దేమె తాను
కమ్మి సారెకు నలుగఁ గడదాననా
చిమ్ముచు నా కిచ్చకాలు సేయ నేలే తానూ

చ. 2: చలమునఁ దన మాఁట జవదాఁటేనా
చెలులచేఁ జెప్పించీ చెల్లఁబో వీఁడు
చలిమి బలిమి నాతో సారెఁ జెల్లదా
వెలి న న్నొడఁబరచీ వెర పేలే తానూ

చ. 3: యితరులవలెఁ దన్ను నెగ్గు లెంచేనా
అతివినయాలు చేసీ నౌనే తాను
యిత వై శ్రీవెంటేశుడిట్టె కూడెను
మతిలోని వెలుతులు మరి యాలే తానూ

రేకు: 0337-4 సామంతం సంపుటం: 11-220

పల్లవి: ఇంత నేరకున్నవాఁడె యిన్నిటాఁ గూళ
వంతు వా లెంచకుండేవాఁడె జాణ

చ. 1: కూరిమితో నాఁడువారు కోపగించినట్టివేళ
వైరము లేక నవ్వేటివాఁడు వో జాణ
ఆరయ నలుకతోడ నట్టె యంత దిట్టినాను
గారవించి వేడుకొన్నఘనుఁడు వో జాణ

చ. 2: అలిగి ప్రాణేశ్వరి అవ్వలిమో మైనవేళ
వలపుతో బుజ్జగించేవాఁడు వో జాణ
చలి వేఁడి సిగ్గుతోడ సటలకు బిగియఁగా
బలిమి సేసి పైకొన్న పతియ పో జాణ

చ. 3: అల్లప్పుడే రావైతి మని సాదించేవేళ
వల్లె వేసి చెక్కు నొక్కేవాఁడె జాణ
వెల్లవిరి గాఁగ శ్రీవెంకటేశ కూడితివి
చల్లని నీవంటి మంచి సరసుఁడే జాణ

రేకు: 0337-5 ముఖారి సంపుటం: 11-221

పల్లవి: తతి గాని తతి నేల తమకించేరే
మతిలోని నొప్పి గొంత మాన నియ్యరే

చ. 1: పతిఁ బాసి వున్న దాన బలు విరహపువేళ
యిత వంటా విరులు నా కేల యిచ్చేరే
రతిరాజనమ్ము లివి రంట దెప్పరపువేళ
కతుకున నాఁటుఁ జేసు గవిశన నిడరే

చ. 2: కందువ జవ్వనమునఁ గావరించి వున్నవేళ
యింద మంటా గందము నా కేల పూసేరే
మందమారుతాన కవి మచ్చు చల్లే చౌక్కుమందు
యిందు కేల పెట్టెఁ గట్టి యింటిలోన నిడరే

చ. 3: శ్రీవెంకటేశువొద్ద సిగ్గువడి వున్న దాన
చేవ దేర నిప్పు డేమి సింగారించేరే
యీవల నాతఁడు గూడె యీ సొమ్ము లిన్నియును
వేవే లాతఁ డిచ్చినవె వేగిర పడకురే

రేకు: 0337-6 నాదరామక్రియ సంపుటం: 11-222

పల్లవి: నీవే నాపై బత్తి యైతే నేఁడి ట్లేంటి కయ్యీ
కావరపు నీ బత్తి కల్ల యేమో కాక

చ. 1: కొప్పు వీడెఁ గదరా కోరి నీవు మొక్కఁగాను
వొప్పుగా నే నీకు మొక్కే దొమ్మదో కాక
దప్పి గొంటిఁ గదరా తగ నీతో నవ్వఁగాను
అప్పటి నీతో నవ్వు లయి రావో కాక

చ. 2: కాలు జారెఁ గదరా కమ్మి నీ కెదురు రాఁగ
తూలుచు నీ తెరువు రా దోసమో కాక
వోలిఁ జెమరించెరా వొగి నిన్నుఁ జూడగాను
తాలిమి నిన్నుఁ జూచేది తగనిదో కాక

చ. 3: కాఁక రేఁగెఁ గదరా కాఁగిట నిన్నుఁ బట్టఁగ
వేఁకపు నీతో రతి వెంగెమో కాక
యేఁకట శ్రీ వెంకటేశ యిత వాయఁ గదరా
మాఁకు పడ మరుఁ డింత మరిపెనో కాక

రేకు: 0338-1 మాళవిశ్రీ సంపుటం: 11-223

పల్లవి: ఎంత కెంత సేసేవు యేరా నీవు
పంతగాఁడ మేలు మేలు పైకొని వచ్చేవు

చ. 1: వొడివట్టి తీసేవు వోప నంటేఁ దిట్టేవు
పడఁతులతో నేర బలువా నీకు
అడరి నా వెంట వచ్చే వప్పులవానివలె
విడువ వింత పనికి వెరతురా నీకు

చ. 2: ఆదిగొని పై నొరగేవు అట్టట్టే పోతేఁ బట్టేవు
సాదులతోనె యింత చలమా నీకు
గోదిలి సాదించేవు గొనుకొన్నవానివలె
యీా దెస నీ గాతికిన యింత కోపఁ గలవా

చ. 3: కామించి నగ వచ్చేవు కాఁగిట బిగించేవు
యేమి నననివారితో యేతులా నీకు
దోమటి దొడికితిని దొడ్డచుట్టమువలెనె
నేమపు శ్రీవెంకటేశ నీవె నీ నయితిరా

రేకు: 0338-2 కాంబోది సంపుటం: 11-224

పల్లవి: ఏమి సేయు మన్నఁ జేసీ యెరపరికము లేల
చే మంచితి నా యడకు శిబ్బితి పడకురా

చ. 1: చేరి నాతో నేమో మాట చెప్ప వచ్చినవాఁడవు
కోరి యంతలోనే గుక్కుకొందురా నీవు
వూరకే మా యింటిదాఁక నొంటి వచ్చినవాఁడవు
పోరచి వై యట్టె మళ్లి పోదురా నీవు

చ. 2: మొదల నాతో నవ్వ మొగ మెత్తినవాఁడవు
వదలి యంతలోఁ దల వంతురా నీవు
పదిమారులు నన్నుఁ దప్పక చూచినవాఁడవు
చెదరి యట్టె పరాకు సేతురా నీవు

చ. 3: యిట్టె నన్నుఁ గాఁగిటిలో యెచ్చరించినవాఁడవు
అట్టు కెక్క నీ మేను మఱతురా నీవు
గుట్టున శ్రీవెంకటేశ కూడినట్టివాఁడవు
యిట్టనై వెనక ముందు లెంతురా నీవు

రేకు: 0338-3 కేదారగౌళ సంపుటం: 11-225

పల్లవి: నీకు బాఁతి గాక ఆకె నేరుపులు మాకు బాఁతె
దాకొని యాసుద్ది నీతోఁ దడవ వచ్చితమా

చ. 1: అంత బత్తిగలవాఁడ వాకె నింటికిఁ గొంపోయి
చెంత నెత్తిఁ బెట్టుక పూజించ రాదా
యెంత లే దాపె మాఁటలే యీడఁ జెల్ల బెట్ట వచ్చే
వంతలో సాకిరి నిన్ను నడుగ వచ్చితిమా

చ. 2: మించి నీ వాపెకుఁ గడు మేలువాఁడ వైతేను
యెంచి నీ మేనిలో సగ మియ్య రాదా
మంచి దంటా నాపె నీడ మంతనానఁ బొగడేవు
యించుక కైనాఁ దేగ మియ్యఁగ వచ్చితిమా

చ. 3: తిరముగ నాపెఁ గొని తెచ్చుకొన్నవాఁడ వైతే
యిర వై నీ గద్దెమీఁద నెక్కించ రాదా
వొరిమి శ్రీవెంకటేశ వురముపై నే నుందాన
సిరసు వంచేవు నీకు సిగ్గులు రేఁచితమా

రేకు: 0338-4 సామంతం సంపుటం: 11-226

పల్లవి: నెఱజాణ విన్నిటాను నీ వెఱఁగవా
యెఱిఁగియును పతి నింత యెలయింతురా

చ. 1: చలము సాదించఁ బోతే సతులు లోఁబడుదురా
వలపించి పైకొనవలెఁ గాక
బలిమిఁ బిసుకఁ బోతే పసురు వేసు విరులు
యెలజవ్వనివి నేఁడు యింత నేతురా

చ. 2: రాజసానఁ దిట్టితేను రాములు మరుగుదురా
తేజమున దగ్గరి బోధింతురు గాక
సాజము దప్పఁగ బోతే సరసమే విరస మౌ
వోజతోడి యీపె నింత వుడికింతురా

చ. 3: పంతాలు నెరపఁ బోతే పడఁతులు లోఁగేరా
చెంత రతులఁ గూడి మెచ్చింతురు గాక
యింతలో శ్రీవెంకటేశ యిద్దరు నేక మయితిరి
అంత కంత కొక రొక రలయింతురా

రేకు: 0338-5 వసంతం సంపుటం: 11-227

పల్లవి: గుమితాన రేపు మాపుఁ గోసి రాపించఁగ నేల
సముకాన దాని నన్ను జగడించ విడరా

చ. 1: దుండగాన నాపెచేతఁ దుటారము లాడించేవు
అండకు రావ ద్దంటే నే నట్టే మానవా
చండి పెట్టి యాఁటదాని జవ్వనము గాకు సేసి
కండ గట్టుకొంటేఁ జాలు కా దనేనా నేను

చ. 2: చన విచ్చి యాపె నాతో సరి వొరించఁగ నేల
తనువు నీ కిమ్మన్న దక్క నియ్యనా
మనసు రానివాఁడవు మాతోడి గొడవేల
కొన మాటాడితేఁ జాలు కొసరేనా నేను

చ. 3: యిద్దరిఁ గాఁగిలింపించి యేకము సేయఁగ నేల
అద్దో నీ చెప్పినట్టు సేయక మానేనా
గద్దరి శ్రీవెంకటేశ కమ్మటిఁ గూడితి నన్ను
వొద్ద నీ విట్టే వుంటే వొరసేనా నేను

రేకు: 0338-6 శుద్ధవసంతం సంపుటం: 11-228

పల్లవి: ఎట్టు నమ్మ వచ్చురా యిటువంటి నిన్నును
వట్టి మాయలఁ బెట్టేవు వద్దు వద్దు తలరా

చ. 1: మంచివానివలెనె నా మాటలు వెలచుకొని
యెంచి చూచి నీలోనె యేల నవ్వేవు
చుంచుల నా చుట్టమవో సూడుబంటవో నీవు
అంచల నన్నియు నాయ నప్పటి నంటకురా

చ. 2: వలచినవానివలె వద్దికి రప్పించుకొని
తలఁపు చేకొని జాణతనా లాడేవు
యిల నీ గుణ మిదెయోయింతయు నా భాగ్యమో
కలపుకో లేక నేల కంటి నూరకుండరా

చ. 3: బత్తి గలవానివలె పట్టి యాకు మడి వచ్చి
యిత్తల మదన మెత్తించి యెమ్మె చూపేవు
హత్తిన శ్రీవెంకటేశ అట్టె ఫలమో చలమో
చిత్తగించి కూడితివి సిగ్గు లేక నేలరా

రేకు: 0339-1 ముఖారి సంపుటం: 11-229

పల్లవి: ఊరకున్నవారితోడ వూ రోప దన్నమాఁట
నేరుచుకొంటి నేను నీ వేమి సేసేవే

చ. 1: చుట్టము లయినవారు సొలసి సొలసి యంత
తిట్టినా యెగ్గు లౌనా తేజమే కాక
వొట్టి నీవు కోపగించి వూరకే యే మనినాను
నట్టనడుమను నాకు నవ్వు వచ్చీనే

చ. 2: చేతికి లో నైనవారు చెనకి యంత మీరినా
ఘాలతలను హీన మౌనా ఘనతే కాక
పోతరించి నీవు నన్ను వూఁచి యేమి సేసినాను
జాతి నా మన సన్నిటా సమ్మతించీనే

చ. 3: కాఁగిఁట గూడినవారు కడుఁ దమకించినాను
మూఁగి వేసట వుట్టునా ముదేమే కాక
యేఁగి వచ్చి శ్రీవెంకటేశుఁడ కూడితి నన్ను
వీఁగని నీ రతు లెల్ల విందు లయ్యీనే

రేకు: 0339-2 శంకరాభరణం సంపుటం: 11-230

పల్లవి: ఏఁటి జన్న మెత్తితి నే నిదె నీకు వెగ టైతి
గాఁటపు నీకు గుంటెనకత్తె నైన మేలూ

చ. 1: చూచిన నీ చూపు లివి చుఱుకున నాఁటీ నన్ను
చేచేత నీ కేమి పగ చేసితి నేను
యీ చాయ నాకే వెఱచే వెవ్వతె నాతో నవ్వినా
కాచి గండెదిగు లైతిఁగా నీకు నేను

చ. 2: ఆడిన నీ మాఁట లెల్ల అట్ట లదరించీ నన్ను
కోడెకాఁడ నీకు నెంత కొల యైతినో
వోడక యిందరిచేతా నొడఁబఱపించేవు
యీడ నీకు మోచి దింపై యింతేసి ఱ ట్టైతిఁ గా

చ. 3: నడుమ నీ వలపులు నాకుఁ గాళ్లఁ బెనఁగీని
కడు నీకు నెన్నాళ్ల సంగర మైతినో
యెడయక శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
బడి బడిఁ గాచుకుండఁ బా లైతిఁగా

రేకు: 0339-3 సామంతం సంపుటం: 11-231

పల్లవి: వేవేలు దండాలు నీకు విడరా నన్ను
యీవల నింత లేకున్న యెట్లు దరించేవురా

చ. 1: వాడుఁగన్నుల చూపుల వడి నాపై నొరగేవు
యేడ నేరుచుకొంటివి యేరా నీవు
ఆడికెకు నామీఁద నంత బత్తి గలయట్టె
వీడె మియ్య వచ్చేవు వెరతురా నీకు

చ. 2: నవ్వుల జాణతనాలు నయగారి వినయాలు
యెవ్వతె నేరిపెరా యేరా నీకు
పవ్వళించి యింతలోనె పైఁ గాలు చాఁచేవు
జవ్వని నింత యాఁప దోసమురా నీకు

చ. 3: కామించి కలయు మని కాఁగిటిలో దైన్యములు
యేమి అభ్యసించితవి యేరా నీవు
చే ముంచి శ్రీవెంకటేశ చెలఁగి కూడితి నన్ను
వాముల ని దెల్లా మరవకురా నీవూ

రేకు: 0339-4 బౌళిరామక్రియ సంపుటం: 11-232

పల్లవి: అన్నిటా ఘనుఁడు దాను అందు కేఁటిదే
వున్నట్టే చెప్పఁ గదరే వూరకుండ నేలా

చ. 1: చెలులఁ దా నంపివాఁడు చెంతనే రాకుండ గాఁను
అలిగి వుందానఁ దొల్లె అందు కేఁటిదే
కలఁగి ముంగోపమున కానివొట్టు వెట్టుకొంటి
పిలిపించ రాదు నాకు పిన్నదాన నేను

చ. 2: ముంచి లేక లంపినాఁడు మొక్కితి నే నన్నాఁడు
యెంచితే నెంతయినఁ గద్దు యే మందునే
పంచుక యిందరిలోనఁ బంత మెల్ల నాడుకొంటి
అంచల నాకు రారాదు ఆఁటదాన నేను

చ. 3: సంగడిఁ గూచున్నాఁడు చన వెల్ల నిచ్చినాఁడు
యెంగిలిమో వడిగీని యే మందునే
సంగతై శ్రీవెంకటేశ్వరుఁ డిట్టె నన్నుఁ గూడె
చెంగట మెచ్చఁగ రాదు సిగ్గుతోడి నేను

రేకు: 0339-5 పాడి సంపుటం: 11-233

పల్లవి: చిత్తమునఁ గలయట్టు నేతువు గాని
హత్తి మాకుఁ బని గద్దు అంపవయ్య మమ్మును

చ. 1: విన్నపాలు సేయఁ బట్టె వెంటఁ దిరిగాడఁ బట్టె
నిన్నుఁ బొదుగుచు మాకు నేఁ డెల్లాను
కన్నెవద్ది కేఁగ లేదు కలసుద్ది చెప్ప లేదు
అన్న పనులును నాయ నంపవయ్య మమ్మును

చ. 2: యిచ్చకాలె ఆడఁ బట్టె యియ్యకోలె సేయఁ బట్టె
నెచ్చెలుల మిదె నీతో నేఁ డెల్లాను
వచ్చేది నెరఁగము వడి రాని దెరఁగము
అచ్చుపడెఁ జేఁత లెల్ల నంపవయ్య మమ్మును

చ. 3: తోవ నడవనె పట్టె తోడుక రానె పట్టె
నీవు నేముఁ జేరితిమి నేఁ డెల్లాను
శ్రీవెంకటేశ్వరుఁడ చెలితోడఁ గూడితివి
ఆవల వాకిట నుండే నంపవయ్య మమ్మును

రేకు: 0339-6 సామంతం సంపుటం: 11-234

పల్లవి: చేరి మెల్లనె పొందులు సేయ వచ్చేవు
నేరుపుల మాటాడేవు నే మరచితినా

చ. 1: అలిగి యప్పుడు నీతో నాడుకొన్నమాఁట లెల్ల
పలుకుఁబంతాలె కాక బతిమాలేనా
చెలిమి నీతో నింకాఁ జేయ వచ్చితేఁ గనక
పలుమారు నీ వప్పుడు పంగించ రాదా

చ. 2: చేయి ముట్టి ని న్నప్పడు సేసినట్టిచేఁత లెల్ల
యీయడ దక్కించుకోక యిఁక మానేనా
వోయి నేఁ బ్రియాలు చెప్ప నొగి వచ్చితేఁ గనక
నాయడ చూచి నీవు నవ్వ రాదా

చ. 3: కొసరి యప్పుడు నిన్నుఁ గోపించినది యల్లా
పసు రెక్కుఁ గాక యిఁకఁ బంత మిచ్చేనా
యెసగి శ్రీవెంకటేశ యింతలో నన్నుఁ గూడితి
అసము దిగితేఁ గన కప్పుడన రాదా

రేకు: 0340-1 భైరవి సంపుటం: 11-235

పల్లవి: నవ్వుతా నేఁ దిట్టితేను నయ మిచ్చీనా
జవ్వనపు చల్లజంపు చలమరివాఁడు

చ. 1: మింగినచదువు వోతే మిట్టి మీ నై పడ్డవాఁడు
కుంగినకొండకుఁ దల గుట్టుకొన్నాఁడు
ముంగిట నొకసతిని మోరతోపు సేసినవాఁడు
సంగతిగ నీ పడుచుజగడాలవాఁడు

చ. 2: అడిగెఁడు నేలకుఁ గా నాకస మంటినవాఁడు
గొడవకె తిరిగెటి కోపకాఁడు
అడరి పుత్తమురాలి నగ్గిబాస గొన్నవాఁడు
సడి బెట్టి మేనమామఁ జంపినవాఁడు

చ. 3: చిల్లో యంటే పాల్లో యని సిగ్గు విడిచినవాఁడు
పెల్లు రేఁగి పరువులు పెట్టెడివాఁడు
యిల్లిదె శ్రీవెంకటాద్రి యెక్కి నన్నుఁ గూడె నేఁడు
బల్లిదుఁడై దేవతల పట్ట మేలేవాఁడు

రేకు: 0340-2 ముఖారి సంపుటం: 11-236

పల్లవి: జౌనే నీ సుద్దులకు అడ్డము చెప్పఁగ రాదు
కాననియడల కైనఁ గలహాలు పుట్టవా

చ. 1: యింటికి వచ్చేఁ జాలదా యేతువ లెత్తఁగ నేల
కంటు లేని దొడ్డవానిఁ గల్ల నేతురా
అంటి ముట్టి యిందు కెల్ల నాతఁడు గాఁగానె కాక
గొంటరి చెలుల కైనఁ గోపములు రేఁగవా

చ. 2: పంత మిచ్చేఁ జాలదా పై పై బిగియ నేల
చెంత నీప్రాణవిభునిఁ జిన్నఁ బుత్తురా
అంతే పో నినుబోఁటి కాతఁడే తగుఁ గాక
యంతయు మాకుఁ జూచితే యేవ పుట్టదా

చ. 3: చెక్కు నొక్కేఁ జాలదా చేతఁ దీసి వేయ నేల
దక్కె శ్రీవెంకటేశుఁ దప్పు లెంతురా
నిక్కము నాతఁడు నీవు నేరుచుకొంటిరి గాక
తక్కిన మావంటివారు తగ వందురా

రేకు: 0340-3 పాడి సంపుటం: 11-237

పల్లవి: ని న్ననఁగ దోసమురా నీకు సాజ మీ గుణము
యిన్నిటా నా మొగమోటే యింత దెచ్చె నాకు

చ. 1: కక్కసించి పెనఁగేవు కటారికాఁ డవా వోరి
వొక్కమాఁటె యింతయితే నోపరా నేను
యెక్కు వైన సటకాఁడ వెవ్వ రిచ్చి రీ బిగువు
మొక్కలపువలపులు మొన లాయ నాకు

చ. 2: అడ్డగించు కొంటివి నా కప్పులవాఁడవా వోరి
గొడ్డేరు నీ కొద్ది కాదు కోపము నాకు
యెడ్డతనాలనె తొల్లి యెందరి భ్రమయించితి
వడ్డితో నా నవ్వులె పై వచ్చెరా నాకు

చ. 3: కూరిమిఁ గాలు చాఁచేవు కొనుకొంటివా వోరి
వూరకె పతికిఁ బతి వోపనా నేను
వేరు లేక నన్నును శ్రీవెంకటేశ కూడితివి
మేరతో నింత నోమితి మేలురా నాకు

రేకు: 0340-4 రామక్రియ సంపుటం: 11-238

పల్లవి: నేరుపరి వవుదువు నీ కే మమ్మ ఆతఁ
డీరానిచనవు లిచ్చె నిఁక నీ కే మమ్మ

చ. 1: మావంటివారికె మన సియ్యఁడు గాక
నీవె ఆతఁడు గావా నీ కే మమ్మ
తోవల నీవును మాతో డట్టె సొలసే వాతఁ
డీవల నీయింట నున్నాఁ డిఁక నీ కే మమ్మా

చ. 2: మే మేమి చెప్పినాను మేరలు మీరుఁ గాక
నీ మాఁట దోయఁడు నీ కే మమ్మ
మోము చూచి మాకు మాకె మొగ మోడితిమి గాక
యేమర వాతని నీవు యిఁక నీ కే మమ్మా

చ. 3: వట్టి సట మా కైతె వరుస వం తిచ్చెఁ గాక
నెట్టుకొనె నిన్నతఁడు నీ కే మమ్మ
జట్టిగొని మమ్ముఁ గూడి సారె శ్రీవెంకటపతి
నిట్టె నీవుఁ గూడితిని యిఁక నీ కే మమ్మా

రేకు: 0340-5 కాంబోధి సంపుటం: 11-239

పల్లవి: తెలిపించుకొ మ్మననే దేశము వారిచేతనే
కులికి సారెకు నా కొంగేల పట్టీనె

చ. 1: వాడలలో తననింద వడిఁ దేర్చుకొనుఁ గాక
యీడ నన్ను నొట్టు వెట్ట నెంతవాఁడే
ఆడితిఁ బో వెరపా అందరు నాడెటిమాఁట
చూడవె తనకు నింత సులభమా నేను

చ. 2: సారెకు దేవుళ్ల వొద్ద సత్యము నెరపుఁ గాక
వూర కైనా నన్ను ముట్టీ నుండఁ బట్టదా
తారుకాణించెఁ బోవె తగిలితే నిందరిని
వోరుచుకుండితే నూరకుండఁడు గా తాను

చ. 3: తనయింటిలోనఁ దానె తగవులు వెట్టుఁ గాక
విను నా తోవ వచ్చితే వెట్టీవాఁడే
అనఁగానె శ్రీవెంకటాధిపుఁడు ననుఁ గూడె
మన సొక్క టాయ నేఁడు మరఁ గేలె యికను

రేకు: 0340-6 రామక్రియ సంపుటం: 11-240

పల్లవి: ఏ మని యెంతునె వల పేరు లై పారఁగఁ జొచ్చె
కామించి కామించి లో లో కాయము మరచెనే

చ. 1: పానుపుమీఁదనే వుండి పని గద్దంటాఁ బిలిచి
మానిని విభునిఁ జూచి మనసు దనియదే
పూని పట్టి నవ్వుతాను బుజముపైఁ జేయి వేసి
నానీఁ జెమటనీట నామాఁట వినదే

చ. 2: ఆరగించి కూరలు చ వాయ నంటాఁ గళ్లు నేసి
చేరి పతి కం దిచ్చి సిగ్గు గొంతాఁ బడదే
పోరచిగా మాఁటలాడి పులకలఁ జిగిరించి
ఆరితేరీ జాము వోయ నంపు మన్నా సంపదే

చ. 3: అట్టె నవ్వులు నవ్వి ఆన లెల్లాఁ బెట్టి పెట్టి
పట్టి శ్రీవెంకటపతిఁ బై కొని తాఁ గూడెనే
నెట్టన నుద్దాలు మెట్టి నిలుచుండి తమకము
మెట్టుక నెరపీఁ గాని మీఁదు కిం దెరఁగదే

రేకు: 0341-1 నాగవరాళి సంపుటం: 11-241

పల్లవి: పొద్దు వోక నీవు నాతో బొంక వచ్చే వింతే కాక
గద్దించి నీ వెట్టుండినఁ గాదు గూడ దనేనా

చ. 1: న న్నొడఁ బరచకుర నమ్మికలు సేయకుర
నిన్నే మయిన నంటినా నీవు గొంకేవు
అన్నిట లోకమువారు ఆడుకొందు రింతే కాక
విన్న నీ సుద్దులు నేను వెల్లవిరి సేసేనా

చ. 2: యింత న న్నుబ్బించకుర యిచ్చకాలు సేయకుర
జంత నై ని న్నిఁక నే సాదించేనా
కాంతుఁడ నీ చుట్టాలు పక్కాలు నమ్మ రింతే కాక
మంతనాన నీపై నింద మరి వేసేనా

చ. 3: గడ్డము వట్టకురా కాఁగిట నించకురా
యెడ్డనై నీమాటకు నే నెదు రాడేనా
వెడ్డు వెట్టి యిట్ల శ్రీవెంకటేశ కూడితివి
దొడ్డదొర వైన నిన్ను దూరు కెక్కించేనా

రేకు: 0341-2 సామంతం సంపుటం: 11-242

పల్లవి: నావంటి సతులు తననగర నెందరు లేరే
భావమున తనుఁ దలచి బతికే నేనూ

చ. 1: తగుల వలచుటె కాని తప్పు సేయట లేదు
జిగి నేల పిలిచీనె చెప్పఁ గదరే
అగడు నేయఁగ మిమ్ము నంపెనా నేఁ డతఁడు
నగుఁబాటు గాక తనకు నాకుఁ బని యేమే

చ. 2: నవ్వు టొక్కటె కాని ననుపు దొంగిలితేను
రవ్వ నాకడకుఁ దా రా నేఁటికే
పువ్విళ్ల నిది వూరకుండ నే లనుచునా
అవ్విభుఁడు చలముకొనె నాఁడుగోల యేలే

చ. 3: యిచ్చ లాడుట గాని యెందు వోతి వన లేదు
పచ్చిగా నా చెరఁగు పట్ట నేలే
అచ్చలాన శ్రీవెంకటాదిపుఁడు నన్నుఁ గూడె
తచ్చన లింతే కాక తానే నేఁ గానా

రేకు: 0341-3 సాళంగనాట సంపుటం: 11-243

పల్లవి: చాలు నూరకుండవయ్య సడి కేల వచ్చీనో
నాలి నే మోనాన నుంటే నన్నుఁ దడవేవా

చ. 1: ఆడితి నే నొకమాఁట అందిరివలెనె నేను
యీడ నెగ్గెనఁ జేసుకో యిత వైనఁ జేసుకో
వీడె మియ్యే నే రాఁగా విందు వెట్టి పగ లాయ
వాడలో నాయింట నుంటే వాదు వెట్టుకొనేవా

చ. 2: మగిడి చూచితి నింతే మగఁడ మంటా నేను
నగినా నగుము కాదాన్నా నన్నుఁ గా దను
వగచితి నీకు నేను వడిఁ జల్ల వేఁ డాయ
మగవాఁడ నై పట్టితే మచ్చరించేవా

చ. 3: పాదము లొత్తితి నింతే బడలి వచ్చితి వంటా
సేదతో వెంగెము నీకు సేవగాఁ గైకొంటివో
ఆదరించి శ్రీవెంకటాధిప నన్నుఁ గూడితి
వేద దీర నే మొక్కితే వీడఁగ నాడేవా

రేకు: 0341-4 మధ్యమావతి సంపుటం: 11-244

పల్లవి: లేలే యిది యంత లేదు లేమలాల
కాలమందే మన మిది కన్నది గాదా

చ. 1: వల పింత గలవాడు వడి నే నలిగి రాఁగా
పిలిచి మాఁటాడ రాదా ప్రియుఁ డప్పుడే
తలఁచుక తలఁచుక తానేఁ డెవ్వరితోను
బెళకుప్రియాలు చెప్పి బేరి బోకొట్టీనే

చ. 2: తగ వెరిఁగినవాడు తారుకాణించఁగ నాతో
నగవు సేసుక నన్ను నమ్మించ రాదా
సగము సగము గొంకి సత్యము లెవ్వరితోడ
నిగిడించి మొక్కి యేరు నిద్దుర వుచ్చీనే

చ. 3: గక్కనఁ గూడెటివాఁడు కన్నీరు నించఁగాను
అక్కరతో నా వగ పారుచ రాదా
యెక్కు శ్రీవెంకటేశుఁ డిప్పుడుగా నన్నుఁ బొందె
మిక్కిలి చెరువునీళ్ల మేలు వడసీనే

రేకు: 0341-5 కేదారగౌళ సంపుటం: 11-245

పల్లవి: నీవే జాణ నందు వాపె నీకంటేఁ గడు జాణ
యేవిదాన నీపంతా లిఁక నీడఁ జెల్లవూ

చ. 1: కలికి పువ్వులచెండు కన్నులనె అద్దుకొంటా
వలపుతో వసివాడు వాడుకొంటాను
అలిగినదిఁ గాక అట్టె కూడినది గాక
మలయుచు చెలులతో మాఁటలాడీ నదివో

చ. 2: పదిమారులును నిమ్మపం డెగర వేసుకొంటా
చెదరినచింతతోఁ జింతించుకొంటా
యెదుట నున్నది గాక యెడసినదిఁ గాక
వొదిగి మలగుపై నొరగీ నదివో

చ. 3: మక్కువ యంతో వడికి మడిచినా కందుకొంటా
అక్కరతో వుస్సు రస్సు రనుకొంటాను
యిక్కు వంటినదిఁ గాక యియ్యకొన్నదిఁ గాక
గక్కన శ్రీవెంకటేశ కాఁగిలించె నదివో

రేకు: 0341-6 బౌళి సంపుటం: 11-246

పల్లవి: చూడవే యప్పటినేనే జూటరి నట
జాడలు తాఁ గట్టినపచ్చడమే యెరుఁగు

చ. 1: ముప్పిరిఁ దారా కుండఁగ ముసుఁగు వెట్టుక వుంటి
అప్పటినేనే కల్ల నటవే చూడు
నెప్పునఁ దమవొళ్లిది నేర మందురా యెవ్వరు
తప్పులు సేసిన వెల్లె దయ్య మెరుఁగుఁ గాక

చ. 2: యెయ్యెడకో తాఁ బోఁగా నిందుకు రమ్మంటి నింతే
గయ్యాళి నేనే యట కమ్మటిఁ జూడు
నెయ్యమునఁ దనతోడ నిజము నా దేడ కెక్కు
అయ్యో తనవొళ్లికడ మాతుమే యెరుఁగూ

చ. 3: చెంత దాఁ బిలచుదాఁక సిగ్గున నుండితి నింతే
పంతము నాదే యట బలువు చూడు
యింతిరో శ్రీవెంకటేశుఁ డిప్పు డిట్టె నన్నుఁ గూడె
పొంతల తనతగవు పొరు గెల్లా నెరుఁగూ

రేకు: 0342-1 శంకరాభరణం సంపుటం: 11-247

పల్లవి: ఊర కుండ నీరా మమ్ము నుడికించకా
గారవించే నీ నవ్వు గాలమునో నాకు

చ. 1: చిఱుతనవ్వు నవ్వఁగా చెక్కు నొక్కి యెత్తి నన్ను
కఱఁచేవు మరికొంత కారింపే కాదా
తఱి నీ మనసునను దలఁచిన ట్లుండు
గుఱిగా నదివో నాకు గుండెలోనీ అమ్ము

చ. 2: మంచముపై నుండఁగాను మచ్చిక నావొద్దఁ బండి
ముంచి చేయి వేసే వది మోపే కాదా
యెంచి నీకుఁ జూడ నది యిచ్చక మైనట్లుండు
తెంచరాని పొద్దు వొద్దు దిగులువో నాకు

చ. 3: భ్రమసి నేనుండఁగాను పట్టి నన్నుఁ గాఁగిలించి
తమకించే విది గొంత తగులే కాదా
అమర శ్రీవెంకటేశ ఆదరించి కూడితివి
చెమటలు నీకుఁ గాని సేసలువో నాకు

రేకు: 0342-2 హిజ్జిజ్జి సంపుటం: 11-248

పల్లవి: పాప మంటాఁ దనమీఁద బత్తి సేయఁ బోతేను
కొపగించుకొన వచ్చీ కొమ్మలాల చూడరే

చ. 1: అయ్యో యేమే తనకు నే నంటే నెంత సదరమే
కొయ్యగదే ముక్కుననే కోప మున్నది
చయ్యన నెవ్వతెతోనో జగడ మడిచి వచ్చీ
వొయ్యన నేనడిగితే నుడికిపడీని

చ. 2: చెల్ల బో నే నెంత దనచేతికల సత్తినే
పల్లదము దననోరఁ బై పై నున్నది
కెల్లు రేఁగి యాడనో తా గిజి గిజి య్యె వచ్చీ
కల్లగదె చూడఁ బోతే గదరుకొనీని

చ. 3: మేలు మేలె తన కెంత మిక్కిలి యనాదనే
కీలుకొని బొమ్మల జంకెన లున్నది
వే ళెరిఁగి శ్రీవెంకటవిభుఁడిట్టె నన్నుఁ గూడె
కేలు చాఁచి పెనఁగితే కేరుచు నవ్వీనే

రేకు: 0342-3 నాదరామక్రియ సంపుటం: 11-249

పల్లవి: మగవారి కేఁటి మేలు మరతురు వేగిరమే
బగివాయ కుండఁగానె పరా కె ట్టితివిరా

చ. 1: ఆకె విలిచీ నంటా నట్టె విచ్చేసేవు గాని
పైకొని మా యింటికి రాఁ బాపమా నీకు
యీకడ నేఁ జూడఁగానె యించుకంత దయ లేక
కైకొని తోసి విచ్చేయఁ గాళ్లెల్లాడెరా

చ. 2: అల్లది పచ్చీ నంటా అక్కడ చూచేవు గాని
వొల్లనె మామొగ మైతే వొచ్చమా నీకు
తొల్లిటిదాననె నీతొడమీఁదఁ బండుండఁగ
మల్లడి యంతదవ్వు నీ మన సెట్టు వారెరా

చ. 3: మంతన మది యాడఁగ మరిఁ జె వొగ్గేవు గాని
కొంత నామాట వింటే కొరతా నీవు
చెంతల శ్రీవేంకటేశ చెప్పఁగా నన్నుఁ గూడితి
వంతలోనె నీగుణము అ దెట్టు దిరిగెరా

రేకు: 0342-4 శంకరాభరణం సంపుటం: 11-250

పల్లవి: ఇంత నీవు మన్నించుట యిందుకా నన్ను
వింతవారిఁ బతి వెట్ట వేడుకా నీకు

చ. 1: ఆపె నన్ను నాడఁగా నే నాపెతో వా దడువఁగ
యేపున వినేవు నీకు యేమి గూడెరా
వోపి కల్ల గలవారి నొద్దంటే దోసమా
చేపట్టి నీ కేమి పగ సేసితిరా నేనూ

చ. 2: సవతి పగ చాటఁగ సారె నేఁ బగ చాటఁగా
భువిలోఁ జూచేది నీకుఁ బుణ్యమా నేఁడు
వివరించి మా మొర విచారించఁ దగదా
కవ కవ నవ్వి నవ్వి గండి గట్టుకొంటివా

చ. 3: చేతు లాపె చాఁచఁగాను చేరి నే నొట్టు వెట్టఁగ
యీాతల నడ్డము రావు యిదె తగునా
జాతిగ శ్రీవెంకటేశ చన విచ్చితివి నాకు
యేతుల నిన్నుఁ గూడితి యిక నేల మరఁగూ

రేకు: 0342-5 రామక్రియ సంపుటం: 11-251

పల్లవి: ఊరకున్నఁ బోనీవు వొక టొకటే రేఁచేవు
గోర గీరితే నే రౌ మాకూటమి కోపుదువా

చ. 1: చిగురుఁగెమ్మో సోఁకఁ జేరి నే మాడెటిమాఁట
వొగరు లై తోఁచు నందు కోపుదువా
పొగరుతమ్మికన్నుల పూఁచి నేఁజూచెటిచూపు
నిగుడునమ్ము లై తోఁచు నీ వోపుదువా

చ. 2: కొండలవంటి చన్నులు కోరి నిన్నుఁ దాఁకించితే
వుం డుండె కుమ్మెలు వోపు నోపుదువా
బండివంటి మాపిరుఁదు బడి నీకుఁ దగిలితే
అండ నీపైఁ బారుఁ జేసు నందు కోపుదువా

చ. 3: చల్లు మాపూరుపుగాలి సమరతివేళల
వుల్ల మెల్లఁ జిందు సేసు నోపుదువా
యెల్లగా శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
పెల్లు రేఁగి నేఁడు నాతోఁ బెనఁగ నోపుదువా

రేకు: 0342-6 గౌళ సంపుటం: 11-252

పల్లవి: ఆపెమీఁద మోహ మైతే నౌదువు గాక
మోపుగా నా మీఁద నెపములు వేయ వలెనా

చ. 1: నిన్ను నేమైన నంటినా నేనె తిట్టుకొంటిఁ గాక
కన్ను లెఱ్ఱఁ జేసి నీవె కాఁగి పడేవు
వన్నెల కెందో పొయ్యేవాఁడ వట్టె పోదు గాక
అన్నిటా నాతో నేఁడు అలిగి పోవలెనా

చ. 2: చేరి నిన్ను దొబ్బితి నా చే వట్టకు మంటిఁ గాక
పారి పారి రొమ్ము దట్టి పగ చాటేవు
ఆరీతిఁ బెండ్లాడేవాఁడ వట్టె పెండ్లాడుదు గాక
యీరీతి వాదు వెట్టుక యింత సేయ వలెనా

చ. 3: చెల్ల బో కైకో కుంటినా సిగ్గున నుంటిఁ కాక
వొల్లనె నన్నింత దూరి వోల వేసేవు
కొల్లగా శ్రీవెంకటేశ కూడితిని నన్ను నేఁడు
చిల్లర సతిని నాచేతి కియ్య వలెనా

రేకు: 0343-1 వరాళి సంపుటం: 11-253

పల్లవి: చెల్లఁబో నీ చెప్పినట్టు సేయ నైతినా వోరి
కల్లతో నిజ మోపదు కల దింతే కాక

చ. 1: కోపగించుకొన నేల కోరి వేఁడుకొన నేల
యేపున నిట్టె రెండూ యెడ్డతనమే
పై పై చేఁదు దిన నేల పంచదార నంజ నేల
పూపవయసులవారి పుణ్య మింతే కాక

చ. 2: అట్టె కల్ల లాడ నేల ఆనలు వెట్టుకో నేల
యెట్టివారి కైన యివి యెడ్డతనమే
మెట్టి చలిఁ బడ నేల మించి సీతు గాయ నేల
పట్టి వలచినవారి భాగ్య మింతే కాక

చ. 3: చలము సాధించ నేల సారెకు వగవ నేల
యెలమితో నివి రెండు యెడ్డతనమే
పిలిచ శ్రీవెంకటేశ పెనఁగి నన్నుఁ గూడితి
పలుకుఁబంతాన నీ నా బలు వింతే కాక

రేకు: 0343-2 ధన్నాశి సంపుటం: 11-254

పల్లవి: మోనాన నుందాన వేమే ముని వైతివా
మేనులు సోఁకిన మందెమేళ మైన లేదా

చ. 1: అలిగితే నే మాయ అట్టె వూరకుండ నేల
పలుకుల నైనఁ దూరఁ బాడి గాదా
మలయుచుఁ బోట్లాడే మాసటీలు సయితము
అలరి పగలు చాటే రది యైన లేదా

చ. 2: రా కుండితే నే మాయ రతి నాపై నెరపి
దాకొని చెప్పంప నైనఁ దగవు గాదా
కాకుగాఁ గొట్లాడేటి కడవారు సయితము
ఆకడఁ జేతులు చాఁతు రదియూ లేదా

చ. 3: పంత మైతే నే మాయ పైకొని నే వేఁడుకోగా
అంతట కోపము దీర నైనఁ జెల్లదా
వింతగా శ్రీవెంకటాద్రివిభుఁడ నింతే నేను
యింతలో నన్నుఁ గూడితి యెర వింత లేదా

రేకు: 0343-3 ఆహిరి సంపుటం: 11-255

పల్లవి: ఏమి చూచేవు నావంక యిం దేమైన తప్పు గద్దో
ప్రేమము నీ కొప్పంచితి బిగు వింక నేలా

చ. 1: నిక్కి నా విరహము నీకు మే లైతేఁ జాలు
ముక్క వోయి నా మోహములోన
వొక్కరి కైన సెలవు వున్నదిగా యీ బదుకు
చక్కని వో రమణుఁడ చాలదా యీజన్మము

చ. 2: చింతతోడ నే నుండేది సెలవు నీ కైతేఁ జాలు
పంతము దప్పెనా నాబలువుకును
వంతు వాసి కెక్కఁగా నావగ పోకచోట నైన
సంత మైన నాయకుఁడ చాలదా నాజన్మము

చ. 3: ఆసలచే వేఁగేది నీ కంత వేడు కైతేఁ జాలు
దోసమా నా సైరణకు దొండి వోయీనా
యీసు లేక శ్రీవెంకటేశుఁడ నన్నుఁ గూడితి
శాసించ నేఁటికి నిన్నుఁ జాలదా నా జన్మము

రేకు: 0343-4 వరాళి సంపుటం: 11-256

పల్లవి: ఎప్పుడును వారు వారు నేకము గాక మానరు
యిప్పటికిఁ దగినట్టు యిచ్చకమె ఆడరే

చ. 1: కొసరి విభునిఁ దిట్టి కోపగించి మాఁట లాడి
అసురుసు రై యలసి అట్టె పవ్వళించెను
పసగా నారగించదు పగలును యిప్పు డైన
అసము దించఁగ లేపి ఆరగించఁ బెట్టరే

చ. 2: తానె వొట్టు వెట్టుకొని తరుణి యాతఁ డిచ్చిన
కానుకకప్పుర మెల్ల కడఁ బారఁ జల్లెను
మోనమున దప్పి గొనె ముంచి మీ రైన విడెము
ఆనవెట్టి యిచ్చి యిట్టె ఆకుమడి చియ్యరే

చ. 3: వోపలనె వేగిరించి వూరకె నిందలు గట్టి
శ్రీవెంకటేశ్వరుఁ జూచి శిగ్గువడి వున్నది
కైవసమై అతఁడె గారవించి చెలిఁ గూడె
యీవల నూడిగములు యేమరక సేయరే

రేకు: 0343-5 నాగవరాళి సంపుటం: 11-257

పల్లవి: ఎంత చెల్లుబడి నీకు యెవ్వ రిచ్చి రోరి నీకు
చెంత దొరతనము చెప్పి చూపేవా

చ. 1: మౌనముతో నుండఁగాను మాఁట లాడించ వచ్చేవు
నేనాఁటదాన నైతే నేమము లేదా
పూని జలక మాడఁగ బొంచి యాడకు వచ్చేవు
మేనబావ వైనంతనే మేర మీరేవా

చ. 2: మోము వంచుకుండఁగానెమొక్కులు మొక్క వచ్చేవు
బాముతో జవ్వను లైతే బలవు లేదా
నోము నోమఁగానె చెక్కు నొక్కి రతికిఁ దీసేవు
యేమిరా నీపొరు గైతే నింత సేసేవా

చ. 3: మంచముపై నుండఁగానె మరి కాఁగిలించేవు
అంచె నీవొద్దనుంటే అడ్డము లేదా
యెంచఁగానె శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
కంచము పొత్తున నుంటే కాఁక రేఁచేవా

రేకు: 0343-6 సామంతం సంపుటం: 11-258

పల్లవి: తుదను దాఁచఁగ రాదు తోడ దిష్ట మై వుండఁగ
మది మది యి ట్లెతి మగఁ డూర లేఁడూ

చ. 1: యిందరితో నీ మాఁట యే మని చెప్పుదు నమ్మ
చెంది యీక్రిష్ణుఁడు చీర చిక్కించెను
అందము సేసుక నేను అణఁచుక వుండే నంటే
మంద నున్నాఁ డిదె నామగఁ డూర లేఁడూ

చ. 2: మంచిన మాయింటివారి మొగ మెట్టు చూతు నమ్మ
పెంచిన క్రిష్ణునికిఁ గా బిడ్డఁ గంటివి
పొంచి లోనఁ బెట్టుకొంటే పొరుగిరుగుల నింద
మంచి దాయ బొంకే నంటే మగఁ డూర లేఁడూ

చ. 3: వెనక చుట్టాలతోడ వియ్య మెట్టందుదు నమ్మ
యెనసి శ్రీవెంకటేశుఁడింట నున్నాఁడు
పనివడి నేఁడు వచ్చి భ్రమసి చూచీ నదె
మనికై యీన్నాళ్లదాఁక మగఁ డూర లేఁడూ

రేకు: 0344-1 లలిత సంపుటం: 11-259

పల్లవి: కపటము మాన వైతి కలకాలము
ఉపమ లింతేసి యాపె కున్నవా మొదలను

చ. 1: యే మని చెప్పెంపితివో యింతితో యేకతమున
ఆమాఁట వింటానె ఆకె వచ్చెను
నీమతకమె కాఁబోలు నేఁడు నాతో జగడించీ
యీ మగుమాకు నిన్నాళ్లు యింత బలు వున్నదా

చ. 2: సన్న యేమి సేసితివో సరి నాపెమోము చూచి
పన్ని నీ సంగడి వచ్చి పవ్వళించెను
కన్నెకు నీ యప్పణి కాఁబోలు నన్ను గద్దించీ
యెన్నఁడైనా యీపె నాతో యీసడించ వచ్చునా

చ. 3: యెప్పుడు నేరిపితివో యీపెకు నీగుణములు
వొప్పుగ నా కిటు మొక్కి వొక్క టాయను
తప్పు దీరఁ గూడితివి దగ్గరి శ్రీవెంకటేశ
మెప్పించితి నీవు నన్ను మే లిం తెరుఁగునా

రేకు: 0344-2 దేశాక్షి సంపుటం: 11-260

పల్లవి: పని గలప్పుడు వచ్చి పలికేఁ గాని
వొరి నీ యింటిలోనె వుండేరా నేను

చ. 1: చిత్తము వచ్చినవేళ చేర వచ్చేఁ గాని నేను
అత్తి యందాఁక లోని కంపరా నన్ను
కత్తిఁ గోసిన ట్టయీఁ గడు నీమాఁటలు వింటే
వొత్తిలి దవ్వుల నైన వుండేరా నేను

చ. 2: నిక్కేము నే నాల నై నీతో నవ్వేఁ గాని
యిక్కువఁ దలవంచుకో నియ్యరా నన్ను
ముక్కు వట్టినట్లయినా మోహము నీవు చల్లితే
వొక్క నీసేవ సేసుక వుండేరా నేను

చ. 3: వలసినప్పుడె నీవద్ద గూచుండేఁ గాని
యిల నందాఁక నలుగు నియ్యరా నన్ను
బలిమి శ్రీవెంకటేశ పట్టి నన్నుఁ గూడితివి
వొలిసే నీతలఁపులోన వుండేరా నేను

రేకు: 0344-3 మలహరి సంపుటం: 11-261

పల్లవి: నీవే యెరుఁగుదు వింతే నీచిత్తము
యీవేళ నే నోరిచితి యింకా నీచిత్తము

చ. 1: చెంతల నవ్వ వచ్చేవు చెయి వట్టి పెనఁగేవు
అంతటి కోపితేఁ జాలు నైతే నీచిత్తము
యింతటిదొర వంటాను యేమి ననఁ జాలు నింతె
యెంత కెంత వెరచెనా యింకా నీ చిత్తము

చ. 2: కప్పురము చల్లేవు కాలు మీఁద వేసేవు
అప్పటి పంతా లాడే వైతే నీచిత్తము
యిప్పుడే నీకు మొక్కితి నిందరును జూడగాను
యెప్పుడు నన్నెరఁగవా యింకా నీచిత్తము

చ. 3: బెట్టి కాఁగిలించేవు పిప్పి సేసేవు నామోవి
అట్టె కానీ లేర అయితే నీ చిత్తము
నెట్టన శ్రీవెంకటేశ నేఁడె నన్నుఁ గూడితివి
యిట్టైతేనేఁ గా దనేనా యింకా నీ చిత్తము

రేకు: 0344-4 ముఖారి సంపుటం: 11-262

పల్లవి: ఇన్నిటా దొరవు నీవు యింత సేతురా
చన్ను లంటే విదె నీకు చల మాయఁగా

చ. 1: చెఱఁగు మాసినవేళ చేరి ముట్ట వచ్చేవు
కొఱ తంటా వద్దంటేఁ గోపగించేవు
మెఱసీ తొల్లిటి దోసమె నేఁ గురియఁగాను
నెఱి నిది యిప్పుడె నీకు బాఁ తాయఁగా

చ. 2: యింట నే భోఁసేనేవేళ యెంగిలి ముట్ట వచ్చేవు
అంటకు మన్నంతలోనె అలిగేవు
వెంటనె నా నోటనుండి వేమారు జిందఁగాను
జంటల నీ కదియున సర కాయఁగా

చ. 3: జలక మాడెటివేళ సంగడికి వచ్చేవు
తొల మంటే కాఁగిలించి దొమ్మి సేసేవు
మలసి శ్రీవెంకటేశ మలినముఁ బాయఁగాను
తిలకించే వది నీకు దిష్ట మాయఁగా

రేకు: 0344-5 లలిత సంపుటం: 11-263

పల్లవి: నీవేడ నే నేడ నేఁడు సిగ్గు వడఁ గాక
భావించి నీకొంగు వట్టెబలువు నా కున్నదా

చ. 1: నిగిడి పదారువేలు నెలఁతలు గల నీకు
జగతి నింకా సతులు సర కయ్యేరా
వగలతో నెరఁగక వలచినదాన నై
జిగి నా మగండ వంటాఁ జెప్పకోనేఁగాక

చ. 2: తొరలి సీత నడవిఁ దోసి రప్పించిననీకు
తరుణులమీఁదఁ గొంత దయ వున్నదా
గరిమి నీ భ్రమఁ బడి గతి లేనిదాన నై
పరులు చూడఁగ నీ పాద మొత్తేఁ గాక

చ. 3: తొడపై శ్రీసతిఁ బెట్టి దొడ్డకొలు వున్ననీకు
తడవి నాపొందు లింకాఁ దల పయ్యీనా
యెడయక శ్రీవెంకటేశ కూడినదాననై
బడి వాయక నీవొద్ద బతికితిఁ గాక

రేకు: 0344-6 రామక్రియ సంపుటం: 11-264

పల్లవి: చెప్పకునే నాతోడ చేరి నీసుద్దులు నేఁడు
కప్పిన నీ నేరు పెల్లాఁ గలది నాతోనా

చ. 1: కానీ లేవె నే నతనిఁ గరఁగించ లే కుండితే
నానఁ బెట్టి కొంత నీవు నవ్వుదు గాని
పోనీ వూరకుండే యేపొద్దుదాఁకఁ గెలసేవు
దాని కేమి నీ యాఁటదానితన మిందుకా

చ. 2: కొంత సయించవె పతి కొరత దీరుచ కుండితే
చెంతల నప్పుడె సంతంసింతువు గాని
పంతము లిప్పు డేఁటికె పని గలప్పుడే కాక
యింత నంతటఁ బడెనా యిల జాణతనము

చ. 3: యిట్టె వోరుచు కుండవె యీతని రతిఁ జిక్కితే
వట్టి సట నీవు దోడై వత్తువు గాని
గట్టిగ శ్రీవెంకటాద్రి ఘనుఁ డిట్టె నన్ను గూడె
పట్టినచలము నీకు బందె దెచ్చినా

రేకు: 0345-1 ముఖారి సంపుటం: 11-265

పల్లవి: ఊరకున్న నన్ను నేల వుడికించ వచ్చేవు
చేరి నీకు యెంత పగ సేసితినో కాని

చ. 1: కొంగు వట్టి తియ్యకుర కూచున్న దాని నన్ను
వుంగిటే నే రా నోప నొళ్లు నొచ్చీని
యింగితాన నన్నుఁ జూచి యించుకంత దయ లేవు
సంగడి నే నెంత పాపజాతినో కాని

చ. 2: బలిమి శాయకురా పలుకఁగ నోప నీతో
లలి నామనసు వొకలా గయ్యీని
తలఁపు నీ వెరిఁగియు తతిగొని పోరేవు
యెలమి నే నేఁటిజన్న మెత్తితినో కాని

చ. 3: కాఁగిలించి పట్టకురా కమ్మటి యిట్టె పొంది
వీగి నిన్నుఁ బాయ నోప వేస టయ్యీని
దాఁగక శ్రీవెంకటేశ తగ నన్నుఁ గూడితిని
రాఁగి యెంత భాగ్యవంతురాలనో కాని

రేకు: 0345-2 మంగళకౌశిక సంపుటం: 11-266

పల్లవి: చెలులాల మీరె యింత సేసితె రిద్దరి నేఁడు
కలయనిమాసటీలఁ గదియింతురా

చ. 1: తక్కరీఁ డంటిఁ గదవే దంట వీఁ డంటిఁ గదవే
అక్కడికతలే చెప్పీ నంటిఁ గదవే
యెక్కువ నాతో నాడేదె మాఁటకె మాఁట
యిక్కడికి వచ్చు టెల్ల యిందుకొరకా

చ. 2: చలమరి యంటిఁ గదే చల్లజం పంటిఁ గదవే
అలపు సొలపె ఘన మంటిఁ గదవే
తలవాకిటనె వుండి తనకు నా కేఁటి పొందే
వలపు నామీఁదఁ జల్లేవరుసా యిది

చ. 3: వేసదారి యంటిఁ గదే వేగిరకాఁ డంటిఁ గదే
ఆసలు చూపిన లో నౌ నంటిఁ గదవే
బాసతో శ్రీవెంకటాదిపతి నిన్ను నిటు గూడె
మోస మెల్లఁ దీరె నింక మొక్కెంచేరా

రేకు: 0345-3 మాళవికసంపుటం: 11-267

పల్లవి: ఎంత్తైన నీగుణము యేల మానును
చింతతో నీకుఁ బ్రియము చెప్పదుము గాక

చ. 1: కడు నెరదు చూచి మాకన్నులె ఘనము గాక
వడి మాయింటికి నేఁడు వచ్చేవా నీవు
వుడివోనితమకాన వుండజాల కొకమాఁట
అడియాసలనె నిన్ను నాడుదుము గాక

చ. 2: నవ్వి నవ్వి యిదె మానడుమె సన్నము గాక
అవ్వలఁ గొంత్తైన లోనయ్యేవా నీవు
జవ్వనభారముచేత జడిసి నీభ్రమఁ బడి
పువ్వుల పానుపుమీఁద బొరలదుఁ గాక

చ. 3: సారె నిన్నుఁ గాఁగిలించి చన్నులె గట్టాయఁ గాక
చేరువ నామేలు దలఁచేవా నీవు
కూరిమి శ్రీవెంకటేశ కూడి నేను తమకించి
యీరీతిని నీ వురమె యెక్కు కొంటిఁ గాక

రేకు: 0345-4 సామంతం సంపుటం: 11-268

పల్లవి: నిక్కి నిక్కి చూచేవు నీ కేల నీకు
దక్కితిమి తొల్లె మాపైఁ దల వేలా

చ. 1: కల్లరి వై నీవు రోలఁ గట్టువడుదువు గాక
గొల్లదాన నాతోడి గొడ వేలా
వుల్లసాన నీవు పాలవుట్లెక్కుదువు గాక
పిల్లఁ గోవిరాగాలఁ బిలువ నేలా

చ. 2: పిన్నవాఁడ వైననీవు పేయలఁ గాతవు గాక
కన్ను లారిచెటిమాతోఁ గాఁక లేలా
అన్నిటా నిందరిచేతి ఆడికఁ బడుదు కాక
సన్నలఁ జాయల మాతో చల మేలా

చ. 3: పుక్కిన లోకాలు చూసి బూమెలు సేతువు గాక
కక్కసించి మాతోడి కాపిరే లేలా
యెక్కువ శ్రీవెంటటేశ యిర వై కూడితి నన్ను
మిక్కిలి కృష్ణుఁడ నాతో మేకు లేలా

రేకు: 0345-5 సాళంగం సంపుటం: 11-269

పల్లవి: మేలు మేలు యిందుకె నే మెచ్చితె వీని
కే లెత్తెనె మొక్కితేను కినిసీనె తాను

చ. 1: చిన్నఁబోయి వుండఁగాను సెలవి నే నవ్వితేను
మిన్నక నన్నుఁ గోపించీ మేలే వీఁడు
యెన్నిక నెవ్వతెచేత నేమి మాఁట బఁడి వచ్చో
కన్న వారిమీఁద నెల్ల కసరీనె తాను

చ. 2: తలవంచు కుండఁగాను దగ్గరి మాఁటాడించితే
మెలుపునఁ దిట్ట వచ్చీ మేలే వీఁడు
వలచి తా న్కెడనో వాదు వెట్టుకొని వచ్చి
పొలసి వొద్దివారితోఁ బోరీనె తాను

చ. 3: గక్కన నొంటి నుండఁగఁ గాఁగిలించుకొంటేను
మిక్కిలి తాఁ బెనఁగీని మేలే వీఁడు
యెక్కడనో శ్రీవకెంటేశుఁ డలిగి వచ్చి
దక్కిన రతులకె తమకించీఁ దాను

రేకు: 0345-6 నాదరామక్రియ సంపుటం: 11-270

పల్లవి: చిమ్ముచుఁ దియ్యనినోరఁ జేఁ దేల
నెమ్మది నాకె వుండఁగ నే మేలా

చ. 1: మన సిచ్చి నీతోడ మాఁట లాడేవారితోనె
అనవయ్య పోయి నీ వామాఁట
వెనకటిమాఁటలకె వేదనఁ బొరలేమమ్మ
చెనకి మరిఁ గొంత చింత రేఁచ వలెనా

చ. 2: మొగము చూచి నీకు మొక్కేటివారితోనె
నగవయ్య పోయి నీవు నయమునా
జగడించి పైఁ జేయి చాఁచి మూల నున్ననన్ను
తగిలి తగిలి యింకఁ దతి గొన వలెనా

చ. 3: పలుమారు సిగ్గుదేరి పారితెంచేవారినె
పిలవవయ్య పోయి ప్రియమునా
అలిగిననన్ను నిట్టె ఆదరించి కూడితివి
యెలమి శ్రీవెంకటేశ యిఁకఁ గొంత వలెనా

రేకు: 0346-1 శుద్ధవసంతం సంపుటం: 11-271

పల్లవి: నే నెంత నీ వెంత నిక్కేమా యిది
కానీ లేరా యిది యొక్కకాకు సేసేజాడలా

చ. 1: కోరి వేఁడి తగిలినగోపసతు లుండఁగాను
ఆరయ నా కొంగు వట్టె వల సతినా
మేరతోఁ బెండ్లాడినరుక్మిణిదేవి వుండఁగాను
యేరా నాతో నవ్వేవు యెగక్కేమా

చ. 2: చన విచ్చి మన్నించిన సత్యభామ వుండఁగాను
చెనకేవు నే నీకుఁ జిక్కితినా
పనివడి తెచ్చుకొన్నపదారువే లుండఁగాను
ననుఁ జెక్కు నొక్కేవు నాఁటకములా

చ. 3: గంద మిచ్చి మెప్పించినకలికి యొకతె యుండ
అంది నన్నుఁ గాఁగిలించే వాగడములా
కందువ శ్రీవెంకటేశ కలసితి విటు నన్ను
చిందేవు మోహము నాపై చిత్త వింత వచ్చెనా

రేకు: 0346-2 శంకరాభరణం సంపుటం: 11-272

పల్లవి: ఏల చెనకేవు నన్ను నిప్పుడె నీవు
తాలిమితోఁ బదరేటిదానఁ గాను నేనూ

చ. 1: వూర కిట్టె నా మీఁద నొళ్లు వేసితివి నేఁడు
కారణ మేఁటిదో కాని కంద మిఁకను
సారెఁ జట్టి పట్టితివి జారనపయ్యదకొంగు
తేరకొన నిది యేమో తెలిసేరా నేను

చ. 2: మన సిచ్చి నాతోడ మాఁటలాడే విదె నేఁడు
కొన మొద లేదో చూచుకొంద మిఁకను
చన విచ్చి మంచముపై సంగడిఁ గూచుంటి విదె
పని నిన్ను నడిగేరా పలుమారు నేను

చ. 3: గక్కనఁ గాఁగిలిచుక కందువ లంటేవు నేఁడు
యెక్కువగా నవ్వేరా యిందుకే నేను
నిక్కము శ్రీవెంకటేశ నీవు నన్నుఁ గూడితివి
మిక్కిలి నీజాడలకు మెచ్చేరా నేను

రేకు: 0346-3 శంకరాభరణం సంపుటం: 11-273

పల్లవి: ఏల వేగిరించేవు యింట్టిపని గద్దు నాకు
గోల వై వెలుపుల అరఁగుపై నుండవయ్యా

చ. 1: మందలోన నున్ననేము మాపటంతఁ గాని రాము
దిందుపడఁ గొంగువట్టి తియ్యకువయ్యా
పొంది ఆవులు దూడలు బొలానఁ గలసుఁ జేసు
అందాఁకా నీవు మాయింటియాడ నుండవయ్యా

చ. 2: చల్ల దచ్చి తచ్చి నేఁడు సందు లెల్ల నాకు నొచ్చు
వొల్లనె విడె మిమ్మనే వోపనయ్య
గొల్లఁడు దెచ్చినపాలకుండ లందుకొనవలె
యిల్లు చొచ్చి అట్టుగపై నెక్కు కుండవయ్య

చ. 3: వెన్న గాఁచేవేళను విను మనఁ జాలను
చన్ను లేల పిసికేవు సారెకు నయ్య
యెన్నికతో శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
పన్నిన మామంచముపై బవ్వళించవయ్యా

రేకు: 0346-4 శంకరాభరణం సంపుటం: 11-274

పల్లవి: లెస్స బుద్ధి చెప్పరే లేమ లిందరుఁ గూడి
వుస్సు రస్సు రనఁగానె వొద్దికి నేఁ బోదునా

చ. 1: పై పై నవ్వేవారితోడ పలుకఁగ వచ్చుఁగాక
కోపగించఁగా కూరిమి గొసరఁగ వచ్చునా
యేపున రమణుఁ డయితే యెదురు రా నైతి నంటా
ఆఁప లేక తిట్టఁగాను అండకుఁ బిలుతునా

చ. 2: వలచినవారితోడ వా దైన నమరుఁ గాక
యిలఁ బగవారితోడ యిచ్చకము చెల్లునా
కులికి యప్పుడు నేను గోరు దాఁకించితి నంటా
అలిగేటివానికే ఆకుమడి చిత్తునా

చ. 3: ఆదరించేవారితోడ నంటి పొందవలెఁ గాక
గోదిలేటి మగవాని కొంగు వట్ట వచ్చునా
యీదెస శ్రీవెంకటేశుఁ డింత నేసి నన్నుఁ గూడె
పొదుకొని వుండఁగాను పంత మిచ్చే నందునా

రేకు: 0346-5 రామక్రియ సంపుటం: 11-275

పల్లవి: నే నున్న దెస యెంత నేఁడు దనవేడు కెంత
పానిపట్టి యితంలో నే బాఁ తైతినా

చ. 1: అలిగి నే నవ్వలి మోమై వూరకుండేదాని
నలరి పాదము లొత్తు మనీనె తాను
తలఁకి సిగ్గు వడఁడు తనకు నా కంత పొందా
మలసి తనచేఁతలు మరచెనా తాను

చ. 2: చింతతోడ చెక్కు చేత సిగ్గువడి వున్నదాని
యింతలో నాకు మడిచి యిమ్మనీఁ దాను
మంతనా లాడఁగ వచ్చీ మంచి చుట్టమె నాకు
వింత దన కానోటనె వెళ్లెనా ప్రియము

చ. 3: పట్టెమంచముపై నొంటిఁ బవ్వళించి వున్నదాని
అట్టె తా వచ్చితిని లెమ్మనీనె తాను
దిట్టయై శ్రీవెంకటాద్రిదేవుఁడు నన్నిటు గూడె
గుట్టునను గతి గూడుకొనెఁ గదె యిపుడు

రేకు: 0346-6 ముఖారి సంపుటం: 11-276

పల్లవి: ఇంకాఁ బెనఁగ నేల యింత చాలదా
వుంకువగా నింతపని కోరిచినదాననా

చ. 1: వొద్దికి నే రాఁగానె వొక్కరితో మాఁటలాడే
వద్దో నాకు సిగ్గియ్యీ సంపరా నన్ను
పెద్దరికేలకె నేఁ బెనఁగెటిదాన నింతే
సుద్దు లెల్లాఁ గంటి నంత చులుకనిదాననా

చ. 2: దగ్గరి నే నుండఁగానె తలపంచు కుండితివి
అగ్గల మయ్యీఁ గోప మంపరా నన్ను
సిగ్గుతోడి బతు కొక్క చీమం తయినఁ జాలు
యెగ్గు లెంచ మీద టెత్తు యెరఁగనిదాననా

చ. 3: కాఁగిలించుకుండఁగానె కన్నులు మూసేవు నీవు
ఆఁగితిఁగా నిన్నిందాఁకా నంపరా నన్ను
చేఁగ దేఁర గూడితివి శ్రీవెంకటేశ నన్ను
రాఁగిన నీపొందు లెల్ల రచ్చ వేసేదానానా

రేకు: 0347-1 సాళంగం సంపుటం: 11-277

పల్లవి: సమతారుకాణ లైతె చల మెంత యెక్కునో
అమర దింతక తొల్లె యలిగి యెరగును

చ. 1: కోపగించే మాఁటలకు గురి గాఁగ బని లెదు
రాపుగా నావద్ది కింక రాకు మనరే
యేపునఁ జెలులు చెప్పేయెడమాఁటలే చాలు
తీపుల నెన్నఁడుఁ దన్నుఁ దెగనా డెరఁగను

చ. 2: దారి తప్పి నందుమీఁద దగ్గరి రాఁ బని లేదు
సారెకు నన్నుఁ బిలిపించకు మనరే
యీరస మణఁగుఁదాక యేకతములే మేలు
బీరమునఁ దనతో నేఁ బెనఁగి యెరఁగను

చ. 3: బిలిమి లో నైన మీఁద బంత మాడఁ బని లేదు
వొలిసి కాఁగిట నిట్టె వుండు మనరే
యెలమి శ్రీవెంకటేశుఁ డింత సేసి నన్నుఁ గూడె
మలసి తన కెదురు మాఁటా డెరఁగను

రేకు: 0347-2 సౌరాష్ట్రం సంపుటం: 11-278

పల్లవి: నిజ మాడితేఁ గనక నీవే నాదేవరవు
గజరు నీచేఁతలకుఁ గలఁగీ నాచిత్తము

చ. 1: యిందరు వినఁగ నిన్ను యెందు వోతి వంటిఁ గాక
నింద లే మైన నీకు నేఁ గట్టితినా
కందువ యింత గలితే గడించుకొదువు నీవు
అందుకె పో నిన్నుఁ గంటే నదరీ నామేను

చ. 2: యింతు ల్లెల్లఁ జూడగాను యిట్టట్టు రమ్మంటి గాక
వింతగురుతులు నీమై వెదకితినా
కాంతలఁ గంటేఁ జాలు కాకు సేయ నేరుతువు
యెంతైన నిందుకె మాఁట యియ్యకొనఁ జాలను

చ. 3: నీ సతుల ముందరనె నే నిటు నవ్వితిఁ గాక
సేస వెట్టి నిన్నుర గేలి సేసితినా
ఆల శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
వేసరక యిందుకె పో వేఁడుకొందు నిన్నును

రేకు: 0347-3 దేశి సంపుటం: 11-279

పల్లవి: ఇటమీఁది పనులకు యిట్టె వేగిరింతునా
కటకటా నే నంత కక్కూరితి సేతునా

చ. 1: యెగ్గు లెంచేదానవా యే మేమి నీవు సేసినా
వొగ్గి నీకు నావయసు వొప్పింతుఁ గాక
దగ్గరి నీ కెవ్వతో తప్పఁ జెప్పె నింతే కాక
వెగ్గళపు టలుకకు వేళ మీఁద లేదా

చ. 2: వెంగె మాడేదానవా వే రొకతెతో నవ్వితే
అంగము నీ కెక్కెనది యందుఁ గాక
మంగిట నీ కెవ్వతో ముడివెట్టె నింతే కాక
కంగి నిన్నుఁ దిట్టే నంటె కా దనేరా వొరులు

చ. 3: చలపట్టేదానవా సారె నీవు వేఁడుకొంటే
తెలిసి నీతోఁ దెప్పలఁ దేలుదుఁ గాక
బలిమి శ్రీవెంకటేశ పట్టి నన్నుఁ గూడితివి
చెలులు నాతోడివారా చేతి కిచ్చే వాపెను

రేకు: 0347-4 మాళవి శ్రీ సంపుటం: 11-280

పల్లవి: కానీ కానీ మీఁదటెత్తు కంటిమి లేరా
యినెపమె నేనుఁ జేసే నెందు వొయ్యే వీఁకను

చ. 1: సతి నిన్నుఁ గొంగు వట్టె సబలోన నండగాను
రతికిఁ దీసుక పోయ రా ననఁగానె
యితరకాంతల కెల్ల నిదె చా లాయ నీఁక
యితవై నీగుట్టు గంటి మెందు వొయ్యేవీఁకను

చ. 2: మానివి నీ నోరిలోన ముక్కవఁ దమ్ముల మిడె
పానుపుపైఁ బడఁ దోసి పట్టుకోఁగానె
ఆనుక కడమవారి కప్పు ణిచ్చిన ట్లాయ
యీానటన మాకుఁ జిక్కె నెందు వొయ్యే మీఁకమ

చ. 3: కలికి బూతులఁ దిట్టి కాఁగిలించి యంటఁ బట్టి
తలుపు మూసుక వుండెఁ దడవుగాను
లలి శ్రీవెంకటేశుఁడ లంచ మిచ్చి నన్నుఁ గూడే
విల నా కలవాటాయ నెందు వోయ్యే వీఁకను

రేకు: 0347-5 నాదరామక్రియ సంపుటం: 11-281

పల్లవి: ఏమి సేసినాఁ జెల్లురా యీవేళ నీకు
కామించి నీకుఁగా నేను కడు వలచితిరా

చ. 1: వొల్లనివాఁడ వై వుండీ వొక్కొక్క నెపము వేసి
కల్లయలుకలు గాఁ గాటారించేవు
చెల్లు లేరా నీకు నిది సేన సతులు గలరు
వెల్లవిరి నొక్కతెనె వెఱ్ఱి నైతి నేనరా

చ. 2: యెందు వోఁ దలఁచితివో యెదో పని గడించుక
విందువలెఁ బోయే నంటా వేగిరించేవు
నింద లేదురా నీకును నీ విట్టె మగవాఁడవు
అంది పొంది నేనె నీకు ఆల నైతిఁ గదారా

చ. 3: చేరి నన్ను భ్రమించి నాచిత్తము చూడ వలసి
వారి వీరిఁ జూపి నాకు వాసి రేఁచేవు
యేర శ్రీవెంకటేశుఁడ యిట్టె నన్నుఁ గూడితివి
ధారుణి నీ రప మాయ తగు లైతిఁ గదరా

రేకు: 0347-6 పాడి సంపుటం: 11-282

పల్లవి: ఏఁట తలఁ పేఁటి పొందు యీస్సీ రోఁతరా
ఆఁటదాని బతు కెల్ల ఆగడమె ఆయఁగా

చ. 1: చిత్తము రావలె నంటాఁ జెప్పిన ట్టెల్లఁ జేసితి
హత్తి యేమిటాఁ గరఁగ వయ్యో యేలరా
పొత్తుకు రానైతి నంటా పూఁచి కోపించుకొంటివి
యిత్తల నీ నా పొందులు యింతలోని వాయఁగా

చ. 2: చనవరి నయ్యే నంటా సర వెల్ల నడపితి
మనసులో తమకాలు మాన వేలరా
మునుపె నే నవ్వ నంటా మోము ముడుచుకొంటివి
వెనకటి నామే లెల్ల వేరే వేరే ఆయరా

చ. 3: కందువ నెరవు లేక కాఁపుర మెల్ల జేసితి
యిందులోన మెచ్చఁ జాల వింకా నేలరా
విందువలె నేఁటిదో శ్రీవెంకటేశ కూడితివి
చెందిన నా ఆయము నీ చేతికి లో నాయఁగా

రేకు: 0348-1 దేసాళం సంపుటం: 11-283

పల్లవి: అయ్యో ఆఁడుఁదనము అంగడి వేయఁ దగున
యియ్యెడ నేఁ బ్రియమైతే యింత పచ్చి గలదా

చ. 1: సిగ్గువడి నే నుండఁగఁ జేపట్టి తీసీఁ బై పై
యెగ్గెరఁగఁ డించుకంత యేమి సేతునే
దగ్గరనె వున్నవారు తరుణు లందరు నదే
బగ్గనఁ దాఁబైకొంటే పకపక నగరా

చ. 2: యిదివో వంచనతోడ యేమీ ననకుండఁగాను
యెదురు మాఁటాడు మనీ నేమి సేతునే
అదన నెదుటనె అత్తమామ లున్నవారు
వదరు లిం తే లంటా వారైనఁ దిట్టరా

చ. 3: ముప్పరి మంచముమీఁద మొగి నేఁ డుండఁ గాను
యిప్పుడె తా నిలుచున్నాఁ డేమి సేతునే
అప్పఁ డిదె శ్రీవెంటాద్రిపతి నన్నుఁ గూడె
దప్పి వోఁ బొరుగువారు తన్ననే పొగడరా

రేకు: 0348-2 రామక్రియ సంపుటం: 11-284

పల్లవి: ఏ మంచిదాన నై నీయెదుట నుండే నేను
వేమారు నూదితేఁ జల్ల వేఁడియై తోఁచురా

చ. 1: నేనే మనిన నీకు నెరుసు లై తోఁచీని
మౌనాన నుండేఁ గాని మాఁట లాడించకురా
వూని నే దొలుతె నాకు వొల్లనివాన నింతే
తేనెలు వోయఁ బోయినా తెగి చేఁదే తోచురా

చ. 2: కడునే దగ్గరి యుంటె కావ లై తోఁచీని
యెడసి వుండేఁ గాని యిట్టె పిలువకురా
గొడవ వెట్టుక నేను గుండెబెద రైనదాన
నడుమను గోర గీరినా నే రై పారురా

చ. 3: పైకొని కాఁగిలించి బలుము లై తోఁచీని
యేకతాన నుండేఁ గాని యిక్కువ రేఁచకురా
యీకడ శ్రీవెంకటేశ యెనసితిఁ గాని నిన్నె
నీకు నే నిజ మాడితె నిష్ఠూరమై తోఁచురా

రేకు: 0348-3 బౌళి సంపుటం: 11-285

పల్లవి: ఎప్పటి కప్పుడె కాక యింత గలదా
వుప్పొలికి యినుము డౌ నొక్కరీతి వచ్చునా

చ. 1: అద్దో రమ్మనుచు నీవానలు వెట్టకువే
చద్దివల పేడ నైన సంగర మౌనో
తిద్దుబడి నీ కిచ్చినదె మాఁటపట్టు దొల్లి
వుద్దండాన తప్పుఁదారు వూహించిన ట్టుండునా

చ. 2: అండ నుండు మని నన్ను నంత వాలాయించకువే
అందుకొని మరుఁ డేడ నాయ మేసునో
మెండుగా నీకు నిట్టె మీఁ దెత్తినవయసు
బందు సేసి యెవ్వతింటి పంచపాలు సేసునో

చ. 3: కూచుండు మనుచు నన్నుఁ గొంగు వట్టి తియ్యకువే
చూచి చూచి యెవ్వ తైన సూడు వట్టునో
యేచి శ్రీవెంకటేశుఁడ యిట్టె నిన్ను నేఁ గూడితి
యిచాయతమకయిన యిఁక నెంత సేసునో

రేకు: 0348-4 సాళంగం సంపుటం: 11-286

పల్లవి: ఇల్లాలి కిది వోజా యిచ్చకమే వలెఁ గాక
వొల్లనె ఆతఁడు దానే వొద్దకయ్యీఁ గాక

చ. 1: వొత్తుకోలుమోహములు వొగి నెందాఁకా వచ్చీ
హత్తి మనసునఁ గలయంతే కాక
తత్తరించి వాని నిఁకఁ దడవకురే మీరు
కొత్తగా దయ పుట్టితేఁ గోరి వచ్చీఁ గాక

చ. 2: పూసుక వాసుక వచ్చెపొదు లెందాఁకా వచ్చీ
ఆసతోడ నంత నైతే నమరుఁ గాక
వేసరించ నిఁక నేలె వేఁగుదాఁకా నాతని
బాసతో నమ్మి వుండఁగఁ బాలించీఁ గాక

చ. 3: బలిమిఁ బట్టెకాఁగిలి బడిబడి నేల వచ్చీ
అలరుఁ గరిమి సరి యైతేఁ గాక
యెలమి శ్రీవెంకటేశుఁడిప్పు డిట్టె నన్నుఁ గూడె
యిలఁ దనసొ మ్మైతి నిట్టె యేలీఁ గాక

రేకు: 0348-5 వరాళి సంపుటం: 11-287

పల్లవి: అప్పటి నిచ్చక మాడే వట్టె నాకు
తప్పని బొంకని మంచి తగవరి వౌదువు

చ. 1: చాపలాన మాయిద్దరి జగడాలు దిద్దవచ్చి
ఆపెమాఁటె వంక లొత్తే వప్పటినీవు
తీపు నీ కామాఁట లైతే తిట్టించుకొందు గాని
పోపో నే నందు కోప పోటిదొర వౌదువు

చ. 2: యెదుట మాకల్లా నిజ మేరుపరచఁగ వచ్చి
అదె పతివాది వయ్యే నప్పటినీవు
బెదరితే నీ వాకెకె ప్రియము చెప్పుదు గాని
కదిసి నన్నుఁ బట్టకు కడు జాణ వౌదువు

చ. 3: వెడ్డు వెట్టి మమ్ము నేఁడు వేఁడుకొన నిటు వచ్చి
అడ్డము లాపెకు వచ్చే వప్పటినీవు
వొడ్డినకోపము దీర వొక రొకరిఁ గూడితి
వెడ్డవు గావు శ్రీ వెంకటేశ్వరుఁడ వౌదువు

రేకు: 0348-6 కన్నడగౌళ సంపుటం: 11-288

పల్లవి: చెప్పుడుబుద్ధు లెందాఁక చిత్తములో నిలిచీనె
యిప్పడె నాకుఁగాఁ బ్రియ మేల చెప్పేరే

చ. 1: తగులమి లేకుండతే తలఁపులో తమి లేదు
నగవులు లేకుండితె ననుపూ లేదు
తెగినపనులకును తిరిగి చూచుట రోఁత
యెగసక్కేనకు వాని నేల పిలిచేరె

చ. 2: చూపు నాఁట కుండితేను చుట్టరికమే లేదు
పై పైఁ బదర కుండితే బత్తే లేదు
తీపుల చాలనిమాఁట తిరుగ నాడుక రోఁత
యేపున వానితో మీరు యేల పోరెరే

చ. 3: జంటలు వాసి వుంటె సమ్మతించుటే లేదు
వెంట వెంట రాకుండితో వేడుకే లేదు
నంటుతోడ నన్నుఁ గూడె నమ్మ నిదె రోఁత యింక
యింటిలో శ్రీవెంకటేశు నేల కొసరేరే

రేకు: 0349-1 బలహంస సంపుటం: 11-289

పల్లవి: కానీ కానీ యిఁక నేల కడమ దీరుతు గాక
ఆన సుమ్మీ నీవు వచ్చి అట్టటు వోతేను

చ. 1: అస యిచ్చుకొని వద్ద నాతఁడు నిలుచుండఁగ
వేసిన ట్టెల్లా నీకు జెల్లదా నేఁడు
వోసరించి ముడివెట్టి వూరా కాతఁడు నవ్వఁగ
యీసునఁ జేతులు చాఁచ యిఁక నెప్పుడే

చ. 2: మంతనాన నేమో చెప్పి మౌనాన నాతఁ డుండఁగ
యెంతైనా వాదకు రాక యేల మానేవే
యింత నిన్నుఁ జేసినట్టి యీతని దూరుతు గాక
వింతగా నిన్నే మన వెఁట్టినా నేను

చ. 3: వొకరి ననఁ జాలక వొప్పగిం చాతఁ డుండఁగ
అకట నీ రప మాయ నట్టె కానీవే
వెకలి య్యై యిత్తరి శ్రీవెంకటేశుఁడు గూడఁగ
మొకమోట నుంటేఁ గాక మోసపొయ్యేనా

రేకు: 0349-2 దేసాళం సంపుటం: 11-290

పల్లవి: సాకిరి మీరే సుండి సతులాలా
యీకడ నన్నే నేరా లెంచ రాకు రమ్మా

చ. 1: వుడివోని తమకాన వొక టొక టాడ వచ్చీ
తడవము తాఁకము తా నేమే వీఁడు
నడుమ నే నే మన్న నానోరె గనమే
వుడుకు నూరుపుతోడ నూరకుండే నమ్మా

చ. 2: చిత్తిణిగుణముతోడ చేతులు చాఁచఁగ వచ్చీ
బత్తి గలవానివలె పై పై వీఁడు
అత్తినేఁ గోపగించితే నందరు నన్నే దూరేరు
కొత్త నివ్వెరగుతోడఁ గూచుండే నమ్మా

చ. 3: యెవ్వరి ముందర నైన యెమ్మెకే నవ్వఁగ వచ్చీ
పవ్వళించాఁ బోనీఁడు పదరి వీఁడు
యివ్వలఁ గడపరాయఁ డిదె శ్రీవెంకటగిరి
నివ్వటిల్ల నన్నుఁ గూడె నెయ్యె మైతి నమ్మా

రేకు: 0349-3 మధ్యమావతి సంపుటం: 11-291

పల్లవి: పొదిగి మమ్ము రేఁచక పో పో నీవు
పొదరు లాడక నీవు పో పో నీవు

చ. 1: గద్దరి నీ మాఁటలకు కడ మొదలే లేదు
పొద్దు వోయ నలసితి పో పో నీవు
అద్దలించి నన్నే నీవు ఆన వెట్ట వచ్చేవు
బుద్దు లంత నేరవు పో పో నీవు

చ. 2: కడ నున్న యాఁడువారి కాలు దొక్క వచ్చేవు
పొడవులు చూపక పో పో నీవు
విడు విడు నీ సుద్ది వింతలా మా కేమి నీవు
పుడకక మమ్మంత పో పో నీవు

చ. 3: కెరలించ కంత మమ్ము కేరి నీగుట్టే చాలు
పొరుగువారు నవ్వేరు పో పో నీవు
గరిమ శ్రీవెంకటాద్రి కడపరాయఁడ నన్ను
పురిగొనఁ గూడితివి పో పో నీవు

రేకు: 0349-4 కేదారగౌళ సంపుటం: 11-292

పల్లవి: ఆన లింకాఁ బెట్టుకొనే వౌరా నీవు
కానవచ్చె నీచేఁతలె కనుకోరా నీవు

చ. 1: కొప్పుపువ్వు లవె కందె గురుతుచెమట చిందె
అప్పటినాతో బొంకే వౌరా నీవు
దప్పి దేరీఁ గెమ్మోవి తగిలెఁ గన్నులకావి
తప్పించుకొనేవు మాఁట తగురా నీవు

చ. 2: చిటిలె గందపుఁబూఁత చెక్కు లెల్లఁ గడు రోఁత
అటమటించేవు నన్నే అవురా నీవు
నిటలాన నలకలు నిండె మేనఁ బులకలు
యిటివంటివౌ ట్లేల యేమిరా నీవు

చ. 3: ముక్కున నిట్టూర్పుగాలి మొగాన నిద్దురజోలి
అక్కడనుండె తెచ్చితి వౌరా నీవు
యిక్కడ శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
మిక్కిలి జాణ వౌదువు మేలురా నీవు

రేకు: 0349-5 ముఖారి సంపుటం: 11-293

పల్లవి: ఎంత వడి కెంత వడి యేమి దలఁచుకొంటివో
యింత వొలిసీ నొల్లము లెరఁగ దాచెలియా

చ. 1: అప్పుడె మావిన్నపము లవధరించినవాఁడ
విప్పు డేల అడిగేవు యిం కొక్కమాఁటు
వుప్పరిగలోన నుండి వువిద నిన్ను రమ్మని
చెప్పి రమ్మన్నది యింతే చిక్కిన వెరఁగము

చ. 2: కచ్చుపెట్టి యల్లప్పుడె కాను కందితివి మాచే
వచ్చినప నడిగేవు వడి నిప్పుడు
విచ్చేయు మనుచు నింతి వెస గొంగువట్టు మని
యిచ్చె మాకు సెల వింతే యి దేమి నెరగఁదు

చ. 3: ముందె నేము రాఁగాను ముంచి నవ్వినవాఁడవు
యిందుముఖిసుద్దు లిప్పుడే లడిగేవు
కందువ శ్రీవెంకటేశ కలసె నాపె విచ్చేసి
విందు నీకుఁ జెప్పు మనె వేరు సేయ నేరదు

రేకు: 0349-6 దేసాక్షి సంపుటం: 11-294

పల్లవి: అప్పటి బీరముతోనె అట్టె వుండుదువు గాక
పిప్పి సేసినందుమీఁదఁ బిసుకఁగ వత్తురా

చ. 1: వొట్టి నీతో మాటలాడ నొల్ల నొల్ల ననఁగానె
పట్టేవు నాకొంగు బలువా యిది
చిట్టకాన వా దడిచి సిగ్గు గలవాఁడ వట్టె
గుట్టున నుందురు గాక కొసరంగ వత్తురా

చ. 2: ఆరయ నేఁ గోపగించి ఆన లెల్లఁ బెట్టఁగానె
సారె నాతో నవ్వేవు చలమా యిది
యేర నాతోఁ బంత మాడి యింటికి రా నన్నవాఁడ
వూరకే వుండుదు గాక వొరయంగ వత్తురా

చ. 3: తక్కరి నీసుద్దులకు తలవంచు కుండఁగాను
మొక్కేవు నాకు నింకా మోహమా యిది
యెక్కువ శ్రీవెంకటేశ యింత బత్తి గలవాఁడ
వక్కరతో నుందు గాక ఆగడాలు వలెనా

రేకు: 0350-1 నాదరామక్రియ సంపుటం: 11-295

పల్లవి: ఇంతలోనివాఁడవా యేరా నీవు
చెంతల నీకె యివి చెల్లురా నేఁడు

చ. 1: దగ్గరి రా వని నిన్నుఁ దమకానఁ దిట్టితేను
యెగ్గులు సిగ్గులు నెంచే వేరా నీవు
అగ్గల మై నీతోడి అంకెకత్తైనా నేను
దగ్గరినంతాఁ గలిగె తగురా నాకు

చ. 2: తప్పక చూడ వనుచు తామరఁ గొని వేసితే
యిప్పు డింతలో నలిగే వేరా నీవు
కప్పి నీకు నే నింత కంటకపుదాననా
చెప్పినంతాఁ గలిగెను చెలు లెల్ల నాకు

చ. 3: పరవశ మైతి వని పక్కన గోర నూఁదితే
యెరవుగాఁ జూచేవు యేరా నీవు
సరవి శ్రీవెంకటేశ చన విచ్చి కూడితివి
సరవు లన్నియు గలిగె చాలురా చలము

రేకు: 0350-2 పాడి సంపుటం: 11-296

పల్లవి: ఇయ్యకొన వద్దా నీ వింతట నైనా
అయ్యో యెమయ్యి నీకు ఆసపడీఁ జెలియా

చ. 1: చెక్కుల జవ్వాది జార చిరునవ్వు మోవిఁ దేర
నిక్కి చూచి మోహించె నీకు నల్లదె
చక్కని యా లలితాంగి సారె సారె మాఁటలలో
మక్కువ వలపు చల్లీ మదనరాగమునా

చ. 2: తను వెల్లఁ జెమరించి తరిపులకలు నించి
మనసు నీ కప్పగించి మలసీ నదె
అనుఁగుఁబాయపుసతి ఆడనుండి సన్న సేసి
తనుఁ దానె కరఁగీని దప్పి దేరే మోవిని

చ. 3: ముచ్చట సిగ్గులు వీఁగ ముక్కున నూర్పులు రేఁగ
యిచ్చటికి విచ్చేసె నింతలో నాపె
పచ్చిగా శ్రీవెంకటేశ పడఁతి నిన్నిటు గూడి
తచ్చన నీతో నాడీ తమకపురతులా

రేకు: 0350-3 శంకరాభరణం సంపుటం: 11-297

పల్లవి: కడవారు నవ్వేది కానవు గాక
గొడవల మమ్ముఁ జూచి గుద్దిరము లేఁటికే

చ. 1: నిండుఁ బరితాపమున నీ వేల సొలసేవు
అండనె నాతో నవ్వే వాతనిఁ జూచి
చండి పెట్టి మగవాని సాదించి వలవు మంటా
బందు సేసే యాఁటదాని బదు కేఁటి బదుకే

చ. 2: నిక్కి చూచే యాతిని నీ వేల కోపగించేవే
మక్కువ నతఁడు నాతో మాఁట లాడఁగా
వొక్కతెపై తరితీ పై వుండెటివిభునిఁ జూచి
గుక్కిళ్లు మింగేదానిగుణ మేఁటి గుణమే

చ. 3: బలిమి శ్రీవెంకటేశుఁ బగ లేల చాటేవే
కలసి యాతఁడు నన్నుఁ గాగిలించఁగా
పిలువని పేరటము ప్రియునివద్దకి వచ్చి
చలముకొనేటిదాని చల మేఁటి చలమే

రేకు: 0350-4 లలిత సంపుటం: 11-298

పల్లవి: తాలిమి చక్కన గాని తనుక మెం తైనాఁ గద్దు
మేల మాడ వయ్యు చెలి మీఁద మీఁద నున్నది

చ. 1: వనితి పువ్వులవేసి వలపు నీపైఁ బూసి
తనుఁ దానె సిగ్గుపడి తల వంచీని
మనసు నీపై బెట్టి మాఁటలు మాతో నాడీ
పెనఁగి పిలువవయ్యు పేరుకొని నీవు

చ. 2: పడఁతి నీతో నవ్వి పాయపుటాసలు దవ్వి
చిడుముడి సిగ్గుతోడఁ జెమరించీని
కడు నిన్నట్టె చూచి కాయము మాపై వేసీ
వొడి వట్టి తియ్యవయ్యు వొద్దికతో నీవు

చ. 3: కలికి నీకాలు దొక్కి కమ్మటి నీకు మొక్కి
వలవనిసిగ్గుతోడ వడఁ బడీని
నెల వై శ్రీవెంకటేశ నిన్నుఁ గూడె తన్నుఁ దానె
అలమి పైకొన వయ్యు అప్పటివి నీవు

రేకు: 0350-5 మంగళకౌశిక సంపుటం: 11-299

పల్లవి: నాపలెనే నీవ నంటా నమ్మితి నేను
దేవర వవుత యింత తెలియరా నేను

చ. 1: మంతనాన నాడినట్టి మాఁట లాకెతోఁ జెప్పి
పంతానకే నవ్వేవు పలుమారును
చింత మది దరికొని శిరసున వెళ్లఁ జొచ్చె
యింతే శవుతఁ దొల్లి యెరఁగరా నేను

చ. 2: నే నిచ్చినపదకము నీ వాకె మెడఁ బెట్టి
పూని యెమ్మెలు చేసేవు పూటఁ పూఁటకు
కానీ లేరా అందు కేమి కాయ మెల్లా నుడికీని
యీా నీ గుణము నాఁడె యెంచ నైతి నేనూ

చ. 3: పీఁటమీఁద నిన్నుఁ దెచ్చి పెట్టుకొంటే నీ వాపెను
పాటించి వద్ద బెట్టుక పాయఁగ లేవు
మాటాడి నే నలమేలుమంగ నంటాఁ గూడితివి
నీటున శ్రీవెంకటేశ నేరరా నేను

రేకు: 0350-6 వరాళి సంపుటం: 11-300

పల్లవి: మంచివాఁడ వౌదవయ్యా మానిన అటుండఁగాను
మంచ మెక్కి చెలులతో మాఁట లేటి వయ్యా

చ. 1: కామిని నీవు రాఁగానె గక్కన లేచి నిలిచి
దోమతెరమాటు కేఁగి తొంగి చూచీని
కోమల మయినసతిఁ గూచుండు మనమయ్యా
జా మాయ నప్పటినుండి చాలు నీ సరసము

చ. 2: తప్పక నీవు చూడఁగ తరుణి సిగ్గున నవ్వి
వొప్పుగాఁ దల వంచుక వూర కున్నది
ముప్పిరి నీచేత నాకెమో మెత్తి మాటాడవయ్యా
యిప్పుడు డింతవడి యాయ నేఁటికీ సరసము

చ. 3: కొంగువట్టి తియ్యఁగాను కోమలి మేను మరచి
వుంగిటి నీ మేనిమీఁద నొరగున్నది
అంగవించి శ్రీవెంకటాదిప కూడితి విట్టె
చెంగట నలమేల్ మంగచేతి దీ సరసమూ

రేకు: 0351-1 గౌళ సంపుటం: 11-301

పల్లవి: అటమీఁద నయినట్లయ్యీఁ గాని
సట లింతే తాముఁ దామే సంతము లయ్యేరు

చ. 1: పలికినంతే చాలు పచ్చి సేయకురే యింతి
నలుక దేరినమీఁద నడిగేఁ గాని
చెలవుఁ డీసుద్ది వింటే చేర వచ్చునో రాడో
కలయిక కిద్దరినిఁ గదియింత మిపుడు

చ. 2: నవ్వినపాటే చాలు నానఁ బెట్టకురే మీరు
నెవ్వగ దీరితే బుద్ది నేనే చెప్పేను
అవ్వల నీపా టైతే నాతనిఁ దేరుచ రాదు
దవ్వుల నిద్దరి సమతారుకాణ నేతము

చ. 3: తానెచూచినంతే చాలు తరువుల వెట్టకురే
మేనులు సోఁకినమీద మించీఁ గాని
ఆనుక శ్రీవెంకటేశుఁ డలమేలుమంగఁ గూడె
పానిపట్టె యింతలోనే పంగింత మిపుడు

రేకు: 0351-2 పాడి సంపుటం: 11-302

పల్లవి: పిలువరె యింకాను ప్రియము చెప్పేఁ గాని
చల మేల నెరపీనె సారెకుఁ దానూ

చ. 1: తప్పు లెంచఁ బని లేదు తానె నే నైనచోట
కప్పురము గొమ్మనవె కపటా లేల
యిప్పుడు నాప్రియములు యిందాఁకా నియ్యకొనె
అప్పటి నేల వున్నదె ఆడనె తాను

చ. 2: కోపగించఁ బని లేదు కూడితి మిద్దర మీడ
చూపులఁ జూడు మనవె సూడుఁబా డేల
యీ పొద్దుదాఁకా మాట లియ్యకొన్నట్టె వుండె
యేపునఁ దెరలోని కే లేఁగీనె తాను

చ. 3: ఆన వెట్టఁబని లేదు ఆయా లిద్దరికి సోఁకె
పూని కూచుండు మనవె బూటకా లేలా
నేనె శ్రీవెంకటపతిఁ దానె యలమేలుమంగ
మానక కూడితి మిఁక మంచ మెక్క నేఁటికే

రేకు: 0351-3 బౌళి సంపుటం: 11-303

పల్లవి: ఎంతచెప్పినా మాన విదేరా నీవు
కాంత లైన వారి నింత కాకు సేతురా

చ. 1: యిట్టె చన్ను లంటకుర యిస్సీ యిందరుఁ జూడ
వొట్టి నీవద్దికి వచ్చి వున్న నేరమా
తిట్టుదుఁ జుమ్మీ నాతెరువు వచ్చితేఁ గన
గుట్టున నుండుదు గాని కొం తైన నోరి

చ. 2: తొడ మీఁద వేయకుర తోతో యిందరు నవ్వేరు
యెడయక దగ్గరితే నిదే పనా
కడు గోపిఁ జుమ్మీ నేను కలదె విన్నవించితి
బడలించకుర నన్ను పలుమారు నోరి

చ. 3: పచ్చిమాఁట లాడకుర పడఁతు లెల్లా వినేరు
అచ్చ మై నే నీతో మాట లాడినందుకా
యిచ్చగించి శ్రీవెంకటేశ నిన్నుఁ గూడితి
నిచ్చ నలమేలుమంగ నేఁ జుమ్మీ వోరి

రేకు: 0351-4 సాళంగనాట సంపుటం: 11-304

పల్లవి: మొక్కరో మొక్కరో మీరు మోమునఁ గళలు దేరె
యెక్కువ శ్రీవెంకటేశుఁ డింతులో వాఁడె

చ. 1: తేరుమీఁద నెక్కి హరి దేవుళ్లుఁ దానును వాఁడె
భోరునను దేవదుందుభలు వాఁగగా
తోరపుమోఁకులు వట్టి దొరలు బ్రహ్మాదు లెల్ల
ధీరతఁ దీశే రదే తిరువీధులందును

చ. 2: వేడుక రథముమీఁద వెలసే శ్రీపతివొద్ద
ఆడేరు పాడేరు అచ్చర లెల్ల
నీడెపు సెలవులతో వెలఁదులతో హరి
యీాడు లేక యేఁగి వచ్చి నింటింటి వాకిటను

చ. 3: శ్రీవెంకటేశుఁడు వాఁడె చేరి యలమేలుమంగ
సావధానమున సరసము లాడఁగ
దేవాసనం బెక్కి తేఁకువ నారగింపులు
వావిరిఁ జేకొనో వాఁడె వాడవాడలను

రేకు: 0351-5 ఆహిరి సంపుటం: 11-305

పల్లవి: ఇందుకా యింత సేసితి విందాఁకాను
అంది పొంది నీవే బదు కాఁటదాన నేనూ

చ. 1: వొలిసీ నొల్లనివాఁడ వూరకే ఆ సియ్యనేల
పొలసి అప్పుడే నన్నుఁ బొమ్మన రాదా
కులికి నేఁ గొసరఁగఁ గోమటిమేనరికమా
నెల వై సుఖాన నుండు నీవే వొక్కఁడవే

చ. 2: మనసు రానివాఁడవు మాతో నవ్వఁగ నేల
అనువు గాదని విడనాడఁగ రాదా
చనవున నిన్ను నాఁగ పరిఁ బత్రసాలామా
యెనయుచు నేకరాజ్య మేలవయ్యా నీవే

చ. 3: మాయలు సేసేవాఁడవు మమ్ము జాలిఁ బెట్టనేల
రాయి డేల మా యింటికి రా నన రాదా
ఆయ మంటి కూడితివి అలమేలుమంగ నేను
పాయపు శ్రీవెంకటేశ బడి నుండు మిఁకను

రేకు: 0351-6 వరాళి సంపుటం: 11-306

పల్లవి: ఎంత వని కెంత వని యిది యేఁటిదే
పంతమె సతుల కిది పాలతోడఁ బోసిరో

చ. 1: నవ్వుతా నే నన్నందున నాలి నెగ్గు సేసుకొని
యివ్వల నట్టె మాటాడే విది యేమె
పువ్వువంటి యాఁట దైతేఁ బొగరు ముంపుఁదనమె
నివ్వటిల్లునో కాక నీకే తెలసునే

చ. 2: తప్పక చూచినందుకే తగఁ గోపము సేసుక
కొప్పు దువ్వినఁ గసరుకొనే వేమే
చిప్పిల జవ్వని యైతె చెంది యాడ లేని వాసు
లెప్పు డెం దుండి వచ్చునో యెరఁగమే నేము

చ. 3: సరస మాడినందుకె చాల నలుక సేసుక
వొరసి చేయి వట్టిన నులికే వేమే
యిర వైన శ్రీవెంటేశుడ నిన్నుఁ గూడితి
గరిమె నిచ్చగించితి కడు మేలె నీవు

రేకు: 0352-1 ముఖారి సంపుటం: 11-307

పల్లవి: ఓసి పోపో నీకు నేమె వుండఁబట్టదా
వాసులు రేసు లెక్కించి వాదుకు వచ్చేవా

చ. 1: నిరతి నామీఁదట నీ కోప మెంత గల్ల
సారిది యాతనిమీఁదఁ జూపవే పోయి
మరిగినవారితోడ మాటలాడఁ బాసెనా
వరుస నిల్లురి కేల వాదుకు వచ్చేవే

చ. 2: సారె సారె న న్నెంత సాదించఁ గలిగినాను
మేర మీరి నీ వాతనిమీఁద వెళ్లించు
కూరిమి గలుచుచోటఁ గూడినదె నేరమా
వారి వీరి మాట కేల వాదుకు వచ్చేవే

చ. 3: మలసి నామీఁదట మచ్చర మెంత గల్లాను
నెలవుగా నతనిపై నెరపఁగదే
యెలమి శ్రీవెంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
వలవనిజోలి నేల వాదుకు వచ్చేవే

రేకు: 0352-2 నాదరామక్రియ సంపుటం: 11-308

పల్లవి: ఆసలును రేసులను అవి రెండు నేలే
కాసు సేయనిపనికి కాఁతాళ మేలే

చ. 1: అలిగినవాఁడు తా నారడనే వుండుఁ గాక
పిలిచి వాదుకు వచ్చి పెనఁగ నేలే
కలయనివాఁడు తాను కడు వాసి నుండుఁ గాక
వొలిసి దగ్గరి తగవుకుఁ దియ్య నేలే

చ. 2: మాటలాడనివాఁడు తా మారుమో మై వుండుఁ గాక
తేటలుగా సారె మమ్ముఁ దిట్టఁగ నేలే
నీటున నుండెటివాఁడు నిక్కము బిగుసుఁ గాక
చీటికి మాటికి మాపైఁ జెయి చాఁచ నేలే

చ. 3: కాఁకలు సేసెటివాఁడు కన్నులనె చూచుఁ గాక
యేఁకటఁ గాఁగిలించీ నన్నింతలో నేలే
వేకపు శ్రీవెంకటాద్రివిభుఁ డిట్టె నన్నుఁ గూడె
మాఁకువలె నన్ను మేను మరపించ నేలే

రేకు: 0352-3 శ్రీరాగం సంపుటం: 11-309

పల్లవి: ఏఁటికి జాగులు సేసే రింకా మీరు
చాటి చెప్పి పతి నిట్టె జరయరమ్మా

చ. 1: వలచినవలపులు వనితమేనిమీఁదికి
పులక లై మొలచె నిప్పుడు చూడరే
యెలమిఁ గాఁక లనేటియెన్నులు వెళ్ళక తొల్లె
నెల వై చలిమందులు నించరమ్మా

చ. 2: చిత్తములో చింత లెల్ల చెమట లై సతిమేన
జొత్తులు గారఁగఁ జొచ్చె జూడరె యిది
యెత్తనతమకముల యేరులు వారక తొల్లె
వొత్తి పువ్వుఁబొట్లాల నొగిఁ గాఁచరమ్మా

చ. 3: కడ లేనిజవ్వనము కలికి నిట్టూరుపులై
విడువక చెలరేఁగి వేఁచఁ జొచ్చెను
తొడరి విరహ మనేదుమ్ములు రేఁగక తొల్లె
అడరి శ్రీవేంకటేశుఁ డాదరించె నమ్మా

రేకు: 0352-4 శుద్ధవసంతం సంపుటం: 11-310

పల్లవి: అందుకే వెర గయ్యీనె అప్పటనుండియు మాకు
అందినవారికి మిన్ను అరచేతిదే

చ. 1: పతిమాఁటాడ విదేమే పలుమారుఁ దమకాన
అతఁడు నీతో మాట లాడఁగాను
యిత వై యెక్కినవారి కేనుగ గుజ్జన్న మాట
కతలుగా నీయందె కంటిమే నేము

చ. 2: గక్కన రావది యేమె ఘనుఁడు నవ్వుతా నిన్ను
తెక్కులనె చేయి వట్టి తియ్యఁగాను
నొక్క టై పాలు వోసితే వోకివింత లన్నమాఁట
మిక్కిలి నీవల్లనె మెరసెనే నేఁడు

చ. 3: శ్రీవెంకటేశ్వరుఁడు చేయి నీపై వేయఁగాను
నోవ దనక వాఁడిచన్నుల నొత్తేవు
పూవులవేసినవారిఁ బొంచి రాల వేసినట్టి
భావము నీయందె కంటి భళి భళి గుణములూ

రేకు: 0352-5 ఆహిరి సంపుటం: 11-311

పల్లవి: కాదనేనా నీమాట కానీ లేవే
నాదె నేమి చూచేవు నవ్వేఁ గానీ లేవే

చ. 1: నమ్మించి నీవు వానినయగారాలు చెప్పఁగ
కమ్మి నామై కాఁక రేఁగె కానీ లేవే
నెమ్మది వాని నిజాలు నీవు గల్లలాడే వటే
అమ్మరో ఆన వెట్టకు మట్టె కానీ లేవే

చ. 2: పిలిచీ ననుచు వాని ప్రియము నీవు చెప్పఁగ
కలిగెఁ బెద్దరికము కానీ లేవే
నెల వై వానిచేఁతలు నీవు నాకు దాఁచే వటే
అలుక లన్నియుఁ దీరె నట్టె కానీ లేవే

చ. 3: శ్రీవెంకటేశ్వరుని చేతికి నీ వియ్యఁగాను
కైవస మయితి నట్టె కానీ లేవే
నీవల్లనే కాదా నే మిద్దర మొక్క టైతి
మావటించి యిఁకఁ బాయ మట్టె కానీ లేవే

రేకు: 0352-6 ముఖారి సంపుటం: 11-312

పల్లవి: ఎవ్వరికి బుద్ది చేప్పె నెఱఁగ మరి
యివ్వల నే నుండదాన నెఱఁగ మరి

చ. 1: చెక్కు చెలిచేత నుండె నింత మదిలోన నుండె
యిక్కడికి నే వచ్చితి నెఱఁగమరి
పక్కన నంపవు మమ్ము పదరి నీవు రావు
యెక్కు నీ చిత్త మొట్టో యెఱఁగ మరి

చ. 2: వుమ్మచెమటలఁ దోఁగె నువిద కాఁకల రాఁగె
యిమ్మల నన్నీడ కంపె నెఱఁగ మరి
కొమ్మసుద్దు లడిగేవు గుట్టునఁ దల వంచేవు
యెమ్మె లేమి సేసేవో యెఱఁగ మరి

చ. 3: యిందాఁకాఁ దమకించె యింతి యిట్టె పవ్వళించె
యిందున్నదాన నేను యెఱఁగ మరి
అంది శ్రీవెంకటేశుఁడ ఆడకె నీవు విచ్చేసి
యిందుముఖిఁ గూడితివి యెఱఁగ మరి

రేకు: 0353-1 దేసాక్షి సంపుటం: 11-313

పల్లవి: అప్పటి మానవుబీరాల దేమే నీవు
యిప్పు డేమి దప్పి పోయ నిఁకఁ జూడ రాదా

చ. 1: యేతు నీకుఁ గలిగితే నెంధైనాఁ జూపుదు గాక
ఆతని నావద్దఁ దిట్టే వదేమే నీవు
నీ తెరువు వచ్చితిమా నీ కేమి గారణమె
తోతో నా రమణుని దూరుదు గాక

చ. 2: బలువు గలిగితేను బతుకుదు గా కతని
అలమేవు నా యెదుట నదేమే నీవు
తలవే నిన్నుఁ దడవ దగ్గరి నాయకుని
వలసినట్టు సేసితే వద్దనేవా నీవు

చ. 3: వాసి నీకుఁ గలితేను వద్దఁ బెట్టుకుందు గాక
ఆస పడేవు నాపతి కదేమే నీవు
యీసరి శ్రీవెంకటేశుఁ డిందరిఁ గూడినమీఁద
గోస నాస నేయఁ బోతే కోప మేలే నీకు

రేకు: 0353-2 రామక్రియ సంపుటం: 11-314

పల్లవి: మేరతో నే నుండఁగాను మీచేతి బాద బెట్టు
వూరకున్నవారి నేల వుడికించేరే

చ. 1: వొట్టి పతికిఁ బాదము లొత్తి వచ్చితి నిందాఁకా
యిట్టె యలిగితి నంటా నేల పోరేరే
వెట్ట దీరఁగ సురటి విసరితి నాతనకి
చిట్టకాన కింకా నేమి సేయు మనేరే

చ. 2: సన్నతో నేనిందాఁక సముకాననే వుంటి
చిన్నఁబోతి నంటా నేల చేయి వట్టెరే
మున్నె యాతనూడిగాన ముక్కు చెమట జారితే
కన్నీరు రాలె నంటా గడియించే రేటికే

చ. 3: ముక్కువ శ్రీవెంకటేశు మాటలు వింటి నిందాఁక
వొక్కటి గమ్మంటా నేల వొడి వట్టేరే
అక్కరతో నాతఁడె ఆదరించి నన్నుఁ గూడె
మొక్కనైతి నంటా నేల మొరఁగు లాడేరే

రేకు: 0353-3 తెలుఁగుఁగాంబోది సంపుటం: 11-315

పల్లవి: అందరూ విన్నవి నే నాడేఁ గాని
సందడింపుమేకులకు చాలఁ బో నేనూ

చ. 1: సేయ రానిపను లైనఁ జేసేఁ గాని
వో యయ్య నీ వినయము లొల్లఁ బో నేను
పాయరానిరాజసాన బడేఁగాని
వే యైన నీయానలు వినలేఁ బో నేనూ

చ. 2: నగవు రాకుండినను నవ్వేఁ గాని
వొగరు మోహము చల్ల నోపఁ బో నేను
మొగమోటఁ గొండెత్తిన మోచేఁ గాని
తెగువతో నీ గుణము తిద్దలేఁ బో నేనూ

చ. 3: వొదిగి పానుపుమీఁద నుండేఁ గాని
చెదర నిన్నింత పచ్చి నేయఁ బో నేను
పొదిగి శ్రీవెంకటేశ భోగించితి నీవు
వెదకి నీ వెం దున్న విడువలేఁ బో నేనూ

రేకు: 0353-4 సామంత సంపుటం: 11-316

పల్లవి: పో పో యిదేడ సుద్ది పోయినది వో నీవే
రేపు మాపు నిదే పనే రేసు లేల పెంచేవు

చ. 1: పంతములే ఆడేవు పట్టేవు చలము
యింతులకుఁ బతిమీఁద నింత గద్దటే
కొంత నీచెక్కు నొక్కఁగ గోరు దాఁకె నింతే కాక
అంత నీతోఁ బగ పాడే అతఁడు వో చెలియ

చ. 2: పిలిచితేఁ గసరేవు పెనఁగితే విసిగేవు
వలచినయీతనితో వాదు లేఁటికే
బలిమి నిన్నుఁ బట్టఁగ పాపట చెదరెఁ గాక
వలె వలె నని నీతో వాదులకు వచ్చెనా

చ. 3: నిట్టూర్పు నించేవు నివ్వెరగుఁ బొందేవు
యిట్టె శ్రీవెంకటెశు నేప నేఁటికే
గుట్టుతోఁ గాఁగిలించఁగఁ గొప్పు వీడె నింతె కాక
తొట్టిన రతులోన దొమ్మి సేయ వచ్చెనా

రేకు: 0353-5 రామక్రియ సంపుటం: 11-317

పల్లవి: మగవాఁడు వలచితే మరి చేతఁ బట్ట రాదు
తగుదునా నే నీకు తమకించే విపుడు

చ. 1: ఆన వెట్టకుర నీ వన్నట్టె వినేఁగాని
మాన వెంత చెప్పినా నీ మంకువోజలూ
కాని మ్మన్నా మొక్కేవు కాఁ గాని దోసాన
నే నెంత నీ వెంత నీకు నేబాఁ తైతిఁగా

చ. 2: చెక్కు నొక్కకుర నీవు చెప్పినట్టే సేసేఁ గాని
యిక్కడ నవ్వేవారి నెఱఁగ వోరి
యిక్కువ లంట వచ్చేవు యెంగి లని చూడవు
చక్కనివాఁడవు నే నీసాటికి రాఁ గలవా

చ. 3: పొగడకురా నేనీ పొందులు విడువఁ గాని
నగవులు మానవు నాతో నీవు
తగు లై శ్రీవెంకటేశ తతి నన్నుఁ గూడితివి
మొగము చూచే వింకా మోహ మింత గలదా

రేకు: 0353-6 రామక్రియ సంపుటం: 11-318

పల్లవి: ఈ కోపా లీతాపా లిట్టె వుండీనా
సాకిరి నేఁ దేలిపేఁగా సాదించేదానిని

చ. 1: ఆతఁ డీడకు రాఁగానె ఆన వెట్టుకొందు గాక
కాతరానఁ జెప్పి పంపఁ గారణ మేమే
యీతల నీ రమణుఁడు యెదుట నిలిచితేను
చూతము వో యిట్లనె సొలసెటిదానిని

చ. 2: వోడక నిన్ను రమ్మంటే నొల్ల నందు వింతే కాక
ఆడ నుండఁగానె లేక లంప నేఁటికే
కూడనివారే తమిఁ గూడేరు యిప్పు డెట్టె
తోడనె పంగించేఁ బో తొలఁగెటిదానిని

చ. 3: పెల్లున నీ వొద్దికె పిలిపించు కొందు గాక
యిల్లురికి వచ్చి వాదు లివి యేఁటికే
వొల్లనె శ్రీ వేంకటేశు డొద్దికతో నిన్నుఁ గూడె
పల్లదాన నవ్వేఁ బో పాసియుండేదానిని

రేకు: 0354-1 బౌళి సంపుటం: 11-319

పల్లవి: చెక్కిటఁ బెట్టెను చేయి చిత్తములో నదే నుయ్యి
యెక్కడికిఁ బోరాదు యిఁక నీచిత్తము

చ. 1: జవ్వనపు పైతరపు సతితురుము బరవు
యెవ్వరు విలిచిన నెర వెరపు
యివ్వల నీ విదె చూడు మిదివో నెమ్మోవివాడు
రవ్వ లాయ నీ వలపు రావయ్య యిఁకను

చ. 2: చిగురుఁబులకపైరు చిత్తడిచెమటనీరు
పగటుగుబ్బలమీఁద పయ్యద జారు
నగకు మాతో నింత నాతికి నంతా వింత
వెగటాయ నీమాయ విడవయ్య చలము

చ. 3: కాయములోని యలపు కనుఁగొనల సొలపు
చాయల సన్నలలోని సారె బులుపు
యీయెడ శ్రీవెంకటేశ యింతిన నీవు గూడఁగా
తోయ రాదు నీ చనవు తోడఁ దోడ నిదివో

రేకు: 0354-2 ముఖారి సంపుటం: 11-320

పల్లవి: లోలో నాతనిచేఁత లోక మెఱఁగదు గాని
యేలీల నన్నే దూరే రేమి నేతు నమ్మా

చ. 1: చిఱునవ్వు నవ్వఁగ చేయి వట్టీ నాతఁడు
గుఱిగా నే వద్దంటేఁ గోప మనేరు
అఱిముఱిఁ దానె సాదు అందిరికిఁ జూడఁ జూడ
యెఱుకతో నేనే వెట్టి నేమి సేతు నమ్మా

చ. 2: పూరకె న న్నాతఁడు వొడివట్టి తీసీని
తారి నే రా నోప నంటేఁ దప్పు సేసేరు
వారక తానె మంచివాఁడు విన్న కన్న వారి
కీ రీతి నే నిష్ఠూరి నేమి సేతు నమ్మా

చ. 3: కడ నేఁ గూచుండఁగాను కాగిలించుకొనీఁ దాను
జడిసి నే నుండితే రాజస మనేరు
విడువక నన్నును శ్రీవెంకటేశుఁ డిదె కూడె
యెడసి నే నుండఁ జాల నేమి సేతు నమ్మా

రేకు: 0354-3 బౌళి సంపుటం: 11-321

పల్లవి: తొల్లిటివలెనా నీవు దొర వైతివి
యెల్లవారుఁ జూడఁగా నేనే మందు నిఁకను

చ. 1: యేరా నే వద్ద నుండఁగ యెవ్వతెదిక్కు చూచేవు
మేర మీర దొరకొంటి మెల్ల మెల్లనె
తేరా నా వుంగరము తెలిసితి నీ గుణము
వోరి నీతో జగడించ నోపరా నే నిఁకను

చ. 2: నా యెదురుకట్టులనె నవ్వఁ బొయ్యే వాపెతోడ
యీయెడ నప్పుడె యెంత కెత్తుకొంటివి
చేయి విడువర నీతో చెలిమి నా కయి వచ్చె
చాయలు నే వెంగె మాడఁ జాలరా నిన్నిఁకను

చ. 3: యిట్టె నా యింటనుండి యిల్లురికి మాటాడేవు
తిట్టీ నంటా నాపె నిదె సందుగా
గట్టిగా శ్రీవేంకటేశ కలసితి విదె నన్ను
పట్టినచలము చెల్లె బ్రదుకరా యిఁకనూ

రేకు: 0354-4 దేసాళం సంపుటం: 11-322

పల్లవి: ఊరి మగనాండ్లకు నుండఁ బాసెను
యీరితి నన్నింత సేసె నే మందు నమ్మా

చ. 1: వొల్ల ననఁగానె వచ్చి వొక టొకటె యాడి
చెల్లఁ బో వీఁడు నా చేయి వట్టీని
పల్లదపు వీనిచేతి బాధకుఁ గాక నేను
యిల్లిదె నే లోనయితి నిఁక నేఁటి దమ్మా

చ. 2: తల వంచు కుండఁగానె దగ్గరి వద్దఁ గూచుండి
చలి వాయ మాట లాడీ జాణతనాలు
చలపాది వీనిచేతి చండకు నోపక నేను
చెలరేఁగి కాఁపురము సేసితి నో యమ్మా

చ. 3: యింటివారికి వెరవఁ డెదుట నవ్వులు నవ్వి
చంటిమీఁద నొరగుచు సట సేసీని
వెంటఁ బాయ కిది వో శ్రీవెంకటేశ్వరుఁడు గూడె
దంట నై వీనిమాయఁ దగిలితి నమ్మా

రేకు: 0354-5 శంకరాభరణం సంపుటం: 11-323

పల్లవి: మా కేమి నీ వెంత మట్టు మీరి తిరిగిన
లోకమువారే నవ్వేరు లో వెలుతు లేలరా

చ. 1: ఆనలు నే కేమిటికి నంత నిజమరి వైతే
కేనాన నీవే బదికేవు గాక
పూని యన్నీ విన్నదాన నుండఁజాల కొక టంటే
కోనలఁ దెలుపు మంటా కొంగు వట్టే వేమిరా

చ. 2: తారుకాణ లేఁటికి తప్పు లేనివాఁడ వైతే
పేరడి నాచారములు పెంచేవు గాక
కేరి నీవు రాకుంటే వెంగెములు ని న్నాడితేను
పోరి పోరి పోయినిది పోనియ్య్య వేమిరా

చ. 3: వట్టిమాఁట లేఁటికి వలచినవాఁడ వైతే
అట్టె అన్నిటను జాణ వయ్యేవు గాక
యిట్టె శ్రీవెంకటేశ యిందుకె నిన్నుఁ గూడితి
దెట్టతెరుపున నన్నుఁ దేలించే మేమిరా

రేకు: 0354-6 ముఖారి సంపుటం: 11-324

పల్లవి: ఏమి నేరుచుకొంటివే యెంత కుచ్చితురాలవే
జాము వోయినా మానవు చలమే సాదించేవు

చ. 1: చూడఁ జాల వేమే యే సుదతితో మాటాడిన
యేడా చుట్టాలు లేరా యెవ్వరి కైనా
కూడీఁ గూడక తొల్లె కొడిమెలే కట్టేవు
వాడలో నుండ బాసెఁగా వన్నెమగవానికి

చ. 2: వుడికి పడే విదేమే వూరివారితో నవ్వితే
విడువ కెవ్వరి కైనా వేడుకె లేదా
కడ నున్నవారిమీఁద కానివావులు వేసేవు
తడవి మగవానికి తల యెత్తఁ బాసెఁగా

చ. 3: చిన్నఁబొయ్యే విది యేమే చెలుల నేఁ బిలిచితే
యెన్న కె ముచ్చట లేదా యెవ్వరి కైనా
చెన్నుగా నురమెక్కితి శ్రీవెంకటేశుఁడ నేను
యిన్నిటాఁ గూడ బాసెఁగా యితరకాంతలను

రేకు: 0355-1 భైరవి సంపుటం: 11-325

పల్లవి: పంతము చెల్లెను నీకు పదర నేలే
చింత దీర పతిమాట చేకొందు గాక

చ. 1: అలిగినరమణుఁడె అట్టె నిన్నుఁ బేరుకొని
పిలిచినమీఁద నింక బిగు వేఁటికే
తల వంచు కుండఁగాను తగ నీపైఁ జేయి వేసి
కలయఁగ నీలోని కపటము లేఁటికే

చ. 2: చేసన్నల రానివాఁడె చెట్ట వట్టి తియ్యఁగాను
వాసుల వంతులతోడి వాదు లేఁటికే
ఆసల నీ వద్దనుండి అట్టె తానె ఆన వెట్టి
సేస చల్లె పతిమీఁద చిడుముడి యేలే

చ. 3: యింటికి రానట్టివాఁడె యిటు నిన్ను వేఁడుకొని
వెంట వెంట రాఁగానె వేస టేఁటికే
అంటుక శ్రీవెంకటేశుఁ డాతఁడె నిన్ను గూడె
జంటయి వుందురు గాక చల మింకా నేలే

రేకు: 0355-2 రామక్రియ సంపుటం: 11-326

పల్లవి: చెప్పరమ్మ మీరు బుద్ది చెలులాల
యిప్పటికోపము మీఁద నిట్టె వుండీనా

చ. 1: చిగురుఁబెదవి వంచి సిగ్గులనె గొణఁగీని
వెగటునఁ బతి దన్ను వేఁడుకోఁగాను
నగుతాఁ బయ్యెదకొంగు నాథుఁడు పట్టఁ బట్టఁగ
జగడించి లోని కేఁగీ సమ్మతించ కదివో

చ. 2: సరుస నవ్వులు దీర సతి యాన లెల్లఁ బెట్టీ
బెరసి విభుఁడు దన్ను బిలువఁగను
పరిమిళము లతఁడు పైపైఁ బూయ బూయఁగ
తెరచీరఁ దుడిచీని తీసి తీసి యదివో

చ. 3: చెమట చెక్కున జార సిరసు వంచుకొనీని
సుముఖుఁడై శ్రీవెంకటేశుఁడు గూడఁగ
అమరఁ గమ్మటి నాతఁ డాయము లంట నంటఁగ
తమితోఁ దిప్పించుకొంటా తాఁ దా నేర్పీ నిదివో

రేకు: 0355-3 పాడి సంపుటం: 11-327

పల్లవి: సిగ్గుగ లాఁటదానికి చెప్పించుకో నింత యేల
దగ్గరి వుండుటె చాలు తడవకు మమ్మును

చ. 1: వొలిసీ నొల్లని నిన్ను వొడివటి తీయుకంటే
అలిగి నేఁ బవళించు టదియే మేలు
పిలువకుండఁగ నీవు పెనఁగి పైఁ బడుకంటే
తల వంచుకొని వుండే తడవకు మమ్మును

చ. 2: కడు రాజసపు నీతో కలకల నవ్వుకంటే
చిడుముడిఁ జిన్నఁ బొయ్యే చింత మేలు
జడిసి వుండిన నీతో చనవు చెప్పుటకంటే
తడతాఁకులఁ బొరలే తడవకు మమ్మును

చ. 3: కపటాలు సేసే నిన్ను కాఁగిలించుకొనుకంటే
నెపముతో నూరకుండే నీటే మేలు
యిపుడె శ్రీవెంకటేశ యేకమై నన్నుఁ గూడితి
తపము ఫలించె నీకఁ దడవకు మమ్మును

రేకు: 0355-4 బౌళి సంపుటం: 11-328

పల్లవి: మేరకు మేరే కాక మీర నేఁటికే
నేరుపులు చాలు జాలు నెరవేరెఁ బనులు

చ. 1: వద్దు వద్దేమీఁ దడవకురే మీరు వా
రిద్దరు లోన నుండఁగ నేలే దోసము
కొద్ది మీరి దగ్గరితే కూళ వందురు
తిద్ద నేల పను లెల్లఁ దీరినమీఁదటను

చ. 2: చేకొని మీ రెరుకలు సేసుకొందురా వా
రేకత మయినవేళ యేలె దోసము
కాకు నేయఁ బోతే నన్నే కల్లందురు
లోకమువారే చెప్పేరు లోలోనే వారికి

చ. 3: తెక్కులవాకి లిప్పుడే తెరవకురే వా
రిక్కువఁ గరఁగేవేళ యేలే దోసము
మొక్కి శ్రీవెంకటపతి మొకమోట నన్నుఁ గూడె
నెక్కుడు మా టేల పంత మిచ్చినమీఁదుటనూ

రేకు: 0355-5 శ్రీరాగం సంపుటం: 11-329

పల్లవి: ఇంక నెన్నఁడె నీ యెమ్మెలు నేఁడు గాక
అంకెల నాతఁడు నీ వాడినట్టె యాడఁగా

చ. 1: చెల్లదా నే కేమి నేఁడు చెలువుని వలపించి
యిల్లు వెళ్లకుండాఁ జేసి యింత సేసితి
పల్లదాన నన్నటిని పంత మాడే వేమి దొడ్డె
కెల్లు రేఁగి ఆతఁడు నీ కింకరుఁ డై యుండఁగా

చ. 2: తగదా నీ కే మతనిదండనుండి సవతులఁ
బగలు సాదించ నీవె పనిగొనను
నగ నేలె యాతఁడు నీ నటనకుఁ దగినట్టు
చిగులుతా సారె సారెఁ జెప్పినట్టు సేయఁగా

చ. 3: మేలు గాదా యిందరిలో మించి శ్రీవెంకటేశ్వరు
నాల వై మావంటివారి నాదరించేవు
సోలుచు నీ రాజసాలు చూపేవు నీ కెదు రేది
వేళ గాచి యతఁడు నీ వెంట వెంట రాఁగా

రేకు: 0355-6 సామంతం సంపుటం: 11-330

పల్లవి: తత్తరపు నీలోని తాపము మానితేఁ జాలు
యిత్తల మీఁదటి పను లెట్టయినాఁ గాని

చ. 1: పక్క నుండఁగానె నన్ను భ్రమసి పేరఁ బిలిచే
వెక్కడ పరా కైతి వేరా నీవు
తక్కక నీవు మోహించేదాని గుఱుతు చెప్పరా
యిక్కడికిఁ దోడి తెచ్చే యె గ్గినాఁ గాని

చ. 2: ఆకు మడి చియ్యఁగానె అవ్వలఁ జేయి చాఁచేవు
యేకడ వున్నది చిత్త మేరా నీవు
ఆకెతో నీకు నే మని ఆతుమ చెప్పవలసె
చేకొని నాతోఁ జెప్పర చెప్పి వచ్చేఁ గాని

చ. 3: నేమాన నేఁ గూడఁగాను నిలువెల్లఁ గరఁగితి
వే మాఁట దలఁచుకొంటి వేరా నీవు
యేమిర శ్రీవెంకటేశ యెవ్వతె జగడించెరా
కామించి యాన తీరా వొక్కటి సేసేఁ గాని

రేకు: 0356-1 సాళంగం సంపుటం: 11-331

పల్లవి: నీ చెయ్యే మీఁ దాయ నీకుఁ జెల్లురా నిన్ను
యేచి వలపుల బయ లీఁదించ నైతిరా

చ. 1: మంచివానివలెనె మాట లాడఁ బిలిపించి
కంచముపొత్తుకుఁ దీసి కాకు సేసేవు
వంచనతో దవ్వులనె వట్టిగట్టు చేసి నిన్ను
పెంచి నీచేఁ బ్రియము చెప్పించ నేర నైతిరా

చ. 2: బత్తి గలవానివలె పానుపుమీఁదికిఁ దీసి
హత్తి సిగ్గువడ నంటా నట్టె నవ్వేవు
కొత్త సతులవలెనె గొందులనుండి నిన్ను
తత్తరాన నాడ కెడతాఁకించ నైతిరా

చ. 3: యిచ్చకునివలెనె యెలయించి నన్నుఁ గూడి
అచ్చల నా సుద్దులెల్ల నాడుకొనేవు
మెచ్చుగా శ్రీవెంకటేశ మేర మీరి ఆవేళనె
కచ్చు పెట్టి నీ మోవి గంటి సేయ నైతిరా

రేకు: 0356-2 దేసాళం సంపుటం: 11-332

పల్లవి: కడుఁ బసిబాలుఁడవు కటకటా
యెడతాఁకి బడలితి విటువలెఁ గలదా

చ. 1: యేయడనుండి నా యన్న యిపు డాడి వచ్చితివి
కాయ మెల్లఁ జెమరించెఁ గటకటా
బాయిట నాడుతా నెంత పరువులు వెట్టితివో
యీయెడ బుస కొట్టేవు యిటువలెఁ గలదా

చ. 2: విందుల నెవ్వరియింట వేఁడిపా లారగించితి
కందువ నీ మోవి వొక్కెఁ గటకటా
మందలించి యా డేడ మడుగులు చొచ్చితివో
యందు నీమై గరుపారె నిటువలెఁ గలదా

చ. 3: యెన్నెన్నిచోట్ల నీవు యేమి సేసి అలసితో
కన్నుల నిద్దుర దేరీఁ గటకటా
పన్నిన శ్రీవేంకటాద్రి బాలుఁడ వై నవ్వేవు
యిన్ని నీవే యెరుఁగుదు విటువలెఁ గలదా

రేకు: 0356-3 బౌళి సంపుటం: 11-333

పల్లవి: చాలుఁ జాలు నాతోడి చల మేఁటికి
ఆలరి వై వుడికించి ఆదరించ నేఁటికి

చ. 1: జల్లజంపు గాఁకతోడ జాగులు సేయ నోప
అలాడ నేకాంత విరహమే చాలు
పెల్లున నప్పటి నన్నుఁ బిలవకురా నీవు
యిల్లిందాఁకా కాఁకఁ బెట్టి యిఁక నేల ప్రియము

చ. 2: పలు మంచిమాటలనె భ్రమఁబడ నోప నాకు
అలర నీతో వావాద మయినా మేలు
తల యెత్తి మోము చూపి తగులకురా నన్ను
వొలసీ నొల్లక వుండి వూరడించ నేఁటికి

చ. 3: బేసబెల్లి కాఁగిటిబిగువుకు నే నోప
రేసులతో నవ్వు నవ్వే వాసులే మెచ్చు
ఆస యిచ్చి శ్రీవెంకటాధిప నన్నుఁ గూడితి
వేసటగా నలయించి వేఁడుకొన నేఁటికి

రేకు: 0356-4 తెలుఁగుఁగాంబోది సంపుటం: 11-334

పల్లవి: ఏల మమ్ము భ్రమయించే రింతులాల
తేలించేరు మాటలనే తెరవలాల

చ. 1: సిగ్గులు యెగ్గులు వాసె చీఁదక చీమిడి వాసె
దగ్గరి మీ రుండితేఁ దరుణులాల
వొగ్గితి మెంగిలితమ్మ కొకయింత దయ లేదు
వెగ్గళించే రప్పటిని వెలఁదులాల

చ. 2: పాపము లన్నియుఁ దెగె బంధము లన్నియునూడె
కొపగించుకొంటే మీరు కొమ్మలాల
తీపుల మా దేహము తెగ నమ్మితిమి మీకు
యేఁపుల నేల పెట్టేరు యిట్టె సతులాల

చ. 3: దావతిపాట్లు మానె తరవు లుడిగెను మా
తోవ రాకుండితేఁ జాలు తొయ్యలులాల
శ్రీవెంకటేశ్వరుఁడు చేరి మమ్ము దయ నేలె
చేవ దేరె మీకు మాకుఁ జెలులాల

రేకు: 0356-5 సామంత సంపుటం: 11-335

పల్లవి: సిగ్గుపడి నీవు నాతోఁ జెప్ప జాల వింతే కాక
కగ్గిన నీ విరహము కాన రాదా నాకు

చ. 1: చెక్కుమీఁది చేయే చెప్పీఁ జిత్తములోపలిచింత
యిక్కడాఁ బతిపై మోహ మేల దాఁచేవే
లక్కవలెఁ గరఁ గొకలాగుల మాట లాడేవు
నెక్కొన్న విభావములు నే నెరఁగనా

చ. 2: కన్నులచూపులె చెప్పీ గాయముతో తమకము
యెన్నికలు నీవు నాతో నేల దాఁచేవే
పన్ని చెమరించుకొంటా పైపై బొంకేవు నాతో
వెన్నెల నీసుద్దు లెల్ల వినకున్నదాననా

చ. 3: నెలవినవ్వులె చెప్పీ శ్రీవెంకటేశునిపొందు
యెలమి నింకా నాతో నేల దాఁచేవే
వెలయ నాతఁడె నిన్ను వెల్లవిరిగాఁ గూడె
నిలువు నూరూఁ బండె నీ కెలె వెరపూ

రేకు: 0356-6 పాడి సంపుటం: 11-336

పల్లవి: ఎప్పుడు మంచిదాననె యిదివో నీకు నాతో
చెప్ప వద్దు గాని నీకు సెల విచ్చేను నేనూ

చ. 1: నిచ్చలూను నిజ మాడి నీకుఁ బగ యవుకంటే
రిచ్చల నూరకుండితే రేఁచ నే లయ్య
హెచ్చి నే నే మనినాను యీారు దియ్యఁ బేను వచ్చు
కుచ్చితము గాదు లోనఁ గూచుండే నేను

చ. 2: కూరిమి నీవెంట వచ్చి గుండెదిగు లవుకంటే
బీరాన నే నీడ నుండేఁ బిల్వకు వయ్య
కేరడాన నట్టె గోర గీరితే నేరు లవును
నేర నంతేసి యిచ్చలు నిద్దిరించే నేనూ

చ. 3: గక్కువ నీ మోవి యాని గంటు రాఁగించుకంటే
చిక్కి నీ వశాన నుండే చెనక కయ్యా
పక్కన శ్రీవెంకటేశ బలిమి నన్నుఁ గూడితి
వక్కర దీరినమీఁద నలయించ కయ్యా

రేకు: 0357-1 నాదరామక్రియ సంపుటం: 11-337

పల్లవి: నే నెంత నీ వెంత నీతోనే బలిమా
మానరాని కృపతోడ మన్నించితి గాక

చ. 1: చిత్తము వచ్చి నావద్ద చేరి వున్నాఁడవు గాక
వొత్తుకోలు వల పైతే వుండేవా నీవు
యెత్తిన కోపపుదాన నేమి బాఁతి నే నీకు
బత్తి సేసితివి నాభాగ్య మింతే కాక

చ. 2: పిలిచితి విచ్చేసితి ప్రేమ గలుగఁగఁగాక
సొలసితేఁ బరులకు సులభుఁడవా
చెలులల మీ కెంత లేదు చేరి నాతోనె మాట
పలు కాడే విదే నాభాగ్య మింతే కాక

చ. 3: యిద్దరి మొక్కటి గాఁగ నిన్నియు నమరెఁ గాక
పొద్దు వోనిచోట చవి పుట్టీనా నీకు
గద్దరి శ్రీవెంకటేశ కాఁగిట నన్నుఁ గూడితి
బద్దు గాదు మెచ్చితి నాభాగ్య మింతే కాక

రేకు: 0357-2 దేసాళం సంపుటం: 11-338

పల్లవి: ఎట్టు గెలువంగ వచ్చు నిటువంటివాని నిన్ను
పట్టినచలముతోడ భ్రమలఁ బెట్టితివి

చ. 1: మంచిమాట లాడఁగానె మఱచితి నిన్నియును
అంచెల నేఁ గోపగించే నంటా నుంటిని
యెంచి కన్ను లెఱ్ఱ చూడు యిటువంటిదాని నన్ను
మంచముమీఁదికి దీసి మరిగించితివి

చ. 2: చెక్కు నీవు నొక్కఁగానె చిత్త మెల్లఁ గరఁగితి
అక్కరతోఁ గాఁగి లియ్య నంటా నుంటిని
మిక్కిలి నాకాఁక చూడు మీరి వచ్చేదాని నన్ను
వెక్కసాన నొడి వట్టి వెఱ్ఱిఁ జేసి తిపుడు

చ. 3: వొద్దికి నీవు రాఁగానె వొడఁబడితిఁ గాకిట్టె
అద్దలించి ఆన వెట్టే నంటా నుంటివి
గద్దరి శ్రీవెంకటేశ గబ్బి నైననన్నుఁ జూడు
ముద్దుమోము యిచ్చి కూడి మొక మోడించితివి

రేకు: 0357-3 సామంతం సంపుటం: 11-339

పల్లవి: ఇంత చలము నీ కే లమ్మా
కొంతయినఁ దెలుసుకో వమ్మా

చ. 1: అలుకలుఁ బులుకలు నాతనితోడను
వలవని దేఁటికి వద్దమ్మా
మొలకల నవ్వులు ముంచఁగ నీకిఁకఁ
దల వంచు కొనఁగఁ దఁగ దమ్మా

చ. 2: పెనఁగులు జనుగులుఁ బెట్టేవు పిలువఁగ
పని మాలినపని బలు వమ్మా
చనవులు నీ పతి చల్లఁగ మరి యిఁక
వెనకటిమంకులు విడ వమ్మా

చ. 3: అసురులు నుసురులు నందినకాఁగిట
వసివాడులు నిఁక వలె నమ్మా
యెసగిన శ్రీవెంకటేశుఁడు గూడెను
పొసఁగె నిన్నియును భోగించ వమ్మా

రేకు: 0357-4 మధ్యమావతి సంపుటం: 11-340

పల్లవి: పంతములే నెరుపేవు పలుమారును
యెంత కెంత విచారించ కిది నీకుఁ దగునా

చ. 1: వీడ నాడేవు విభుని వీసమంత పని కైన
తోడనె కొండవంటి దొర గాఁడా
యేడ నైనా నీ వైతే నెకసక్కేమే సేసేవు
జాడతో నీచే నాతఁడు సాదింపఁబడునా

చ. 2: చెలరేఁగే వది యేమే చేతికి లోనాయ నంటా
వలపు నీమీఁదఁ గలవాఁడు గాఁడా
సొలసి సొలసి వోరచూపుల జూచే వదేమే
చలపాదితన మింత సతులకుఁ చెల్లునా

చ. 3: సిగ్గువడే విది యేమే చేయ నీపై వేసె నంటా
యెగ్గు లేని శ్రీవెంకటేశుఁడు గాఁడా
అగ్గ మై నీచిత్తము రా నన్నిట నాతఁడు గూడె
కగ్గ దేరినందుమీఁదఁ గపటము చెల్లునా

రేకు: 0357-5 ఆహిరి సంపుటం: 11-341

పల్లవి: ఎందు కైన వచ్చు నీయిటువంటి భావములు
విందుగా నాతో నాడవే వింటా నున్నాఁ డాతడు

చ. 1: చెక్కునఁ బెట్టేవు చేయి సిగ్గుకో చింతకో కాని
తక్కక నేపతిసుద్ది దడవితేను
పక్కన నవ్వే వందుకు పగటో నీ పల్లదమో
వొక్కమాటె ఆన తేవే వొద నున్నాఁ డాతఁడు

చ. 2: తప్పక చూచే వదేమే తగలమో కోపమో
చిప్పిల నాతని నీ చేతి కియ్యఁగా
కుప్పేవు పయ్యదకొంగు కసరులో కొసరులో
వొప్పుగా నాకుఁ జెప్పవే వూరకున్నాఁ డాతఁడు

చ. 3: పవ్వళించే యేమే నీ పంతనాలో పొంతనాలో
యివ్వల శ్రీవెంకటేశుఁడెడ మియ్యఁగా
దవ్వుల నుండిననన్ను దగ్గరఁ బిలిచే వేమే
నివ్వటిల్ల నాన తీవే నిన్నుఁ గూడె నతఁడు

రేకు: 0357-6 బౌళి సంపుటం: 11-342

పల్లవి: కూళతనమౌ బత్తి గొట్టమునఁ బెట్టఁ బోతే
ఆలసించ కిఁక లేవే ఆకెతోఁ జెప్పుదము

చ. 1: వదలి మనసు రానివాని మాట లెన్నైనా
పెదవులపైనె కాని ప్రియము లేదు
యిదివో తారాఁ డట యీాడ నుండ మన కేల
ఆదనఁ బోదము రావె ఆకెతోఁ జెప్పుదము

చ. 2: ననుపు లేనివాని నగవు లెందాఁక నైన
పని మాలుటే కాని ఫలము లేదు
మనవు లడగఁ డట మనమే చెప్పఁగ నేల
అనమానించక రావె ఆకెతోఁ జెప్పుదము

చ. 3: ఆరయ రాజసపువాఁ డాస లెన్ని వెట్టినాను
పేరడి నుండుటె కాని పెనఁగ రాదు
యీారీతి శ్రీవెంకటేశుఁ డింత చేసి చెలిఁ గూడె
ఆరితేరె నా సుద్దులె ఆకెతోఁ జెప్పుదమూ

రేకు: 0358-1 పాడి సంపుటం: 11-343

పల్లవి: ముద్దు గారీఁ జూడరమ్మ మోహనమురారి వీఁడె
మద్దులు విరిచిన మా మాధవుఁడు

చ. 1: చల్ల లమ్మ నేరిచినజాణ గొల్లెతల కెల్ల
వల్లెతాడు మా చిన్న వాసుదేవుఁడు
మొల్లపు గోపికల మోవిపండులకు నెల్ల
కొల్లకాఁడు గదమ్మ మా గోల గోవిందుఁడు

చ. 2: మందడిసానుల కమ్మని మోముఁదమ్ములకు
చెందినతుమ్మిదవో మా శ్రీకృష్ణుఁడు
చంద మైన దొడ్డివారి సతులవయసులకు
విందువంటివాఁ డమ్మ మా విఠలుఁడు

చ. 3: హత్తిన రేపల్లెలోని అంగనామణుల కెల్ల
పొత్తుల సూత్రము మా బుద్ధుల హరి
మత్తిలి వ్రేతెల నిండుమనసుల కెల్లాను
చిత్తజునివంటివాఁడు శ్రీవెంకటేశుఁడు

రేకు: 0358-2 ముఖారి సంపుటం: 11-344

పల్లవి: ఊరకె గుట్టు సేసుక వుండనీ వయ్య
పేరఁ బెట్టినటువంటి పెరగె మాజరగు

చ. 1: గొల్లవారిమాఁటలు గోనుఁ బువ్వువాటులు
కెల్లు రేఁచి మమ్ముఁ బలికించకు వయ్య
కొల్లలాడే బాగులు గొడ్డుఁబుల్లతేగెలు
నొల్లనొల్లమి విడే లుంగిటయ్యో మాకును

చ. 2: చిత్తములో మంకులు చేతు కెల్లా అంకులు
బత్తితో మమ్ము బలిమిఁ బట్టకు వయ్య
గుత్త మైనమేడలు కొమ్మిమాకునీడలు
కొత్త సున్నపుటిండ్ల కొర యాల మాకును

చ. 3: తొలుతే మా కాఁపురాలు తోఁపుతిత్తి దాఁపురాలు
తిలకించి మా వొడి సోదించకు వయ్య
నెల వైశ్రీవెంకటేశ నీవు మమ్ముఁ గూడితివి
మొలకలపులకలు మోపు లాయ మాకును

రేకు: 0358-3 ఆహిరి సంపుటం: 11-345

పల్లవి: ఆఁటదానిపై నీ బలు వంతయునుఁ జూపేవా
నాఁటెనా నీ ఆయములు నవ్వుల నా మాటలు

చ. 1: వాలుకరెప్పలు వంచి వడిఁ దప్పక చూచేవు
వొలి నిందాఁక నేడ నుంటి వంటేను
తాలిమి లే కప్పటికి తగఁ గసరుకొనేవు
యేలని నెంజిరి వికం నెంతటాఁ దీరదురా

చ. 2: చేరి మారుమోముతోఁ బిల్చిన నాతోఁ బలుకవు
మేర మీరే నీ గుణాలు మెచ్చే నంటేను
దార దప్ప కందుకె తగఁ బంతా లాడేవు
యేరా నా పై కోప మెంత నీ కున్నదిరా

చ. 3: కోక గట్టుక నాతోను కోరివాదుకు వచ్చేవు
కైకొని నీ పరువులు గంటి నంటేను
యేక మై యిట్టె శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
యీాడక నా గరిమెలు యెందు కైనా వచ్చురా

రేకు: 0358-4 శుద్ధవసంతం సంపుటం: 11-346

పల్లవి: ఓరి పో యిదేడ సుద్ది వుండఁ బట్టదా వోసి
వోరికొట్లు గొట్టఁగా వొద్దికి వచ్చితినే

చ. 1: గొల్లపిన్న వాఁడా గోవులఁ జక్కఁ గావరా
యిల్లిదె మావాకిలి నీ వేల కాచేవు
కల్ల గాదె నీమాట నేఁ గాచే ఆవులపాల
చల్ల లమ్మఁ బోఁగానె పో సాదించ వచ్చితిని

చ. 2: బాలకృష్ణబోయిఁడా పసులు వల్లె వేయరా
వాలుఁ జూపుల మ మ్మేల వల్లె వేసేవు
నేలనుండి మాకోడెలు నీ యింటిచూరు మేసె
తోలవైతి వందుకే పో దూరులు వేసితిని

చ. 3: నాలి శ్రీవెంకటేశుఁడ నాచన్ను లెల పట్టేవు
చాలదా నీవు పసుల చను పట్టేది
మేలిమి ఆవులవారి మెలుతలు మీరు గాన
మూల నన్ను మీ చన్నులు ముట్టి నేఁ గూడితిని

రేకు: 0358-5 హిజ్జిజి సంపుటం: 11-347

పల్లవి: మంచవాని వలనె మాటలు నాడేవు గాక
దించరాని తమకపు దేవరవు గావా

చ. 1: గుట్టున నెవ్వతెమీఁది కోపాన వచ్చి య దెల్ల
వెట్టికి నింటివారిపై వెళ్ళించేవు
దిట్ట నే నొకతెఁ గాఁగా దో కొంటిఁ గాక నీతో
అట్టిపాటి యాఁట దెల్లా నండకు రాఁగలదా

చ. 2: బిగిసి యాడ నెవ్వతే పిలువనికాంతాళన
నగుతా నెవ్వరే మనినాఁ దిట్టేవు
అగపడి నేఁ గాఁగా నన్నియు నమరెఁ గాక
నిగిడి వేరొక్క తై తే నీతోఁ బొందు సేసునా

చ. 3: ఆవల నెవ్వతెతోను అలిగినవాఁడవై
కవ గూడి నన్ను నిట్టె కాఁక సేసేవు
నవ మై శ్రీవెంకటేశ నాకె మజ్జాతి గాక
నివిరి వేరొక్క తై తే నీతోఁ బిందు సేసునా

రేకు: 0358-6 మాళవిగౌళ సంపుటం: 11-348

పల్లవి: ఓప నన్న విడవవు వూఁకొను మనేవు నీవు
నీ పను లివెల్లాను నిన్ననె పో వింటివి

చ. 1: మాను మన్న మానవు మా తొనె నీ సుద్దు లెల్లఁ
దేనె పూసి చెప్పి చెప్పి తేలించేవూ
కాని కాని అందు కేమి కల్ల లాడేవాఁడవా
నే నెరుఁగుదు నంతాను నిన్ననె పో వింటివి

చ. 2: వద్దన్నా విడువవు వాకిటఁ గూచుండీ నీ
పెద్దరికె లెల్ల నాతో పెంచి చెప్పేవు
కద్దు గద్దు నీవల్ల కడము లేమి లేవు
నిద్దరించు నీ గుణము నిన్ననె పోవింటిని

చ. 3: సిగ్గు వడ్డాఁ బో నీవు చేయ వట్టుకొని నాతో
అగ్గలపుఁ బచ్చిమాట లవి చెప్పేవు
దగ్గరి శ్రీవెంకటేశ తగు నన్నుఁ గూడితివి
నిగ్గుల నీ కత లెల్ల నిన్ననేపా వింటని

రేకు: 0359-1 శంకరాభరణం సంపుటం: 11-349

పల్లవి: అదివో నీ రమణుఁడు అలుగఁగఁ దరి గాదు
యెదిటికి రావు లోన నేమి సేసేవే

చ. 1: చిలుక పావురము చెరకు శింగిణివిల్లు
వలరాజు దాడి ముట్టె వసంతవేళ
బలిమిఁ గోవిలకూఁత పరివారముల మోఁత
యెలమి నదివో లోన నేమి సేసేవే

చ. 2: పొడవు మీను టెక్కెము పూవులయమ్ములపొది
వెడలె వరుఁడు దండు విరహులపై
యెడయని వెన్నలలు యెగయుఁ బౌఁజుల ధూళి
యిడమఁ జింతతో లోన నేమి సేసేవే

చ. 3: చిగురుఁజొంపపు జల్లి చిరుతగాలి ప్రధాని
మగటిమిఁ గాముఁ డెక్కె మనసులపై
తగిన శ్రీవెంకటాద్రి దైవ మిట్టె నన్నుఁ గూడె
యెగసక్కెమున లోన నేమి సేసేవే

రేకు: 0359-2 వరాళి సంపుటం: 11-350

పల్లవి: వాకిట కాతఁడు రాఁగా వద్దంటినా
చేకొని నా కేల చెప్పేవే బుద్ధులు

చ. 1: మన సాతనితగులు మాటలు నీతో తగులు
వొనర నన్నే మనేవే వో చెలియ
కనుచూపు లాతనిపై కాఁకలు నామేనిమీఁద
పెనఁగీ నింకా నేల పెంచేవే దూరులు

చ. 2: సిగ్గు లాడ కంపితిని చెక్కుచేయి నాకు నిదె
యెగ్గులు దప్పులు లేవు యే మనేవే
దగ్గరెఁ దనపొరువు తాలిమి నాకుఁ గరవు
నిగ్గుల నాపయి నేల నించేవే కోపము

చ. 3: ముంగిట నాతఁడున్నాఁడు మూల నున్నదాన నేను
అంగడి కెక్కె వలపు లవుఁ గదవే
రంగుగా శ్రీవెంటాద్రిరాయఁ డిట్టె నన్నుఁ గూడె
సంగ తాయి నీ కోరికె చల మేలే యిఁకను

రేకు: 0359-3 పాడి సంపుటం: 11-351

పల్లవి: మేలు మేలు రాఁగా రాఁగా మెచ్చితి నిన్ను
కోలు ముంద్దై యుందే కాక కొండకుఁ బొయ్యేవా

చ. 1: సంతసాన నేనీతో జరసి మాటడఁగాను
పంతము దప్పీ నంటాఁ బలుకవు
రంతుల నేఁడె నీకు రాజస మెంత గల్లాను
కాంతలమీఁదనె కాక కడఁ జూపేవా

చ. 2: సలిగెతో నేనెంత నటలు సేసిన నీవు
చలము దప్పీ నంటా సరి నగవు
పెలుచుఁదనాన నీకు బీర మెంత గలిగినా
చెలులమీఁదనె యింత సేయక మానేవా

చ. 3: యేపుననీ ముందటనె యెంత నిలుచుండినా నీ
చూపు లరగీ నంటాఁ జూడ జాలవూ
బాపుర శ్రీవెంకటేశ పచ్చిగాఁ గూడితి నన్ను
నీ పొందు నాతోనె కాక నేఁడు మానేవా

రేకు: 0359-4 సామంతం సంపుటం: 11-352

పల్లవి: నీవు విరహి వవుట నే నెరఁగనా
భావించ యెవ్వ రవుతా నేర్పరచలేఁ గాని

చ. 1: కాఁకలు నీ మాటలోనే కాన రాదా నీ మేను
సోఁకించి నా కప్పటిని చూప వలెనా
యేఁకట నాకయిన దిన్ని యెవ్వతెకు నీ వైనది
తేఁకువ నీ రెండూను తెలియలేఁ గాని

చ. 2: కరఁగులు నీ మోము కళలోనె కాన రాదా
ఆర మరిచితి నంటా నాడవలెనా
ధర నిది నా కవుత తగ వేరొకతె కవుత
యిరవుగ నిది నిశ్చయించలేఁ గాని

చ. 3: కూటమి నీ కాఁగిటితో గురి సేయవలెనా నీ
తేటలు ప్రియాలలోనె ద్రిష్టము గాదా
మేఁటివి శ్రీవెంకటేశ మించి నన్నుఁ గూడితివి
యాఁటదాటిపొందవుత అరయలేఁ గాని

రేకు: 0359-5 మంగళకౌశిక సంపుటం: 11-353

పల్లవి: ఇప్పుడె సవతితన మేరుపడె నాకు నేఁడు
తప్పులేదు యిఁక నన్నుఁ దడవక పోవే

చ. 1: ఆతఁడె నీమీఁదిబత్తి అవు నట యిఁక నీవు
యీతల వెంగెము లాడి యేమి సేసేవే
కాతరాన మా గుట్టు కడు బయట వేసితి
భీతి వాసె నిఁక నీవు బీరము లాడకువే

చ. 2: వూరకె మా యింట నాతఁడున్నాఁ డంటా నాడేవు
సారెకు నీవిఁక మరి సాదించే దేమే
యీరీతి మా చలి వాపి యింత అట్టు సేసితివి
తేరెఁ బను లన్నియును తెగ నాడేఁ బదవే

చ. 3: శ్రీవెంకటేశ్వరుడు నాకుఁ జేరి వొప్పగించితివి
కావించి నీ వాడేనింద గట్టాయ లేవే
వేవేగ నాతఁడు నన్ను విచ్చనవిడిఁ గూడెను
దేవరే మేలు సేసె తెరమరఁ గేఁటికే

రేకు: 0359-6 ఆహిరి సంపుటం: 11-354

పల్లవి: అప్పుడువో నన్నుఁ జూచే దంతా నీవు
చెప్పక నీవు దాఁచినచెలిఁ గంటేఁ గాని

చ. 1: చెప్ప రాదు గాని నా చిత్తములోని చింత
వుప్పతిల్లి వున్నది నా వొళ్లఁ జూడరా
కప్పురానాఁ బోదు చల్లగాలిచేతా నారదు
తప్పదు నిన్ను రానీనిదానిఁ గంటేఁ గాని

చ. 2: చూప రాదు గాని నా చుట్టుకొన్నతమకము
ఆఁప రానినిట్టూరుపు లందుఁ జూడరా
తీపుల మాటలఁ బోదు తేటల వెన్నలఁ బోదు
తాపి య్యై నిన్ను బోదించేదానిఁ గంటేఁ గాని

చ. 3: యెంచ రాదు గాని నా యీరసపుఁ జలములు
యించుక నా కాఁగిటిలో నిదె చూడారా
ముంచిన శ్రీవెంకటేశ మూసి మంతనాలఁ బోదు
అంచెల నీ మేలుదాని నట్టెకంటేఁ గాని

రేకు: 0360-1 ముఖారి సంపుటం: 11-355

పల్లవి: బాపు బాపు జాణ గదే బావఁగారు
కోపగించీ నోప నంటే గోల బావఁగారు

చ. 1: చనవు సేసుక నాతో సారె సారె నవ్వీని
పని లేదు తన కేమి బావఁగారు
వినరె మాటల నుప్పు వేసి పొత్తు గలసీని
పెనఁగి యెక్కడ నైనా పెద్దబావఁగారు

చ. 2: నయమున నా యెదుట నన్నుఁ బేరుకొని పాడి
బయలు పందిలి వెట్టీ బావఁగారు
ప్రియముతో మంచ మెక్కీ పిలివని పేరంటము
లయకాఁడు గదవే తొలఁగుబావఁగారు

చ. 3: సులభానఁ దానె మెచ్చి సొమ్ము లెల్లా మెడఁ గట్టీ
బలిమికాఁడు గదవే బావఁగారు
తొలఁగక నన్నుఁ గూడి దొరకోలు సేసుకొని
చెలఁగీ శ్రీవెంకటాద్రి చిన్నబావఁగారు

రేకు: 0360-2 కేదారగౌళ సంపుటం: 11-356

పల్లవి: ఏల నిలువఁ బెట్టేవు యింతేసి వలపులు
పోలికలు గాన రాదా పోయనందుకే

చ. 1: ఆన వెట్టేవు నామీఁద నక్కర గల నంటాను
కాని కాని అందు కేమి కడమా నేఁడు
యీనిజము లెంచఁ బోతే యీరుదియ్యఁ బేనువచ్చు
వోరి నన్ను గుట్టుతోనె నూరకుండ నియ్యరా

చ. 2: తారుకాణించ వచ్చేవు తలఁతు న న్నంటాను
సారె సారె నందు కేమి చాలదా నేఁడు
మారుబాణము లెంచితే మంచముకిందే నుయ్యి
నేరుపుతోఁ బరాకున నెత్త మాడ నియ్యరా

చ. 3: పులకలే చూపేవు పొంది కరఁగితి నంటా
తలతల అందు కేమి తగదా నేఁడు
యెలమితో శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
పలుకుఁబంతము చెల్లె భావించుకో నియ్యరా

రేకు: 0360-3 వరాళి సంపుటం: 11-357

పల్లవి: ఎరవులదానివలె నెందు వొయ్యేవే ఆత
నిరవులు వెదకవే యేమి సేసివో

చ. 1: కంకణాల చేతుల కదల నూఁచుకొంటాను
యింకనిచెమటలతో నెందు వొయ్యేవే
అంకెల నీయింటికి నాతఁడె విచ్చేసె
యింకా రాఁడా వెర గయ్యీ నెంతఁ బోయనో

చ. 2: సెలవుల నవ్వుకొంటా చెంపలఁ దురుము జార
యెలమి నసురుసు రై యెందు వొయ్యేవే
కొలఁది లేనిసొమ్ములు కొంట వచ్చె నీకు నిట్టె
యెలయించి నాతోఁ జెప్పి యేడ నున్నాఁడో

చ. 3: బంగారు పాదాలతోడ పట్టుచీర కొంగ జార
యింగితాల గాన రాఁగా నెందు వోయ్యేవే
అంగన శ్రీవెంకటేశుఁ డప్పుడె నిన్నుఁ గూడెనో
రంగై నీ వెంటనె వచ్చే రాఁపుల వీఁడు గదే

రేకు: 0360-4 కాంబోది సంపుటం: 11-358

పల్లవి: చాలుఁ జాలుఁ దనిసితి సటలనె నేఁ డెల్ల
తాలిమి నిందుకై నిన్నుఁ దప్పక చూచేను

చ. 1: నేయ రానిచేఁత లెల్లఁ జేసి వచ్చి నీవు నన్ను
పాయిని చుట్టమువలెఁ బై కొనేవు
కాయకపువారికె కాని లే వీ వినయాలు
వొయమ్మ నిన్నే మనే నూరకుండేఁ గాక

చ. 2: చిత్త మెక్కడనో పెట్టి చేరి నాతో మాయలకు
బిత్త గలవానివెల పలికే విదే
హత్తి గాయగంట్లై కాని అంతేసి నేరరు
యిత్తల నెట్టు పూఁకొందు నిట్టె నవ్వేఁ గాక

చ. 3: తేరకల్లె నెవ్వతెనో తెచ్చి యాపెచేత నాకు
చేరికొనఁ బెట్టి సేవ సేయించేవు
నేరుపు శ్రీవెంకటేశ నీకె కాని లేదు
సారెనన్నుఁ గూడితివి సమ్మతాయ నిదివో

రేకు: 0360-5 కొండమలహరి సంపుటం: 11-359

పల్లవి: ఇంతటా నీ మనసు రా దెగ్గు లెచం నేఁటి కోయి
చింతతో నుందాన నంటా సిగ్గు వడే వోయీ

చ. 1: చిత్తమును నోవకుండా చిన్నఁబోయి వుండకుండా
మెత్తనిమాట లాడితే మే లదే వోయి
కొత్త లెల్లఁ దొఁచకుండా గుట్టు నీకుఁ జెడకుండా
పొత్తుల నవ్వు నవ్వితి పూఁచి మెచ్చ వోయి

చ. 2: జగడాలు రాకుండా చనవునుఁ దప్పకుండా
సగముచూపు చూచితి చాలదా వోయి
తగులమిఁ బాయకుండా తప్పు నీపైఁ జేయకుండా
మొగము వంచితి నే నీ ముందరనె వోయి

చ. 3: నింద నీపై మోయకుండా నేమమూనుఁ దప్పకుండా
అంది నేఁ బరా కైతి నప్పడే వోయి
కందువ శ్రీవెంకటేశ కాఁగిలించితివి నన్ను
చంద మాయ నిద్దరికి సరి లేదు వోయి

రేకు: 0360-6 పాడి సంపుటం: 11-360

పల్లవి: ఎవ్వ రేమి చెప్పిరె యింతలోననే
నివ్వటిల్ల వింత లెల్ల నేరుచుకొంటివా

చ. 1: మోము చూచి నవ్వఁగానె మోనానఁ దల వంచేవు
యేమిటికే కోపము నీ కెన్నఁడు లేమి
కామించి పిలిపించి కడసారె నలిగేవు
నేమమున నివి గొన్ని నేరుచుకొంటివా

చ. 2: దగ్గరి నేఁ గూచుంటె తగ లేచి నిలిచేవు
సిగ్గు గొంత జిగి గొంతఁ జిలికే వేమే
అగ్గలపుఁ బ్రేమ చల్లి అంతలోఁ బిరి తీసేవు
నిగ్గులు నీడలు కొన్ని నేరుచుకొంటివా

చ. 3: కాఁగిట నే నించఁగాను కన్నులు మూసుకొనేవు
మాఁగఁ బెట్టేవు వలపు మతిలో మేలే
పాఁగిన శ్రీవెంకటపతి నన్నుఁ గూడితవి
నీఁగనిరతులు నేఁడు నేరుచుకొంటివా

రేకు: 0361-1 ముఖారి సంపుటం: 11-361

పల్లవి: తనవొళ్లి భయ మింతే తప్పులు నేఁ బట్టేనా
వినవె సిగ్గు వడీని వేగిరించ నేఁటికే

చ. 1: అద్దము నేఁ జేడు మంటె నాన వెట్టి నవ్వీని
అద్దలించి తన్ను వెంగె మాడేనా నేను
వొద్దికి నే రమ్మంటే నూరకే అట్టట్టు వొయ్యీ
సుద్దు లింతే తన మేను సోదించ వచ్చేనా

చ. 2: జలక మాడే మంటేను సారె సారెఁ దల వంచీ
యెలమిఁ దన కెగ్గవుత యెరఁగను
అలరులు ముడిచే నంటేఁ దా లోఁగీని
మలసి వాడుఁ జూపుల మచ్చము వట్టేనా

చ. 3: నిద్దరించు మంటేను నిట్టచూపు చూచీని
యిద్దరి జాగరాలు నే యెత్తి పెట్టేనా
కద్దులె శ్రీవెంకటాద్రి ఘనుఁ డిట్టె నన్నుఁ గూడె
ముద్దమోము చూచి చూచి మొగ మోడ కుండేనా

రేకు: 0361-2 సౌరాష్ట్రం సంపుటం: 11-362

పల్లవి: ఇందు కేల అలుగ మాయింటికి విచ్చేయవయ్య
ముందు మందె నీకు నేము మొక్కేము గాని

చ. 1: యేడ నైనా జేయి చాచే విందుకే పో సిగ్గువడి
ఆడరాని మాటలు నే నాడితిఁ గాక
జాడతో నేక మైతే సారె నీ వేమి సేసినా
కూడ దనేనా నీకు గుట్టు లేదు కాగ

చ. 2: కొలువులో నుండి నీవు కొంగు వట్టి తియ్యఁగానె
వెలయఁగ విదలించి వేసేఁ గాక
సెలవునఁ బానుపుపై నిన్నుఁ గసరుకొనఁగ
చలమా నీ కక్కూరితే జరుపేపు గాక

చ. 3: నిద్దుర వోయేవేళ నీవు నన్ను లేపఁగాను
అద్దమరేతిరి వోప నంటిఁ గాక
యిద్దరము సమ్మతల్లి యిటువలెఁ గూడితిమి
అద్దో శ్రీవెంకటేశ అప్పు డేలో కాక

రేకు: 0361-3 శంకరాభరణం సంపుటం: 11-363

పల్లవి: ఇంత నేరకుండితే నీ వేల వచ్చేవు
వింత వింత వగ లెల్ల వింటిఁ గంటిరా

చ. 1: వాలుక రెప్పలు నే వంచిన మాత్రములోనె
నాలికాఁడ నీ తనువు నాఁటె ననేవు
యీలాగు మాట లాడి యిచ్చకాలు సేసుక
కాల మెల్ల బతికితి కానీ కానీరా

చ. 2: చల్లఁగా నే గందవొడి చల్లిన మాత్రములోనె
పల్లదాన తల దిమ్ము పట్టె ననేవు
కల్ల గాదు యింత మాయకాఁడవు గాకుండితేను
యెల్లవారిలోన నేఁడు యెట్టు వేగించేవురా

చ. 3: కొంకక నీ తొడమీఁద గూచున్న మాత్రములోనె
అంకెల నీ కళ దాఁకె నని అనేవు
సంకె లేక నీ వింతేసి జాణవు గాకుండితేను
పొంకపు శ్రీవెంకటేశ పొంచి నన్నుఁ గూడేవా

రేకు: 0361-4 ఆహిరి సంపుటం: 11-364

పల్లవి: నవ్వ నీకుఁ జెల్లు నట నాకుఁ గొసరఁ జెల్లదా
రవ్వగాఁ దడవుదురా రాజసపు వాఁడవు

చ. 1: సిగ్గుపడి వున్నమమ్ముఁ జేయి వట్టి తియ్య నేల
యెగ్గు వట్టె వేల నే నే మన్నాను
అగ్గల మై సరసము లాడ నేర్చినవాఁడ
వొగ్గి అన్ని మాటలనును వోరుచుకో నేరవా

చ. 2: జగడించి యున్నదాని చన్ను లంటి చూడ నేల
తగవులఁ బెట్ట నేల తల మంటెను
చిగులుతా మమ్ము నింత నేయ నేర్చినవాఁడవు
యెగసక్కెపు మాకోపా లిముడుకోఁ జాలవా

చ. 3: కన్ను మూసుకున్నదాని కాఁగిలించి పట్ట నేల
చిన్నఁ బోవ నేల నాచే దాఁకె నంటా
యెన్నికెతో శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
నిన్ను నన్ను నెంచుకొని నిండుకుండ నేరవా

రేకు: 0361-5 మాళవి సంపుటం: 11-365

పల్లవి: నేరుపు గలితేఁ జాలు నీవే నేను
దూరి మాటాడ నోప మందు లిట్టె నూరకురా

చ. 1: యెప్పుడు నీ వారమే యేల పిలిచేవు మమ్ము
చప్పు నై నీ నోరు నొచ్చీఁ జాలించ రాదా
నెప్పున నే నీడ నుంటే నీ వద్ద నుండుట గాదా
ముప్పిరిఁ బెనఁగ నోప ముంజుయి వట్టకురా

చ. 2: పూడిగపువార మింతే వొడ లేల నిమిరేవు
తోడ నీచేతు లరిగీఁ దొలఁగ రాదా
నీడల నే నవ్వితేనె నీ పరిణామము గాదా
వీడ నాడ నే నోప వేసాలు సేయకురా

చ. 3: నీకు మేనదాన నింతే నీ వేల కిందు పడేవు
కాకై నీ రాజసము కైకో రాదా
యీకడ శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
నీకు నే సరిగా నోప నీ వంత మెచ్చకురా

రేకు: 0361-6 నాగవరాళి సంపుటం: 11-366

పల్లవి: ఎఱఁగ నైతి నిందాఁక యింత నీవు జోలిఁ బెట్టే
దెఱఁగుకో నిన్నుఁ గొల్చే దిందుకొరకా

చ. 1: మాయదారిమాటలే మాపుదాఁకా నాడి నా
కాయముపై నొరగితే కాఁక మానీనా
ఆయములు సళుపఁగ నాసపడి నీరాక
కీయెడ నేఁ గాచుకున్న దొందుకొరకా

చ. 2: నాటకపునవ్వులే నవ్వి నాతో వేగించఁగ
తాఁటలు దూఁటలే కాక తాపము మానీనా
కూటమి గలిగె నంటా కోరన సంతోషముతో
యీటున నుండిన దెల్లా నిందుకొరకా

చ. 3: పెనఁగి వట్టికాఁగిట బిగియించి సారె నా
తనువు నిమిరితేనె తని వయ్యీనా
ఘనుఁడ శ్రీవెంకటేశ గక్కునఁ గూడితి విట్టె
యెన లేని నీ మతకా లిందుకొరకా

రేకు: 0362-1 శంకరాభరణం సంపుటం: 11-367

పల్లవి: నేనె కూళఁ గాని వాడు నెరజాణఁడే
తానె నావెంటవెంటఁ దగిలీనె వీఁడు

చ. 1: మన్ననలు నాకు నిచ్చిన మరి నే నెంత దూరిన
కన్నులనె నవ్వు నవ్వీఁ గదవే వీఁడు
సన్న లెరఁగక నేనె సారెఁ దమకింతుఁ గాని
పన్ని నే నెం తలిగినఁ బదరఁడే వీఁడు

చ. 2: యిచ్చకము నాకుఁ జేసి యెంత నే నలిగినాను
బచ్చనల నావద్దఁ బాయఁడే వీఁడు
కుచ్చుతాన నేనె తన్నుఁ గొంగు వట్టి నియ్యఁ గాని
విచ్చనవడిఁ దా నైతే వేఁడుకొనీనె వీఁడు

చ. 3: తాలిమితోడను నేఁ దల వంచుకుండినాను
కేలు చాఁచి నన్ను బుజ్జగించీనె వీఁడు
వే ళెరిఁగి రతుల శ్రీవెంకటేశుఁడిట్టె కూడె
నాలి దీర నన్నిట్టె నమ్మించెనే వీఁడు

రేకు: 0362-2 భవుళి సంపుటం: 11-368

పల్లవి: సారె విన్నపము లేల చవులు వుట్టించ నేల
దార దప్పకుండేజాణతన మింతే యిఁకనూ

చ. 1: నావలె వలచివట్టి నాతి నీకుఁ గలదా
ఆవల నీవల నే నాడుకోఁ గాక
నీవల్లఁ గడ మున్నదా నెరజాణతనమందు
బావభేదములలోని భాగ్య మింతే కాక

చ. 2: యింత నీతో నవ్వేటియింతి నీ కొకతె యేది
వింతగా నీపై వళకు వేయఁ గాక
చెంత నీచేసినమేలు చెప్పితే నటువంటిదే
కొంత గొంత కూడేవేళ గుణ మింతే యిఁకను

చ. 3: నిన్ను నేఁ గూడినరితి నేరుచునా యెవ్వ తైన
పన్ని నిన్ను నే నిట్టే పంగించఁ గాక
యిన్నిటా శ్రీవెంకటేశ యిటు నన్నుఁ గూడితివి
మున్నిటివెనకల యీ ముచ్చటలే యిఁకను

రేకు: 0362-3 సాళంగనాట సంపుటం: 11-369

పల్లవి: సందడికిఁ జొర నేల చలము సాధించ నేల
అం దెంది సరసమాడి అండ నుంట గాక

చ. 1: పంతపు నీ మాటల బావించి తెలియఁ బోతే
కొంతము లై నాటుఁ గాక కొర తయ్యీనా
చింత లేల మాకును నీ చేఁతలే చూచుకొంటా
అంత కంతే చాలు ననే దది మేలుగాక

చ. 2: నగెటి నీ నవ్వుల నయాన వహించుకొంటే
వొగరులే మించుఁ గాక వుడి వోయినా
తల వేల నీమంచితనానకే మెచ్చుకుంటా
మొగమొగా లెదుటనే మొక్కు కొంటఁ గాక

చ. 3: కాఁగిటి నీరతులు గాలించి వెదకఁ బోతే
మాఁగినచవులే కాక మానఁ బోయీనా
సొఁగిన శ్రీవెంకటాద్రిపతి నన్నుఁ గూడితివి
పొఁగు వోఁగుఁ బొందినట్టు పురిగొంట గాక

రేకు: 0362-4 కన్నడగౌళ సంపుటం: 11-370

పల్లవి: నీ మన సెట్టుండునో నేనెరఁగను
కోమలపుఁ బలుకులఁ గొసరే నే నిదివో

చ. 1: తప్పక చూడగ నోప తల వంచుకొన నోప
చిప్పిలుఁ జెమటతోడి సిగ్గలే కాని
ముప్పిరి ములుగ నోప ముందటనే నగ నోప
అప్పటప్పటికి నుస్సు రనుటే కాని

చ. 2: యేమీ నడుగనోప యెవ్వరిఁ గోపించ నోప
ఆమని జాగరముల అలపే కాని
నేమపువ్రతాల కోప నిండుమాయలకు నోప
చే మంచి తమకలము చింతించుటే కాని

చ. 3: బుద్దులు చెప్పఁగ నోప బూములు దొక్కఁగ నోప
వొద్దనె పాయక నీతో నుండుటే కాని
గద్దరి శ్రీవెంకటేశ కలసితి విదె నన్ను
వద్దని తోయఁగ నోప వంచుటే కాని

రేకు: 0362-5 దేవగాంధారి సంపుటం: 11-371

పల్లవి: మంచివాఁడ వవుదువు మమ్ముఁ దడవకు చాలు
ముంచి నీకు నేపొద్దు మొక్కేము నేను

చ. 1: తెగనాడఁ జాలఁ గాక తేనెల నీమాటలకే
ఆగపడి చిక్కరా దైత్యాంగనలు
పగ కోప మింతే కాక పడఁతిఁ జంపినవాని
మగతన మే మున్నది మరతునా నేను

చ. 2: యిచ్చకము మానఁ గాక యిట్టె నీ పొందుల సేసి
కొచ్చి మరులు గొనరా గోపికలు
వొచ్చె మిదె నీ కొడుకు వొగిఁ గూడపెట్టఁగాను
తెచ్చుకొంటివి సతుల దేవరవు గావా

చ. 3: యింకా నే లని కాక యిట్టి నీకు మోహించి
కొంకక వొక్కతె ముక్కుగోఁతఁ బడదా
లంకె మమ్ము గూడితి వీలాగు మమ్ముఁ జేయకుమీ
అంకెల శ్రీవెంకటేశ అన్నిటా నమ్మితిని

రేకు: 0362-6 సాళంగం సంపుటం: 11-372

పల్లవి: సడి సన్న యట్టి నెరజాణ నందువు
గొడవలు దీరఁ జెలి గూడ రాదా రతుల

చ. 1: చిగురుఁబానుపుమీఁదఁ జెలి విరహనఁ బొంది
చిగురువంటిచేయి చెక్కునఁ బెట్టి
చిగురులోపలిచేగ చిత్తమునఁ బుట్ట దాయ
చిగురుఁబోణిని దయ్యి నేయ రాదా విభుఁడ

చ. 2: పూవులతోఁటలోన పొలఁతి తాపాన నుండి
పూవుల మొగ్గల మేనఁ బులకించెను
పూవులలో పూఁపలు పుట్ట వాయ మాటలలో
పూవుఁబోణి నీవు గొంత బుజ్జగించ రాదా

చ. 3: పండువెన్నెలబయట భామిని యలయుచునుండి
పండువంటిమోవివాఁడు బయల వేసె
పండుగలు గాఁగ నిట్టె బాపురె శ్రీవెంకటేశ
పండుజవ్వనిఁ గూడితి పవ్వళించ రాదా

రేకు: 0363-1 లలిత సంపుటం: 11-373

పల్లవి: ఎంత కెత్తుకొంటివి నీ వేరా వోరి
చెంతల నవ్వు నవ్వేవు చెల్లురా వోరి

చ. 1: చెఱఁగు మాసినదాని చెక్కు ముట్టి వేఁడుకొని
యెటీఁగి నన్నంట వచ్చే వేరా వోరి
యటియు సురతపుఁజెమటలు జొబ్బిలఁగాను
వుఱక నాపైఁ బూసేవు వుద్దండాలా వోరి

చ. 2: గుట్టున నాకెపొత్తున కోరి యారగించుకొంటా
అట్టె నాకుఁ గడెఁ దిచ్చే వదేరా వోరి
వొట్టుక ఆపెయు నీవు వుండనపరపుమీఁద
యెట్టు గూచుండఁ బిలిచే వేరా నన్ను వోరీ

చ. 3: అచ్చు వాసుకొన్నదాని నట్టె నీవు గూడి వచ్చి
యిచ్చల నన్నుఁ గూడితి వేరా వోరి
పచ్చిగా శ్రీవెంకటేశ భ్రమసితి నీరతుల
మెచ్చితి ని న్నిన్నిటాను మేలు మేలు వోరి

రేకు: 0363-2 దేసాక్షి సంపుటం: 11-374

పల్లవి: అప్పటప్పటికి బాగా లందియ్యు వలె మనకు
చెప్పరే కతలు యిఁకఁ జింత లేఁటికి

చ. 1: ముసిముసినవ్వులతో ముంగిట నుండినచెలిఁ
గొసరి కొసరి పతి కొంగు వట్టెను
వసమై యిద్దరు లోన వడిఁ బవ్వళించి రదే
యెసఁగి వాకిట మన మిట్టే వుందమే

చ. 2: చిప్పిలుఁ జెమటతోడ సిగ్గువడి వున్నసతిఁ
గప్పి పచ్చడ మాతఁడు గాఁగిలించెను
దెప్పర మిద్దరు దోమతెరలోఁ గూచుండి రిదే
కొప్పులు ముడుచుకొంటాఁ గూచందమే

చ. 3: మాట లాడె అలమేలుమంగఁ చెక్కు నొక్కి కూడె
మేటి శ్రీవెంటకపతి మించురతుల
మాటున నుండి వచ్చి మనవద్ద నిలిచిర
చాటువ సురటులు విసరు చుందమే

రేకు: 0363-3 భైరవి సంపుటం: 11-375

పల్లవి: అట్టె కాదా తనమోహ మందరు నెరఁగ వద్దా
మిట్టిపడి యిందు కే మెచ్చితిఁ గానేను

చ. 1: సవతులతో నేను సారె వాదు లడువఁగ
తవిలి సాకిరి చెప్పీఁ దన కేలే
యివల నేఁ దనుఁ జూచి యిందుకే వెల గంది
కవకవ నవ్వితిని కడు సంగ తేయఁగా

చ. 2: పగ చాటి వారు నేను పంతములు నెరపితే
తగవులు పచరించీఁ దన కేలే
అగ డై యందుకే నేను అది యటు వెట్టి పతి
మొగమె తప్పక చూచే మగిసెఁనా పనులు

చ. 3: వుఱక మాలో నేము వొట్లు వెట్టుకొంటేను
తఱి సందిమాట లాడీఁ దన కేలే
యెఱిఁగి శ్రీవెంకటేశుఁ డిందుకే నన్నుఁ గూడఁగ
మఱచితి నన్నియును మన సొక్క టాయఁ గా

రేకు: 0363-4 వసంతవరాళి సంపుటం: 11-376

పల్లవి: ఆన లేన పెట్టుకొనే వప్పటి నాతో
దాని కేమి దోసమా తగినంతే కాక

చ. 1: చెలచేఁ బిలిపించఁగ చేర వచ్చితిని గాక
వలచి నీ యంత నీవే వచ్చితివా
వెల లేక మోహించి విడువ లేనేఁ గాక
కల నీగుణమే తొల్లి కన్నది గాదా

చ. 2: సేవలు నేఁ జేయఁగాను చిత్తము గరఁగెఁ గాక
కావించి నీ యంత నీవే కరఁగితివా
యీవల గూళ నై నేనె యిట్టె పై కొందుఁ గాక
చేవ గలంతే కాక సేసి పెట్ట వచ్చునా

చ. 3: దండ నేనే వుండఁగాను దయ దలఁచితి గాక
గుండె గరఁగి నీ యంతఁ గూడితివా
నిండి శ్రీవెంకటేశ నీకు నాకుఁ బోదు గాక
వెండియు నీతో విన్నవించ గురి యున్నదా

రేకు: 0363-5 రామక్రియ సంపుటం: 11-377

పల్లవి: ఇంకా నేల తడవేవు యేరా నీవు
సంకె దేరె నాకు నీ చలమూఁ జెల్లెనూ

చ. 1: మాఁట నీతో నాడితిన మనసు దెలిసితిని
యేఁటికి నన్నుఁ బిలిచే వేరా నీవు
యీటుతోఁ బెండ్లాడితిని యిట్టె సేస వెట్టితివి
వాఁట మాయ వలపులు వద్దనే నుందానను

చ. 2: చేత నీకు మొక్కితిని చేరి నీతో నవ్వితిని
యీతల నన్నొరసేవు యేరా నీవు
నీతగులు చూపితివి నెగు లెల్లాఁ బాపితిని
యేతు నీకు గన మాయ యియ్యకొంటి వందుకూ

చ. 3: కన్నుల నిన్నుఁ జూచితి కాఁగిటిలో నున్నదాన
యెన్నేసి ప్రియాలు చేప్పే వేరా నీవూ
నన్ను మన్నించితి విట్టె నంటున శ్రీవెంకటేశ
చిన్నిపులకలు నేఁడె సెలవు నా కాయను

రేకు: 0363-6 తెలుఁగుఁగాంబోది సంపుటం: 11-378

పల్లవి: చుట్టమవు గా వతని సూడుబంటవూఁ గావు
ముట్టి వేఁడుకోఁ గాను మో మేల వంచేవే

చ. 1: గుట్టు లేక ఆతఁడు నీ కొంగు వట్టి తీసీని
పట్టినచలము మాని పదవే నీకు
వుట్టిపడి నీ చెక్కు లుంగరాలచేత నొక్కె
బెట్టుగా నింతేసి యింకాఁ బెనఁగ నేమటికే

చ. 2: గక్కన నవ్వుతా వచ్చి కదిసి కూచున్నాఁడు
వెక్కసపుకోప మింక విడవే నీవు
అక్కరఁ దనపై నీకు ఆన లెల్లఁ బెట్టె నదే
యిక్కడఁ దొల్లిటినేరా లెంచఁగ నేమిటికే

చ. 3: కందువ లంటుచు నిన్ను కాఁగిలించె నాతఁడు
మందెమేళములు యింక మానవే నీవు
అందెంది శ్రీవెంకటేశుఁ డన్నటాను నిన్నుఁ గూడె
చంద మాయఁ బను లెల్ల సాదించ నేమిటికే

రేకు: 0364-1 పాడి సంపుటం: 11-379

పల్లవి: మాయలు మాని నాతో మాటలాడరా
నాయడ మునిమచ్చుఁ దన మేల నీకు

చ. 1: ఆరయ నాకెవంతూ ననేవు నీ వప్పటిని
నేరుపున నాపెమోము నేఁడు చూడవా
కేరి కేరి నవ్వేవు కేఁగండ్లఁ జూచుకొంటా
యేరా లే దటరా యీ మాట నీవు

చ. 2: బత్తి నాకు గల నంటాఁ బాయవు నీ వాపెకు
హత్తిన చెలిచేఁ జెప్పి యంప వామాఁటా
వత్తివలెఁ బైఁ బడేవు వట్టి చనవు సేసుక
ఉత్తర మీరా యిందు కూరకుండేఁ గాని

చ. 3: యేపున నన్నే కాని యెవ్వరి నొల్లనేవు
ఆపె సొమ్ములె కావా అట్టె నీమేన
రాపుగా శ్రీవెంకటేశ రతి నన్నుఁ గూడితివి
ఆపను లిన్నాళ్లదాఁకా నమరెఁ గా నీకు

రేకు: 0364-2 రామక్రియ సంపుటం: 11-380

పల్లవి: ఏఁటికి వాదుకు వచ్చే వింత నీవు
నాటకపుటాన లేల నమ్మినా నేను

చ. 1: చెంతలఁ జెప్పనమాఁట చెవి యొగ్గి వింటిఁ గాక
కాంతుఁడ నీచేఁత లెల్లాఁ గంటినా నేను
యింతలోనేఏ నీకుఁ గోప మేల వచ్చె నిందరిలో
నంత నిన్ను గురి సేసి అంటినా నేను

చ. 2: చెక్కుల తమ్మచెదరు చేఁతఁ దుడిచితిఁ గాక
తక్కిన వెఱుఁగుదునా తప్పులు నేను
గక్కన నీ వేల తారుకాణలకుఁ బెట్టేవు
వొక్క టై నీవద్దఁ బాయ కుండితినా నేను

చ. 3: మించి కాఁగిలించఁగా నీ మేను నిమిరితిఁ గాక
యెంచి నీ మైగురుతు సోదించేనా నేను
అంచల శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
యించు కంతయిన నలయించేనా నేను

రేకు: 0364-3 సాళంగనాట సంపుటం: 11-381

పల్లవి: ఇందాఁకా రా వన వేమమ్మా
అందెందె నవ్వేవు అతనితో నమ్మా

చ. 1: యేలినరమణుని కెన్నఁడు నలుగవు
తాలిమి నీకే తగు నమ్మా
యీలాగులనే యిచ్చక మాడేవు
మేలు మేలు నిను మెచ్చితి మమ్మా

చ. 2: దండ నున్నపతిఁ దరవులు వెట్టవు
నిండురాజసము నీ దమ్మా
వెండియు నతనికి వీడె మొసఁగితివి
కొండఁ బోలు నీగుణ మమ్మా

చ. 3: శ్రీవెంకటపతిఁ జెక్కులు నొక్కేవు
నీ వాడినవే నిజ మమ్మా
కైవసంబుగా గాఁగిటఁ గూడితి
దేవుల వతనికిఁ దెలిసితి మమ్మా

రేకు: 0364-4 రామక్రియ సంపుటం: 11-382

పల్లవి: ఆతని నీవేమైనా నంటివా తొల్లి
నీతమి తానె యెరుఁగు నీకేలే వెరవు

చ. 1: మొగము చూచె నతఁడు మొక్కిలి వందుకు నీ
తగ వాతఁ డెఱఁగడా దాని కేమి
పగ యిద్దరికి లేదు సంతాన నుండితి వింతే
నిగిడి యిందుకుఁ గాము నీ కేలే వెరవ

చ. 2: తామెర వేసె నతఁడు తట్టితివి చేత నీవు
దోమటి దోడికేవేళ దోసమా యేమి
యేమిటాను మోసపోరు యిద్దరికి కిద్దరే సాటి
నేమ మేమిటాఁ దప్పదు నీ కేలే వెరవ

చ. 3: చేత నిన్ను నంటఁగాను సిరసు వంచితి వింతే
ఆతఁడె శ్రీవెంకటేశుఁ డందు కేమి
యేతులకుఁ గూడితిరి యిద్దరు నిక్కడనే
నీతితో బదుక వమ్మ నీ కేల వెరవ

రేకు: 0364-5 భవుళి సంపుటం: 11-383

పల్లవి: వెలఁది యీమాఁటె విన్నవించ నంపె
వలవనిజోలి వద్దు సుమీ

చ. 1: తరుణిచూపుల దట్టపు వెన్నెల
గరిమ నీపైఁ గాయఁగానె
విరహపుఁగాక వేసవి యెండలఁ
బొరలే వే మయ్య పొద్దు వోదా

చ. 2: పేఁడుచు మాటలఁ బెరతేనె నీపైఁ
బోఁడి మాపె బూయఁగానె
వేఁడి నిట్టూర్పుల వెసఁ గారముల
మాఁడ నేల నీకు మంకు గద్దా

చ. 3: కొమ్మ నిన్నంతలోఁ గూడి మోవులనె
చిమ్ముచు విందులు నేయఁగానె
యిమ్ముల శ్రీవెంకటేశ ర తెంకలి
కమ్మరఁ బెంచేవు కడ లేదా

రేకు: 0364-6 లలిత సంపుటం: 11-384

పల్లవి: చాలుఁ జాలు నే మన్నుఁ జవి గావు
కూళతన మింతే నిన్నుఁ గొసరఁ బోతేను

చ. 1: ఉమ్మగిలుఁ జిత్తముతో నుడుకుతా నుండేనన్ను
యెమ్మెలకుఁ జెనకేవు యేరా నీవూ
తమ్మి మొగ్గవాట్లకె తల్లడించే నామేను
నిమ్మపంట వేసేవు నే నోపఁ గలనా

చ. 2: చెక్కు చేతఁ బెట్టుకొని చింతఁ బొరలెడినాతో
యెక్కువఁ గేరడా లాడే వేరా నీవూ
మొక్కలాన నీకు దక్కి మోసపోయి వున్న నన్ను
తోక్కేవు నాకాలు వట్టి దూరప్పటి వలెనా

చ. 3: పులుకుట్టుఁజేఁతలకు నుస్సు రంటా నున్ననాతో
యెలయించి నవ్వు నవ్వే వేరా నీవూ
నెలవై శ్రీ వెంకటేశ నిన్నుఁ గూడి యలసితి
బలిమిఁ గాఁగిట నిఁక పచ్చి సేయ వలెనా

రేకు: 0365-1 రామక్రియ సంపుటం: 11-385

పల్లవి: మొక మొక మెదుటనె ముంగోప మిఁక నేల
పక పక నగుతానె పంత మిచ్చె నాతఁడు

చ. 1: ఆతడె నీ వున్నచోటి కంగనల నంపఁగాను
యీతలఁ దల వంచేవు యేలమ్మ నీవు
కాతరిం చంతటఁ బోక ఘనుఁడు దానె వచ్చె
చేతులార నీవ నేవ నేయవమ్మ యిపుడు

చ. 2: కడు మోహములె నీకుఁ గప్ప మాతఁడు వెట్టఁగ
యెడమాటలఁ దిట్టించే వే లమ్మ నీవు
తడవి మీ రాతని తరుణులు దొబ్బిరట
గొడవలు దీర వేఁడుకోవమ్మ పతిని

చ. 3: ఆయములు సోఁక నాతఁ డాన లెల్లఁ బెట్టుకోఁగా
యీయెడ నవ్వులు నవ్వే వే మమ్మ నీవు
వోయమ్మ శ్రీవెంకటేశుఁ డోఁగునూతులలోఁ గూడె
నీయిచ్చ నాతఁ డున్నాఁడు నీవు మెచ్చ రాదా

రేకు: 0365-2 లలిత సంపుటం: 11-386

పల్లవి: కానీవయ్య అందు కేమి కాల మిట్టే వుండీనా
మాన కెవ్వతె సలిగె మతి నమ్మినాఁడవో

చ. 1: మాట లాడ నాతో నీకు మనసు రా దోమో కాక
పాటించి నేఁ బిలువఁగాఁ బరా కయ్యేవు
చీటికి మాటికిఁ దొల్లి చేసన్నకె వచ్చేవాఁడ
వీటున రాజసాన నీ వెవ్వరిఁ గైకొనవు

చ. 2: నగ నైనఁ గొంత నాతో నంటున దోసమో కాక
మొగము నేఁ జూడఁగానె మోము వంచేవు
అగపడి యేపొద్దు నాయండఁ బాయనివాఁడవు
వెగ టై మావిన్నపాలు వినఁ దీర దాయను

చ. 3: నిండినచలము నాపై నీకు నెంత గద్దో కాక
బెం డైననన్నుఁ గాఁగిట బిగియించేవు
కొండల శ్రీవెంకటేశ కూడి లో నైనవాఁడవు
నిండుకొని యే డవుత నిన్ను నీ వెరఁగవు

రేకు: 0365-3 బౌళి సంపుటం: 11-387

పల్లవి: ఏరా నావద్ద నుండే యిది దగునా
ఆరీతిఁ గనీఁ గానమి నది గొంత గాక

చ. 1: కాఁకలు నేయుచు నాపె కన్ను లెదిటికి వచ్చి
సోఁక నిన్ను నవ్వితేనె చొక్కి పడేవు
మూఁకలో నుండి అప్పటి ముసుఁగు వెట్టుక కొమ
రాఁకల నెలయించఁగ నట్టె చూచేవు

చ. 2: మటమాయముల నాపె మాట దీసి నీతోడ
సటులు రెం డాడితేనె చన విచ్చేవు
తటుకున నప్పటిని దగ్గరికివచ్చి యాసె
యెటు నేయు మనినాను యియ్యకొనే విపుడు

చ. 3: సిగ్గుపడ కాపె నిన్ను చేచాఁచి కాఁగిటఁ గూడి
వొగ్గి లోనికిఁ దీసితే వొడఁబడేవు
నిగ్గుల శ్రీవెంకటేశ నీవు న న్నప్పటిఁ గూడి
తగ్గి యాపెచే మొక్కించి తగులు సేసేవూ

రేకు: 0365-4 భవుళి సంపుటం: 11-388

పల్లవి: ఏల చిన్నఁ బోయినాఁడ విందుకుఁ గాను
ఆలరి వినోద మింతే ఆపె నీపైఁ గోపమా

చ. 1: కలికికన్నుఁ గొనల కాంత నిన్ను నవ్వఁగాను
తల వంచే వేమయ్య తక్కక నీవు
అలిగినవిధమో నీ వవ్వల యే మైనఁ జేసి
చెలరేఁగి యిందు వచ్చి సిగ్గు వడ్డ విధమో

చ. 2: సోవలు గా నూరివారి సుద్దు లాపె చెప్పితేను
యీవలఁ బైకిఁ దీసుకో నే లయ్య నీకు
తావుల నీ కందే మైనా తగులు గలదో కాక
కావిరి నెం దైన మరి కలఁగి వచ్చితివో

చ. 3: గక్కన నాపె నిన్నుఁ గాఁగిటఁ గూడఁగాను
వొక్కటై శ్రీవెంకటేశ వుస్సు రనేవు
అక్కడ నెవ్వతె కైన ఆస యిచ్చి వచ్చితివో
లక్కవలెఁ గరఁగినలాగు రతిఁ జూపేవో

రేకు: 0365-5 సామంతం సంపుటం: 11-389

పల్లవి: అన్నియుఁ గావలసిన ట్టయ్యీఁ గాని
యెన్నికగా మమ్ము నంపు యేల నవ్వే వీఁకను

చ. 1: ఆనుక నీ వాడినట్టే ఆపెతో నే విన్నవించే
వీనుల నీ మాట లెల్ల వింటిఁగా నేను
కానుకగాఁ బట్టె మయ్య కాంతకు నీ సరితెలు
యీ నిజాలె చెల్లించుకో యేల నవ్వే వీఁకను

చ. 2: అక్కడనే పనులు అందాలుగాఁ జేసి వచ్చే
గక్కన నీ చేఁత లెల్లఁ గంటిఁ గా నేను
పెక్కు నీవినయములు బిందెల నించే నాపెకు
యిక్కడనే వుండవయ్య యేల నవ్వే వీఁకను

చ. 3: తీపులు గా నీరాక తేట తెల్లములు సేసే
నాపెకు నీకు లో నైతిఁ గా నేను
యేపున శ్రీవెంకటేశ యిద్దరిఁ గూడించితిని
యేప నైనా నాన తీ నీ వేల నవ్వే వీఁకను

రేకు: 0365-6 వరాళి సంపుటం: 11-390

పల్లవి: ఏమి సేతు మొగమోట మిదివో నాకు
దీమసానఁ దిట్ట లేను దీవించ లేనూ

చ. 1: తోయ రాదు నీ మాఁట దొరవు నీ వాన తీఁగా
సేయ రా దటంటే నీవు చెప్పిన ట్టెల్ల
రాయడిసతుల మచ్చరము నాలో మాన లేను
వే య్యైనా నీ వారి పొందు విడిపించ లేనూ

చ. 2: తెగ రాదు నీమీఁద తేరి నన్నుఁ బొగడఁగ
నగ కుండ రాదు నీవు నవ్వించఁగ
వొగి నీ వెం ద్దైనఁ బోతే వోరుచు కుండఁగ లేను
మగఁడవు నీ గుణాలు మట్టుపెట్ట లేను

చ. 3: పట్ట రాదు పాయ మిది పైకొని నీవు గూడఁగా
గుట్టు నేయ రాదు నీవు కొంగు వట్టఁగా
చుట్టాలఁ జేసితివి నీ సుదతుల నెల్లాఁ దెచ్చి
యిట్టె శ్రీవెంకటేశ యింక బాయ లేనూ

రేకు: 0366-1 భూపాలం సంపుటం: 11-391

పల్లవి: నిన్నటికి నాయఁ బోయ నేఁడే లయ్యు
కన్నుల బీరాలే కాని కాంక్ష లేకుండ దయ్యా

చ. 1: వొట్టు వెట్టుకొనెఁ గాన వూర కున్నది చెలియ
వెట్టికి మాట లాడక వేఁడుకోవయ్యు
పట్టినపంతమే కాని పై నున్నది ప్రేమ
వట్టియనువనా లేల వద్దికి రావయ్యా

చ. 2: పలుక దింతే కాని భార మెల్ల నీ మీఁదనే
చలి వాయఁ బై చేయి చాఁచవయ్యు
చల మనేపేరు గాని సతి తమకము బెట్టు
కలికిచెక్కులు నొక్కి కాఁగిలించవయ్యా

చ. 3: సిగ్గులే మరఁగు గాని చింతలు వెలి కురికీ
యెగ్గు దీర మంచముపై కేఁగవయ్యు
అగ్గమై శ్రీవెంకటేశ అంగనఁ గూడితి వింక
నిగ్గుల నాపెకోరికె నెరవేర్చవయ్యా

రేకు: 0366-2 నారణి సంపుటం: 11-392

పల్లవి: ఎగసక్కె మాడితేనె యెంత సేసేవు
మగువతోనె నేఁడు మంకు లేల నేకును

చ. 1: పలుమారుఁ బిలిపించీ పదవయ్య చెలి నిన్ను
అలిగి వచ్చితి వంటా అప్పటినుండి
చల మెంత గలిగిన సతి నీవు గూడుకుంటె
తెలుసుకొందురు గాక తెగు వేల యీడను

చ. 2: వాకిట నిలుచున్నది వచ్చినదాఁకా నీవు
రాక తా నారగించదు రమణి నేఁడు
యేకతాన నాపెతోనె యే మన్నా నందువు గాని
వాకునిష్ఠూరము లేల వద్దు వద్దు యీడను

చ. 3: కొంగు వట్టి తీసీ నిన్ను కొమ్మ దానె యిందు వచ్చి
వుంగిటఁ జిన్నఁబోయి వున్నాఁడ వంటా
అంగవించి శ్రీవెంకటాధిప కూడితి విట్టె
వెంగలియాన లెల్ల విడవయ్య యిఁకను

రేకు: 0366-3 ధన్నాశి సంపుటం: 11-393

పల్లవి: మందరిదోసము వాయ మొక్కితి మయ్య
చెంది నీపనికి నోఁచితఁగా నేను

చ. 1: అంగనలతో వాదు లడిచినకోవ మెల్ల
ముంగిట నుండిన నీపై ముంచితి నేను
చెంగట నూరకె నీ చిత్త మింత నొప్పించితి
సంగతిగా నెంత పాపజాతినో నేను

చ. 2: యెగసక్కెపుసవతు లే మేమో నవ్వఁగఁ జూచి
మొగము చూడక నామోము వంచితి
తగ వెఱఁగక నేనే తమకించితి నీ మీఁద
జిగి నన్నింత కట్టిణిఁ జేసెఁ గా దైవమూ

చ. 3: పడఁతులతోడ నేను పంత మాడినదాన నై
చిడుముడిఁ గూడి వచ్చి సేసితి నిన్నూ
కడఁగి శ్రీవెంకటేశ గబ్బి నైతిని రతుల
వెడఁగుఁజలాల నెంత వెట్టినో నేనూ

రేకు: 0366-4 శుద్ధవసంతం సంపుటం: 11-394

పల్లవి: ఏల మమ్ము నెగ్గు లెంచే వే మంటి నిన్ను
తాలిముల కెల్ల గురి తనమనవే

చ. 1: మోహము గలవారికి ముంగోపపుతి ట్లెల్ల
దేహనకు చల్ల నైనదీవెన లౌను
యీహల మనసు రాక యిత వెంత సేసినాను
వూహించి చూచినను వొరటు లై తోఁచుము

చ. 2: అచ్చివచ్చినచోటికి ఆయాలు దాఁకించుకొన్న
మచ్చికఁ గళలు రేఁగేమర్మము లౌను
మచ్చర మైనచోట మరి పాదా లొత్తినాను
కచ్చు పెట్టి యవే కామాకారము లై తోఁచును

చ. 3: అనుమాన మైనందుకు అన్నియానలు వెట్టిన
పనికి వచ్చునో రాదో భావించ రాదు
ఘనుఁడ శ్రీవెంకటేశ కైకొని కూడితి నిన్ను
వెనకటిదయ నాపై విడువకు వయ్యా

రేకు: 0366-5 ఆహిరి సంపుటం: 11-395

పల్లవి: నీవు చేసినచేఁతకు నెలఁత యేమీ ననక
కావికన్నులకొనల కలకల నవ్వెను

చ. 1: మక్కువ నిన్ను దూరఁగ మనసు నొచ్చనో యని
వుక్కున జంకించఁగాను వొచ్చెమో యని
నిక్కి నిన్నుఁ జూడఁగాను నేరమి మోఁచునో యని
చెక్కు నొక్కి యింతి నిన్నుఁ జేరి నవ్వెనూ

చ. 2: యేల రావైతి వనఁగ నిట్టె చిన్నఁ బోదు వని
వేళ గాచు కుండఁగాను వెంగెమో యని
తాలిమితో నూరకున్నఁ దల వంచుకొందు వని
వేలు ముక్కుపై మోఁవి వికవిక నవ్వెనూ

చ. 3: చేయి వట్టి తియ్యఁగాను సిగ్గు వడుదువో యని
రాయడింపురతులకు రాఁ పయ్యే వని
యీయెడ శ్రీవెంకటేశ యిట్టె నిన్నుంగన గూడి
పాయపుమదము తోడ పకపక నవ్వెను

రేకు: 0366-6 కాంబోది సంపుటం: 11-396

పల్లవి: ఇచ్చకమే నడచేటియిల్లాల నేను
పచ్చిసేఁత లివి మాకు పాడిగా దయ్యా

చ. 1: పక్కనఁ దిట్టఁగ నోప పైపై వేఁడుకొన నోప
వొక్కరీతి గుట్టుతోడ నుండే నేను
అక్కడివారెనీకు నన్నిటికి నేరుతురు
చిక్కించుక యిత వైతే నేయించుకో వయ్యా

చ. 2: అలిగి పొమ్మన నోప అప్పటి మొక్కఁగ నోప
నిలిచి రాజసముతో డే నుండేను
వెలయాండ్లే నీకు వినోదాలు నడుపేరు
చెలఁగి నీ కిత వైతే సేయించుకో వయ్యా

చ. 3: బొమ్మల జంకించ నోప పారిఁ జెక్కు నొక్క నోప
యెమ్మె నీరతులఁ జొక్కి యిట్టుండే నేనూ
నెమ్మది శ్రీవెంకటేశ నీవు గూడితివిగ నన్ను
చిమ్మల నీ సేవ నాచేఁ జేయించుకోవయ్యా

రేకు: 0367-1 దేవగాంధారి సంపుటం: 11-397

పల్లవి: మేరకు మేరే కాక మీర వచ్చునా
ఆరీతి నారడి యైతే నంద మవునా మాటలు

చ. 1: మొగమోట గలచోట ముంచి వా దడువ నేల
నగితోనె చాలదా నయముగాను
తెగనాడేమాట లెల్ల తెలుసుకోనీ నాతఁడె
జగడ మయినమీఁద చక్క నవునా పనులు

చ. 2: యెగ్గు పట్ట రానిచోట యెక్కువ తక్కువ లెల్ల
సిగ్గు వడుటే చాలదా సిరసు వంచి
దగ్గరి కాఁ గలపని తనుఁ దానె తోఁచీని
కగ్గినందుమీఁద పతిఁ గైకొలుప వసమా

చ. 3: మన నెరిఁగినచోట మరి యెడమాట లేల
పెనఁగుటే చాలదా ప్రియముతోడ
యెనసె శ్రీవెంటకేశుఁ డింతలోఁ దానె నిన్ను
చన మిచ్చినందుమీఁదఁ జలములు గలవా

రేకు: 0367-2 దేసాక్షి సంపుటం: 11-398

పల్లవి: నేసినట్టు నేయవయ్య చిత్తము వచ్చినయట్టు
బాస దుప్పేమగవానిఁ బట్ట వస వవునా

చ. 1: నేమాన నేపుణ్య మైన నీవో కట్టుకొందు గాక
యే మనిన నీ మాట కెదు రాడేమా
మోము వంచు కాఁడువారు మూలనుండుదురుగాక
గామిడైన మగవానిఁ గక్కసించఁ జెల్లునా

చ. 2: కిమ్ములవా రాడెటికీరితి నీదే కాక
యెమ్మె నెవ్వతెఁ దెచ్చినా నెగ్గ లెంచేమా
వుమ్మడిమానాపతులు వోరుచుకుందురు గాక
దిమ్మరి మగవారితో దీకొనఁగఁ జెల్లునా

చ. 3: పాపపుణ్యములలోని ఫలము నీదే కాక
యేపని సేసిన నీతో నీసడించేమా
చేపట్టి కూడితి నన్ను చేతిలోనిదాన నంటా
పై పై శ్రీవెంకటేశ బలుము చెల్లునా

రేకు: 0367-3 గుండక్రియ సంపుటం: 11-399

పల్లవి: మమ్ము నేల తడవేరు మాటిమాఁటికి
వొమ్మదు మాకు వలపు లో చెలులాల

చ. 1: మన నెల్లా నివ్వెరగు మాటలు నాకు వేసట
యెన లేనికత లెల్లా నేమి చెప్పేరే
విన నోప మారుమాట వివరించా నే నోప
అనుమాన మెల్లఁ దీర నాతని నడుగరే

చ. 2: కాయముపైఁ జెమటలు కన్నులపై వసినాడు
చేయి వట్టాతని నేల చేరఁ దీసేరే
సేయ లేను వినయాలు చేచేతఁ గొసర లేను
మాయకాఁ డాతని మీరె మనసు దెలియరే

చ. 3: నిమిష మొక్కటి యేఁడు నిండుఁబాయము తరవు
భ్రమయించి యాల వొడఁబరచేరే
సమరతి శ్రీవెంకటేశ్వరుఁ డిట్టె నన్ను గూడె
తమితో నాతని మీరు తప్పక నవ్వించరే

రేకు: 0367-4 సామంతం సంపుటం: 11-400

పల్లవి: ఇదివో తెలుసుకోరా యింకా నీవు
మదనపరవశాన మర పాయఁ గాని

చ. 1: వాలుకరెప్పలు నాపై వంచి వంచి చూచేవు
ఆలించి న న్నెరిఁగిన ట్టయ్యీనో నీకు
మేల మాడి చూడు తొల్లి మేనవారమే మనము
సోలిఁ బెక్కుసతులలో చూచి మర పాయను

చ. 2: వీరి వారి యేకాంతాన విచారించి చూచేవు
కారన మే మైన నాతోఁ గద్దో నీకు
చేరి దగ్గరిన తొల్లి చెందిచుట్టాలమే
తారుకాణ లేక సందడి మర పాయనూ

చ. 3: పెనఁగి పెనఁగి నన్ను పే రడిగి చూచేవు
కనుచూపులగురుతు కంటివో నీవు
యెన లే కలమేల్‌మంగను శ్రీవెంకటేశ్వర
మనరతులనుఁ జొక్కి మర పాయఁ గాని

రేకు: 0367-5 భైరవి సంపుటం: 11-401

పల్లవి: ఎప్పుడు నీసుద్దులు నే మెరిఁగినవే
కప్పురము గోవయ్య తల లెల్ల మాని

చ. 1: నొస లెల్లఁ జెమరించి నున్నని చెక్కుల జారె
కిసరి యెవ్వతె యలిగెనో నీతోను
యిసుమంత వడె కాని యింతి నిన్నుఁ బాయ లేదు
విసరేము రావయ్య వేసాలు మాని

చ. 2: సరు లెల్ల జిక్కువడి చల్లువెద లైన వివే
సిరుల నిన్నెం తాపె చేయి ముట్టెనో
సరస మింతే కాని చలము నీతోఁ గాదు
సరిసేసుకోవయ్య చలములు మాని

చ. 3: నిట్టూరుపులు రేఁగె నిద్దుర కన్నులఁ దేరె
అట్టె యెవ్వతెరతి నలసితివో
నెట్టన శ్రీవెంకటేశ నేఁడు నన్నుఁ గూడితివి
పట్టపలమేల్మంగను పంత మెల్ల మాని

రేకు: 0367-6 రీతిగౌళ సంపుటం: 11-402

పల్లవి: గుబ్బతిల్లె తమలోని గుద్దిరా లింతే కాక
గొబ్బున నీడకు వచ్చి కొంగు వట్టఁ గలదా

చ. 1: ఆతఁడే నాయింట నున్నాఁ డందరు సతులుఁ గూడి
యేతులకుఁ గోపగించి యేమి సేసేరే
చూతమువో వొక్క తైనా సోరిదిఁ గాంతునిఁ దమ
చేతికి లోనుగాఁ జేసి చిక్కించుకోఁ గలదా

చ. 2: చనవు నా కిచ్చినాఁడు సవతు లెందరు గల్లా
యెనయక నామీఁద నేమి సేసెరే
ననుపున నొక తైనా నన్నుఁ గూడినట్టిపతిఁ
బెనఁగి వేరె వలపించుకొనఁ గలదా

చ. 3: బాసతోడ నన్నుఁ గూడెఁ బైకొని శ్రీవెంకటేశుఁ
డీసులవా రిందరును యేమి సేసేరే
ఆస లింతే కాక వచ్చి అందులో నొకతె యైనా
నాసరి నుండి పతితో నవ్వి చూడఁ గలదా

రేకు: 0368-1 పాడి సంపుటం: 11-403

పల్లవి: ఇంతులచేఁ జెప్పి పంపె యిదివో యాతఁడు దానె
సంతసపు మేలుసుద్ది చాటరే యిందరికి

చ. 1: అంగనవద్దికి నేఁడు అతఁడే విచ్చేసీ నట
సింగారింతము రారే చెలులాల
ముంగిల ముగ్గులు వెట్టి ముత్తేల పందిలికింద
బంగారుపీఁట వెట్టి పరవు వరచరే

చ. 2: యిందుముఖి మన్నించ నిప్పుడిది వేళ యట
విం దాయిత్తము సేయరే వెలఁదులాల
గందముఁ గస్తూరియును కప్పురవిడెములును
అందుకఁ బన్నీటఁ బాదా లదె కడుగరే

చ. 3: వాయిదాలు వాయించేరు వాకిటికి రాఁ బోలు
యీయింతిఁ జేపట్టినాఁ డింతలో నట
యీ యెడ శ్రీవెంకటేశుఁ డీమగువతోఁ గూడె
చే యెత్తే మొక్కరే మీరు సేసినట్టి మేలుకు

రేకు: 0368-2 గౌళ సంపుటం: 11-404

పల్లవి: వాఁడివో నీ రమణుఁడు వలసినట్టు సేయనీ
పేఁడుకొని మాకు నింత పెనఁగ నేమిటికి

చ. 1: బలిమిఁ బట్టఁగ రాదు పరాకున నుండ రాదు
యెలమి నీతోడిపొందు లెటుఁ బో రాదు
వలపు తీపన రాదు వడిఁ గార మన రాదు
చెలులము సారె బుద్ది చెప్పకుండ రాదు

చ. 2: నవ్వులు నవ్వఁగ రాదు నాలి నూరకుండ రాదు
యివ్వల నీతో సరస మెటుఁబో రాదు
జవ్వన మిందుకో రాదు చాలించి పో దొబ్బ రాదు
మవ్వపు మీతేఁకువలు మాకుఁ జూడ రాదు

చ. 3: తప్పక చూడఁగ రాదు తల వంచు కుండ రాదు
యెప్పుడు నీతోడిజాడ యెందుఁ బో రాదు
అప్పఁడు శ్రీవెంకటేశుఁ డలయేలుమంగ నిన్ను
యిప్పుడిట్టె కూడె మాకు నేమీ నన రాదు

రేకు: 0368-3 శంకరభారణం సంపుటం: 11-405

పల్లవి: మిము దూర నోపను మించతనిఁ బాయ లేను
తమకము దైన్యముఁ దడఁబడెనూ

చ. 1: ఆల విభునియెలుఁగు ఆలించెద నిదె
పలుకకురే అటు పలుమారు
యెలమి నాతనికి నెదు రేఁగెద నిదె
పిలువకురే నను బెనఁగుచును

చ. 2: వడి నతని నగరివంక చూచెదను
యెడ నడ్డము రా కిటు దలరే
తొడ రతనిసతులతో మాఁట లాడెద
చిడుముడిఁ బరాకు సేయకురే

చ. 3: శ్రీవెంకటపతికిఁ జేతుల మొక్కెద
చేపల బుద్ధులు చెప్పకురే
కావించి నన్నతుఁడు కాఁగిటఁ గూడెను
భావించి ననుఁ బై పై నవ్వకురే

రేకు: 0368-4 సామంతం సంపుటం: 11-406

పల్లవి: చీ చీ సతుల మనఁగ సిగ్గు గాదా
తాచి యిన్నియు నింకఁ దడవ నేమిటికి

చ. 1: సొలసియునుఁ దని వోదు చూచియునుఁ దని వోదు
పలుమారు నీమీఁదఁ బాడి తని వోదు
వలవ నేరుచు నాకె వలపించ నేర్చితివి
చెలులబతుకులు యింకఁ జెప్ప నేమిటికి

చ. 2: కదిసియునుఁ దని వోదు కడు నవ్వి తని వోదు
అదన నీతో మాట లాడి తని వోదు
మది నిలిచె నీ కాపె మన్నించితివి నీవు
గుదికొన్న కామినుల గొడవ యేమిటికి

చ. 3: మెచ్చియునుఁ దని వోదు మితిమీరి తని వోదు
కొచ్చి కాఁగిటిరతుల గూడి తని వోదు
యెచ్చటను శ్రీవెంకటేశ ననుఁ గూడితివి
హెచ్చితి మిద్దర మొకటే యితరు లేమిటికి

రేకు: 0368-5 సాళంగం సంపుటం: 11-407

పల్లవి: చాలుఁ జాలు నంత మాతో సత్యా లేల
పోలించి వింటేఁ గల్లలు పుట్టెఁడేసి రాలవా

చ. 1: యెగ్గు పట్టే వని నిన్ను యేమి యనఁ జాలఁ గాక
సిగ్గుపడే వని నీపైఁ జే చాఁచఁ గాక
నిగ్గుల నీతోఁ గనక నే నేపాటి నవ్వినాను
బగ్గన నీయచారాలు బయిటనే పడవా

చ. 2: తల వంచే వని నిన్నుఁ దారుకాణఁ బెట్టఁ గాక
కలఁగే వని పయ్యెదఁ గప్పితిఁ గాక
వొలిసి నేఁ గనక నిన్నొత్తి మాట లాడితేను
యెలమి నీదొరతన మిట్టే యేరుపడదా

చ. 3: పై పైఁ దమకించే వని పచ్చి సేయఁ జాలఁ గాక
కోపగించే వని నిన్నుఁ గూడితిఁ గాక
యేపున శ్రీవెంకటేశ యిట్టె నిన్ను నొరసితే
తీపులనీమోవి తప్పు దీరుచుకోఁ బడదా

రేకు: 0368-6 ముఖారి సంపుటం: 11-408

పల్లవి: ఇట్టివలపులు తల కెక్కెఁ గా నీకు
పెట్టరానిమందు లెల్లఁ బెట్టెఁ గా నీకు

చ. 1: కోపగించి కన్నులనె కొసరుచుఁ దిట్టఁగాను
ఆపెతోడిమాట లిత వాయఁగా నీకు
పో పో కొంగు వీడు మని పోరఁగానె యాపెతోడ
పూపనవ్వు నవ్వ బుద్ధి పుట్టెఁ గా నీకు

చ. 2: పిలువఁ బిలువఁ గానె బిగిసేయాపెతోడ
బలిమిఁ బట్టి పెనఁగ బాఁతిగా నీకు
తల మొల వీడఁగాను తప్పించుకొనేయాపెకు
యెలమిఁ దమ్మ వెట్టేదే యింపుగా నీకు

చ. 3: చెక్కుచేతిసిగ్గుతోడ సిరసు వంచినయాపె
కక్కసపురతులు సంగతిగా నీకూ
అక్కర శ్రీవెంకటేశ అలమేలుమంగ నని
వొక్క టయితి విది మతి నుండెఁ గా నీకూ

రేకు: 0369-1 శంకరాభరణం సంపుటం: 11-409

పల్లవి: అయ్యో యిన్నాళ్లు నీవే నే నని వుంటివి
నెయ్యపు నీ కపటాలు నే నెరఁగ నయ్యా

చ. 1: యీాడు గానిచెలి నన్ను నే మేమో ఆడఁగాను
వేడుక నోరాఁ గన్నుల వినేవు నీవు
తాడుపడి నే నందుకు తరిఁ జిన్నఁ బో యుండఁగాఁ
గూడెనా నీ కే మైనాఁ గోరి కట్టుకోవయ్యా

చ. 2: పుక్కటసతులు నాతో పురుఁడుకు రాఁగాను
దక్కెనా నీ పంత మదె తగఁ జూచేవు
పక్కన నే నిందుకుఁ గా పై పై నిన్ను దూరఁగాను
అక్కర దీరెనా నీకు నైతే నీచిత్తమయ్యా

చ. 3: నడుమంత్రాన నొకతె నాయెదుట మురియఁగా
యెడయక సమ్మతాన నేల నవ్వేవు
బడినె శ్రీవెంకటేశ పాయక నేఁ గూడఁగాను
యెడపులవారిపొందు లేమి బాఁతి నీ కయ్యా

రేకు: 0369-2 దేసాళం సంపుటం: 11-410

పల్లవి: ఎట్టు నేసినా నీచిత్త మింతే కాక
వట్టి జాలి నే నేల వాదు లడిచేను

చ. 1: చింత లేమిటికి నీవు చిత్తములో నుండఁగాను
పంత మేఁటికి నీవు చే పట్టి వుండఁగా
వింతదాననా నన్ను వేఁడుకొనే విప్పు డిట్టే
యెంత లేదు నీతో నే నేల యలిగేను

చ. 2: కోప మేఁటికి నీవు కొంగు వట్టు కుండఁ గాను
కైపు లేమిటికి నీవు గలి గుండఁగా
మాపుదాఁకానె నీకు మన్ననదానఁ గాన
యీపాటి కీపాటి యేల యలిగేను

చ. 3: వేసా లేమిటికి నీవు వేమారు నవ్వఁగాను
బాస లేమిటికి నన్నుఁ బచ్చినేయఁగా
ఆసగా శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
యీ సుద్దులకే నీతో నేల యలిగేను

రేకు: 0369-3 రామక్రియ సంపుటం: 11-411

పల్లవి: చేసిన ట్టెల్లా నీకే చెల్లుఁ గాకా
ఆ సుద్దులు దడవి నిన్నంత సేయ వచ్చునా

చ. 1: నెమ్మొగము వాడె నంటా నిండుఁజెమ టేడ దంటా
దిమ్మరిమాఁటల నిన్నుఁ దిట్ట వచ్చునా
అమ్మరో పానుపుమీఁద నాకె నీవు నున్నా రంటా
నిమ్మపంటఁ గొని నేము నిన్ను వేయ వచ్చునా

చ. 2: యేతల చూచే వంటా యెంగిలిత మ్మేడ దంటా
చేత వంటి నిన్నే మైనాఁ జేయ వచ్చునా
భీతి లేక ఆపె వెంటఁ బెట్టుక వచ్చితి వంటా
నీతి దప్పి చిన్నఁ బో నిన్నుఁ జేయ వచ్చునా

చ. 3: ఆకెచే మొక్కించే వంటా అట్టె సిగ్గు వడ వంటా
కాకు సేసి నిన్ను గంపఁ గమ్మ వచ్చునా
యీకడ శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితిని
పైకొని యింకా నిన్నుఁ బచ్చి సేయ వచ్చునా

రేకు: 0369-4 రామక్రియ సంపుటం: 11-412

పల్లవి: ఇంకా నేల తడవే వేరా నీవు
సంకె దేరె నాకు నీ చలముఁ జెల్లెనూ

చ. 1: మాట నీతో నాడితిని మనసూఁ దెలిసితిని
యేఁటికి నన్నుఁ బిలిచే వేరా నీవు
యీటుతోఁ బెండ్లాడితివి యిట్టె సేస వెట్టితివి
వాఁట మాయ వలపులు వద్ద చే నుందానను

చ. 2: చేత నీకు మొక్కితిని చేరి నీతో నవ్వితిని
యీతల నన్నొరసేవు యేరా నీవు
నీ తగులు చూపితివి నెగు లెల్లా బాపితిని
యేతు నీకు గన మాయ నియ్యకొంటి నందుకు

చ. 3: కన్నుల నిన్నుఁ జూచితి కాఁగిటిలో నున్నదాన
యేన్నేసి ప్రియాలు చెప్పే వేరా నీవు
నన్ను మన్నింతిని విట్టె నంటున శ్రీవెంకటేశ
చిన్నపులకలు నిండి సెలవు నా కాయనూ

రేకు: 0369-5 శ్రీరాగం సంపుటం: 11-413

పల్లవి: ఇంత సేసినట్టి తన్ను నేమి సేసేమే
చింతతోడ నాచెక్కు చేతిమీఁది కెక్కెనూ

చ. 1: దవ్వుల నుండేతనకు దండము వెట్టితి మిదె
యివ్వల నింకా మాతో నేమి నవ్వీనే
రవ్వ లాయ మావలపురాజ్యములోన నెల్ల
పువ్వుటమ్ములమనసు పుర పురఁ బొక్కెను

చ. 2: పట్టక తొల్లె తనకుఁ బంత మిచ్చితి మిదె
యిట్టె మాదిక్కు తా నేమి చూచీనే
వెట్టివిన్నపము లాయ వేగుదాఁకా మాకతలు
జట్టిగా మావిరహము చల్లువెద లాయను

చ. 3: చేరి తాఁ బైకొనఁ గానె చేతికి లో నైతి మిదె
యీరీతి నాయడకు తా నెంత సేసీనే
కూరిమి నిట్టె నన్నుఁ గూడె శ్రీవెంకటేశుఁడు
తీరుకు వచ్చి పనులు తేటతెల్ల మాయను

రేకు: 0369-6 దేసాళం సంపుటం: 11-414

పల్లవి: నీకుఁ బోదు నాకుఁ బోదు నీ వెట్టు సేసినాఁ జేయి
సాకిరివంటిది నాజవ్వన మిందుకును

చ. 1: జిగురువంటిది నాచిత్త మిది నీమీఁదఁ
దగిలి విడువరు నీ తగురూపు
తగరువంటిది నాతమకము మీఁద మీఁద
నతడు నేయు నీయాయాలు దాఁకీని

చ. 2: బచ్చనవంటిది నాపలుకు నీయడకును
అచ్చమై చూడఁ జూడఁగ నంద మై యుండు
నిచ్చనలవంటివి నానిండుఁ గోరికలు నీకు
హెచ్చినవలపు తల కెక్కఁ జేసేయెందుకు

చ. 3: గాలమువంటిది నాకాఁగిటికూటమి నీకు
తూలి మరి యెందుకునుఁ దొలఁగ రాదు
తాలమువంటిది నాతగులమి నీమీఁద
మేలిమి శ్రీవెంకటేశ మీఁదఁ గిందఁ బాయదూ

రేకు: 0370-1 సాళంగం సంపుటం: 11-415

పల్లవి: ఎదుట నున్నాఁడు వీఁడె యీబాలుఁడు
మదిఁ దెలయ మమ్మ యేమరులో కాని

చ. 1: పరమపురుషుఁ డట పసులఁ గాచె నట
సరవు లెంచిన విన సంగతా యిది
హరియే తా నటముద్దు లందరికిఁ జేసె నట
యిర వాయ నమ్మ సుద్దు లేఁటివో కాని

చ. 2: వేదాల కొడయఁ డట వెన్నలు దొంగిలె నట
నాదించి విన్నవారికి నమ్మికా యిది
ఆదిమూల మితఁ డటా ఆడికెల చాఁత లట
కా దమ్మ యీసుద్దు లెట్టికతలో కాని

చ. 3: అల బ్రహ్మతండ్రి యట యశోదకు బిడ్డఁడట
కొలఁ దొకరికిఁ జెప్ప గూడునా యిది
తెలిపి శ్రీవెంకటాద్రిదేవుఁడై నిలిచె నట
కల దమ్మ తన కెంత కరుణో కాని

రేకు: 0370-2 లలిత సంపుటం: 11-416

పల్లవి: కా దని మీమాఁట కడచేమా
సోదించి మమ్మే సొలయఁగ రాదా

చ. 1: తెలిసినమాఁటకు తెరమరఁ గేఁటికి
చెలులు తగవు లిటు చెప్పరే
అలిగి యిద్దరము నటు నిటు నుండఁగ
చల మే లని మమ్ము జంకించ రాదా

చ. 2: మునుపు వెన కెరిఁగి మొగమో టేఁటికి
అనవలసినట్ల నాడరే
పెనఁగుచు మాతో బీరము లాడఁగ
కనుసన్నలచే కలఁపఁగ దగదా

చ. 3: అమరినపనులకు ననుమాన మేల
సమము సేసితిరి సరుగ మమ్ము
క్రమమున శ్రీవెంకటపతి గూడెను
గుము రై మా కిటు గురిగాఁ దగదా

రేకు: 0370-3 శంకరాభరణం సంపుటం: 11-417

పల్లవి: ఎవ్వరితో గొడ వేల యింకా నీకు
రవ్వగా నీయింటికి రమ్మనేవు నీవూ

చ. 1: యీయింతిపయి మన్నన నీ కేఁటిదో వొక్కమాఁటలో
సేయరానిపను లైన సేతువు నీవు
మాయ సేసి యాపె నీతో మచ్చిక చల్లితేఁ జాలు
పాయ లేక నిలువున భ్రమతువు నీవూ

చ. 2: యెవ్వ రైనా నాపెను నేఁ డిటు పేరుకొంటేఁ జాలు
అవ్వల మూఁపులు మూఁడు అవుదువు నీవు
నవ్వులకు నాపెపయి నానలు వెట్టితేఁ జాలు
నివ్వెరగుపడి అట్టె నిలుతువు నీవూ

చ. 3: యెంతదడ వాపె నీయెదుట నుండితేఁ జాలు
రంతులఁ గిందు మీఁదు నరయవు నీవూ
కాంతతో శ్రీవెంకటేశ కడపలోఁ దే రెక్కి
యింత నన్నుఁ గూడి వీదు లేఁగితివి నీవూ

రేకు: 0370-4 లలిత సంపుటం: 11-418

పల్లవి: మానవు జగడము మాతోను
నేనీకిం తేసి నేరుపనా

చ. 1: రపమున న న్నిటు రమ్మని పిలువఁగ
అపుడే నే నోప నననా
ఉపమల దూరేవు వూరకే నను నిటు
కపటం బిపుడే కైకొంటినా

చ. 2: చెనకుచు నాపైయి చేతులు చాఁచఁగ
కొనచూపుల నినుఁ గోపించగా
తనియక నీవే తగిలేవు గాక
యెనసి యాస నీ కిచ్చితివా

చ. 3: కలయుచు నీవే కాఁగిట నించఁగ
వలపు నీవు మఱవకు మనవా
బలిమి శ్రీవెంకటపతి ననుఁ గూడితి
వలసి యెదురుమా టాడితినా

రేకు: 0370-5 లలిత సంపుటం: 11-419

పల్లవి: ఇందుకే వెరగయ్యీ నన్నెంచుకొంటేనూ
పందను దైవాన కెట్టు బాఁ తైతినో నేనూ

చ. 1: యెన్కికకూ మాని సంటా నెట్టు వుట్టించె దైవము
పన్ని యాఁడువా రే మన్నఁ బంత మిత్తును
వున్నమచందురునకు పువ్వులమొనలకును
వెన్నెలబాయిటికిని వెరతు నేనూ

చ. 2: యెందుకుఁ గొ రౌదు నంటా యెట్టు వెంచె దైవము
ముందె ముట్టునెత్తురుముద్దను నేనూ
అంది చనుగొండలలో నధరామృతములలో
అందందె పొట్టువొర లైయలతు నేనూ

చ. 3: యెక్కడిదొర న న న్నేలె శ్రీవెంకటేశుఁడు
మక్కువఁ బయ్యదకొంగమాఁటువాఁడనూ
చక్కెరమాఁటలకును జంకెనబొమ్మలకును
పక్కన లో నై యట్టె భ్రమతు నేనూ

రేకు: 0370-6 ముఖారి సంపుటం: 11-420

పల్లవి: ననుఁబోటిగాఁ గా నాతో నవ్వేఁ గాక
గునినే యాఁట దైతే గుంపించ కుండునా

చ. 1: తక్కక నేను నిన్ను తప్పు లెంచఁ జాలఁ గాక
నిక్కపు నీవొళ్లితప్పు నీ వెఱఁగనా
చెక్కు నొక్కి చెలు లెల్లాఁ జెప్పఁగానె వింటిఁ గాక
వెక్కసపుటాఁట దైతే విడనాడ కుండునా

చ. 2: కావరించి నిన్నుఁ దారుకాణఁ బెట్టఁ జాలఁ గాక
నీ వాడినమాఁటలు నీ వెఱఁగవా
మోవ నాడి యిందరూను మొక్కఁగానె వింటిఁ గాక
చేవ దేరి నాఁట దైతే చిమ్మి రేఁచ కుండునా

చ. 3: కలసినమీఁద నీతోఁ గపటాలు నేరఁగాక
నిలువు నీకుచ్చితాలు నీ వెరఁగవా
చెలఁగి కూడితి విట్టె శ్రీవెంకటేశ నన్ను
అలిగినయాఁట దైతే నలయించ కుండునా

రేకు: 0371-1 లలిత సంపుటం: 11-421

పల్లవి: ఇందుకే వెర గయ్యీ మాకు
అందపురమణుఁడు అతఁడే యెఱుగు

చ. 1: చెలిచిగురుమోవి చిత్తజునడిదము
వొలకుఁదేనె లె ట్లులికెనో
కులుకుఁజూపు పతిగుండెబెదరు లవి
కలికివెన్నె లెటు గాసీవో

చ. 2: కాంతకుచంబులు గట్టికొండ లవి
దొంతివల పెట్లఁ దొరిగోనో
పంతపునడు మది బట్టబయలు గిలి
గింత నెట్లఁ గరఁగీనో తానూ

చ. 3: తరుణిదేహ మింతయు బంగారమె
సొరిదిరతుల నెట్టు చొక్కెనో
యిరవుగ శ్రీవెంకటేశ్వరుఁడు గూడెను
అరిది విభవము లెట్లబ్బెనో

రేకు: 0371-2 కన్నడగౌళ సంపుటం: 11-422

పల్లవి: ఇంక నేల ఆసుద్దులు యిన్నియు నిందే కంటిమి
అంకెల నీ విన్నాళ్లు అంతేసి నేరుతువా

చ. 1: నవ్వేటినిన్నుఁ జూచి నమ్మఁగలదానఁ గాక
యెవ్వరికపటా లెట్టో యెఱఁగుదునా
మవ్వపు నీమేన నేఁడు మచ్చములు గంటిఁ గాక
నెవ్వగ నపనమ్మిక నీపై తొల్లి కంటినా

చ. 2: నీనయగారములకు నేనే మెచ్చుకొందుఁ గాక
యే నెపానకుఁ జేయుట యెరుఁగుదునా
కానీలే నీకపటాలు కానఁబడెఁ గాక నేఁడు
నానాఁడె నీ గుణము నా కింత దెలుసునా

చ. 3: గక్కన నీవు గూడఁగ కాని మ్మని యందుఁ గాక
యెక్కడనుండి వచ్చుట యెరుఁగుదునా
యిక్కువ శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
నిక్కి నేఁడు సేసే మేలు నిన్న నెరుఁగుదునా

రేకు: 0371-3 పాడి సంపుటం: 11-423

పల్లవి: నే నొకటి నేయఁగాను నీ వొకటి సేసేవు
కోనచెన్న రాయఁడ నీగుణ మింక మానవు

చ. 1: పక్కన నే తోడ పకపక నగఁగాను
తెక్కుల నీ వైతే నేల తిట్ట వచ్చేవూ
మొక్కలము విడిచి నే ముచ్చట లాడుకోఁగాను
వెక్కసపువెంగె మని వేరె తలఁచేవూ

చ. 2: తనివోక నే నిన్ను తప్ప కిట్టె చూడఁగాను
తనవు చూచుక నీకే తల వంచేవు
అనుమానము లే దని ఆన నీపైఁ బెట్టఁగాను
పెనచి నీ వామాఁట పేరడిఁ బెట్టేవూ

చ. 3: కందువ లంటుచు నిన్ను కాఁగిట నించఁగాను
పొందుల నుప్పు వేసి పొత్తు గూడేవూ
అందపు శ్రీవెంకటేశ అట్టె కొనచెన్నఁడ వై
ముందు వెనకాఁ గూడి మోహము చల్లేవూ

రేకు: 0371-4 శంకరాభరణం సంపుటం: 11-424

పల్లవి: ఎఱఁగమా యింత యెమ్మెకాఁడ
గుటి లేని వట్టి కోపకాఁడా

చ. 1: మాయలు నెరపి మంచిమాఁట లాడి
చాయకు వలచే సటకాఁడా
కాయజకేలికి కాలిసన్నగోర
వాయక వాసేపు వగకాఁడా

చ. 2: అట్టు నిట్టు వచ్చి యాసలు రేఁచేవు
పట్టినచలముల పంతగాఁడా
గుట్టు సేసుకొని కూరిమి చల్లేవు
తొట్టినపాయపు దొమ్మికాఁడా

చ. 3: మన్నించి యింతలో మంచ మెక్కితివి
మిన్నక నవ్వుల మేఁటికాఁడా
యిన్నిటా శ్రీవెంకటేశ కూడితిని
కన్నుల మొక్కెటి గండికాఁడా

రేకు: 0371-5 మంగళకౌశిక సంపుటం: 11-425

పల్లవి: ఇసుమంత పని కైన యియ్యకొందును నీ
వస మైనదాన నీకు వంక లాడ వలెనా

చ. 1: మన్నించి నీవు నాతో మాట లాడితిని గాక
సన్న సేసి నిలచుటే చాలదా నాకూ
నన్నుఁ జూచి మరిఁ గొంత నవ్వు నవ్వితిని గాక
వున్నట్టె నావొద్ద నీవు వుండితేనె చాలదా

చ. 2: కరుణించి నీవు నాకాయ మంటితివి గాక
సరిపేరఁ బిలిచిన చాలదా నాకు
మరిగించుకో లేక మంతన మాడేవు గాక
గరిమె నీసొమ్మ నని కైకొంటే చాలదా

చ. 3: ఆదరించి కాఁగిట నీ వలముకొంటివి గాక
సాద నంటా మెచ్చి తిదె చాలదా నాకు
సేదదేరఁ గూడితివి శ్రీవెంకటేశ నీవు
పాదము చాఁచి నన్నుఁ బైకొనుటే చాలదా

రేకు: 0371-6 రామక్రియ సంపుటం: 11-426

పల్లవి: నీకే తెలుసు నయ్య నీతగవూ
యీక డాకడివారలు యే మందురో కాని

చ. 1: అంచెలఁ బెట్టెను చూపు లంగన నీరాకకు
యించుకంత నీజాగు లెరఁగ రాదూ
మంచివాఁడ వంటానె మమ్ము నంపె నీకడకు
యెంచి యిటమీఁదిపను లె ట్టుండునో కాని

చ. 2: పడఁతి మొక్కులు నీకు పొఁజు లెదురుగా నంపె
అడరి నీరాజస మింతౌ తెరఁగదూ
అడియాలము చెప్పంపె నది యెం తైనాఁ గలదు
యెడసి నీ వుండినందుకు కే మనునో కాని

చ. 3: కాంత కుచములు నీకు కానికెనా మీఁ దెత్తె
పంతము నీవు చెల్లించేబా గెరఁగదూ
అంతలో శ్రీవెంకటేశ ఆదరించి కూడితిని
యింతటి నీ మేలు దక్కె నిఁక నెంతో కాని

రేకు: 0372-1 ముఖారి సంపుటం: 11-427

పల్లవి: వెన్నలు సెలవిఁ గారే విఠ్ఠలేశా
నన్ను చచి నవ్వేవు నాలి విఠ్ఠలేశా

చ. 1: బాలులతో నాడి యాడి బడిలితివి రావయ్య
వేలెటికురుల ముద్దువిఠ్ఠలేశా
కాళింగుఁ దొక్కితి వట కటకట పుద్దండాలు
వోలిఁ జేయ దొరకొంటి వోవిఠ్ఠలేశా

చ. 2: దూడలవెంటఁ దిరిగి దూళి మేన నంటె నిదే
వేడుక యంతో నీకు విఠ్ఠలేశా
యేడకొండో వొకవేల నెత్తితివి నీ వట
వోడక యింత సేతురా వోవిఠ్ఠలేశా

చ. 3: గొల్లెతల నంటి యంటి గొల్లు మేన నిండె నిదే
వెల్లవి రాయఁ బనులు విఠ్ఠలేశా
యిల్లిదె పండరంగిని యిటు శ్రీవెంకటాద్రిని
వుల్ల మలరు నిలిచి తోవిఠ్ఠలేశా

రేకు: 0372-2 సాళంగనాట సంపుటం: 11-428

పల్లవి: నాకు నీమొగము చూచి నవ్వు వచ్చీని
కాకు సేయ కిఁక నైన గతి గూడవయ్యా

చ. 1: పలుకు లెన్ని గలవు పాటించి బొంకఁగఁ బోతే
అలరీనా నీవంటి అందగానికి
చలము సాధించితివి చక్క నాయఁ బను లెల్ల
వెలయ మాయింటి కిఁక విచ్చేయవయ్యా

చ. 2: ఆన లెన్నైనఁ గలవు అటమటించే నంటే
యీనెపాన నీవంటి యెమ్మెకానికి
నీనేర్పు లీడెరె నిన్ను నిందరు మెచ్చిరి
వీనులు చల్ల నాయను వీడె మిందవయ్యా

చ. 3: వొడఁబా టైనఁ గద్దు వోపిక గలిగితేను
విడువక నీవంటి వేసదారికి
తొడిఁబడఁ గూడితివి దొమ్మితో శ్రీవెంకటెశ
బడలితివి రతులఁ బవ్వళించవయ్యా

రేకు: 0372-3 గుండక్రియ సంపుటం: 11-429

పల్లవి: కన్నవా రెవ్వరు దీనిఁ గడ లేని జవ్వనము
తన్నుఁ దానె వలపు లింతకుఁ దెచ్చె నయ్యా

చ. 1: మనసులోపలి చింత మాటలాడుదాఁకాఁ
యెనలేనిమాఁట బయలీఁతకుఁ దెచ్చె
తనవోని బయలీఁత తమకములకుఁ దెచ్చె
పెను నావల పింతగాఁ బెరిగె నోయయ్యా

చ. 2: గక్కనఁ జూచినచూపుకాఁక లింతేసికిఁ దెచ్చె
చిక్కించి కాఁకలు లో లో సిగ్గుకుఁ దెచ్చె
నిక్కినసిగ్గులు నేఁడీ నివ్వెరగులకుఁ దెచ్చె
పిక్కటిల్లి వల పింత పెరిగె నోయయ్యా

చ. 3: మితి లేని మోహములు మేరలు మీరఁగఁ దెచ్చె
రతులమేరలు యింత రవ్వకుఁ దెచ్చె
యిత వై శ్రీవెంకటేశ యిట్టె నీవు గూడితిని
కత రై వలపు లింతగాఁ బెరిగె నయ్యా

రేకు: 0372-4 సామంతం సంపుటం: 11-430

పల్లవి: చేరి మందెమేళ మెంత సేసేవు మమ్ము
మేరకు మేరే కాక మిక్కి లింత చెల్లునా

చ. 1: చివ్వన నీ కూడిగాలు సేసేకాంతలలోన
నెవ్వరిఁ బోలుదు నేన న్నేల పట్టేవు
యివ్వల నీ వే మన్న నెదు రాడఁ జాలఁ గాక
దవ్వుల నుండిననన్ను దగ్గరి రాఁ దీతురా

చ. 2: అంచెల నీతో నవ్వే యాపాటివారమా
పొంచి నన్ను నెంత సేసి పొగడేవు
ముంచి బలిమి సేయఁగా మోనానల నుండితిఁ గాక
మంచ మెక్కి నీసరుస మాట లాడేదాననా

చ. 3: కొంగు వట్టేవు నీకాలిగోరఁ బోరఁ గలనా
యెంగిలి మా మోవితేనె లేల ముట్టేవు
అంగవించి శ్రీవెంకటాదిప కూడితి నన్ను
మంగిటినిధానము వై ముట్టి నన్నుఁ బాయవు

రేకు: 0372-5 శంకరాభరణం సంపుటం: 11-431

పల్లవి: తగ దీకనూ నీ వెటు సేసిన తపములు ఫలియించె
మగలవాఁడూ ప్రియములు చెప్పఁగ మంకులు లేవేఅమ్మా

చ. 1: అలుగుకువే వోచిలియా ఆతఁడు గరి గాఁడు
వలవంతల నీలోఁ బొడమినవలపులు గురి గాని
చలములు యింకా సాదించకువే జగడము పని లేదు
వెలసిన నీ మొగమోటము లుండఁగ వెనక నేరరాదు

చ. 2: తడవకువే ఆతఁడు చేసినతప్పులు గురి గావు
విడువక నీతనువునఁ బెనఁగెటివిరహము గురి గాని
చిడుముడికి యిఁక నేఁటికి నీచేతికి లో నతఁడూ
బడిబడినె నీవే అతనికిఁ బంత మియ్యఁ బడును

చ. 3: పెనగకువే శ్రీవెంకటేశ్వరు బీరము గురి గాదు
కొన మొద లెంచుక మీలోఁ గూడినకూటమి గురి గాని
వినియును వినకే సిగ్గులు వడియెడివెరగులు వని లేదూ
ననిచిన నీసెలవులలో ముసిముసి నవ్వులు దొలఁకఁగను

రేకు: 0372-6 శ్రీరాగం సంపుటం: 11-432

పల్లవి: నీతో వాదుకు నే నోప
యేతుల కిఁక నీ వే మైన ననరా

చ. 1: బచ్చనమాటలు పలుమరు నాడఁగ
యెచ్చుకుందు లిఁక నే మౌనో
వొచ్చము లే కే నూర కుండఁగా
యిచ్చకొలఁది నీ వే మైన ననరా

చ. 2: చేకొని బత్తులు సేయఁగ రాఁగా
నేకొలఁది బడునో యెన్నికలు
చీకా కయి నే సిగ్గున నుండఁగ
యీకొలఁదుల నీ వే మైన ననరా

చ. 3: గుటిగాఁ గాఁగిటఁ గూడఁగఁ రాఁగా
నెఱుకలు మఱపులు నే మవునో
నెఱి శ్రీవెంకటనిలయుఁడ నీవే
యెఱఁగి కలిసితివి యే మయిన ననరా

రేకు: 0373-1 మంగళకౌశిక సంపుటం: 11-433

పల్లవి: నావాఁడ వని నిన్ను నమ్మి యుందును
యీవేళ నాతోనె యింత గలదా

చ. 1: రావద్దా నీవు నేఁడు రమణుఁడ మాయింటికి
కావిరి నీకు నేము కడవారమా
సోవల నెగ్గులు లేవు చుట్టపువరుసే నాకు
నీ వెరఁగనితగవు నీకుఁ జెప్పేమా

చ. 2: చెప్ప వద్దా నీవు నాకుఁ జేసేపనుల కెల్ల
నెప్పు డైన నేము నీకు నెదు రాడేమా
తప్పించుకోఁ బని లేదు తగుల మైనచోట
ముప్పిరి నీకు వలపు మోపు గట్టేమా

చ. 3: కూడ వద్దా నీకు నీవే కొంగు వట్టి నన్ను నేఁడు
జాడ దప్పి నీకు మెచ్చనివారమా
యీడనె శ్రీవెంకటేశ యింత సేసి కలసితి
వేడుక నీచేఁతలకు వెగ్గళించేమా

రేకు: 0373-2 ముఖారి సంపుటం: 11-434

పల్లవి: కడు గట్టిగుండె నీకుఁ గాఁగాఁ గాక
అడరి పాయపువారి కంతేసి చెల్లునా

చ. 1: పంతము దప్పినఁ దప్పీ పక్కన నవ్వేవు సుమ్మీ
యింతిరో నిన్నటిమాట కిపుడు నీవు
చెంతల నే మిందరము చేరి వేఁడుకోఁ గాను
కాంతునిఁ గాఁగిట నిట్టె కలయఁగ వలదా

చ. 2: మంకులు దీరినాఁ దీరీ మాట లూఁకొనేవు సుమ్మీ
వుంకువగా రాతిరింటివొట్లకును
సంకె దీర మీతగవు సరిగా నే తేర్చఁ గాను
యింకా నేల అలుకలు యియ్యకొన వలదా

చ. 3: సిగ్గులు వీడినా వీడీ సిరసు యెత్తేవు సుమ్మీ
అగ్గమై శ్రీవెంకటేశుఁడ డండ నున్నాఁడు
వెగ్గళిం చాతఁడే నిన్ను వేఁడుక కాఁగిటఁ గూడె
నిగ్గుల మమ్మిక మెచ్చి నిండుకొన వలదా

రేకు: 0373-3 లలిత సంపుటం: 11-435

పల్లవి: నూఁటికి సెలవు గాఁగ నూలిపోఁగే యందురు
యేఁటి కిఁక మాఁట లెల్లా నిందులోనె వున్నవి

చ. 1: నిండు విరహతాపాన నీవు రాని కోపాన
అండ నే మని దూరి నే నంటినో నిన్ను
వుండుసుద్దు లేల యిఁక వొక్క మాఁటే మొక్కే మిదే
చండి పెట్టి యే మన్నాఁ జవి గాదు ప్రియము

చ. 2: చెప్పుడు మాఁటలకుఁ గా చిత్తము నిలుప లేక
వుప్పటించి నిన్ను నెంత వొరసితివో
ముప్పిరి నాకందు వాయ ముందటికి వచ్చితిమి
యిప్పు డిఁక నే మన్నా నెరవు లై తోఁచును

చ. 3: చెఱఁగు వట్టి తియ్యఁ గా సిగ్గునఁ దప్పించుకోంటా
తటె నాకొనగో రెందు దాఁకించితినో
నెటె శ్రీవెంకటేశుఁడ నే నందుకే కూడితిని
మొఱఁగు మరఁగు లేదు ముంచుకొనీ నవ్వులు

రేకు: 0373-4 శంకరాభరణం సంపుటం: 11-436

పల్లవి: ఎంద రైనఁ గలరు నీ కెరుఁగుదు నది నేను
నింద నీపైఁ బడి నని నే ననేఁ గాని

చ. 1: కాయము నీచేతిది కడు మోహించితిఁ గాన
యేయడకు నీ వేఁగఁగా నే మౌదునో
నాయంతకు నే వెరవ నంటున నిన్నందరును
యీయెడ దూరే రని యెంచుకొనేఁగాని

చ. 2: పుసు రెల్ల నీసొమ్ము పూడిగపుదానఁ గాన
దెసలు నీచేతవి నీ తెగు వెట్టౌనో
విసుగ నీసుద్దులకు వెక్కసపుటపకీర్తి
ముసరి మీఁదట నీపై మోచీ ననీ కాని

చ. 3: బదు కెల్ల నీసొమ్ము పట్టపుదేవులఁ గాన
యిదె నీరతులలో నే నెంత సేతునో
పొదిగి శ్రీవెంకటేశ పోనీక కూడితి నన్ను
అది గాదు నాతో సరి యయితి వనీ కాని

రేకు: 0373-5 గుండక్రియ సంపుటం: 11-437

పల్లవి: త నంతఁ దా నెఱఁగఁడు తగులక నాకుఁ బోదు
చెనకఁగ నైన దయ్యీ సిగ్గులు వడకురే

చ. 1: యేమా టయినఁ గాని యెగ్గు దప్పు లైనఁ గాని
ఆమాఁటే నామాటగా ననరే మీరు
వేమారుఁ దనతోడ వేసరితి మిన్నిటాను
వోముచు నెన్నాళ్ల దాఁకా వోరుచుక వుందునే

చ. 2: వాసి పంతు లైనాఁ గాని వైపు లెట్టయినాఁ గాని
సేసినదే నాచేఁత చెల్లనే మీకు
మోసపోతి నిన్నాళ్లు మొగమోటములనే
పాసితే వలపులు చేపట్ట నెట్టు వచ్చునే

చ. 3: చేతికి లో నైనాఁ గాని సేసినట్టే సేయనీ
మీతగవే నాతగవు మీరరే మీరు
యీతల శ్రీవెంకటేశుడింతలో విచ్చేసి కూడె
యీతలఁపు నేఁడు గాక యిన్నాళ్లు నెందుండునే

రేకు: 0373-6 దేసాళం సంపుటం: 11-438

పల్లవి: నీతో మాటాడఁ బోతే నింద వచ్చును
యేతెరువుఁ బో నోప మాయింటనే వుండే మయ్యా

చ. 1: సిగ్గులు ముదిరితే సెలవికి నవ్వు వచ్చు
బగ్గన నవ్వితేఁ గోపము వచ్చును
వొగ్గి కోపగించఁ బోతే వొక టొకటే వచ్చును
యెగ్గులకు నోపము మాయింటనే వుండే మయ్యా

చ. 2: సరసాలు ముదిరితే సారెఁ జేపట్లకు వచ్చుఁ
దొరల చేఁ బట్టఁ బోతే దూరు వచ్చును
మరలి ఆదూరులు మరి యెందు కైనా వచ్చు
నిరవు లెరిఁగితిమి యింటనే వుండే మయ్యా

చ. 3: తప్పక నిన్నుఁ జూచితే తలపోఁతలకు వచ్చు
కప్పినతలపోఁతల కాఁక వచ్చును
యిప్పుడె శ్రీవెంకటేశ యెనసితి విదె నన్ను
యెప్పుడూఁ బాయక మాయింటనే వుండే మయ్యా

రేకు: 0374-1 శంకరాభారణం సంపుటం: 11-439

పల్లవి: నామనసు వేగిరించీ నాకంటేను
తామసించఁ బని లేదు తమకించీ వయసు

చ. 1: పోయి వచ్చి తటె నేఁ బొమ్మన్న చోటికి నీవు
ఆయనా ఆపని నే నన్నట్లనే
మాయలు గావు గదా మన సొక్క టాయనా
యీయెడకు నీవెంటే యిప్పు డిట్టె వచ్చెనా

చ. 2: వేలఁ దగిలించుకొన్న వింతలేక యెక్కడిదే
మేలుసుద్ది నీమొకాన మించీ నదే
వాలుకరెప్పలకొన వంచి సన్న సేసేవు
లోలో మాటాడుదము లోనికి రాఁ గదవే

చ. 3: యేఁటికి నవ్వేవే నీవు యెంచినట్టే ఆయనా
చాటువ నదియ నా సంతోషము
యీటున శ్రీవెంకటేశుఁ డింతలో విచ్చేసి కూడె
పాటించి తా నే మనీనె పంతము లీడెరెనూ

రేకు:	0374-2 లలిత	సంపుటం:	11-440
పల్లవి:	ఈకాలం బెవ్వరి కైన యిచ్చకమే మేలు
	మీకేఁటికి నిష్ఠూరంబులు మితిఁ దానె బుద్ధియెరిఁగీని
చ. 1:	నగ నేలే చెలులాలా నటనల మీలోను
	అడపడి నేఁ డతఁ డేమని నట్టె అవు ననరే
	తెగనాడ వల దింకా తెలిపి చెప్ప నేలా
	మొగమోటమినె వుందము మనముందరఁ దానె యెరిఁగీని
చ. 2:	కడుఁ గడుఁ దప్పక చూడకురే కపటము దగిలీని
	జడిగొని ఆతఁడు యెంత సేసినా సారెఁ బొగడ గదరే
	తడవఁగ వల దింకా తరి గా దీవేళ
	వడివోనివలపులు గలితే నొగిఁదాఁ బ్రియములు చెప్పీని
చ. 3:	వెస నూరకె మొక్కకురే వెంగెము లయ్యీని
	పొసఁగ నూరక దండ నిడిచి పొగడకురే మీరు నన్ను
	పస గల శ్రీవెంకటేశ్వరుఁడు పై పై నన్నుఁ గూడె
	వసమై యాతిని లోనై నడతము వడి నతఁడే మన్నించీని

రేకు: 0374-3 సామంతం సంపుటం: 11-441

పల్లవి: తనకును నాకునుఁ దగు లేదే
పెనఁగి పిలవనిపేరట మిపుడూ

చ. 1: దవ్వుల నాతఁడు దప్పక చూచీ
నెవ్వరి మనసున నె టుండునో
నవ్వ కుండినా నన్నుఁ బెడరేఁచీ
చివ్వన నా కిది సిబ్బితి గాదా

చ. 2: కోపగించినాఁ గొంగులు వట్టీ
యీపెకు నితని కే మనరా
మాపుదాఁక నిదె మాటలె యాడీ
ఆపని మీతో నన సంగతులా

చ. 3: కడు నాన లిడఁగఁ గాఁగిట నించెను
వెడ వెడ గుట్టింక వెలిఁ బడదా
బడి శ్రీవెంకటపతి యిదె తిరిగీ
నిడువుల నిందలు నిజమే కాదా

రేకు: 0374-4 భవుళి సంపుటం: 11-442

పల్లవి: చిత్తగించి చూడవయ్య చిగురుఁ బోఁడిదిక్కు
బత్తి నీవు గల దాపెభాగయ్యముకొలఁ దయ్యా

చ. 1: చెలిచెమటల నాని చిత్తములో వలపులు
పులక లై మొలచెను బుజ కలిగే
యెలమిఁ గోరికె లై యీరికె లెత్తె నవే
బలుపంట లిక నీభాగ్యముకొలఁ దయ్యా

చ. 2: అంగనవిరహవేళ నాయిటిగా లై పూర్పు
వెంగలితనాన నట్టె విసరఁ జొచ్చె
పొంగుచుఁ దూరు పెత్తంగఁ బొలివారె నివ్వెరగు
పంగులఁ గోరు వట్టు నీభాగయ్యకొలఁ దయ్యా

చ. 3: కామినికుచము లనేగాదలెను జవ్వనము
ఆమనికాలము పై పై నదె ముంచెను
చే ముంచి కూడితి విట్టె శ్రీవెంకటేశ యీపెను
భామకు నీకు రతులు భాగ్యముకొలఁ దయ్యా

రేకు: 0374-5 భవుళి సంపుటం: 11-443

పల్లవి: తలవాతిమాఁట లెల్ల దయ్యె మెఱుఁగు
యెఱఁగనిదాన నేను యే మందు నేనూ

చ. 1: మంతనము లాడుకొంటా మంచముపైఁ గేరుకొంటా
నింతదడవు నుండరా యిద్దరు మీరు
యింతలో నే రాఁగాను యెవ్వ రాపె యీ పెంటా
యెంత కెంత నన్నడిగే వే మందు నేను

చ. 2: అంగము లొరసుకొంటా నాకు మడి చిచ్చుకొంటా
యెంగిలి పొత్తందుకోరా యిద్దరు మీరు
సంగడి నేఁ గూచుండఁగా సతి నా చెలి యనుచు
యింగితానఁ బే రడిగే వే మందు నేను

చ. 3: కమ్మి కాఁగించుకోంటా కాయాలు మరచుకొంటా
యిమ్ములఁ గూడి యుండరా యిద్దరు మీరు
పమ్మి నే దగ్గరఁ గాను పైకొని నన్నుఁ గూడితి
వెమ్మెల శ్రీవెంకటేశ యే మందు నేను

రేకు: 0374-6 పాడి సంపుటం: 11-444

పల్లవి: ఏలోయి విభుఁడా యిప్పుడు బాఁ తైతిమా
తాలిమి నిన్నాళ్లు నీతలఁ పెట్టె వుండేనా

చ. 1: సంగతిగా నాపెతోడ జగడించి రా కుండితే
నంగవించి మాతో మాట లాడుదువా
కుంగక కూడు వేఁ డైతే కూరాకు నంజినట్టు
పొంగుచు నీ నా సంది పొందు లెల్ల నిదివో

చ. 2: సన్నల నాపెతో యకసక్యేలకు నేమో కాక
యెన్నఁడైనా మాయింటికి నిట్టే వత్తువా
పన్నీరు గడుఁ జలైతే పచ్చిచాఁదు పూసినట్టు
యెన్నఁగ నీ నా పొందు లిన్నియు నిట్టెపో

చ. 3: బలిమి నీ వాపెతోడ పంత మాడి రా కుండితే
కొలఁది మీర నన్నిట్టే కూడుదువా
అలరి శ్రీవెంకటేశ ఆయములు సోఁకినట్టు
తలఁగని నీ నా పొందు తారుకాణ సుమ్మీ

రేకు: 0375-1 శంకరాభరణం సంపుటం: 11-445
పల్లవి: ఏల నన్ను బుజ్జగించే వింతటిలోనె
నాలితో నీ వేడ నున్నా నన్ను మానేవా
చ. 1: చిన్నఁబోయి వుండ నేల చెక్కు చేయి నాకేల
మన్నించి నీవే నాతో మాట లాడఁగా
మున్నె నీ కొప్పగించితి ముంచిన నా దేహ మెల్ల
నిన్న నేఁటి వారిమాట నే వినేనా
చ. 2: వెంగె మాడ నా కేల వేసరుకొనఁగ నేల
సంగతిగా నీవే నాతో సారె నవ్వఁగా
వుంగరము వెట్టితిని వున్నదాన నీకుఁ గాను
చెంగట నెవ్వరు నేమి చెప్పేరు యిఁకను
చ. 3: సిగ్గు వడ నా కేల సిరసు వంచఁగ నేల
దగ్గరి నీవె నాకు దక్కి వుండఁగా
నిగ్గుల శ్రీవెంకటేశ నీవే నన్ను గూడితివి
యెగ్గులు దప్పలు మరి యెంచ నేది యిందునూ

రేకు: 0375-2 సాళంగనాట సంపుటం: 11-446

పల్లవి: దగ దొట్టి వుస్సు రనీఁ దన కేలే
మగఁడే యింత సేసితో మరి యేఁటి మాఁటలే

చ. 1: ముప్పిరి నాపె కంటేఁ దాముందై వాదుకు రాఁగ
యిప్పుడుఁ గోపము రాక యింకా నెన్నఁడే
చప్పఁగా నప్పటిఁ దానే సాకిరులు చెప్ప వచ్చీ
కుప్పలుగా నవ్వ కెట్టు గుట్టు చేసుకొందునే

చ. 2: సారెకు నాకెకుఁ గా బాసలు దానే సేయ రాఁగా
యీరు దియ్యఁ బేను రాక యేల మానువే
పోరిచ యెందు కైనాఁ దాఁ బూసుక వాసుక రాఁగా
దూరక దైవముల నేల తోసిపో నిత్తునే

చ. 3: చెంది మ మ్మిందది దానె చెక్కులు నొక్కఁగ రాఁగా
యిందరితోఁ జెప్పక నే నేల మానేనె
కందువ శ్రీవెంకటాద్రిఘనుఁ డట్టె నన్నుఁ గూడె
చందమే కాక నే నెట్టు చలము సాదింతునే

రేకు: 0375-3 నాగవరాళి సంపుటం: 11-447

పల్లవి: వలవు రచ్చల వేసేవారు గలరా
కులమునాండ్ల నింత గోర నేయ వలెనా

చ. 1: నేరుపునఁ గళ లంటి నివ్వెరగుఁ బొందించేవు
వీరు వారుఁ జూచి నన్ను వెఱ్ఱి యనరా
వూర కున్న నామీఁద వొక్కొక్క గురుతు సేసి
ఆరయ నిదెంత చిత్తి ణనిపించ వలెనా

చ. 2: చేతిమీఁద జేయి వేసి చెమరింపించేవు మేను
ఆతలివారు చూచి నన్నట్టె నవ్వరా
కాతరపుమాట లాడి కన్నులకెం పెక్కించేవు
యీతరుణిమదరాగ మిది యెమ్మె లనరా

చ. 3: రతి నేసి తెర దీసి రామలఁ బిలిపించేవు
అతివె లి దెంత పచ్చి యనరా నన్ను
గతిగా శ్రీవెంకటేశ కలసితి విటు నన్ను
యితవరి యిది యెంత యిచ్చకురా లనరా

రేకు: 0375-4 సామంతం సంపుటం: 11-448

పల్లవి: అడ్డ మాడకు వమ్మ నీ వాతనితోను
వొడ్డార మతఁడు నీతో నొనరించీనా

చ. 1: మూలలకుఁ బోకు వమ్మ ముంచి యాతఁడు రాఁగాను
యీలాగు దొరచిత్త మెట్టుండునో
బాలకివి నీ విపుడు ప్రౌఢనాయకుఁ డతఁడు
తాలిమి నీయడకుఁ దప్పి నేసినా

చ. 2: సిగ్గులు వడకు వమ్మ చెనకి యాతనితోను
నిగ్గులమగవాఁడు యేనెప మొంచునో
అగ్గలపు మేనదాన వతఁడు మోహపువాఁడు
యెగ్గలు నీ కొనరించి యెలయించీనా

చ. 3: పక్కన నవ్వకు మమ్మ పట్టి యాతఁడు గూడఁగ
యెక్కువ శ్రీవెంకటేశుఁ డెంత సేసునో
మిక్కిలి వాసికత్తెవు మించి వోరుచు నాతఁడు
వొక్క టైతి రిఁక నీపై నోల వేసీనా

రేకు: 0375-5 సాళంగం సంపుటం: 11-449

పల్లవి: పిండికూరలోనలుపులునేఁబెనఁగి యేరఁగ నోపతన్ను
చండి సేయఁగ రాదు యిఁకసరుగఁగూచుండుమనవేయమ్మా

చ. 1: వేగి మిలిచినచీఁకటి వీఁడేల తడవీ మమ్ము
ఆగడము రాతి రెల్ల సతులు ఆడఁ జేయట చాలదా
యీగతులు నేనెఱఁగనా మరియు యేల రేఁచీమమ్మును
జాగులన్నియును యిఁకచాలుఁ గూచుండుమనరేయమ్మా

చ. 2: పూస గుచ్చినదారము పోనీఁడు తా నన్నును
వాసితో వీరి వారి వెనువెంట వలలఁ దిరుగుట చాలదా
సేసినవి తా నెరఁగఁడా చెప్పఁ బోతే నవ్వులు
ఆసఁ దన కెపుడుగలదూ యిఁక నాయఁగూచుండుమనరేయమ్మా

చ. 3: పూవుల పూఁపలువలెనె పొసఁగఁ దా నన్నుఁ గూడె
భావమున తలఁచి తలఁచి కూడెటిభావరతులెచాలదా
సేవ లెల్లనుఁ జేసితి నేఁడు శ్రీవెంకటేశ్వరునికి
యీవేళ నేఁ దనిసితి యెపుడు నిట్లఁ గూచుండు మనరేయమ్మా

రేకు: 0375-6 లలిత సంపుటం: 11-450

పల్లవి: కంటి మిన్నాళ్లకు గక్కన దొంగను
అంటె నోర నదే అంగమచ్చము

చ. 1: వుట్టు లెక్కినాఁ డొక్క తొక్కతె
తిట్టఁ దిట్ట వాని దిగఁ బిలవరే
గుట్టుఁ గృష్ణునికి గొల్లెతలకును
యెట్టు గావలసి నట్టయ్యీఁ గాని

చ. 2: మూల నున్నాఁ డదె ముంగిటికిఁ దీసి
రోలఁ గట్టరే రోస మెల్లఁ దీర
నీలవర్ణునితో నేఁడు మనబలి
మేలాగున నైన నెక్కీఁ గాని

చ. 3: మంచముపై వాఁడె మన మిందరము
కొంచక వొక్కొక్కగురుతు నేయరే
యెంచఁగ శ్రీవెంకటేశునకు మనకు
నంచెఁ బొందు లాయ నట్టే కాని

రేకు: 0376-1 నాదరామక్రియ సంపుటం: 11-451

పల్లవి: ఆఅడిం బెట్టకు మమ్ము నప్పటి నీవు
ఆణ నీవు నా కోపము అప్పటి నీవూ

చ. 1: మందు మందె సోఁక నాడి మొరఁగి లే దనేపతి
కందాలు చెప్ప వచ్చేవు అప్పటి నీవు
సందె మాడి వోడి తానె పగ చాటీ లోలోన
అందు కేల నవ్వేనే అప్పటి నీవు

చ. 2: సంగతి గానిచేఁతలు సారెఁ జేసినట్టివాని
నంగవించి కూడు మనే వప్పటి నీవు
ముంగిట వాఁడుండఁ గాను మొక్కి మొక్కిమావలపె
అంగడి వేసేవు మేలే అప్పటి నీవు

చ. 3: యింటికి నాతనిఁ దెచ్చి యిట్టె కాఁగిలించు మంటా
అంటించేవు బటిమినే అప్పటి నీవు
దంట శ్రీవెంకటేశుఁడు తానె కలసె నీమాఁట
కంటే నన రాదు మొక్కే వప్పటి నీవూ

రేకు: 0376-2 సాళంగనాట సంపుటం: 11-452

పల్లవి: ఇంత యెరఁగనియట్టి యెడ్డనా నేను
కాంతుఁడ నీ వంతేసి గరిసించ నేఁటికి

చ. 1: సిగ్గు వడి వొకమాఁట చింతతోడ నొకమాఁట
వెగ్గళించి నిన్ను నాడ వెఱ్ఱిదాననా
అగ్గలపుమోహ మైతే అన్నియు నమరుఁ గాక
దగ్గరి నప్పుడె నీతోఁ దమకించఁ దగునా

చ. 2: కన్నప్పుడే మొక్కులూను కాన కున్నఁ దక్కులును
పన్ని యింత నేయ నీకుఁ బగదాననా
మన్నించినవారితోడ మందెమేళ మింపు గాక
నిన్న నేఁటిలోనకే నిన్ను దూరఁ జెల్లునా

చ. 3: మూల నుండి వొకవాని ముంగిట నొకవాయియు
గోల నై చెప్పుక రాను కూళదాననా
యీలాగుల శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
వేళగా కిందాఁక నిన్ను వేసరించ వచ్చునా

రేకు: 0376-3 సామంతం సంపుటం: 11-453

పల్లవి: ఎఱఁగ ననకుండా నీ కెఱిఁగించితిమి నేఁడు
తఱవాతిపనులకు తలఁపు నీ కెట్టిదో

చ. 1: జక్కవకుచములపై జారెటి పయ్యదతోడ
చెక్కుల జారే చెమటచిత్తడితోడ
నిక్కి నిక్కి లోలోనె నీ కెదురు చూచుకొంటా
అక్కడ నున్నది చెలి ఆనతి నీ దెట్టిదో

చ. 2: నిట్టూరుపుగములతో నివ్వెరగుపాటుతోడ
అట్టె నిన్నుఁ గూడెటి యాసలతోడ
నెట్టనఁ దనపాయము నీకే మీఁ దెత్తుకొంటా
యిట్టె వాకిటికి వచ్చె యెన్నికె నీ కెట్టిదో

చ. 3: బారపుఁదురుముతోడఁ బవళించే నీపానుపు
చేరి యఁ దున్నది నవ్వునెలవితోడ
ఆరయ శ్రీవెంకటేశ అంతలో నేతెంచి యాపె
నూరడించి కూడితివి వున్న దిఁక నెట్టిదో

రేకు: 0376-4 ముఖారి సంపుటం: 11-454

పల్లవి: ఇంక నేల తెగి కొంక నెదురా నేనూ నీవు
కంకిగా నేమి సేసినాఁ గా దనేనా నేను

చ. 1: మక్కువ నీవే నన్ను మన్నించఁగా నింతే కాక
యెక్కడ నీసతులలో నెవ్వతె నేను
మొక్కలపుఁజేఁత లేల మొగమాట మరి యేల
వక్కణించి నీ వే మన్న వద్దనేనా నేను

చ. 2: నీ విచ్చినచనువున నేనే కసరితిఁ గాక
యీవల నీ వూడిగాన కేబాఁతి నేను
ఆవలఁ గపట మేల అట్టె కూటము లేల
నీవలసిన ట్టుండఁగా నిందించేనా నేను

చ. 3: కామించి నీవే నన్నుఁ గలయఁగా నింతే కాక
యేమంచిదాన నీకు యిప్పుడే నేను
ఆముక శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
ప్రేమము నీవు నించఁగా బిగిసేనా నేనూ

రేకు: 0376-5 సామంతం సంపుటం: 11-455

పల్లవి: ఎటువంటి నీ మాయ యెరంగమురా
యిటువంటి చేఁతలనే యెడ్డ నైతిరా

చ. 1: నగఁ బోతే నీ చేతి నాలికి లోనయితిమి
అగ డాయ మావలపు లట్టే వుండరా
మొగము చూడఁగఁ బోతే ముంచుకొనె మోహ మెల్ల
యగసక్కెములకే యేమి సేతురా

చ. 2: మాఁట లాడఁ బోయి నీతో మంతనాలఁ జిక్కితిమి
యేఁటికి మమ్ముఁ జెనకే వేడ సుద్దిరా
మేఁటినిన్న మెచ్చఁ బోయి మేనవాని చుట్టుకొంటే
యేఁట వెట్టీఁ దమకము యేమి సేతురా

చ. 3: కరఁగించఁ బోయి నీ కాఁగిట నేఁ గూడితి
యిర వాయ వయసు నవ్వేఁక నేలరా
సరవి శ్రీవెంకటేశ సమ్మటూరిలో మనము
యెరవు లేని యీమేలు కేమి సేతురా

రేకు: 0376-6 సాళంగం సంపుటం: 11-456

పల్లవి: దోసము దోసము దొర నే మనినా
యీసు లేనివిభుఁ డిచ్చకుఁ డతఁడూ

చ. 1: పంతము లాడకు పగతోఁ జూడకు
కాంతుఁడు నిను నిదె కైకొనును
యెంత వడియు నీ వెరఁగక తిట్టిన
వంతుకు మొక్కవె వైపరి యతఁడూ

చ. 2: కోపము మానుము గుంపెన లుడుగుము
తీపుల నీపైఁ దెగఁ డతఁడు
చే పట్టఁగ గోరఁ జిమ్మినయందుకు
మోపుచు శిరసున మొక్కవె యిపుడు

చ. 3: చలము లేమిటికి జంకెన తగ దిఁక
బలిమి శ్రీవెంకటపతి గూడె
తొలుత నీ వతనిఁ దోసి పెనఁగితివి
అలరుచు మొక్కవె అన్నియుఁ దేరె

రేకు: 0377-1 సాళంగం సంపుటం: 11-457

పల్లవి: ఏ మయ్యా వో యయ్య వే మయ్యా నే
మేమి బాఁతి నీకు నేల పిలిచే వయ్యా

చ. 1: నీ సరివారమా నేము నిండు సరసము లాడ
ఆసలఁ బెట్టక మాను మన్నామానవు
కాసు సేయనిపనికి కమ్మటి నాన వెట్టేవు
వేసరక నీవు మావెంట వెంటఁ బాయవు

చ. 2: చనవరులమా నేము సంగడి నీతోఁ గూచుండ
పొనిగి వోయినసుద్ది పో నియ్యవు
ననిచినవావు లెల్ల నాటికి నాఁడే కాక
కొనవేసి మమ్ము నేల కూరిమి గొసరేవు

చ. 3: నిన్ను మీరెవారమా నేఁ డేమి సేసినాను
కన్నులఁ దప్పక చూచి కలసితివి
యిన్నిటా శ్రీవెంకటేశ యిందరు నిట్టె చూడఁగ
నన్ను మన్నించి నాతోనె నవ్వులు నవ్వేవు

రేకు: 0377-2 ముఖారి సంపుటం: 11-458

పల్లవి: అయ్యేపను లేవిధాన నయ్యీఁ గాక
చెయ్యారఁ జేసేపనికి సిగ్గు లిఁక నేలా

చ. 1: పంతము లాడఁగ నేలే బలువులతోడను
చింతతో చెక్కిటిచేతి శిబ్బితె మేలు
చెంతలఁ బెనఁగఁ బోతే చేకత్తిగోళ్లే తాఁకు
నంతేసి లోఁతుల చొర నాఁడువారి కేలా

చ. 2: కోరి నేరా లెంచ నేలే కొయ్యగాండ్లకుతోడ
వోరుచు కుంటే టస్సు రుసురే మేలు
యేరీతిఁ దమి రేఁచిన నీరు దియ్యఁ బేను వచ్చు
బారపుబండ్లకుఁ గాళ్లు పైఁ జాఁచ నేలే

చ. 3: కడుఁ గడు నవ్వు లేలే కాములకులతోడను
చిడుముడిఁ జేసెటిసేవలే మేలు
అడరి శ్రీవెంకటేశుఁ డాతడే నన్నుఁ గూడె
విడువనిపొందులకు విచారము లేలే

రేకు: 0377-3 సాళంగం సంపుటం: 11-459

పల్లవి: ఏల తిట్టేవే నన్ను నెంత గబ్బిదాననే
మే లని పొగడితేను మెచ్చ వద్దా నీవూ

చ. 1: చిక్కని వెన్నెలతేట సెలవినె వుండఁ గాను
చక్కని నీ మోమునె చంద్రుడు డంటినే
నిక్కి నిక్కి మూతు లెత్తి నీ మొగాన కెగరఁగా
జక్కవపిట్టలు నీ చన్ను లంటినే

చ. 2: కామించి మురిపెముతోఁ గదలుచు నుండఁ గాను
రామ నీపిరుఁదు మరురథ మంటినే
కోమలపుఁ బోలికలు గురుతులు చూపఁ గాను
తామెరలనె పాదాలు తగ నంటివే

చ. 3: జాతిమెఋుఁగులతోడ సరివచ్చి వుండఁగాను
నీతురుమె రాశి యైల నీలా లంటినే
నీతితో నన్నుఁ గూడితి నేను శ్రీవెంకటేశుఁడ
నీతనువె బంగారునెల వంటినే

రేకు: 0377-4 భైరవి సంపుటం: 11-460

పల్లవి: ఇట్టె నేఁ దప్పక చూడ నెంతదానము
పట్టి నీతోఁ బంత మాడి పని గొందువా

చ. 1: పాటించి యిచ్చినమాఁటపట్టుకే నిన్నంటిఁ గాక
యీటున నీతోఁ బెనఁగ నెంతదానము
వాఁట మైన వలపులే వాసి రేఁచెఁ గాక నన్ను
వేఁట వెట్టి నిన్ను నింత వేసరింతునా

చ. 2: కదిసి చెప్పేకతకుఁ గాల్లడిగితిఁ గాక
యెదురుమాటాడ నీతో నెందదానను
మొదల నా మొగమోటె మొక్కించెఁ గాక నీకు
యిదివో నిన్నుఁ దగిలి యింత సేతునా

చ. 3: సందడిఁ గాఁగిలించఁగా సంతోషించితిఁ గాక
యిందరిలో నిన్ను నవ్వ నెంతదాననూ
అంది శ్రీవెంకటేశుఁడ అట్టె నన్నుఁ గూడితివి
పొందుకు మెచ్చే కాక పోనీ కిట్టె వుందునా

రేకు: 0377-5 సామంతం సంపుటం: 11-461

పల్లవి: వాఁడి గలవాఁడ వౌత వడి నే మెఱుఁగుదుము
వేఁడిమి దుష్టులమీఁద విసరంగ రాదా

చ. 1: వోప నంటాఁ బెనఁగితే నుడికి తిట్ట వచ్చేవు
ఆపనికే యెంత కెంత ఔరా నీవు
కోపము గలిగితేను గురిఁ బగవారిమీఁదఁ
జూప రాదా యీడ నేల చూపేవు నీవు

చ. 2: తనిసినవారిమీఁదఁ దగఁ జేతులు చాఁచేవు
యెన లేనికాఁకతోడ నేరానీవు
మొన చూప వలసితే ముంచి నీకు నెదిరించి
చెనకెటివార్పైనే చేఁత సేయ రాదా

చ. 3: పొలసి నంతటిలోనె పొదిగి నన్నుఁ గూడితి
మెలుపు శ్రీవెంకటేశ మేలురా నీవు
బలిమి నీకుఁ గలితే పాఁజులమీఁద నురికి
వలసినట్టు మెరయ వద్దనేనా నేను

రేకు: 0377-6 రామక్రియ సంపుటం: 11-462

పల్లవి: అడుగరే చెలులాల ఆతనినే యీమాఁట
తడవి నే మెవ్వ రైన తన్ను మీరేమా

చ. 1: చదురంగ మాడి యాడి సరిఁ దానె వోడె నింతే
వొదిగి తనకు నసు రుసురేలే
మొదల నేఁ డెవ్వతెకు మొగము చూపి వచ్చెనో
యెదుట నున్నరా రెల్ల నేమి సేతురే

చ. 2: వసంతము లాడ వచ్చి వడిఁ దానె తొప్పఁ దోఁగె
వసివాడి తానె తల వంచ నేలే
దెసల నెవ్వతెచేతి తిట్టు దాఁకి తా వచ్చెనో
యెసఁగి నవ్వేవా రెల్ల నేమి సేతురే

చ. 3: సరస మాడె తనకు సరి నింద మోఁచె నింతే
దరలోన సిగ్గుపడ దన కేలె
యిర వైన శ్రీవెంకటేశుడె తా నన్నుఁ గూడె
యెరవులవా రెల్ల నేమి సేతరే

రేకు: 0378-1 దేసాళం సంపుటం: 11-463

పల్లవి: అన్ని సుద్దులు నెరుఁగు నాతఁడె కాక
యెన్నికలు పలుమారు యే మెంచేనే నేను

చ. 1: నివ్వెరగు వడి యుండి నే నే మనే నిన్ను
నవ్వులిమాటలు నన్ను నడుగ నేలా
దవ్వులఁ దనచేఁతుల తలపోయుచున్నదాన
యెవ్వరిమాటల కని యే మందు నేను

చ. 2: చెక్కుచేత నే నుండి నేనే దేమే నిన్ను
తక్కక నన్నేల మీరు తడవేరే
మొక్కలోన నాతనిమోము చూచె నిదే నేను
యెక్కువ తక్కువలకు నెంతదాన నేనూ

చ. 3: కలకల నవ్వుతాను కా దనే దేమే నిన్ను
చలపట్టి వల పేల చల్లు మనేరే
యెలమి శ్రీవెంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
యిల నాకు నెదు రేదే యిర వయితి నేనూ

రేకు: 0378-2 రీతిగౌళ సంపుటం: 11-464

పల్లవి: నిజమే యాడుచు గాక నీ కేల యీవెరపు
గజిబిజి నేసి నిన్ను గాసిఁ బెట్టేనా

చ. 1: మాఁట లాడుటే గురుతు మంచముపై నాపె నీవు
నాటినకూరిమి మించునవ్వులతోడ
యేఁటికి నాతో బొంకే వేసుద్ది నెరఁగ నంటా
ఆఁటదాన నిన్ను నే నే మైనాఁ జేసేనా

చ. 2: చేయి పట్టుటే గురుతు సిగ్గుపడి యున్నచెలి
చాయకుఁ దీసీ నది పూఁజప్పరములో
మాయ లేల నెరపేవు మగువ నింతే నేను
దాయవలె నీతోడఁ దగఁ బోరేనా

చ. 3: చెక్కు నొక్కుటే గురుతు చెలి నీవు మేడమీఁద
నెక్కడి యానలు నాతో నేల పెట్టేవు
యిక్కడ శ్రీవెంకటేశ యేలితివి నన్ను నేఁడు
పక్కన లే కున్న నిన్ను బలిమి సేసేనా

రేకు: 0378-3 ఆహిరి సంపుటం: 11-465

పల్లవి: ఎవ్వరికిఁ దెలుసు నీ యిట్టి మాయలు
రవ్వలుగాఁ జూడఁ బోతే రంటికిని వత్తువూ

చ. 1: నగవులు సారె నీకు నవ్వ వచ్చుఁ గాక మాకు
పగ సవతులచేతఁ బడ వచ్చునా
పగలుమేలము చాలు పద వోయి నీ కేమి
తగులువిరికాఁడవు దక్కినట్టే వుందువూ

చ. 2: చేఁత లెల్లఁ జేసి నీకుఁ జెక్కు నొక్క వచ్చుఁగాక
బాఁతిపడి విరహనఁ బడఁ గలమా
లేఁతమాట లాడ వద్దు లేవోయి వలపులు
పాఁతగిలితేఁ జాలు పనులే మరతువూ

చ. 3: గతి గూడి నీకు మమ్ముఁ గాఁగిలించ వచ్చుఁ గాక
అతివలయు నిన్ను రమ్మన నోపేమా
సతమై శ్రీవెంకటేశ చన విచ్చి కూడితివి
యిత వయినచోటికి నీ వెట్టయినఁ జేతువూ

రేకు: 0378-4 హిందోళం సంపుటం: 11-466

పల్లవి: వెనక మమ్మన వద్దు వెతలఁ బొరల వద్దు
అనుమాన మెల్లఁ దీరె నరుసుకోవమ్మా

చ. 1: తలఁచఁగానె వచ్చె తరుణి నీరమణుఁడు
అలరి మీమచ్చటలు ఆడుకోరమ్మా
నిలుచున్నాఁ డదివో నీయెదుట నతఁడు
తెలియఁగల వెల్లాను తెలుసుకోవమ్మా

చ. 2: చేతికి లో నై యున్నాఁడు చిల్లరచేఁతలు మేన
ఘాతలుగ లేవు గదా కనుకోవమ్మా
యేతుల నీ చెప్పినట్టు యేమి సేయు మన్నాఁ జేసీ
యీతల నొరసి చూడు మింకా నోయమ్మా

చ. 3: గక్కనఁ బ్రేమ మెరిఁగి కాఁగిలించినాఁ డిదివో
మిక్కిలి శ్రీవెంకటేశు మెచ్చవమ్మా
నిక్కి యీతనిగుణాలు నీ వెరఁగ వలసితే
చెక్కు నొక్కి బుజ్జగించి చిత్తగించవమ్మా

రేకు: 0378-5 శంకరాభరణం సంపుటం: 11-467

పల్లవి: దొరపాటివాఁడు తాన దొరరీతి నుండఁడు
వరుసలు మిరి వచ్చీ వద్దనరే చెలులూ

చ. 1: అంది నాకు బాగా లిచ్చి ఆకు మడి చిచ్చె నంటా
విందువలె నితఁ డేల వేఁడుకొనీనే
యెందు నూడిగపువార మింతే తనకు నేము
మందెమేళములు సేసీ మాను మన్న మానుఁడ

చ. 2: సరిఁ దానిలుచుండి మంచముపైఁ గూచుండుమంటా
అరుదుగ నన్ను నేల ఆన వెట్టినే
సరుసఁ దనకొలవుసతుల మింతే నేము
వెరవులు చెప్ప వచ్చీ వీఁడి దేమే నేఁడు

చ. 3: తల గుచ్చి కాఁగిలించి తమ్ముల మిడు మంటాను
బలిమి నేసీ పెనఁగీ పచ్చిగాఁ దానూ
యిల శ్రీవెంకటేశుఁడు యిచ్చలోనివార మింతే
చాలి వాసి మమ్ముఁ గూడె చన వింత గలదా

రేకు: 0378-6 రామక్రియ సంపుటం: 11-468

పల్లవి: ఎంత బలువె తన కెంత నేము సదరమా
అంతే పో తనసుద్దు లవి నే మెరఁగమా

చ. 1: రమ్మని చేరఁ బిలిచీ రా కున్నఁ దనచేతి
నిమ్మపంటఁ గొని వేసీనే నన్నును
కమ్మటిఁ దప్పక చూచీ కడు నేఁ దల వంచితే
అమ్మ మీఁదఁ దిట్టీనే అంతలోనె తానూ

చ. 2: చేయి చాఁచీ నామీఁద సిగ్గున నూర కుండితే
చాయలకుఁ బన్నీరు చల్లీనే వీఁడూ
ఆయములు దా నంటఁగ నందుకు నేఁబెనఁగితే
బాయిట వొట్టు వెట్టీనే పాయ లేక తానూ

చ. 3: కొంగు వట్టి తియ్యఁగాను గుట్టున నే నవ్వితేను
అంగవించి యట్టె కూడె నందుకే తానూ
యింగితము శ్రీవెంకటేశుఁ డితఁడే యెఱంగు
చెంగట నన్నిటికిని చెక్కు నొక్కీఁ దానూ

రేకు: 0379-1 రామక్రియ సంపుటం: 11-469

పల్లవి: ఎఱికముడి విశ్వాశ మిఁక నేలా
నెఱి నిటమీఁదికీర్తి నీదే కాకా

చ. 1: నీవే నే నై యుండఁగాను నిన్ను దూరఁ జో టేది
కావలసినపనులు గనుటే కాకా
ఆవల మారుమాట లడుగఁగఁ జో టేది
వేవేలు సుద్దులెల్ల వినుటే కాకా

చ. 2: మనసు లొక్క టైయుండి మచ్చరించఁజో టేది
ననుపున నెందు కైన నగుట గాక
చనవులు గలిగియు సాదించఁ జో టేది
వొనరినసంతసాన నుండుటే కాకా

చ. 3: నిండుఁ గాఁగిటనే వుండి నీతోఁ గొంకఁ జో టేది
అండనే మనము వెర గందుట గాకా
కొండల శ్రీవెంకటేశ కూడితిని నన్ను నిట్టె
మెండుగా నిన్నిటా నేను మెచ్చు టింతే కాకా

రేకు: 0379-2 శుద్ధవసంతం సంపుటం: 11-470

పల్లవి: అప్పటి నేనే కోపి నందురు మీరు
చెప్పరాని ఆతనిచేఁత లివి చూడరే

చ. 1: నవ్వుతానె మంచితనము నెరుపుత గాక
యెవ్వరిమనసు లెట్టో యెరుఁగుదునా
పువ్వుల నే వేయఁగాను పూఁచి నిమ్మపంట వేసీ
దవ్వుల నుండి యాతని తగవులు చూడరే

చ. 2: మొగము చూచి తనకు మొక్కఁ గలదానఁ గాక
యెగసక్కెము లవుట యెరుఁగుదునా
తగు వెన్నెలలోనికె తన్ను నేఁ బిలువఁ గాను
సగము చీఁకటిలోనె సన్న సేసెఁ జూడరే

చ. 3: చెంది యిట్టె తనసేవ సేయఁ గలదానఁ గాక
యిందుకె నన్ను మెచ్చుట యెరుఁగుదునా
అందపు శ్రీవెంకటేశుఁ డన్నిటా నన్నుఁ గలసె
కందువలు గరఁగించి కడు మీరెఁ జూడరే

రేకు: 0379-3 సాళంగం సంపుటం: 11-471

పల్లవి: అంతటఁ గాని తీర దతివమతి కోపము
యెంత దలపోసినా యిదివో నాయకుఁడా

చ. 1: యిప్పుడైనా నామాట కియ్యకొంటేఁ జాలుఁ గాక
తప్పి పోయినా వలపు తతి మీరీనా
చెప్పనా నీ కప్పుడే సేసిననేరాన కెల్ల
ముప్పిరి నాపె నీపెకు మొక్కించు మని

చ. 2: వెనకటి నీచలము విడిచితేఁ జాలుఁ గాక
అనువుగఁ జేయ లేమా అన్నిపనులు
విన వైతి వింతే కాక వేగమే యెచ్చరించనా
చెనకిన ఆపె నీపెచేతి కిమ్మని

చ. 3: ప్రేమానఁ దగవు నడుపే నంటేఁ జాలుఁ గాక
యీమగువమారుగ నే నియ్యకొననా
కామించి శ్రీవెంకటేశ కలసితి వౌ ననా
సామాన నాపె నీపెను సరిగాఁ జేయు మని

రేకు: 0379-4 మాళవిగౌళ సంపుటం: 11-472

పల్లవి: ఊరకె ని న్నింత సేసి వుప్పటించేనా
తేరె నన్నిపనులు నిందె మొక్కే రావయ్యా

చ. 1: కప్పురవిడెము నీవు కాంతచేత నుందుకోఁగా
దెప్పరపుకోపమునఁ దిట్టితిఁ గాక
నెప్పున నాపెసొమ్ములు నీమేన నుండఁ గాను
అప్పుడె నాతో నేను అలిగితిఁ గాకా

చ. 2: ముసిముసి నవ్వులతో ముదితమోము చూడఁగా
వెసఁ బూవుబంతిఁ గొని వేసితిఁ గాకా
వసమై యాపె నీతో వట్టిసన్నలు సేయఁగ
యిసు మంత నిన్ను నేర మెంచితిఁ గాకా

చ. 3: గట్టిగా నీ వాసతి కాఁగిట నుండఁగాఁ జూచి
చిట్టకానకుఁ బాదానఁ జిమ్మితిఁ గాకా
నెట్టన శ్రీవెంకటేశ నీవే నన్నుఁ గూడితివి
గుట్టున నన్నిటా నిన్నే కొసరితిఁ గాకా

రేకు: 0379-5 శ్రీరాగం సంపుటం: 11-473

పల్లవి: నాకొర కంటినా నీ నాటకాన కంటిఁ గాక
యీకడ నాకు మొక్కే వేఁటి కింతే సానలు

చ. 1: చిత్తజకేలికి నీవు చేర వైతి వంటినా
హత్తి నీ వెందో వుంటి వంటిఁ గాకా
పొత్తుకు రావలసి నేఁ బోరి యింతే సంటినా
అత్తలివారిపొత్తు లరసితిఁ గాకా

చ. 2: వుంగరము నాకు నీవు వుంకువ యిమ్మంటినా
అంగడి నెవ్వతె యిచ్చె నంటిఁ గాకా
కంగి నాతో నీ విట్టె వల్ల లాడే వంటినా
అంగనతో నే మని యంటి వంటిఁ గాకా

చ. 3: నావద్దనె వుండు మని నమ్మక నే నంటినా
ఆవలివారు నిం దాడే రంటిఁ గాకా
శ్రీవెంకటేశుఁడ నన్ను చేకొని కూడితి విట్టె
భావరితి నాపెనుఁ జెప్పకు మంటిఁ గాకా

రేకు: 0379-6 శంకరాభరణం సంపుటం: 11-474

పల్లవి: నీకు నిచ్చకమే నెరపుదుఁ గా కిటు
కాకు సేసి నినుఁ గదిమేనా

చ. 1: యెమ్మెకు నాతో నెంత నవ్వినా
కిమ్ముల నాతోఁ గిని సేనా
నిమ్మపంటఁ గొని నీవెంత వేసిన
ముమ్మాటికి నే ములిగేనా

చ. 2: తొడిఁబడ నీవే తురుము వట్టితే
బెడిదంబుగ నేఁ బెనఁగేనా
అడరి నీవు రమ్మని నను బిలువఁగ
వోడకఁ బండ నని వొదిగేనా

చ. 3: పైకొని నీవే పాదము చాఁచగ
చేకొని పిసుకక సెలసేనా
యీకడ శ్రీవెంకటేశ్వర కూడితివి
యేకడ కేఁగఁగ నిచ్చేనా

రేకు: 0380-1 వరాళి సంపుటం: 11-475
పల్లవి: ఆడ కేల పిలిచేవే అప్పటి నన్ను
గోడ గడుఁగగఁగ నేల గొబ్బున రాఁ గదవే
చ. 1: లోఁతఁకు జొచ్చినవాఁడు లోన నీమాట వినీనా
మూఁతి మీఁది కెత్తేవాఁడు మోము చూచీనా
చేఁతలు దవ్వేటివాఁడు సిగ్గు వడ నేరుచునా
పాఁతుమా కై వుండేవాఁడు పైకొనీనా
చ. 2: పెచ్చు వెరిగెటివాఁడు ప్రియము చేకొనునా
మచ్చరమే పెంచేవాఁడు మన సిచ్చీనా
వొచ్చెము వెదకేవాఁడు వొగి నిజ మెరుఁగునా
యెచ్చు కుందు చేఁతవాఁడు యిత వై చూచీనా
చ. 3: సటల మాటలవాఁడు సరవిగా నడచీనా
కుటిలపుగతివాఁడు గుట్టు చెప్పీనా
యిటు శ్రీవెంకటేశుఁడు యీమాటకే నన్నుఁ గూడె
యిటువలె నుండినామ యింకఁ బాసీనా

రేకు: 0380-2 శుద్ధవసంతం సంపుటం: 11-476

పల్లవి: ఏల వేగిరించీనె తా నింతలోనను
జాలితోఁ బవ్వళించి మంచముపై నుందానను

చ. 1: తెల్లవార నియ్యవే తేనె లుట్టిపడేఅట్టు
మల్లాడి తనతో నేను మాటాడేఁ గాని
యిల్లు గడె వెట్టుకొంటి నీపొద్దుకు నోప లేను
పల్లదాన నిదివో నా పక్క బిడ్డ వున్నది

చ. 2: చలి వాయ నియ్యరే సరి బేసి ఆడినట్టు
వలపులు తనమీఁద వడిఁ జల్లేను
తలఁ బట్టు వెట్టుకొంటిఁ దతి గా దీవేళను
పొలసి మాయత్త నేఁడు పొరుగింట నున్నది

చ. 3: చేగ చేర నియ్యవే చెల్లుబడి గలయట్టు
బాగులుగా తన్ను నేనె పైకొనేను
చేగడియ దీసి చొచ్చి శ్రీవెంకటేశుఁడు గూడె
వేగిరించి మావదినె వెలుపల నున్నది

రేకు: 0380-3 పాడి సంపుటం: 11-477

పల్లవి: సతులకుఁ బతులకు సాజమె యిది
యితవు లెంచుక తామే యేకములు నవుదురు

చ. 1: కూరిమి గలుగుసతి కోరి పతిఁ గాన కున్న
యేరీతి నయిన దూరు యిందరితోడ
దార దప్పి మగవాఁడు తనయిచ్చఁ దిరిగాడి
యీరసాన నే మనిన యెగ్గులునుఁ బట్టఁడు

చ. 2: అంకెకు రా కున్నవేళ నాఁడువారు మగవానిఁ
గంకి నేసి కన్నచోటఁ గాకు సేతురు
వంక లొత్తఁ బోఁడు తనవల్ల నేరుమి గలితే
మంకు దీరి తనుఁ దానె మట్టుకు వచ్చును

చ. 3: కాఁగినచెలియ తనకాఁగిటికి దగ్గరితే
లోఁగి తనవిభునికి లో నవును
వీఁగుచు శ్రీవెంకటేశ వెలఁదిఁ గూడితి విట్టె
చేఁగ దేర నే మిందుకు నెలవి నవ్వుదుమూ

రేకు: 0380-4 నాదరామక్రియ సంపుటం: 11-478

పల్లవి: వద్ద నుండి మీరు చూడ వలసి కాక
కొద్దిమీరి నేనె పైకొన కుండేనా

చ. 1: కగ్గి తనచేఁతలకు కన్నుల మొక్కినదాన
దగ్గరి తనకు మొక్కఁ దడవా నాకు
యెగ్గు లెంచక పనులు యే మైనాఁ జేసినదాన
వొగ్గి వూడిగాలు సేయ కూర కుండేనా

చ. 2: బింకాన నాఁడిట్టె తన్ను పేరఁ బిలిచినదాన
అంకెల తనతో మాట లాడ కుండేనా
కంకి తనసుద్దులకు గక్కన నవ్వినదాన
యింకా సరస మాడ కిటు మానేనా

చ. 3: చెమటమేని తనకు చేలా గిచ్చినదాన
అమరఁ గాఁగిఁట గూడ నరుదా నాకు
సముఖుఁ డై శ్రీవెంకటేశుఁడు దానె ననుఁ బొందె
తమకాన నిద్దరికి తతి పోయినా

రేకు: 0380-5 దేసాక్షి సంపుటం: 11-479

పల్లవి: మామాట లేల వినేవే మగువ నీవు
వోమి యాతనికే మొక మోడేవు గాని

చ. 1: పంతాన రా నని చలపట్టుకొని వుండఁ గాను
యెంతదడ వైనఁ బోర నేలే మాకు
చెంతల నాతఁడే వచ్చి చేయి వట్టి తియ్యఁ గాను
వంతకు నేఁడు నీ విట్టే వచ్చేవు గాని

చ. 2: మాట లాడ నని నీవు మౌనముతో నుండఁ గాను
యేఁటికిఁ బెనఁగితియే యిందాఁకా నేము
పాటించి యాతఁడే వచ్చి పక్కన నవ్వితేను
గాఁటపుమచ్చట లాడి కరఁగేవు గాని

చ. 3: మంచముపైఁ బవ్వళించి మంతనాన నుండఁ గాను
పొంచి నిన్ను లేప నేలే పొదిగి నేఁడు
అంచెల శ్రీవేంకటేశుఁడదె వచ్చి నిన్నుఁ గూడె
యెంచి యాతనికే చన విత్తువు గాని

రేకు: 0380-6 సౌరాష్ట్రం సంపుటం: 11-480

పల్లవి: నీమనసులోనిమాట నే నెరఁగనా
కామించి నీవే నాకుఁ గల వని వుందునూ

చ. 1: నాకే వలతు వంటా నాపై బత్తి గల వంటా
ఆక డీకడివారితో నాడుకొందును
యీకడ నన్ను మన్నించి యింటి కిట్టె వచ్చే వంటా
తూకొని నీరాకల కెదురు చూతును

చ. 2: నమ్మఁగలవాఁడ వంటా నామాట గడవ వంటా
కమ్మిని నిన్నే పొద్దునుఁ బొగడుచుందునూ
రమ్మని నిన్నుఁ బిలిచి రతుల మెప్పించే నంటా
నెమ్మది నుపాయములు నేరుచుకుండుదును

చ. 3: యిద్దరము నొక్క టంటా నెగ్గు దప్పు లెంచ వంటా
పెద్దరికమున సరి పెనఁగుదును
అద్దివో శ్రీవెంకటేశ అట్టె కా నన్నుఁ గూడితి
పొద్దు వొద్దు నీకు నిట్టె బోదింతునూ

రేకు: 0381-1 ఆహిరి సంపుటం: 11-481

పల్లవి: చే పట్టి పిలువరమ్మ చెలులారా
వే వేగఁ దా రాకున్న వేసరరా లోకులు

చ. 1: వెదకి కాకన నే విరహన నుండఁ గాను
పొదిగి తానే వచ్చుట పుణ్యము గాదా
మదిలో నేఁ దలఁచగ మరఁగున దా నుంటే
వదలక దయ లేనివాఁ డనరా లోకులు

చ. 2: తలఁచి తనకుఁ గాను తమకాన నుండఁ గాను
మలసి తాఁ బైకొంటే మంచిది గాదా
వలచినవారి నింత వలలఁ బెట్టఁగఁ బోతే
అలరి యెం తపకీర్తి యనరా లోకులు

చ. 3: తన పేరు నాలికపైఁ దడవుచు నుండఁ గాను
తనియఁ బొందుట జాణతనము గాదా
యెనసె శ్రీవెంకటేశుఁ డిదివో నన్ను రతుల
పొనిగి యానోళ్లనే పొగడరా లోకులూ

రేకు: 0381-2 కాంబోది సంపుటం: 11-482

పల్లవి: ఉన్న వల్లా నటుండనీ వొద్ద నిలుచుండనీ
కన్నులకు నిధానము గలిగెఁ గా నీకు

చ. 1: యేపొద్దు నాపె నీవు యెదఁ గట్టుకొ నుండఁగ
తీపుల నీపాలిటి దేవ రాయఁగా
యీపాటి వారి వీరి నెలయించి యీసు రేఁచ
కాపాడి చెప్పి చూపఁ గలిగెఁ గా నీకు

చ. 2: చేతికి లో నై యాపె చెప్పినట్టె సేసేవు
యీతల నిన్ను వంచుకో నేలి కాయఁగా
రీతిగా సింగారించి రేయిఁ బగలుఁ దాలార్చ
ఘాతల సింగారబొమ్మ గలిగెఁ గా నీకూ

చ. 3: చీ మంత మా టైన చెవిలో నీకు బోదించు
కోమలి నీ కిన్నాళ్లను గురు తాయఁగా
యీ మేర శ్రీవెంకటేశ యిద్దరి మమ్ముఁ గూడితి
కామించి మేకులు సేయఁ గలిగెఁ గా నీకు

రేకు: 0381-3 సామంతం సంపుటం: 11-483

పల్లవి: అందాఁకాఁ గాఁగిన నిన్ను నన రాదు గా
పొందిక లైన మీఁద బుద్ధి చెప్పేఁ గాని

చ. 1: వేడుక నీ రమణుఁడు విచ్చేసుదాఁకా నీ
వాడిన ట్టెల్లా మాకు నాడ వలెఁ గా
యీడుగా సమరితి మి మ్మిద్దరిఁ గూడఁగఁ జేసి
జోడుగా నీతిట్లకు సూడు వట్టేఁ గాని

చ. 2: పక్కన మీలోన మొకబంగారు వాసినదాఁకా
వెక్కసపు నీసణఁగు వినవలెగా
చిక్కు వడ్డ మీలోని చిత్తము లేకము సేసి
దక్కిన నీచేఁత లెల్లాఁ దగఁ దిప్పేఁ గాని

చ. 3: యీకడ నాతఁడు నిన్ను యిట్టె మన్నించినదాఁకా
నాకు నాకే నిన్నుఁ జూచి నవ్వవలెఁ గా
చేకొని యింతలోనె యాశ్రీవెంకటేశుఁడు గూడె
సాకిరి దెలిపి మీద సమ్మతించేఁ గాని

రేకు: 0381-4 సామంతం సంపుటం: 11-484

పల్లవి: ఎప్పుడు నీయిచ్చలోని యింతిఁ గాక
తప్పులు నీమీఁద వేసేతరుణినా నేను

చ. 1: వంతులకు వాసులకు వలపులు చల్లి చల్లి
అంత నిన్ను దూరేటియాఁటదానానా
కొంత నిన్నుఁ గోపగించి గొణఁగి గొణఁగి తిట్టి
పంతము వెనక నిచ్చే పడఁతినా నేను

చ. 2: పొద్దు వొద్దు నీవద్ది పొలఁతులవలెనే
అద్దలించి పెనఁగేటి యాఁటదానానా
ఉద్దండాలు నీతోఁ జేసి పూరకే వెనకు వచ్చి
తిద్దుకొని మాట లాడేదేవులనా నేను

చ. 3: గారవాన నిన్నుఁ గూడి కాఁగిటి నీచేఁత లెల్ల
ఆరయ జెప్పుకొనేటి యాఁటదానానా
నేరుతువు శ్రీవెంకటనిలయ నీయాల నైతి
సారెకు సారె మాటాడేసకియనా నేనూ

రేకు: 0381-5 కొండమలహరి సంపుటం: 11-485

పల్లవి: నీ కేమి దూరుదాన నే నైంతి గాక
వాకున నప్పుడే నీతో వద్దననా

చ. 1: నా మోము చూచి నీవే నవ్వఁగా నవ్వితిఁ గాక
ఆమాట లెల్లా నాపెతో నాడుదురా
ప్రేమాన నా పంపఁగా నే పిలువ వచ్చితి నింతే
చే ముట్టిన యాసుద్ది చెప్పుదురా

చ. 2: రమ్మని చేయి వట్టఁగ రతి నూర కుంటిఁగాక
యెమ్మె కెల్లా నాపెతోడ నెంచుకొందురా
వుమ్మడి నాపెకు నీకు నూడిగపుదాన నింతే
అమ్మరో నావుంగరము ఆపె కిత్తురా

చ. 3: పాదాలు గుద్దు మనఁగా పైకొన గుద్దితిఁ గాక
పోదిగా నాసుద్ది యీడఁ బొగడుదురా
యీదెస నాపెఁ గూడితి విట్టె శ్రీవెంకటేశ
సోదించి నా మో వాపెకుఁ జూప వచ్చునా

రేకు: 0381-6 సామంతం సంపుటం: 11-486

పల్లవి: అంతటఁ గాని తీరదు ఆపెనే చేరి
చెంత లోనికి రమ్మని చే వట్టి తియ్యవయ్యా

చ. 1: యిచ్చగించి నీవు నాపె యేకతము లాడఁ గాను
వచ్చి వచ్చి నిలిచెను వాకటిఁ జెలి
తుచ్చము లాడక తొల్లె తొయ్యలిచే మొక్కించి
మచ్చికగాఁ గిందుపడి మాట లాడవయ్యా

చ. 2: చేచేతమీ రిద్దరును సెలవుల నవ్వఁ గాను
చూచి చూచి తలవంచి సోలగిలీని
యేచి కోపించకతొల్లె యింతిచే సేవ సేయించి
తాచి నీకాఁగిట నీవు తమి రేఁచవయ్యా

చ. 3: మంచముపై నీవు నాపె మలయఁగా ముట్టి ముట్టి
అంచునఁ దా బవ్వళించి అంగవించును
అంచెల శ్రీవెంకటేశ అంతలోఁ గూడితి వాపె
కంచముపొత్తు గలపి కరగించవయ్యా

రేకు: 0382-1 ఛాయనాట సంపుటం: 11-487

పల్లవి: వేసాల నేఁడు నాకుఁగా వెరవ నేల
వాసి యాపె కెక్కించఁగా వద్దనేనా యిపుడు

చ. 1: చాయలు చూచి చూచి సణఁగులు చల్లి చల్లి
ఆయెడనే నిలుచున్న దప్పటనుండి
చేయి మీఁది వేసి యాపె జెంగటఁ గూచుండు మంటే
యీయెడఁ దా వచ్చినా నే లనేనా నేను

చ. 2: వెంగెములే యాడి యాడి వెరగులే నించి నించి
కంగి నిలుచున్న దదే కంబముదండ
సంగడి నీవు నిలిచి చన విచ్చి వేఁడుకొంటే
సింగారము నేఁడు గాదా సిగ్గయ్యీనా నీకు

చ. 3: పొందు లట్టె చేసి చేసి బొమ్మలట్టే వంచి వంచి
కందువ శ్రీవెంకటేశ కరఁగీ నదే
యిందు నందుఁ దిరిగాడి యిద్దరిఁ గూడితి విట్టే
ముందరనే యిట్టైతే మొరఁగి నవ్వేనా

రేకు: 0382-2 శుద్ధదేశి సంపుటం: 11-488

పల్లవి: వీరి వారివలె నేను వింతదాననా
నేరక నీ వుండినాను నే మెచ్చక మానను

చ. 1: వలచిన మేలు నీవు వలవ కున్నా మేలు
తలఁపు నీమీఁద నాకుఁ దగిలి పోదు
అలిమి పట్టఁగ వద్దు ఆనలు వెట్టఁగ వద్దు
చెలిమి నీతో నెపుడుఁ జేయక నే మానను

చ. 2: యింటికి వచ్చిన మేలు యేడ నున్నా మేలు నీ
వెంట వెంటఁ దిరిగి సేవించక పోను
తొంటిపొందు చెప్ప వద్దు దొమ్మిఁ జెక్కు నొక్క వద్దు
అంటి ముట్టి సరసము లాడక నే మాననూ

చ. 3: యివ్వలమో మైన మేలు యెటువలె నున్న మేలు
నెవ్వగ దీరఁ గూడక నే మానను
రవ్వగ శ్రీవెంకటేశ రతిఁ జొక్కించితి విదె
పువ్వువలె నిన్ను నేఁ బొదుగక మానను

రేకు: 0382-3 భైరవి సంపుటం: 11-489

పల్లవి: ఇంక నేల కొంకఁ దమయిచ్చ లనరే
అంకె నే నుంటేఁ దమ కే మాయ నడగరే

చ. 1: యేకత మాడెటి వేళ నేల నే వచ్చితినో
దాకొని నన్నుఁ గంటానే తల వంచిరి
యీకడఁ దమ కిద్దరి కెంత వెగ టైతినో
రా కున్న నెట్టాయ నింత రచ్చల కెక్కితిని

చ. 2: మగఁడు నాలు నుండఁగ మంచ మే లెక్కితినో
చిగురుమోవులఁ దాము సిగ్గు వడిరి
సొగిసి యిద్దరి కెంత సుఖవిరుద్ధ మైతినో
మొగ మియ్య ననే రంటా ముందు నుందానను

చ. 3: యెనసినరతివేల నేల కాఁగిలించితివో
తనిసి తమమేనులు తా మెఱుఁగరు
అను వై శ్రీవెంకటేశుఁ డప్పటిని నన్నుఁ గూడె
ఘనగర్వ మనే రంటాం గాని మ్మని యంటిని

రేకు: 0382-4 శ్రీరాగం సంపుటం: 11-490

పల్లవి: చెప్పకున్న దోసమూ సేసినచేఁతలు నీతో
చొప్పెత్తి పయ్యద గంటే సోదించక మానఁడు

చ. 1: రాఁడని నీతోఁ జెప్ప రాఁగా నీరమణుఁడు
పోఁడిమి గాఁగిటఁ బెట్టెఁ బోకు మంటాను
నాఁడె నీతోఁ జెప్పవా నన్ను నంపకు మనుచు
ఆఁడ దైతేఁ జాలు నాతఁ డంటుకోక మానఁడు

చ. 2: నీపై నాన వెట్టఁ గానె నీవావి మీఁద వేసి
చేపట్టి గిజిగిజిగాఁ జేసె నాతఁడు
వోప నన్నాఁ బో నీక వూడిగాన కంపితిని
యీపాటి సందు గలితే యెనయక మానఁడు

చ. 3: నే నట్టె పెనఁగఁ గాను నీమతకమే యంటా
తానే కూడె శ్రీవెంకటోత్తముఁడు నన్ను
మోనాన నూరకుండితి ముందు నిన్నుఁగూడుదాఁకా
నానాటి కీపాటి నవ్వు నడపక మానఁడు

రేకు: 0382-5 కన్నడగౌళ సంపుటం: 11-491

పల్లవి: మనోభావకుఁడవు మగువ మిక్కిలి జాణ
అనేకవిన్నపము లందులోనే వున్నవి

చ. 1: వంచినరెప్పలవెంట వడిసిన కన్నీరు
కొంచక నీమీఁదఁ జెలి గోరఁ జిమ్మీని
యెంచి నీ విందాఁక రాక యింత నేసినయందుకు
పొంచి నీకు నక్కునఁ బోసి చూప వలదా

చ. 2: సారె నాకొప్పువిరులు సరి నొక్కొక్కటే తీసి
దార దప్ప కుండ నిన్నుఁ దాఁక వేసీని
రా రమ్మనీ పిలువఁ బరా కై వుండినందుకు
వూర కుండి తనపాటు వొప్పగించ వలదా

చ. 3: వెట్టఁ బొరలిన దై వెస నిన్నుఁ గాఁగిలించె
అట్టె తన అసురుసు రదె చూపీని
అట్టుగ శ్రీవెంకటేశ నెట్టనఁ గూడి తీడనె
దిట్టయి నీసేసినమేలు దిగఁ బోయ వలదా

రేకు: 0382-6 సాళంగనాట సంపుటం: 11-492

పల్లవి: అగుగరే చెలులాల ఆతఁడు వాడే
యెడసితే జంకింతుము యింత కోపీనా

చ. 1: చేతికి లో నౌదాఁకా జెప్పటి ప్రియము లింతే
ఆతలి మందెమేళాలె అదు కోపీనా
కాతరపుదాన నేను ఘనుఁ డిన్నిటాఁ దాను
యేతులు నెమ్మెలు మాని యింత కోపీనా

చ. 2: చనవు గలుగుదాఁకా సరవి నడచు నింతే
వెనకపనులు మీరు వెట్ట కోపీనా
మొకతోడిదాన నేను మొక్కలపుదొర దాను
యెనసి మాతోడి జడ్డు కింత కోపీనా

చ. 3: కలసిన యందాఁక కన్నుల మొక్కుట యింతే
బలుము లంతటి మీఁదిపని కోపీనా
చెలి నింతే నన్నుఁ గూడె శ్రీవెంకటేశుఁడు దాను
యెలయింపులరతుల కింత కోపీనా

రేకు: 0383-1 నారణి సంపుటం: 11-493

పల్లవి: తనిసినవాఁడు గాన తమి చాలదు దనకు
పని లేదు తను నింక బడలించ నాకు

చ. 1: సరసమే ఘన మాయ సరి యేఁకలవల పాయ
సరివొద్దు వోయ నింకాఁ జాల దటరే
అరలోనఁ బవ్వళించు మనరే విభుని నేను
పొరిఁ దూఁగుమంచానఁ బొరలేఁ గాని

చ. 2: పందెములే తఱ చాయ బయలీఁత సుద్దు లాయ
చందమామగుటుకలు చాల దటరే
కందువ నిద్ర రా కుంటె కతలు విను మనరే
ముందర నేనే లోన మొక్కు చుండేఁ గాని

చ. 3: చల్లుఁజూపు లెక్కు డాయ జడివానరతు లాయ
జల్లింపు వినయములు చాల దటరే
యిల్లిదె శ్రీవెంకటేశుఁ డింత సేసి నన్నుఁ గూఁడె
యెల్లకాలమునుఁ దన్ను నెడ వాయఁ గాని

రేకు: 0383-2 ముఖారి సంపుటం: 11-494

పల్లవి: అప్పటిఁ దా మంచివాఁడ ననుకొనును
చెప్పరే బుద్దులు మీరు చెలులాల పతికి

చ. 1: మోము చూచితే నాకు మొగవమోట దరచూ
దోమటి నాతని నే దూరఁ బొయ్యేనా
గామిటిమాట లాడితే గబ్బి నందురు
యేమి సేతు నమ్మలాల యెం దున్నాఁడో అతఁడు

చ. 2: గక్కనఁ గదిసితే కరఁగు నా చిత్తము
మక్కువ నాతని నేను మట్టు పెట్టేనా
చక్క నూర కుండితే రాజస మందురు
దక్కితి నే నమ్మలాల తా నేడ నున్నాఁడే

చ. 3: సొలసి మా టాడితే చుట్టమ నే నౌదునూ
కలసే శ్రీవెంకటేశుఁ గా దనేనా
చలపట్టి మెచ్చఁ బోతే సట లందురు
వలచితి నమ్మలాల వాఁడె నవ్వీ నదివో

రేకు: 0383-3 దేసాళం సంపుటం: 11-495

పల్లవి: ఏల నాపై నాన వెట్టే వేఁటికి నీకు వెరపు
నీలాగు రమణుఁడనే నెఱఁగనా

చ. 1: తేరకొన నీగుణాలు దెలిసినప్పుడు గాక
వీరి వారి మాటలకె వేగిరించేనా
మేరతో నీవు నాయెడ మెచ్చుగా నడవఁ గానె
కూరిమి గొసరి నిన్నుఁ గోపగించేనా

చ. 2: యెల్లవారు నీచేఁతలు యెఱుఁగుదు మన్నదాఁకా
అల్లంత నిన్నుఁ గంటానె అలిగేనా
కల్ల నిజ మెఱఁగక కాదు గూడ దని నీపై
వెల్లవిరిగా నిందలు వేయఁ బొయ్యేనా

చ. 3: మంతానాన నీ మేన మచ్చము గానకతొల్లె
పంత మాడి నే నీతో పగ చాటేనా
యింతలోఁ గాఁగిలించితి విందుకె శ్రీవెంకటేశ
యెం తయిన నిన్ను నే నెడసి వుండేనా

రేకు: 0383-4 ముఖారి సంపుటం: 11-496

పల్లవి: అన్నియు నీవల్ల నింతే సాయ నయ్యా
నిన్న నేఁటనె యీ మేలు నిండె నయ్యా

చ. 1: సాదించి నేఁ డాపె నీసరిఁ గూచుండినది నీ
పాదము సోఁకినయట్టి బలు వయ్యా
ఆదికొని యిన్నా ళ్లాపె ఆపె గాదో నేఁ గాదో
యీదెస మేరలు మీరి యిట్లనె వుంటిమా

చ. 2: యించు కంత పిన్నది నా కెదురు మాటాడె నిదే
మించి నీ నవ్వినముందెమేళ మయ్యా
నించి వొక్కవూరనె నే లేనో ఆపె లేదో
చంచు మీరి యింతేసి రచ్చలకు నెక్కుదుమా

చ. 3: తేరకొన నాపె నన్ను దిష్టించి చూచినది
కోరి నీచేయి వేసినగఱి మయ్యా
యీరీతి శ్రీవెంకటేశ యిటు నన్నుఁ గూడితివి
నేరువు నీ వల్లఁ గాక నే మొక్కటి అవుదుమా

రేకు: 0383-5 భౌళి సంపుటం: 11-497

పల్లవి: కన్నుల నీ రాఁప లేక కాఁకలు నిలుప లేక
పన్ని పెద్దయెలుఁ గెత్తి పాడితి నోయమ్మా

చ. 1: దగ్గరి వచ్చినవాని తడవి నేనే మన్నా
అగ్గలము నావొల్లిదె యౌ నేరమి
వెగ్గళించ రాదు మరి వెనక తియ్యఁగ రాదు
బగ్గనఁ బాదాలమీఁదఁ బడితి నోయమ్మా

చ. 2: చేయి మీఁద వేసేవాని చేఁత నే నేమి సేసినా
నాయము గా దని మీరు నన్నే అందురు
పోయినట్టె పోనీలేను పొంచి కొత్త సేయ లేను
సేయ రాని వినయాలు చేసితి నోయమ్మా

చ. 3: వుమ్మడిఁ గాఁగిలించఁగ వోప నంటే అంతలోనే
కిమ్ముల నాతఁడు నాకుఁ గిందు పడును
నెమ్మది శ్రీవెంకటేశు నేనె మునుపఁ గూడి
సమ్మతించి ఆనందమే చల్లితి నోయమ్మా

రేకు: 0383-6 పాడి సంపుటం: 11-498

పల్లవి: నేనే పిలువ ననే నేర మేమి గలిగినా
దీన నైనతప్పు మీఁద దిద్దుకొనేఁ గాని

చ. 1: వలపు బలిమి సేసి వంతకుఁ బెనఁగఁ బోతే
చలువలే వేఁ డౌను సతులాల
వెల నున్నరమణుని వేడుక నేఁ బిలిచితే
చులుకఁదనము రాదా చూడఁ గానె యిపుడూ

చ. 2: మనసు రానిచోట మాటలఁ గొసరఁ బోతే
చన వెల్లాఁ జవి దప్పు జాణలాల
ననుపు లేనిపతితో నవ్వులు నవ్వఁగఁ బేతే
పని మాలినది గాదా పై పైనె యిపుడూ

చ. 3: దరదరిఁ గాక నే దగ్గరి కూడఁగఁ బోతే
సరసమే విరస మౌ సకియలాల
యిర వై శ్రీవెంకటేశుఁ డిట్టె విచ్చేసి కూడె
దొరతన మిది గాదా తుద కెక్కె నిపుడూ

రేకు: 0384-1 ఆహిరి సంపుటం: 11-499

పల్లవి: ఒ ద్దన్నా మానవు నీవోజ లిట్టివి
పెద్దరికము నేయుచుఁ బ్రియము లాడేవు

చ. 1: నివ్వటివల్ల నీ నవ్వు నేఁడె నాతో వలెనా
వువ్విళ్లూర రేపు గొంత వుండనీరాదా
జవ్వనపువాఁడవు నీసరివారమా నేము
దవ్వుల నుండి మొక్కితే దగ్గరఁ బిలిచేవూ

చ. 2: కోయ్య నా మాటలు నాకొరకె నేరిచితివా
అయ్యో యీవేళకుఁ దగి నంతే చాలదా
గయ్యాళించి నిన్ను నేమౌఁ గా దనేనటివారమా
పయ్యద నే మూసుకొంటే పై నేల వొరగేవు

చ. 3: కన్నులసన్నలు నాకే గాదెఁ బోసు కుండితివా
పన్ని పైఁడియమ్ము లిన్నీఁ బార వేసేవా
యిన్నిటా శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
మన్ననలు పొగడితె మర్మము లంటేవు

రేకు: 0384-2 సామంతం సంపుటం: 11-500

పల్లవి: మన మింత దడ వాయ మంకు వాప లే మైతిమి
ఘనుఁడు గాన యాతఁడు కాంతకాఁక వాపెను

చ. 1: చెలియమోము చూచి చెక్కులు చేత నొక్కి
కలవురేకులకొప్పు కడు దువ్వి
సెలవుల నవ్వించి చేరి మోవితేనె లాని
అలుక దేరిచెఁ బతి అదివో యిప్పుడు

చ. 2: మాటలనె బుజ్జగించి మనసునొప్పులు మాన్పి
కాటుకన్నులయింతి కందువ లంటి
తేటలఁ గతలు చెప్పి దిష్టపుమన్నన లిచ్చి
యీటునఁ గోపము దీర్చె నిదివో విభుఁడు

చ. 3: వనితఁ గాఁగిట నించి వాడినదప్పి దేరిచి
ననుపులు నటియించి నయ మిచ్చి
తనువు నిమిరి యీపె తత్తరాలు మందిలించె
యెనసి శ్రీవెంకటేశుఁ డిదివో యిపుడు

రేకు: 0384-3 శంకరాభరణం సంపుటం: 11-501

పల్లవి: కానీవే తనవేసాలు కనుఁగొంటిఁ గా
వీనులకు యీసుద్దులు వెర గాయఁగా

చ. 1: చెప్పరే చెప్పరే వీనిచేఁతలు నాకు
అప్పుడే యాపెతో మాట లాడి వచ్చెవా
ముప్పిరి నా కిఁక నేఁటి మొకమోటమే
తప్పని బొంకనివాఁడు తా నెందు వోయీనే

చ. 2: యెంత కెంత వీనిసుద్దు లేల దాఁచేరే
దొంతిగా నాపెను వెంటఁ దోడి తెచ్చెనా
పంతపుమోనము లిఁకఁ బనికి రావె
సంతసమే చేసేఁ గాక జగడించేనా

చ. 3: యే మంటి రే మంటిరే యెఱఁగ నేను
చే మట్టి యాపెను నాచేతి కిచ్చెనా
కామించి శ్రీవెంకటాద్రికడపరాయఁడు నన్ను
గోమునఁ గూడె నిదియుఁ గొంత వలెనా

రేకు: 0384-4 కొండమలహరి సంపుటం: 11-502

పల్లవి: చేగ మీరినపనులే సేసే వెల్ల
బాగు మీరఁ దన కది పై వచ్చే దెరఁగఁడూ

చ. 1: సిగ్గు వడి తనుఁ జూచి సిరసు వంచుకొంటేను
దగ్గరి రమ్మంటి నంటా దండ చేరీని
వెగ్గళించ నైతిఁ గాక విదలించి వేసి నేను
బగ్గనఁ దిట్టితే తనభావము చూచీనా

చ. 2: యెదుట నిలవుక నేనింటిలోని కేఁగితేను
అదె సన్న సేసుక నన్నంట వచ్చీని
పదర లే నైతిఁ గాక పక్కనఁ బువ్వులబంతి
నెదరొమ్ము వేసితేను యే మనీనె యపుడూ

చ. 3: నెల వై పానుపుమీఁద ముసుఁగు వెట్టుకుంటే
కలయు మనే నంటాఁ గాఁగిలించీని
యెలమి శ్రీవెంకటేశుఁడింత నేరుపునఁ గూడె
బలి మైతే నాతోడఁ బంత మాడఁ గలండా

రేకు: 0384-5 ముఖారి సంపుటం: 11-503

పల్లవి: పో పోయి దేడ సుద్ది పొద్దు పొద్దు చెలులకు
యేపున నిన్ను రమ్మన నేడదాన నేను

చ. 1: కాతరాన నలుకలు గడించేవు గాక నీవు
నీతో నలుక రేఁచ నే మెవ్వరము
జాతులకు నీ వాడెటిచారువాకా లింతే కాక
ఆతల నిన్నుఁ గొసర నంత పొందులా

చ. 2: చిన్నఁ బో యుందాన నంటా చెక్కు నొక్కే వింతే కాక
వున్నతి నీముందరను వొచ్చెము గాదా
యిన్నేసి నీ వినయాలు యెగసక్కే లింతే కాక
నన్ను నీవు వేఁడుకోను నంటుదాననా

చ. 3: అక్కడ పూర కుందువా ఆనలు వెట్టేవు గాక
యిక్కడ వా దడువ మా కెవ్వ రున్నారు
గక్కన శ్రీవెంకటేశ కలసితి విటు నన్ను
యెక్కువ తక్కువ లేిక నేల మాకూ

రేకు: 0384-6 రామక్రియ సంపుటం: 11-504

పల్లవి: ఒద్దన్నా మానవు నన్ను నొడఁబరచేవు నీ
వద్ద యెమ్మెలు మెఱయ వారు వీరు చాలరా

చ. 1: కొండవంటి దొర వని కుంచ నీవు వేయఁ గా న
న్నుండఁ గూచుండు మనుచు నాన వెట్టేవూ
దండితోడ నూడిగపుదాన నయ్యే నంటే నేల
చండి పోరి నీదేవులసానిఁ జేసే వయ్యా

చ. 2: అందచందమునను నీ కాకు మడి చియ్యఁ గాను
అందల మెక్కు మనుచు నాన వెట్టేవూ
గొందినె నీపాదాలు గొలిచి వచ్చే నంటే
యిందరిలో దొర గాన న్నెంత సేసే వయ్యా

చ. 3: కట్టడతో నీమేనఁ గస్తూరి నేఁ బూయఁ గాను
అట్టె కాగిలించు మంటా నాన వెట్టేవూ
గుట్టుతో శ్రీవెంకటేశ కూడితి వింతలో నన్ను
మట్టుతో నుండఁగా నెంత మన్నించే వయ్యా

రేకు: 0385-1 హిజ్జిజి సంపుటం: 11-505

పల్లవి: పో పో యి దేడ సుద్ది పొద్దు వోదా తనకు
దూపకు నేయి దాగేటిదూరు గాకా

చ. 1: యింతిని వద్దఁ బెట్టుక యేల పిలిచీనె నన్ను
బంతిఁ గట్ట రతు లేమి పసులదొడ్డే
దొంతులవేడుకలను తొల్లె తా మోల లాడిరి
యింతలోనఁ జల్లారిన యీ చ వింతే కాక

చ. 2: కమ్మి యాపెపై నొరగి కమ్మటి నన్నేల పట్టీ
కుమ్మి చిందులాడ నేమి గొల్లదోమటే
అమ్మరో తా మిద్దరును అన్నిటాఁ గరఁగి మీఁద
చిమ్ములాన నవ్వితేనె నెల వౌఁగాకా

చ. 3: కన్నుల నొక్కతెఁ జూచి కాఁగిట నన్ను బిగించీ
పన్నినవలపు రేమి బండికండ్లా
యిన్నిటా శ్రీవెంకటేశుఁ డిద్దరిఁ దాఁ గూడినాఁడు
మన్నించ నాపెతో సరి మరిగితిఁ గాకా

రేకు: 0385-2 హిందోళవసంతం సంపుటం: 11-506

పల్లవి: వట్టిమాట లిఁక నేల వాసి గలకాంతలకు
గుట్టుతోడ నుండేదె గుణ మింతే కాక

చ. 1: పూసుక వాసుక వచ్చి పొందులు నీతోఁ జెప్పి
వేసరించేకాఁగిటిలో వేడు కున్నదా
మూసినతముత్యమువలె మూల నుండఁగా నీవే
చేసినపాటి ప్రియము చేకొనేది గాక

చ. 2: చేరి నవ్వి విన్నపాలు చెలుటచేఁ జేయించి
సారెఁ జల్లేకూరిమిలో చవు లున్నవా
పూరక మానావతి నై వోజ దప్ప కుండఁగా నీ
వేరీతి చేసిన నది యియ్యకొంట గాక

చ. 3: యిచ్చకాలు సేసుకొంటా యెరవువలపు చల్లి
తచ్చి యెంత పిలిచినా తమి వుట్టీనా
అచ్చపు శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
యిచ్చట నీవే కూడితి విది మేలు గాకా

రేకు: 0385-3 నాదరామక్రియ సంపుటం: 11-507

పల్లవి: ఏల వేగిరింపించేరే యేమిరే వో చెలులాల
చాలుకొన్న నాయకుని చరితలు చూడకా

చ. 1: నగినయంతటిలోనె నాకు దగ్గర వచ్చునా
తెగ నాడి మన సెల్లఁ దెలియకా
మొగుము చూచె నంటాను ముచ్చ టాడ వచ్చునా
మగవాఁడని లోనిమర్మములు గానకా

చ. 2: వద్ద నున్నాఁ డంటాను వావి చెప్ప వచ్చునా
కొద్ది నాతఁ డుండేటిగు ట్టెరంగకా
పెద్ద చేసె నంటానె పెనగొన వచ్చునా
వుద్దండుఁ డీతని మేనివొరపు లరయకా

చ. 3: యింటికి వచ్చె నంటాను యియ్యకొన వచ్చునా
అంటిము ట్టాతనిసుద్దు లడుగకా
దంట శ్రీవెంకటేశుఁడు తా నలమేలుమంగను
జం టాయ మీర వచ్చునా చవులు సోదించకా

రేకు: 0385-4 మధ్యమావతి సంపుటం: 11-508

పల్లవి: దాని కేమి మీఁదటను దైవమే మేలు సేసీని
తానే యింత చేసు నట తగటు వోయినా

చ. 1: యింత మోహించిననేనె యింటికి రాఁ జెల్లుఁ గాక
పంతగాఁడు తన కేలే పైకొనను
కాంతుఁడు మ మ్మింత నేసి కట్టుకోనీ యామేలు
యింతలోనే సతులకు హీన మయ్యీనా

చ. 2: మనసు లెంతైన నేనె మాటాడించ వలెఁ గాక
తనిసితన కేలే తత్తరించను
ఘనరాజసముతోఁ దా గడకూ బదుక నీవే
వనితల కిందువంక వాసి దప్పీనా

చ. 3: కాఁకఁల బొందిన నేఁ గాఁగిలింతుఁ గాక మా
వీఁకకు రాఁ దన కేలే వేడుకకాఁడు
ఆఁకల శ్రీవెంకటేశుఁ డలమేలుమంగ నేను
యేఁకటఁ గూడితి మిఁక నెఱ మయ్యీనా

రేకు: 0385-5 పాడి సంపుటం: 11-509

పల్లవి: ఇందుకు బాస యిచ్చేద యిటు నీయింటికి రాను
చెంది నీసతులు యింత చేసిరి నీగుణము

చ. 1: నవ్వుతా దగ్గరి వచ్చినాను సరకు గొనవు
యెవ్వరితో మాట లాడే విపుడు నీవు
మువ్వంక నీరాజాసము మున్నిటివంటిదా నేఁడు
రివ్వలుగా సతు లెల్ల రేఁచిరి నీగుణము

చ. 2: బడి బడి మొక్కినాను పరా కై వున్నాఁడవు
కడు దొర వైతి నీకుఁ గాన వచ్చీనా
కడఁగి మావంటివారిఁ గైకొనేవా గొల్లెతలు
బెడసుగొల్ల మంకుతోఁ బెంచిరి నీగుణము

చ. 3: యిట్టె చేయి వట్టినాను యించు కంతాఁ దెమలవు
నెట్టుకొన నీబిగువు నేఁడు గొత్తలా
నెట్టన శ్రీవెంకటేశ నే నల మేలుమంగను
జట్టిగొని కూడితివి సాజమే నీగుణము

రేకు: 0385-6 బలహంస సంపుటం: 11-510

పల్లవి: మిక్కిలి జాణవు నీవు మే మేమి బాఁతి
పక్కన నీ వన్నిటాను బదికితేఁ జాలదా

చ. 1: కూరిములు చల్లుతానె కొసరేగుణము మాది
నేరపు మా కున్నదా నేరమే కాకా
మేరతోడి మ మ్మేల మేకులు సేసేవు రతి
ధీరుఁడవు నీవు మాతెరువు రా వలెనా

చ. 2: నించేసరసములోనె నిండువిరసము మాది
మంచితన మున్నదా మాటలే కాకా
యెంచ నేల మమ్ము నీవు యిల జాణలలో నెల్ల
అంచె నూడి పడ్డవాఁడ వంత మాతో వలెనా

చ. 3: చనవునఁ గూడుతానె జంకించేగుణము మాది
తనివి మా కున్నదా తమియే కాకా
అనుఁగు శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
పెనఁగి కూడితి వింక బెట్టి నవ్వ వలెనా

రేకు: 0386-1 దేవగాంధారి సంపుటం: 11-511

పల్లవి: మట్టు మీరినచేతల మగవాడవు
వట్టి సత్తేలు నెరప వలెనా నీవు

చ. 1: అంగన నీవును మాట లాడుతా నుండగ జూచి
అంగవించి పొందు గద్దొ యని వుంటిమి
నింగి మోవ నాన లెల్ల నీ వేల పెట్టుకొనేవు
చెంగట దోసమా నీకు జెల్లదా యేమి

చ. 2: పొలతి నీ వొకవీధిఁ బొలసి నడవఁ గాను
అలరిన నీసమ్మంధ మని వుంటిమి
తెలపు మనుచు నేల తీసేవు నాకోంగు వట్టి
తలఁచ నాపెకు నీకుఁ దగదా యేమి

చ. 3: యింతియును నీవును నేకతాన నుండఁ జూచి
అంతలో నీవు గూడితి వని యుంటిమి
వంతకు శ్రీవెంకటేశ వడి నలమేలుమంగ
నింతటఁ గూడితివి నీ వెగఁరవా యేమి

రేకు: 0386-2 శంకారాభరణం సంపుటం: 11-512

పల్లవి: మేలే నీభాగ్య మలమేలుమంగా అదె
ఆలరి నీపతి మెచ్చె నలమేలుమంగా

చ. 1: యెంచ రాక పతితోడ నిచ్చకము లాడి నేర్పు
మించితివి గదే యలమేలుమంగా
వంచనఁ బ్రియాలు సేసి వడి నాతనిచిత్తము
అంచెల దక్కఁ గొంటివే అలమేలుమంగా

చ. 2: తఱితోడ మంచిజాణతనపుమాటల నెల్ల
మెఱసితి గదే యలమేలుమంగా
తెఱఁగుల నీపతికి తెల్లనినవ్వులు చల్లి
అఱచేతిమణి వైతి వలమేలుమంగా

చ. 3: వొక్కటై శ్రీవేంకటేశవుర మెక్కి యేపొద్దు
మిక్కుట మైతివే యలమేలుమంగా
యెక్కువఁ బదారువేలుయింతుల మతనికి మ
మ్మక్కర దీర మన్నించి తలమేలుమంగా

రేకు: 0386-3 ఆహిరి సంపుటం: 11-513

పల్లవి: ఇందాఁక రా కుండితే నిది పావగా వలెనా
చందాలు చెప్ప వచ్చేవు సాదించ వచ్చేమా

చ. 1: ముందరికి రా రాదా మో మైనఁ జూచేను
చెంది యింతలో నేల సిగ్గు వడేవు
అందు కేమి మాచుట్టమ వవుత గల్లా యెంతయిన
కందువఁ బెనఁగ నిదె కడ మయ్యీనా

చ. 2: పీఁటపైఁ గూచుండ రాదా పిసికేము పాదాలు
యేఁటి కని వొద్దనేరా యెవ్వ రైనాను
యీటు లేనిమగవాఁడ వేమి సేసినా నేమి
కొటిసతులఁ బొందిన కోపగించేనా

చ. 3: పచ్చడము గప్ప రాదా పక్కనఁ గరఁగించేను
చెచ్చెర నేల నవ్వేవు సెలవులను
అచ్చపు శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
నిచ్చఁ గూడి యున్నారమ నీవే నేఁ గానా

రేకు: 0386-4 కాంబోది సంపుటం: 11-514

పల్లవి: బలిమి సేయఁగ నీతోఁ బంతమా నాకు
పలచఁగా నిన్ను నాడఁ బంతమా నాకు

చ. 1: యిట్టె నీసతులు యే ముందురో అని కాక
పట్టకు మని కోపించఁ బంతమా నాకు
చుట్టుకొన్న నీతగవు చూడవల సింతే కాక
బట్టబయ లీదించఁ బంతమా నాకు

చ. 2: మోసాన నెవ్వతె కైనా మొక మోడే వని కాక
పాసి వేరే మంచ మెక్కఁ బంతమా నాకు
వాసుల నీ మతిలోని వల పెరఁగక కాక
బాసలు నిన్నుఁ జేయించఁ బంతమా నాకు

చ. 3: ఆడిరి మరి నొకతె నాసపడీ నని కాక
బడలించి రతి సేయఁ బంతమా నాకు
వడి శ్రీవెంకటేశుఁడ వా నలమేలుమంగను
బడి వాయ నియ్యకుండఁ బంతమా నాకూ

రేకు: 0386-5 దన్నాసి సంపుటం: 11-515

పల్లవి: ఎఱఁగ మిన్నాళ్లు నీ విటువంటివాఁడ వవుట
ఉఱక లేనిగుణము లొక్కటే వే యాయను

చ. 1: మంచివానివలెనె మాటలు వెలుచుకొని
పొంచి నవ్వుతాఁ జెప్పేవు పొలఁతికిని
యెంచఁగా నాపె నీకు హితవరురాలు గాని
పంచల వేయఁగ నీకుఁ బగవారమా

చ. 2: నామంచముమీఁద నుండి నయముల సట చేసి
కామించి యాపెమీఁదఁ గాలు వేసేవు
ప్రేమ నాపె నీకు సేస పెండ్లికూఁతు రాయఁగాని
నేము వెట్టికి వచ్చిననెలఁతల మైతిమా

చ. 3: పురముపై నే నిట్టె వుండఁగా శ్రీవెంకటేశ
కరఁగించి యాసతికిఁ గత చెప్పేవు
యెరవుగా నాపెఁ గూడి యింపుగా నన్నుఁ గూడితి
నిర తలమేల్మంగను నేనే మేలుదానాన

రేకు: 0386-6 కురంజి సంపుటం: 11-516

పల్లవి: ఎప్పటివాఁడవె కావా యెరుఁగుదుము
తప్పులు పట్టఁగ నిన్నుఁ దగ దయ్య మాకును

చ. 1: చనవు సేసుక నే నీసరి నిలుచుందుఁ గాక
మన సిచ్చి నీవు నాతో మాట లాడేవా
వనిత లి దెరఁగరు వడి నేఁ గైకో నందురు
అనుమాన మెల్లఁ బాసె నంపవయ్య మమ్మును

చ. 2: వూర కైనా నేనే వట్టి వూడిగాలు సేతుఁ గాక
మేరతో నీవు గొంతైన మెచ్చుఁ బొయ్యేవా
నేర మెల్లఁ దీర నేఁడు నిన్ను ముదులకించితి
పోర నోప నీతోను పోవయ్య్య చాలును

చ. 3: నంటున నీతో నేనే నవ్వులు నవ్వుదుఁ గాక
జంట య్యై నీ వట్టె సరసము లాడేవా
అంటిని శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
యింటికి వచ్చి కూడితి వేల వయ్య నన్నునూ

రేకు: 0387-1 నాగవరాళి సంపుటం: 11-517

పల్లవి: ఇన్నియు గన్నట్టిమీఁద నిఁక నేలా
యెన్నికలు నీకు నాకు నిఁక నేలా

చ. 1: పొదిగి నీ వనఁ గాను పూఁచి నిన్ను నే నాడఁగా
యెదురుబడి మాటలు యిఁక నేలా
కదిసి యీవలఁ జూచి కన్నవారె నవ్వఁ గాను
యిదివో మనలో వాదు లిఁక నేలా

చ. 2: సారె సారె నీవు నేను సరసము లాడఁ గాను
యీరు దియ్యఁ బేను వచ్చు నిఁక నేలా
మోరతోపుఁదనములు మొగములో నుండఁ గాను
యీరీతి సాకి రడుగ నిఁక నేలా

చ. 3: పంతముల నిందాఁకఁ బరాకులె పచరించి
యింతలోనె యిచ్చము లిఁక నేలా
అంతటి శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
యింతటఁ గూడితి రేసు లిఁక నేలా

రేకు: 0387-2 ఛాయనాట సంపుటం: 11-518

పల్లవి: వట్టి సటలకు తల వంచ నేలే
మట్టు మీరేపని యైతే మానుప కుండేనా

చ. 1: కాతరాన నీవిభుఁడు కదిసి యేపొద్దు నీ
చేతికి లో నై యుండఁగ చింత లేలే
ఆతల నొక్కతెయింట నాతఁ డుండఁగాఁ జూచితే
యేతుల నీ వే మన్న నియ్యకొందుఁ గాకా

చ. 2: చంచలము దీరీ నిన్ను సమ్మతించఁ జెప్పి నీతో
ముంచి నవ్వులు నవ్వఁగ ముసుఁ గేలే
పంచల నాతఁడు వేరే పరా కై వుంటేఁ గనక
వంచన నీకుఁ గా పత్రివాదుల మై యుండేమా

చ. 3: అక్కజపు యేకతాన నంగము లంటుచు నీ
చెక్కులు నొక్కఁగా నీకు సిగ్గు లేలే
అక్కర శ్రీవెంటకేశుఁ డలమేలుమంగవు నీ
విక్కువతోఁ గూడితివి యిట్టె సంతోసించవే

రేకు: 0387-3 భైరవి సంపుటం: 11-519

పల్లవి: ఏమి నేతు నిందుకు ని న్నెటువలె వేఁడుకొందు
చే మంచి నీమోము చూడ సిగ్గయ్యీ నాకు

చ. 1: వేడక నాపె యింటికి విచ్చేయఁ గాఁ జూచి
వోడక నే లేవ నైతి నుడుకనను
యీాడ నాతోఁ జెప్పే విను యెంత దోసకారినో
యీాడ జో డై సవతిపో రింత సేసే నయ్యా

చ. 2: యిచ్చగించి ఆపెతేనె యిట్టె నవ్వఁగాఁ జూచి
మచ్చరాన నీతోడ మా టాడ నైతి
కచ్చుపెట్టి నే నెంత కట్టడి మతిదాననో
యెచ్చి నాజవ్వనమద మింత సేస నన్నును

చ. 3: గక్కన నాపైకు నీవు కనున్న నేయఁ జూచి
యెక్కువ నీ వున్నమంచ మెక్క నైతిని
అక్కర శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
యిక్కువ నీతోడికూట మింత నేనె నన్నునూ

రేకు: 0387-4 రామక్రియ సంపుటం: 11-520

పల్లవి: ఎంతయిన మానవు ని న్నేమి సేతును
పంతపు నీసుద్దులకు భ్రమ సున్నదానము

చ. 1: నగదు గాదు నీతోడ నాఁడె నేఁ జెప్పనా
తెగి మాలో నవ్వితే నేఁ దిట్టుదు నవి
మొగము చూడఁగ నీకు ముందెనే మొక్కనా
తగుల నాడకు మమ్ముఁ దడవకు మనుచు

చ. 2: నను పై యిన్నా ళ్లాయ నాతలఁ పెరఁగవా
తనివోని కక్కూరితిదానఁ గాన నీ
చనవు నేసి యింతుల సాకిరులుఁ బెట్టనా
పెనఁగకు మమ్ముఁ బేరఁ బిలువకు మనుచు

చ. 3: నీ వేల నమ్మవో కాక నీవే నేఁ గానా
వాని నీవు దెలయవా వదినె నని
ఆవల శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
తావులఁ గూడితి వింకఁ దమక మే లనుచూ

రేకు: 0387-5 శ్రీరాగం సంపుటం: 11-521

పల్లవి: నీవు సేసేపనులకు నేర మేది
తావుల నాతోఁ బెనఁగఁ దగ వేది

చ. 1: వెలఁదులతోడనె వేగువంతాఁ బట్టె నీకు
వెలయ మాయింటికి రా వేళ యేది
కులికి మాకాతరానఁ గొసరేము గాక నిన్ను
పలుమారుఁ బలికించ బలు వేది

చ. 2: యెక్కడనోఁ దిరుగాడ నిందాఁక బట్టె నీకు
దిక్కి మాతో రతి సేయ దల పేది
మక్కువ సేసితి గాన మాన లేము గాక నిన్ను
తక్కులఁ బెట్టగ మాకుఁ దగ వేది

చ. 3: ఆదరించి నీమీఁద నాన వెట్టఁ బట్టె నీకు
సోదించి ని న్నవుఁగా దనఁ జో టేది
ఆదెస శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
ఆదిరించి కూడితివి అడ్డ మాడ నేది

రేకు: 0387-6 నాదరామక్రియ సంపుటం: 11-522

పల్లవి: చెల్లు లేవే యాతఁడు నీచేతఁ జిక్కెనే
పల్లదమే తల్లి నీకుఁ బాలతోనే పోసెనే

చ. 1: తెగువలు వచరించ తేనెలమాట లాడ
పగటుల నడవ నీపాలఁ బోయనే
మొగమిచ్చలు నెరవ ముసిముసినవ్వు నవ్వ
తగవులఁ బెట్ట నీకు తతి వచ్చెనే

చ. 2: సారెకు మొక్కులు మొక్క చలములు సాదించ
ఆరీతి నాన వట్టె నీ కలవా ట్లాయనే
నేర మొకరిపై వేయే నీచేయి మీఁదు సేయ
నేరుపు నాలితానలు నీ వియ్యు వలెనే

చ. 3: అరగపటము చూప నంతలోఁ దిరుగ వేయ
సరిఁ జిన్ననాఁడె యిన్ని సాధించితివే
గరిమ శ్రీవెంకటేశుఁ గలసి న న్నే లించితి
సరి వచ్చితే మెచ్చ జాణ వైతివే

రేకు: 0388-1 ముఖారి సంపుటం: 11-523

పల్లవి: ఏ లోయి మాతోడి యెగసక్యాలు
జాలిఁ బడి వున్నవారి సట సేసేవా

చ. 1: సెలవుల నవ్వు నవ్వి చేతి పువ్వుబంతి వేసి
యెలమి మాకోపము నేఁ డేల రేఁచేవు
వులి వచ్చి విరహన నుడుకుతా నుండేవారి
వలపుల యెండలనే వడ చల్లేవా

చ. 2: దగ్గరనే నిలుచుండి తతిగొని చన్ను లంటి
యెగ్గులతిట్ల మాచే నేల పడేవు
నొగ్గిన సిగ్గులతోడ నుట్టి లేక వూఁగేవారి
అగ్గలపుటాసలవుయ్యాల లూఁచేవా

చ. 3: చేరి పచ్చడము గప్పి చెక్కు నొక్కి కాఁగిలించి
యీరీతి మన్నించి మమ్ము నేల మెచ్చేవు
కూరిమి శ్రీవెంకటేశ కూడిన మావంటివారి
నేరా తరితీపుల నెలయించేవా

రేకు: 0388-2 రాయగౌళ సంపుటం: 11-524

పల్లవి: ఎప్పటివలెనే చన వియ్య రాదా
తప్పు లేనిసతి నింక దయఁ జూడ రాదా

చ. 1: నాలితో నాపె నిన్ను నవ్వుతా నన్న మాఁటకు
యేల కోపగించుకొనే వింతలోనే
మీలోనే యిటు లైతే మెత్తురా లోకమువారు
తాలిమితో నింతి నింక దయఁ జూడ రాదా

చ. 2: చనవు చేసుక యాపె జంకించనయందుకు
యెన లేక చిన్నఁ బొయ్యే వేఁటికి నీవు
కొనగొన మీకు మీకు కోపము లింత చెల్లువా
తనిసి నీ దేవులను దయఁ జూడ రాదా

చ. 3: చుట్టరికమున నాపె సూడు వట్టినందుకు
యెట్టు పెనఁగఁ బోయి నితవు లవునా
యిట్టె శ్రీవెంకటేశ యింతలోఁ గూడితి వీపెఁ
దట్టు ముట్ట సేయ కిట్టె దయఁ జూడ రాదా

రేకు: 0388-3 నారణి సంపుటం: 11-525

పల్లవి: కల మీ సహజానకు కన్నుల మెచ్చుట గాక
తలపోసి మి మ్మడుగఁ దగవా యీవేళనూ

చ. 1: పడఁతి నీమోము చూచి పకపక నవ్వు నవ్వి
చిడుముడి నీచేతిపై చేయి వేసేను
అడరి మీలోని మర్మా లనవి యేమి గలవో
తడవఁగ మాకు నంత దగవా యీవేళను

చ. 2: సారె సారె సన్న సేసి చాయలు దొరల నాడి
మోరతోపుఁదనమున మొక్కు మొక్కెను
కారణ మేఁటికో కాని కందువ మీకే తెలుసు
తారుకాణించఁగ మాకుఁ దగవా యీవేళను

చ. 3: చెనకి పాదము దొక్కి చెలిలోన మాట చెప్పి
ఘనముగ నిన్ను నాపె కాఁగిలించెను
అనుగు శ్రీవెంకటేశ ఆడుకోలుమాటలేవో
తనివి నిట్టె పొగడఁ దగవా యీవేళనూ

రేకు: 0388-4 సామంతం సంపుటం: 11-526

పల్లవి: ఎంత నీవు పతి వైనా యింతులకు లోనే సుమ్మీ
వంత జవ్వనమదపువారు సుమ్మీ వీరు

చ. 1: సొలసి యాడెటిమాట సుమాళముమీఁది పాట
పెలుచుఁగామినులకుఁ బెట్టని కోటా
బలిమి చూపఁగ రాదు పంతపు మగవారికి
వలరాచసలిగెలవారు సుమ్మీ వీరు

చ. 2: కనుచూపుల కొసరు గబ్బితనపుటుసురు
దినవలపులకు నెత్తినయసరు
మొనలు మీరఁగ రాదు ముంచి యెంతకొర తైన
వనవసంతునిపొజువారు సుమ్మీ వీరు

చ. 3: వుదుటుమీఁది సణఁగు వొద్దికతోడి గొణఁగు
మదరాగ మీసతికి మంచి మణుఁగు
ఆదన శ్రీవెంకటేశ అట్టె కూడితి వీపెను
వదనశశినిఁ బోలేవారు సుమ్మీ వీరు

రేకు: 0388-5 భవుళి సంపుటం: 11-527

పల్లవి: ఏమి సేసినా నీ చిత్త మింతే కాక
కాముకుఁ డైన నిన్నుఁ గా దనేటివారమా

చ. 1: నేరిచినవారుగా నీతో మాటాడేది వే
మారును నెదు రాడఁగ మా కేటికి
కారణము గలిగి కా కమ్మర నీతో నవ్వేది
యీరీతి నీతోఁ గెలయ నెంత పని మాకును

చ. 2: అంత కోపినప్పుడుగా నట్టె నిన్ను దగ్గరేది
మంతనాలు విన్నవించ మా కేఁటికి
పంతము నే నాడితేఁగా బలవు నీతోఁ జూపేది
యెంత కెంత నీసుద్దులు యేమి పని మాకునూ

చ. 3: నేనే నీ వయితేంగా నిజ మని నమ్మేది
మానక వావులు చెప్ప మా కేఁటికి
పూనుక శ్రీవెంకటేశ బుజ్జగించి కూడితివి
యే నెపాలకు నింక నేమి పని మాకును

రేకు: 0388-6 తెలుఁగుఁగాంబోది సంపుటం: 11-528

పల్లవి: తను నేమి సేసితినే తా నేల తమకించేనే
యెనయఁగా నూరకున్న దిదే నా నేరమి

చ. 1: తగుల నాడినదదానఁ దల వంచు కుండ నైతి
నగితి నింతే పో నా నేరమీ
మొగుము చూచినదాన మోనము గైకొన నైతి
అగపడి లో నైన దదే నా నేరమీ

చ. 2: యింటికి వచ్చినదాన నే మైనాఁ గొసర నైతి
నంటున నే నుంటి నది నా నేరమీ
అంటినదాన నే నట్టె చెనక నైతి
వొంటి మొగమోటల నే నున్నదే నా నేరమీ

చ. 3: నెమ్మదిఁ గూడినదాన నిజబా సడుగ నైతి
నమ్మితి నే నిదయె కా నా నేరమీ
వుమ్మడి శ్రీవెంకటేశుఁ డొగి నిట్టె నన్నుఁ గూడె
సొమ్ముల మై మఱచి నేఁ జొక్కినదే నేరమీ

రేకు: 0389-1 సాళంగం సంపుటం: 11-529

పల్లవి: కొసరి ని న్నింతలోనె కోపగించేనా
ముసిముసి నవ్వు లెల్లా ముచ్చటలె కావా

చ. 1: తలఁపులో నీరూపు తగిలి పాయ కుండఁగ
యెలమి విరహతాప మెక్కడిది
వెలయ నిందుకుఁ గాను వేఁడుకొనే వేల నన్ను
నలువంక నీమేలె నామేలు గాదా

చ. 2: చేకొని నీ కంకణము చేతఁ జిక్కి వుండఁ గాను
యీాక డాకడి మాటకు నెగ్గు లేది
వాకున నిందుకుఁ గానె వైపులుగా నమ్మించేవు
నీకుఁ గలసంతోసమే నేఁడు నాకుఁ గాదా

చ. 3: కందువ నీవే నాయింటఁ గాఁణా చై వుండఁగాను
చెంది నామనవి నీతోఁ జెప్ప నేది
అంది శ్రీవెంకటేశ నన్నలమితి కడపలో
విందుల నీవేడుకే నావేడుకలు గావా

రేకు: 0389-2 సాళంగనాట సంపుటం: 11-530

పల్లవి: ఎవ్వరితోడ గొడవ లేక నేలా
యివ్వల మ మ్మిందులోనే యేల పొగడేవు

చ. 1: సన్నల సారెకు మెచ్చ సణఁగు నీపైఁ జల్ల
కన్నులెదుట నీ కాపె గలిగెఁగా
మన్ననలు పచరించ మాటికి మాటికి నవ్వ
అన్నిటిమారును నీవు ఆపెకుఁ గలితి గా

చ. 2: యిచ్చకము నీకు నాడ యే మైనఁ బనులు సేయ
గచ్చుల నీకు నేఁ డాపె గలిగెఁ గా
చెచ్చెర వాసు లెక్కించ చెప్పినపనులు సేయ
నిచ్చ నిచ్చ నాపెకు నీవు గలితివి గా

చ. 3: అంది నీకాఁగిఁట గూడ నాయము గరఁగి చొక్క
కందువ లంట నీ కాపె గలిగెఁ గా
అందపు శ్రీవెంకటేశ ఆపెఁ గూడి నన్నుఁ గూడి
తిందులో మాయిద్దరికి నిటు గలితివిగా

రేకు: 0389-3 సాళంగనాట సంపుటం: 11-531

పల్లవి: పెలుచుఁ గోపపుదాన బిరుదుకు మొదలను
యెలమి నీగుణాలే న న్నింత వలపించెను

చ. 1: తత్తరించి నే నిన్ను తగుల నాడినందుకు
చిత్తన నొవ్వక నన్నుఁ జేర వచ్చేవూ
మత్తిలి నేఁ గోసరితే మరి నీవు నవ్వేవు
యిత్తల నీమంచితనా లింత వలపించెనూ

చ. 2: గక్కన నీరాకు నేఁ గైకో కుండినందుకు
అక్కర దీర న న్నంటి ఆదిరించేవూ
వొక్కటి గా కూరకున్న వొడఁబరచ వచ్చేవు
యిక్కువ నీ నేరువు న న్నింత వలపించెనూ

చ. 3: వొంటిఁ గాఁగిలించఁగాని నిన్నొట్టు వెట్టినయందుకు
బంటువలె వెంట వెంటఁ బాయ కుండేవూ
అంట కుంటే శ్రీవెంకటాధిప నన్నుఁ గూడితి
వింటనే నీ చనవులు యింత వలపించెనూ

రేకు: 0389-4 హిందోళం సంపుటం: 11-532

పల్లవి: ఏమి సేసితి విందాఁకా నేడ నుంటివి
చే ముంచి యాపెను నీవే నేద దేర్చవయ్యా

చ. 1: యింతి నీవు వచ్చే వంటా నిందాఁకా నెదురు చూచె
అంతయు నీతోఁ గొంచి యాడఁ జాలదు
చింతతో నున్నది చెలి చెక్కు నొక్కి యాపెకు
సంతోసము సేసి మోవి చవి చూపవయ్యా

చ. 2: నీవే పిలిచే వంటా నిలుచుండె నిందాఁక
ఆవలిమాటలు నిన్ను ననఁ జాలదు
కోవరపుఁ దమకాన గుట్టుతో వున్నగి యాపెఁ
జే వట్టి బుజ్జగించి చిత్తగించవయ్యా

చ. 3: పవళించే వంటాను నీపైనే కన్ను లిందాఁకా
అవుఁ గా దనుచు నిన్ను ననఁ జాలదు
వివరించి కూడితి శ్రీవెంకటేశ యీసతిని
కవ వాయ కిట్లానె కైకొ నుండవయ్యా

రేకు: 0389-5 సాళంగం సంపుటం: 11-533

పల్లవి: అన్నిటాఁ దన్నుఁ జూచుకొ మ్మనరే మీరు
వున్నమచంద్రువెన్నెల భూమి కెల్లాఁ గాదా

చ. 1: యెంత నన్ను బుజ్జగించి యెటువలెఁ బెట్టు కున్నా
అంతయునుఁ దనమే లనరే మీరు
పొంతనె పాదాలమీఁదఁ బూజించినపెద్దరికె
మంతట దేహన కెక్కు నదియే కాదా

చ. 2: సారె సారె దా నెంత చనవు నా కిచ్చినాను
ఆరయఁ దనలాభమో అనరే మీరు
నేరుపుతో వేళ్లపై నీళ్లెల్లాఁ బోసితేను
కూరిమినా తని వెల్లాఁ గొనలకే కాదా

చ. 3: సరి నన్నుఁ గూడి నా మైచలు వెంత వేసినాను
ఆరిది తనకె పుణ్య మనరే మీరు
యిర వై శ్రీ వేంకటేశుఁ డింత వేసి నన్నుఁ గూడె
మరిగె పండ్లతీపు మాకు వల్లఁ గాదా

రేకు: 0389-6 ముఖారి సంపుటం: 11-534

పల్లవి: ఇంతేసి మాయలు పతి యెరుఁగునో యెరఁగఁడో
చింత దీర నాతనితోఁ జెప్పరమ్మ చెలులు

చ. 1: దగ్గరి యాతనితో నే తమితో మాట లాడితే
ఆగ్గలపుసతులు గయ్యాళి యందురూ
సిగ్గు పడి పూర కున్న చెంగలించి వెంగెముల
నిగ్గుల ని దేమియు నేర దందు రూ

చ. 2: నయమున నేఁ గొంత నవ్వులు నవ్వఁగఁ బోతే
బయకారా లని వారే పచ్చి వేతురు
దయతోడ గుట్టు సేసి తల వంచుకొని వుంటే
నియతి నలిగె నంటా నెట్టన గడింతులు

చ. 3: కతగా శ్రీవెంకటేశుఁ గలసి మెప్పించితేను
రతులలో ని దెంతటి రాఁగ యందురూ
యిత వై యీతఁడు నన్ను నింతగా మన్నించి కూడె
మతక మింతయును నామర్మమే యందురూ

రేకు: 0390-1 గుండక్రియ సంపుటం: 11-535

పల్లవి: కంటి వటె నామీఁదఁ గల బత్తి యీతనికి
గొంటుఁదనమునఁ దానె కొంకీ నాచేఁతకు

చ. 1: నంటు గలవారిఁ గంటే నవ్వ బుద్ది వుట్టుఁ గాక
కంటకపు వారికిఁ గలదా సొంపు
అంటి ముట్టి నే సరస మాడఁగా నా కినగోరి
ముంటివాఁడి సోఁక కుండా మొక్క వచ్చీ నితఁడు

చ. 2: యేకచిత్త మైనచోట నిన్నియు నితవు గాక
చీకాకు వడినచోటఁ జెప్పఁ గలదా
కైకొని నేఁదను నెంత కరఁగించి మాటాడినా
ఆక డీకడి మాటలు ఆలకించీ నితఁడు

చ. 3: యంత నే విన్నవించఁగా నియ్యకొని కూడెఁ గాక
చెంత నే నాడక వుంటేఁ జిత్తగించీనా
పంతపు శ్రీవెంకటాద్రిపతి యిప్పుడు నారతి
మంతనానఁ జిక్కి చొక్కి మచ్చి కాయ నితఁడు

రేకు: 0390-2 పాడి సంపుటం: 11-536

పల్లవి: ఈపాటి కీపాటి యిఁక నెంతో
కోపగించ రాదు నీతో కూటములు చెల్లునా

చ. 1: సెలవుల నవ్వితేనె చెరఁగు వట్టెవు నీవు
యెలమి నాల నైతే యెంత సేతువో
బలవులతోడి పొందు పై వచ్చునై వచ్చు
చలము సాదించ రాదు చాలు నోప నందుకు

చ. 2: మచ్చికె నిన్నుఁ జూచితే మంచానకుఁ దీసేవు
యిచ్చలు నీకుఁ జేసితే నెంత నేతువో
వచ్చెఁ బలివేలు మాకు వరుస లిందే కంటిమి
మచ్చరించ రాదు నాతో మాట లింతే సేఁటికి

చ. 3: వొంటి నే నిలుచుంటెనే వూరకే కాఁగిలించేవు
యింటికిఁ బిలచుకొంటే నెంత సేతువో
గొంట నై శ్రీవెంకటేశ కూడితిని నన్ను నిట్టె
దంట నై జంకిం రాదు తతి వచ్చె నీకును

రేకు: 0390-3 దేసాళం సంపుటం: 11-537

పల్లవి: వట్టి మండాటము లేల వద్దన నేలా
యిట్టె నీపతి వీడె యే మైన ననవే

చ. 1: వలవనిజోతి యాల వాదుటాల మా కేల
తలఁచఁగానె యాతఁడు తానే వచ్చెను
పొలసి యిందాఁక నేము పూనుక వచ్చితి మింతే
చెలువుఁడు వాఁడె నీవు సేసినట్టు నేయవే

చ. 2: ఆన వెట్ట నా కేల అంతేసి పంతము లేల
వీనుల నాతఁడు దానే వినుచున్నాఁడు
కానీవే ఆతఁడు నీవు గన్నదాఁకా గురియైతి
పోనీక యీతని కిన్ని బుద్దలూనుఁ జెప్పవే

చ. 3: చక్కటి సేయఁగ నేల చవులు చెప్పఁగ నేల
గక్కన నాతఁడును నిన్నుఁ గాఁగిలించెను
యిక్కువ శ్రీవెంకటేశుఁ డెనసి వున్నాఁడు నీతో
యిక్కడు నాతనితో నీ వెట్టయినఁ బెనఁగవే

రేకు: 0390-4 గుండక్రియ సంపుటం: 11-538

పల్లవి: మగవాఁడు గూళ యైతే మరి చేతఁ బట్ట రాదు
తగ వెరఁగక నీవే తమకించే విదివో

చ. 1: అంగనకు నీమనసు అరిసి తెలయుదాఁకా
నంగవించి నవ్వ దాయ నందుకే కదా
కుంగుచు నీవది చూచి కోపగించి వున్న దంటా
నండగిఁ బెట్టి వలపు లాడుకొనే విదివో

చ. 2: పడఁతికి నీ వాకడి పరాకు మానినదాఁకా
నడరి నీతో మాటాడ దుందుకే కదా
కడగి నీతో నాపె కైకొనక వున్న దంటా
వుడివోక గోర సేసి వుప్పతించే విదివో

చ. 3: జలజాక్షికిని నేవీ చనవు లిచ్చినదాఁకా
నలమక వూరకుండె నందుకే కాదా
యెలమి శ్రీవెంకటేశ యిట్టె నీవే కూడితివి
చలము చెల్లించే నంటా జట్టిగొనే విదివో

రేకు: 0390-5 సాళంగం సంపుటం: 11-539

పల్లవి: చెల్లనో నీ వింత నాకుఁ జెప్ప వలెనా
బల్లిదుఁడ నాకు నీ బలు వుండఁగా

చ. 1: సందడించి యవ్వరితో జడగడాలు మా కేల
కందు వై నీవు నాకుఁ గలి గుండఁగా
మందలించి కన్నవారిమాట విన నా కేల
కిందట మీఁదట నీకృప యుండఁగా

చ. 2: పొట్టఁబిరుగువారితో పురుఁడు నా కది యేల
యిట్టె నీవు నాకుఁ జన విచ్చి యుండఁగా
వట్టి విచారము లేల వగలఁ బొరల నేల
గుట్టుతో నీబాస నాకు గురి యుండఁగా

చ. 3: కడవారితో నింకఁ గాఁతాళము నా కేల
ఆడరి నీకాఁగిలి నన్నంటి యుండఁగా
బడినె శ్రీవెంకటేశ పాయక నన్నుఁ గూడితి
జడియ నేల వలపు సరు లయి వుండఁగా

రేకు: 0390-6 సాళంగనాట సంపుటం: 11-540

పల్లవి: నిక్కము నేఁడు మా పొందు నీకు వలెనా
చక్కని విభుఁడ యింత చవి వుట్టీనా

చ. 1: మనసు దెలిసి నాతో మాట లాడే విప్పు డిట్టే
తనిసి నేఁ డైన నీచిత్తము వచ్చెనా
చెనకి నామీఁదఁ దెచ్చి చేయి వేసే వప్పిటిని
వెనకముందరి బుద్ధి విచారించుకొంటావా

చ. 2: నయగారమును మాతో నవ్వఁ జూచే విప్పు డిట్టే
జయ మైన సిగ్గు దేరి చలి వాసెనా
ప్రియపడి నన్నుఁ గడు పేరుకొని పిలిచేవు
క్రియతో నీ కింతపని కిమ్ములఁ గలిగెనా

చ. 3: చొక్కుచు నా మోముదిక్కు చూచేవు సారె సారె
పుక్కటై నీలోని వలపులు రేగెనా
యిక్కు వంటి శ్రీవెంకటేశ నన్ను గూడితివి
దిక్కుల నీగుణములు తిద్దుకొంటివా

రేకు: 0391-1 ముఖారి సంపుటం: 11-541

పల్లవి: చెప్పకు నీ వోరపులు సిగ్గు లయ్యీని
కప్పుక రాఁగానె కాక కడుఁ బెలుచవు

చ. 1: ఆయము దప్పక నిన్ను ఆడ కుండఁగానె కాక
వోయయ్య నీ వింతేసి కోరిచేవా
చాయ సేసుకొని నీతో సరి నవ్వే దెరఁగవు
నీయంతనే వచ్చి నిజము నెరుపేవు

చ. 2: సంగడి దప్పి నీపైఁ జేయి చాఁచ కుండఁగానె కాక
యింగితాన నెందు కైన నియ్యకొనేవా
చెంగట నీగుణములు చెల్లఁ బెట్టే దెరఁగవు
ముంగిటిచెలుల కెల్ల ముచ్చట చేప్పేవూ

చ. 3: కిమ్ముల బొమ్మలకు జంకించ కుండఁగానె కాక
నెమ్మది నీ దీమసాలు నెరుపేవా
యిమ్ముల శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
సమ్మతించి యిప్పుడు గా చనువు లిచ్చేవూ

రేకు: 0391-2 మంగళకౌసిక సంపుటం: 11-542

పల్లవి: ఈపాటి మేలు సేసితి వింత చాలదా
మాపట్టుకు నీవు గాఁగా మన్నింతిని గాక

చ. 1: వంతుకు నామనసు రావలె నంటా నాపెచేత
పంతము లిప్పించే వేర పలుమారు
యెంతటివాఁడవు నీవు యే మేమి సేయ నేరవు
మంతనానా మముఁ గొంత మన్నించితి గాకా

చ. 2: ఆది గొని నేనే మైనా ననే నంటా నాపె చేత
పాదాలకు మొక్కించేవు పలుమారు
కా దంటే నీ వెంత కైనఁ గలవు నే నెరఁగనా
మాదెసఁ గొంత నీవు మన్నించితి గాకా

చ. 3: యెనయ నిద్దరి నొకయింటఁ బెట్టి యాపెచేత
పని నాకుఁ జేయించేవు పలుమారు
కొనబు శ్రీవెంకటేశ కూడితిని నన్ను నిట్టె
మన సిచ్చి నేఁ గాఁగా మన్నించితి గాకా

రేకు: 0391-3 వరాళి సంపుటం: 11-543

పల్లవి: మొదల నేమీ నెరఁగ మూఢురాలను
యెదుట నీయాల నేను యీడేరించ వయ్యా

చ. 1: వోపి మంచము దిగక వుందు నొక్కక్కవేళను
రాపుగ నిన్నుఁ బొందిన రాజసానను
కోపగింతు నొకవేళఁ గొసరుదు నొకవేళ
ఆపాపము లే దని మా కానతియ్య వయ్యా

చ. 2: దగ్గరినవేళ నాపాదము దాఁకు నీ మేను
అగ్గలపుమందెవేళ మట్టె కాఁగాను
వెగ్గళింతు నొకవేళ వేసిరింతు నొకవేళ
యెగ్గు లే దని వరము లియ్య వయ్యా

చ. 3: యేకతపువేళ నిన్ను యే మైనా నందుము నేము
కైకొని చనవుతోడఁ గాఁగిట నించి
యీకడ శ్రీవెంకటేశ యేక మైతి మిద్దరము
వాకుదోసము లే దని వల లీవయ్యా

రేకు: 0391-4 లలిత సంపుటం: 11-544

పల్లవి: నిన్ను మీర నోపను నే నెటువలె నుండిన
అన్నిటా నే నీకె లో నవుతే నాతగవూ

చ. 1: యెంత విరహవేదన నెట్లా నేఁ బొరలినా
రంతుల వేగిరించఁగ రాదు నిన్ను
యింతకంటే నీతో నే నెంత వొట్టు వెట్టుకొన్న
వంతలు నీయంకెలకు వచ్చుటే నాతగవు

చ. 2: ముంచి నాకు నీమీఁద మోహ మెంత యెక్కు డైన
చంచలించి వేగరించ సంగతా నాకు
మంచితనాననే నీకు ముందెమేళ మెంతయిన
పొంచి నీవేళ గాచుక పొందుటే నాతగవూ

చ. 3: వరుసతో నే నీకు వద్ద నిట్టే వుండినాను
గరిమె నే ముందు చేనకఁగఁ జెల్లునా
నిరతి శ్రీవెంకటేశ నీవే నన్నుఁ గూడితిని
ధరమీఁది పనులకుఁ దాలిమే నాతగవూ

రేకు: 0391-5 పాడి సంపుటం: 11-545

పల్లవి: పొంచి పొంచి మాతో నేల పురుడు వెట్టుకొనేవు
నించి యిన్నిటా దొరవు నీకుఁ జెల్లదా

చ. 1: చలపట్టి మాకే నీతో జవదాఁట రాదు గాక
నెల వై పెచ్చు వెరుగ నీకుఁ జెల్లదా
కలది గ లట్టే మాకు కల్ల లాడ రాదు గాక
నిలువున బొంకు బొంక నీకుఁ జెల్లదా

చ. 2: మఱఁగు లెల్లా విరులు మాకుఁ జెల్ల దింతే గాక
నెఱి దాఁగి పొడచూప నీకుఁ జెల్లదా
తఱిఁ గపటము మాకుఁ దగవు గా దింతే గాక
నెఱవుదొంతగనాలు నీకుఁ జెల్లదా

చ. 3: చిమ్ముచు మాకే నీతో చేరి నవ్వ రాదు గాక
నెమ్మది సిగ్గు విడువ నీకుఁ జెల్లదా
నమ్మించి శ్రీవెంకటేశ నన్ను నిట్టె కూడితివి
నెమ్మి నన్ను మన్నించ నీకుఁ జెల్లదా

రేకు: 0391-6 ముఖారి సంపుటం: 11-546

పల్లవి: చిత్తము వచ్చిన ట్టెల్లఁ జేసుఁ గాకా
బత్తితోడ నేల వొడఁబరచీనె నన్నునూ

చ. 1: చేరి తనతో నవ్వి సేసపాలకు లో నైతి
బీరాన నేఁ బొందు సేసి బేల నైతిని
సారె సారెఁ దనవంక జాలదా నా కింత మేలు
పోరి పోరి యిఁక నేమి బుజ్జగించీ నన్నునూ

చ. 2: కన్నులఁ జూచినందుకు కాలమందె లో నైతి
యెన్ని తనునే నమ్మి యిం తైతిని
మన్ననలు దనవంక మరి యింతకంటే నేవి
కొన్నకో లై యిఁక నేమి గొంగు వట్టీ నన్నునూ

చ. 3: మాటలు దనతో నాడి మన సిట్టె తనిసితి
యీటుకుఁ బెనఁగఁ బోయి యేక మైతిని
గాఁటపు శ్రీవెంకటాద్రిఘనుఁడు దా నన్నుఁ గూడె
ఆఁటదాన నేల మచ్చీ యప్పటిని నన్నునూ

రేకు: 0392-1 మలహరి సంపుటం: 11-547

పల్లవి: ఎందాఁక నీసిగ్గు లేఁటికిఁ బెంచేవు
పొందులు దొరకెను బోగించ రాదా

చ. 1: చెలఁగి నీకురులు చేతుల దువ్వుచు
మలసెటిపతితో మా టాడవే
సెలవినవ్వుతోఁ జెక్కులు నొక్కి
చెలువుని చనవులు చెల్లించ రాదా

చ. 2: కదిసి చేసురటి కాంతుఁడు విసరీ
నదె చీచేతుల నందుకోవే
మొదల నాతఁడె ముచ్చట లాడీ
యెదు రుత్తరము నీ వియ్యఁగ రాదా

చ. 3: ఆతఁడు కాఁగిట నట్టె బిగించీ
నీతగ విప్పుడు నెరపఁ గదే
కాతరపు శ్రీవెంకటఘనుఁ డితఁడు
ఘాతలఁ గూడెను కనుఁగొన రాదా

రేకు: 0392-2 శంకరాభారణం సంపుటం: 11-548

పల్లవి: నీవు మగవాఁడవు నెలఁత యాపె
వేవేలకు నైనాన వింత సేయఁ జెల్లానా

చ. 1: తచ్చి తచ్చి యాపెతో తారుకాణ నీకు నేల
యిచ్చగించి విన రాదా యింతలో నేమి
హెచ్చినకోపానఁ జెలి యే మన్నా ననెఁ గాక
మచ్చరించ యింత నీకు మారుమాట చెల్లునా

చ. 2: ముంచి తిట్టెయాపెఁ జూచి మోవినె నవ్వఁగ నేల
యించుక వోరుచ రాదా యింతలో నేమి
మించలవనిత యెంత మీరినాము మీరెఁ గాక
అంచెల సతులతో నా కాడుకొనఁ జెల్లునా

చ. 3: కూడినవేళ యాపెతో గోరఁ జెనకఁగ నేల
యీాడ జోడై యుండ రాదా యింతలో నేమి
వేడుక శ్రీవెంకటేశ వెలఁదిఁ గలసితివి
తోడనె తనివి లే దొమ్మి సేయఁ జెల్లునా

రేకు: 0392-3 నాదరామక్రియ సంపుటం: 11-549

పల్లవి: అంతే కలితే నీ ఆతనివద్దికి రావే
కాంతరో అన్నియుఁ దారుకాణించె నిపుడు

చ. 1: యేమి సేసినో యంటా నేకతాన దగ్గిరితే
కామించి యాతఁడు నన్నుఁ గరఁగించెనూ
నీమనసున విభుని నేనే యంటితి నంటా
మోము చూచి నవ్వేవు మొరసి యే ముందునే

చ. 2: సూడు వట్టి నే నాతని జూజ మాడఁ బిలిచితే
కూడఁ బట్టి తానె దక్కఁ గొనె నన్నునూ
తోడనె వెంగె మావేడు దొమ్మినేఁ జేసితి నంటా
ఆడియు నాడవు నన్ను నందుకు నే మందునే

చ. 3: నీతోడి చుట్టరికాన నే మొక్కితే నన్నుఁ గూడె
యీాతల శ్రీవెంకటేశుఁ డిచ్చకాననూ
నీతితో న నన్నడిగేవు నీ వెఱఁగ వటే యిది
యేతరీఁ డాతఁడు నీతో నే ముందునే

రేకు: 0392-4 సాళంగం సంపుటం: 11-550

పల్లవి: ఎఱఁగ రాదు మీ గుట్టు యి ట్టుండ వలదా
అఱమఱపులే కంటి మవ్వల దెలియదు

చ. 1: అట్టె నీమొగము చూచి అతివ నవ్వినవవ్వు
వట్టి శిగ్గుతో నీ తల వంచినవంపు
దట్టపు వెన్నెలకును తామెర ముకుళించిన
ఆ ట్టాయఁ గాని మాకు నవ్వల దెలియదు

చ. 2: చేతి పూవుబంతిఁ గొని చెలియ వేసినవాటు
యీాతల నంతలో నీ చె య్యెత్తిన మొక్కూ
ఘూత మరునమ్ములకు గవిశనవలె నాయ
నాతుమలోపల మాకు నవ్వల దెలియదు

చ. 3: తరుణి నీమంచానకు దగ్గరి వచ్చినరాక
నిరతి శ్రీవెంకటేశ నీకూటమి
గరిమఁ బాలును నీరు గలసినయ ట్టాయ
ఆరు దందితిమి మాకు నవ్వల దెలయదూ

రేకు: 0392-5 కొండమలహరి సంపుటం: 11-551

పల్లవి: నేనే కాదు చెలు లెల్ల నీగణ మెరుఁగుదురు
నానినవలపు చెప్ప నాతో నేల యిఁకనూ

చ. 1: మంతనాన మీ రిద్దరు మచ్చిక ముచ్చ టాడఁగ
వింతలుగా మీ సుద్దులు విననా నేను
యింతలో నే నగిగితే యేరుపడఁ గత చెప్పే
వంతరంగ మెఱఁగదా ఆన లేల యిఁకను

చ. 2: మొదలనె మీకళల మొకములలో తేట
కదిసి చూచితి నిట్టె కానాన నేను
అదన నే నవ్వితేను అట్టె తెర వేసేవు
కదిమి నాతో నయగార మేల యిఁకను

చ. 3: పచ్చి గాఁగ నింటిలోన పానుపుపైఁ గూడినది
యెచ్చరికె లెరఁగనా యిప్పుడే నేను
అచ్చపు శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితిని
ముచ్చిమి దీరినమీఁద మొక్కు లేల యిఁకను

రేకు: 0392-6 శుద్ధవసంతం సంపుటం: 11-552

పల్లవి: ఇసుమంత పనికిఁ గా నెంత సేసేవు
విసు పేల వచ్చె నీకు వినవయ్య మాఁటా

చ. 1: తూఁగుమంచ మెక్కుకొని తొయ్యలి లేవ దంటా
తోఁగి చూచి నీవు వోఁగా దొడికి పట్టి
వేఁ గగు కుచభారము వీడఁగాఁ బెనఁగీ నాపె
వీఁగక మన్నించి నేఁడు వినవయ్య మాఁటా

చ. 2: తామెర నాపె వేయఁగఁ దాఁకి నీకు నొచ్చె నంటా
వోమి నీవు కళ వట్టి వూర కుండఁగా
మోము చిన్నఁబోయి యింతి మోవితేనె నీకు నిచ్చి
వేమారు వేఁడుకొనీని వినవయ్య మాఁటా

చ. 3: సిగ్గుతో నున్నది యంటా శ్రీవెంకటేశుఁడ నీవు
బగ్గన నవ్వలిమో మై పవ్వళించఁగా
దగ్గరి యందుకే యింతి తమకించి నిన్నుఁ గూడె
వెగ్గళించ కిపు డిట్టె వినవయ్య మాఁటా

రేకు: 0393-1 శుద్ధవసంతం సంపుటం: 11-553

పల్లవి: ఇప్పు డేల చవు లయ్యీ నింపులు చాలనిపొందు
చప్పు నైనా నుప్పు నౌను సమ్మ తైతేఁ గాకా

చ. 1: చలము సాదించేచోట సలిగెలు చెప్పఁ బోతే
ములుచదాన ననవా మొదల నీవే
వలచినవేళ నెంత వడి నేఁ గోపించినాను
తల ఊయి సేసుకొని తగులుదు గాక

చ. 2: నయము చాలనిచోట నవ్వులు నవ్వఁగఁ బోతే
బయకారించె ననవా పక్కన నీవే
ప్రియము గలవేళను బిగి నెంత నే నుండినా
దయ పుట్టి నీవు నన్ను దగ్గరుదు గాక

చ. 3: తమకము లేనిచోట తతిఁ బెనఁగఁగఁ బోతే
భ్రమసి వున్న దనవా పై పై నీవే
అమర శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ గూడితిని
సమ మై యేకతవేళ సత మైతి గాకా

రేకు: 0393-2 సాళంగం సంపుటం: 11-554

పల్లవి: చెలులతో నీసుద్దులు చెప్ప వచ్చునా
చలము మన లోలోనె సాదించుట గాకా

చ. 1: మచ్చిక నీతిట్లూను మనలోని వొట్లూను
చెచ్చెర నొరులతోడఁ జెప్ప వచ్చునా
కొచ్చి బొమ్మల జంకించి కోపముల నుంకించి
రొచ్చుల మతికాఁక దీరుచుకొంట గాకా

చ. 2: నీ చేఁతలను మన నెట్టుకొన్న మర్మములు
చేచేత నొరులతోడఁ జెప్ప వచ్చునా
తాచి నిట్టూర్పు నెరపి తగఁ గన్నులు గిరపి
యేచి మనలో మనమే యిందుకొంట గాకా

చ. 3: యింతేసి నీ వినయాలు యిక్కువ మనరతులు
చెంతల నొకరితోడఁ జెప్ప వచ్చునా
పంతపు శ్రీవెంకటేశ భావములనే చొక్కి
వింత సంతసాల విఱ్ఱవీఁగుకొంట గాకా

రేకు: 0393-3 సాళంగం సంపుటం: 11-555

పల్లవి: ఆన వెట్టినా మానరు అప్పటి మీరు
పానిపట్టి చెలులార పగదాన నటరే

చ. 1: యెదురుమాటలు నేర యెవ్వరితో నేఁ బోర
వొదిగి వొకరీతి న న్నుండ నీరే
అదన నండఁ గూచుండ నాతని సరివారమా
పొదిగి నా కేల మీరు బుద్ది చెప్పేరే

చ. 2: వట్టి పూడిగాల కోప వాదు లాతనిపై మోప
వెట్టికి మొక్కి నన్నేల వెట్టిఁ జేసేరే
యిట్టె నన్నాతఁ డే మన్నా నే మాయ లే దంటా
నొట్టు వెట్టుకొనె నంటా నొడఁబరచకురే

చ. 3: మంతనా లంతే నెఱఁగ మతిఁ దనకు మొఱఁగ
యెం తయినఁ దనకాఁగి లేల మానేనే
యెంతలోనే శ్రీవెంకటేశుఁడు దానె కూడె
పొంత నన్ను నాతనిఁ బొగడ నేమిటికే

రేకు: 0393-4 గుజ్జరి సంపుటం: 11-556
పల్లవి: ఆలుక గాదు నీతో నన్నిటా మన్ననదాన
చలపట్టి యందరితో సరి సేయ కిఁకను
చ. 1: చిత్తము నొవ్వకుమీ చెప్పే నే నొకమాట
హత్తిమంచ మెక్కు మన కంతే చాలు
యిత్తల నీ కూడిగాలు యెన్ని యైనఁ జేసేఁ గాని
పొత్తుల యెంగిలితోడి బోగము సయించదు
చ. 2: ఆనలు వెట్టకుమీ అడిగే నే కొకయీవి
పూని నాతోడ నవ్వకు పొందులే చాలు
కానిమ్మని నీవద్ద నేఁ గాచుకుండే నేపొద్దు
సానఁ బట్టేసరసాలు చవి గాదు నాకును
చ. 3: చేతుల మొక్కకుమీ సేసేఁ గాని నీమాఁట
రాతిరి నన్నుఁ గూడినరతులే చాలు
యీతల శ్రీవెంకటేశ యిప్పుడు నన్నుఁ గూడితి
కాతరాన నీతోడఁ గపట మెరఁగనూ

రేకు: 0393-5 రామక్రియ సంపుటం: 11-557

పల్లవి: నే మెటుల నుండినాను నీ కేమి
వేమరు మామీఁది ద్రిష్టి విడువవు నీవు

చ. 1: సెలవి నే నగితేను చేరి య దేమిటి కంటా
నలరి చెప్పు మనుచు నాన వెట్టేవూ
తలఁకేవు నీ వ దేమి తప్పు నీవల్లఁ గలదా
తెలసుకో నీకు నీకే తేటతెల్ల మిఁకను

చ. 2: ముక్కుపై వే లిడుకొంటే ముంచి యేపని కనుచు
గుక్కక తెలుపు మని కొంగు వట్టేవు
మక్కువ నీవల్ల ననుమాన మైనఁ గలదా
చక్క నీవే దిద్దుకొమ్ము చల మేల యిఁకను

చ. 3: తప్పక నేఁ జూచితేను తమకించితి ననుచు
కప్పి కప్పి నన్ను నట్టె కాఁగిలించేవు
యిప్పుడె శ్రీవెంకటేశ యెనసితి విటు నన్ను
అప్పటి కిప్పుడు నీవే అందము సేసుకొమ్మి

రేకు: 0393-6 వరాళి సంపుటం: 11-558

పల్లవి: చేతికి లో నైనవారిఁ జెతురా పగవా రైన
కాతరాన నీవే కళవళించితివి

చ. 1: యెట్టకేలకును నిన్ను యింటికిఁ బిలచుకొంటి
చుట్టమ నయినదాన సూడు వట్టేనా
యిట్టె నీ కెవ్వతె చెప్పె యింతసేతుఁ జేయ నని
నెట్టన నాగుణ మెల్ల నీ వెరఁగవా

చ. 2: చెక్కు నొక్కి చేత మొక్కి సేవ లిన్నియునుఁ జేసె
మొక్కలాన నింక నిన్ను మోస వుచ్చేనా
యెక్కడిబుద్ధి దలఁచి తేల సిగ్గు వడ నీకు
యిక్కువ నీ వా సంది యిటువంటిదా

చ. 3: మాఁగినమోవి యిచ్చి మంతానలు నీతో నాడి
కాఁగిట నిన్నుఁ గూడి ఘాత సేసేనా
యేఁగివచ్చి శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
నాఁగువారె వలపులు నమ్మి కియ్య వలెనా

రేకు: 0394-1 గుండక్రియ సంపుటం: 11-559

పల్లవి: నీవే మంచివాఁడ వయ్యా నేనే వీరిడిఁ గాని
భావించి నామంకు నేనే పాపఁగల నింకను

చ. 1: సారె సారె నిన్ను దూరి సణఁగులే యాడితిని
భారపు నీసతులకుఁ బగ యైతిని
యీరీతి నిన్నుఁ జేసి యేఁటిజన్మ మెత్తితినో
తేరకొన నన్ను నేనే తిట్టుకొంటి నిందుకు

చ. 2: కపటాన నీమీఁద గబ్బిచూపు చూచితిని
కపురుల నీమనసు గలఁచితిని
యిపు డిందు కొడిగట్టి యెందుకు మంచిదాననో
వుపమించి నాకు నాకే వుస్సు రంటి నేను

చ. 3: అట్టుగఁ నిన్నుఁ గూడి యుఱక యలయించితిని
కట్టఁగడ నిన్నుఁ దిరుగ నీనైతిని
యిట్టినన్ను శ్రీవెంకటేశ నేఁడు గూడితివి
నట్టనడమ నిందుకే నవ్వుకొంటి నేనూ

రేకు: 0394-2 కేదారగౌళ సంపుటం: 11-560

పల్లవి: విచ్చనవి డాయ నేఁడు వెర పేల యిఁక నీకు
నిచ్చల మాయమనసు నే మే మనే మయ్యా

చ. 1: కన్నుల మొక్కితిమీ కాఁకలఁ జిక్కితిమీ
సన్నలు మాతో నింకాఁ జాలదా అయ్యా
వెన్నెలలే యెండ లాయ వేగి యిది వొ ద్దాయ
నిన్నుఁ గాక వచ్చె నిట్టె నే మే మనే మయ్యా

చ. 2: యిచ్చక మాడితిమీ యింతగా నోడితిమీ
మచ్చిక లింకా మాతో మానవా అయ్యా
రచ్చలో నిన్నుఁ గంటిమి రాతిరే వింటిమి మాట
నెచ్చెలిచేఁ జెప్పింపేవు నే మే మనే మయ్యా

చ. 3: కుందువ తెరిగితిమీ కాఁగిటఁ గరఁగితిమీ
సందడి నవ్వేవు మాతో చలమా అయ్యా
యిందుకె శ్రీవెంకటేశ యిటు నన్నుఁ గూడితివి
నింద లెల్లాఁ బాసె నిన్ను నే మే మనే మయ్యా

రేకు: 0394-3 ముఖారి సంపుటం: 11-561

పల్లవి: ఒద్ద నున్నదాన నేను వొక్కటి గాఁ దాడవా
దిద్దుకోఁ గలమా ట్టెల్ల తేరుచుకొ మ్మనవే

చ. 1: తన మేలే కలితేను తాపముఁ బాసేఁ గాక
ఘనుఁడు నిన్నే లంపె యిక్కడికి నేఁడు
మనసుతో నున్నదాన మారుమాట లాడేనా
మనుపటివారి బాస ముగియించు మనవే

చ. 2: యేకత మైనవేళ యిట్టె నే వచ్చేఁ గాక
యీకడ మాయింటికిఁ దా నేల వచ్చీనే
చేకొలఁదిదాన నేను చిత్తము నొప్పించేనా
పై కొన్న వారి పొందులపని దీర్చు మనవే

చ. 3: నే వెట్టినట్టిదాన సేవలు సేసేఁ గాక
ఆస నేల వేఁడుకోనీ నప్పటిఁ దానూ
వేసరక నన్నును శ్రీవెంకటేశ్వరుఁడు గూడె
రాసి కెక్కె నీవలపు రవ్వ మాను మనవే

రేకు: 0394-4 ఆహిరి సంపుటం: 11-562

పల్లవి: నాతో నూరకే నీవు నవ్వేవు గాక
రాతిరి నీమాఁట వూరక పోవ నిచ్చేవా

చ. 1: కొంకక నీవును నేనుఁ గూడి యున్న రతివేళ
బింకము లాడుచు నట్టె పెనఁగితివి
అంకెల నాకుచములు అంతవేఁగు లని నీవు
జంకెనతో ములిగేవు సత్తు వెల్లా నిట్టిదా

చ. 2: మంచముపై నిద్దరము మంతన మున్నంతపడి
కంచువలె వాఁగెను నీ గబ్బికుత్తికె
కొంచపు నామాట లివి కొండలనెల లనుచు
యించుకలో భ్రమసేవు యిట్టిదా నీవోరుపు

చ. 3: మోవి మోవిఁ గూడి తేనె ముసరి యానినఁదాకా
నీవు నే న నెరఁగవు నిండఁ జొక్కుచు
శ్రీవెంకటేశుఁడు గోరఁ జెనకితేఁ దెలిసేవు
యీవల నీతో కూటము లిటుంటివా

రేకు: 0394-5 సామంతం సంపుటం: 11-563

పల్లవి: అటువంటివాఁడవా అద్దో నీవు
నటన మొకమోటాలు నడుపేవు గాకా

చ. 1: తలఁపులోపల నీకు తగులు గలిగితేను
అలరి రా కుండుదువా అక్కడ నీవు
చలముల నెవ్వతో జాగులఁ బెట్టుక నిన్ను
వెలి లోను మఱపించి వెట్టిఁ జేసెఁ గాకా

చ. 2: కడుఁ దమకము నీకుఁ గమ్మి పెరరేఁచితేను
అడరి నాతో మాట లాడ కుందువా
వడి నెవ్వతో నిన్ను వాకట్టు గట్టుక యింత
ముడి వెట్టి విడిచి తా మొప్పెఁ జేసెఁ గాకా

చ. 3: తటుకన నన్నుఁ గూడేదయ నీకు లే కుండితే
ఘటన నెదురుకొని కాఁగిలింతువా
యిటువలె శ్రీవెంకటేశ కడపలోన
సటల కెవ్వతో నిన్ను చండి సేసెఁ గాకా

రేకు: 0394-6 సామంతం సంపుటం: 11-564

పల్లవి: సరవు లెరఁగ మయ్యా చాలు నింత కోపము
కరగించి సొలసితే గర్వ మనేవూ

చ. 1: కందువలుగా నీకుఁ గతలు నేఁ జెప్పఁ గాను
అంది నీమీఁద బెట్టుక అట్టె నవ్వేవు
యిందు రమ్మనుచు నిన్ను నింటికిఁ బిలచుకొంటే
యెందో పో నియ్య ననుచు నెమ్మె చూపేవూ

చ. 2: వద్ద నుండి సతులను వారి వీరిఁ జూపితేను
అద్దో నింద లాడె నంటా నాన వెట్టేవు
తిద్దుకో కస్తూరిబొట్టు తెర దిగ వేయు మంటే
గద్దించి యట్టె నన్నుఁ గాఁగిలించేవూ

చ. 3: పూస గుచ్చినట్టు నీకు బుద్దులు నేఁ జెప్పితేను
ఆసతో నామోవి మోవి నందుకొనేవు
వానితో శ్రీవెంకటేశ వడి నన్నుఁ గూడితివి
రాసి కెక్కితి వంటేను రతికిఁ దీసేవూ

రేకు: 0395-1 శుద్ధవసంతం సంపుటం: 11-565

పల్లవి: ఎంతవాఁడ వైన నిన్ను నింత సేసితి
యింతిని నాయపరాదా లెట్టోరిచే వయ్యా

చ. 1: చేర రమ్మంటే రా నైతి చెక్కులు చేత గిల్లితి
గారవించఁగా నిన్ను గసరితిని
కూరిమి గొసరఁగాను కోపాన జంకించితిని
యీరీతి నాయపరాధా లె ట్టోరిచే వయ్యా

చ. 2: మనసు నొప్పించితిని మాట లెల్లా నాడితిని
చెనకఁగా వద్దని పైఁ జేయి వేసితి
పెనఁగితి నీతోడఁ బ్రేమము రెట్టించఁగాను
యెనసి నాయపరాదా లె ట్టోరిచే వయ్యా

చ. 3: కందువులు నీ వంటఁగా గాఁగిలించితి సిగ్గున
విందుల నీరతులకు వేసరుకొంటి
అందుకొని శ్రీవెంకటాధిప నిన్నుఁ గూడితి
నిందు నాయపరాదా లె ట్టోరిచే వయ్యా

రేకు: 0395-2 సామంతం సంపుటం: 11-566

పల్లవి: విన్నప మొక్కటే నీకు వేవేలకు
మన్నించక నీకుఁ బోదు మామనసు నీది

చ. 1: చేరి మొక్కే వారమూ సేవ సేసేవారమూ
యేరితి మాట లాడినా నే మాయ నీకు
నేరనివారు దిట్టితే నీకుఁ బోదు బుద్ధి చెప్ప
భారము నీదే సు మ్మయ్యా పడఁతినే నీకు

చ. 2: నీతోడివారమా నీసరివారమా నేము
యీతల నేఁ గైకొన్న నే మాయ నీకు
కాతరాన నే రా కున్నఁ గదియక నీకుఁ బోదు
నాతప్పులు నీవి సుమ్మీ నాపతిని నీవూ

చ. 3: కాంతుఁడ శ్రీవెంకటేశ కాఁగిటిలోని వారమూ
యెంత నిన్ను జంకించినా నే మాయ నీకు
అంతరంగ మైనవారి నాదరించ కిఁకఁ బోదు
పంతము నీది సుమ్మీ బడిదాన నేను

రేకు: 0395-3 సామంతం సంపుటం: 11-567

పల్లవి: ఇయ్యకో లయినమీఁద నిఁక నేలా
నెయ్యము లాతఁడు నాపై నెరపీఁ జూడరే

చ. 1: యెన్నినేరా లైనఁ గానీ యెక్కడ నైనా నుండనీ
వన్నెగా నేర మ్మంటే వచ్చెఁగా తాను
మన్ననలు నా కిచ్చె మాఁటలూ నాచేత వినె
మున్నిటి సుద్దులిం కేమీ ముదులకించకురే

చ. 2: యెం దైనా సన్న సేయనీ యెవ్వ తైనాఁ గూడనీ
యిందు నాపై నాన వెట్టె నిప్పుడే తానూ
అంది నాపైఁ జేయి వేసీ నంతరగ మెల్లఁ జెప్పె
నింద లాడేమాట లెల్ల నిలువఁ బెట్టకురే

చ. 3: మన సెట్టైనై నుండనీ మంతనాలె యాడనీ
కొన కెక్కె నను నేఁడు గూడెఁగా తాను
యెనసెను శ్రీవెంకటేశ్వరుఁ డీతమితోడ
నను పైతి మిద్దరము నవ్వులు నవ్వకురే

రేకు: 0395-4 శుద్ధవసంతం సంపుటం: 11-568

పల్లవి: చెల్లఁబో నామన సింక సిగ్గు వడదు
పల్లదాన నీకు నేల భ్రమసితినో

చ. 1: అడరి నీవు మొక్కఁగా నాపె నిన్నుఁ దిట్టఁ గాను
నడుమ నూరకే నాకు నవ్వు వచ్చెను
వడిఁ జనవు గలట్టివారు ని న్నేమి చేసినా
తడవి నీపై నా కేల దయ పుట్టెనో

చ. 2: చెఱఁగు నీవు ముట్టఁగ చేతు లాపె దొబ్బఁ గాను
కఱకుఁ బెంజెమటలు గారీ నాకు
గుఱి యైనవారు నీతో గొడవలు వెట్టుకుంటే
అఱిమఱి నే నేల అడ్డము వచ్చితినో

చ. 3: కాని మ్మని యాపె రాఁగా కాఁగిట నీవు నించఁగా
తానక మై నావలపు తల కెక్కెను
దీనికె కా నన్నుఁ గూడితిని శ్రీవెంటటేశుఁడ
కానీ లే నీ కెంత నేను కైవస మయితినో

రేకు: 0395-5 శంకరాభరణం సంపుటం: 11-569

పల్లవి: ఏమియుఁ గొలుప వింక నేఁటి మాటలూ
యీమన సెల్లఁ గంటిమి యిఁక నేటి మాటలు

చ. 1: వున్నతి నీ హరములు వొకతెమెడ నుండఁగ
నెన్నుకొంటి విందాఁక నేటి మాటలు
నిన్ను సతు లెల్లాను నేరము లెంచే దెల్లా
నిన్నిటాను సరి వచ్చె నిఁక నేటి మాటలు

చ. 2: మేలిమి వింతవాసన మేన నీవు నించుకొని
యేల న న్నొడఁబరచే వేఁటి మాఁటలు
పాలించి యాపెకు నీవు బాస లెల్ల నిచ్చి వచ్చి
యీలీల ముచ్చట లాడే విఁక నేఁటి మాఁటలు

చ. 3: నవ్వుతా నొకతెతోడ నంటు సేసితి విందాఁక
యివ్వల నన్నుఁ బిలిచే వేఁటి మాటలు
రవ్వగా శ్రీవెంకటేశ రతి నన్నుఁ గూడితివి
యెవ్వతెతోడుత నీకు నిఁక నేఁటి మాటలు

రేకు: 0395-6 హిందోళం సంపుటం: 11-570

పల్లవి: కామిన యప్పటినుండి కాచు కున్నది
యీా మోహ మోఅఁగ కున్న నెగ్గు వట్టుఁ జుమ్మీ

చ. 1: చక్కఁ జూడ రాదా సతి నిన్నుఁ జూడఁ గాను
యెక్కడో పరా కై యేమి సేసేవు
మొక్కి నాపెవిద మెంత ముంచి నీరాజస మెంత
తక్కు లేక మాన కున్న తమకించుఁ జుమ్మీ

చ. 2: మాట లాడ రాదా మగువ నిలుచుండఁగ
నేఁటికి నీకుచ్చితము లేల చూపేవు
మేఁటి యాపెప్రియ మేడ మించిన ఈ బలు మేడ
నీటుతో మన్నింప కున్న నేరమి యౌ జుమ్మీ

చ. 3: చిత్తగించ రాదా చెలి వద్దఁ గూచుండఁగ
యెత్తిన నీ యెమ్మె లింక నేల మానవూ
పొత్తుల శ్రీవెంకటేశ పొందితి వీపె నింతట
హత్తి యిట్టె వుండ కున్న నాఅడి యౌఁ జుమ్మీ

రేకు: 0396-1 లలిత సంపుటం: 11-571

పల్లవి: ఏ మయ్యు రమణుఁడ యెంత సేసేవూ
భామ నిన్నుఁ దలపోసీఁ బైకొనుదాఁకాను

చ. 1: చింతలచిగురు గోసీఁ జిత్తములోనఁ
గాంతుఁడ ని న్నెదుటనుఁ గన్నదాఁకాను
పొంతఁ బ్రియములఁ జేసీ బోనాలు
సంతతపు వలపుల చవి గొనుదాఁకాను

చ. 2: వెదచల్లీఁ జీఁకటులు వేనలివెంట
అదె నీవిరహతాప మాఁపఁగ లేక
తుదుచూపులనె కట్టె దోరణాలు
వదలక నీ వింటికి వచ్చినదాఁకానూ

చ. 3: ముగ్గులు వెట్టీఁ జెమటుమత్తెములను
అగ్గ మై నీవు తనుఁ బెం డ్లాడుదాఁకాను
సిగ్గుదేరఁ గూడితివి శ్రీవెంకటేశ
అగ్గల మై నీకు మొక్కె నట్టె యిందాఁకానూ

రేకు: 0396-2 సామంతం సంపుటం: 11-572

పల్లవి: రాజసపుదాన నంటా రవ్వ సేసేరు గకన
వోజ నా కిటువంటిదె వూహించుకొనరే

చ. 1: వొలిసీ నొల్లమితోడ వూరకె తా నుండఁ గాను
బలిమి సేసీ పెనఁగఁ బాడి యౌనా
పిలిచినప్పుడు మరి ప్రియముతో వచ్చేఁ గాని
తలఁగి లోననే వుండేఁ దతి యెరిఁ గుండరే

చ. 2: పంతము ముంగిట వేసి పరాకుతో నుండఁ గాను
పొంతఁ జేసన్నలు చూప బుద్ది వుట్టునా
చింతతోఁ గావలె నంటే చెప్పినట్టు సేసేఁ గాని
మంతనానఁ బండి వుండేమన సెరిఁ గుండరే

చ. 3: బయలు మెరసి తానె పైకొని న న్నంటఁ గాను
నయ మిచ్చి కూడ కున్న నాయమా నాకూ
క్రియతో శ్రీవెంకటాద్రిగిరి నితఁడె కూడె
దయ తనపాటి నాకు తగ వెరిఁ గుండరే

రేకు: 0396-3 శుద్ధవసంతం సంపుటం: 11-573

పల్లవి: పలుకవే చెలియా పంత మెచ్చెనే
చలి వాసి నీవలపు చవు లెక్కెనే

చ. 1: నీ వెంత గోపగించి నేరుపుతోఁ దిట్టి నాను
వావిరి నిండా నవ్వు వచ్చీనె నాకు
కావిరితో నీ వెంత కాఁకా దేరఁ జూచినాను
మూవంకఁ దమకమే ముంచీ నాకు

చ. 2: పూఁచి పట్టి నీ వెంత బొమ్మల జంగించినాను
చాఁచి మందెమేళములు జూజుకొనీనే
రేఁచి నీవు నన్నుఁ గడు రేసు లెంత పుట్టించినా
తూఁచినట్టు కళ లెల్లా తుద ముట్టెనే

చ. 3: కాతరించి నీ వెంత కాఁగిట బిగించినాను
యీతల నా కంత కంత కింపు పుట్టెనే
యేతులకు శ్రీవెంకటేశుఁడ కని కూడితి
నీతలఁపు నావలెనె నేర్పున రూ పాయనే

రేకు: 0396-4 శంకరాభరణం సంపుటం: 11-574

పల్లవి: ఏమి గంటివి నావల్ల నిట్టె కాచుక తిరిగి
ఆమీఁదఁ గదా నిన్ను నట్టె మరిగితిని

చ. 1: వుపచరించ నేరక వూర కున్న నాపై నొక్క
నెపానఁ బాదాలు చాఁచి నీవే మెచ్చేవు
యెపుడూ సరస మాడ నెరఁగని ననుఁ దెచ్చి
వుపమల నాచేయి నీవొళ్లిపై వేసేవు

చ. 2: దవ్వుల నే నూర కున్న దగ్గరఁ బిలిచి నీవే
నవ్వులు నవ్వి నను నటియించేవు
జవ్వనపు సిగ్గుతోడ సరిఁ దల వంచుకొంటే
చివ్వన నామొగ మెత్తి చెక్కు నొక్కేవూ

చ. 3: మాట లాడ కుండితేను మంతనము గడియించి
నీటున మందెమేళాలు నీవే సేసేవూ
గాఁటపు శ్రీవెంకటేశ గక్కనఁ గూడితి నంటా
మాటికి మాటికి నన్ను మన్నించేవూ

రేకు: 0396-5 సాళంగం సంపుటం: 11-575

పల్లవి: కొమ్మలాల అమ్మలాల గోవిందరాజు మీపాల
నిమ్ములఁ జి క్కున్నే వాఁడు యిక నే మమ్మా

చ. 1: పరపుమీఁద నూరక పవళించుండుట గాని
నిరతి మీవిభునికి నిద్దుర లేదు
పరగ మీ రిద్దరును పాదములు పిసుకఁగ
సురతమర్మపుఁ గాఁకఁ జొక్కీ నదే

చ. 2: వున్నతితోఁ గొలు విచ్చి వుండుట యింతే కాని
కన్నులచూపు మీపైనే కదరమ్మా
మన్ననసతులు మీకు మాట లిట్టె యాడఁ గాను
విన్నవినకుల మెచ్చి విఱ్ఱవీఁగీ నదివో

చ. 3: పూఁచి భుజములు మూఁడై పొరలి వుండుట గాని
చాఁచినకరము మీకే సన్న సేసీని
ఆఁచి శ్రీవెంకటగిరి నదె తిరుపతిలోన
రేంచినమోహన గూడె రేయిం బగ లదివో

రేకు: 0396-6 రామక్రియ సంపుటం: 11-576

పల్లవి: ఇంత వెల్లవిరి గద్దా ఇంతుల వలపు లెల్లా
కాంతునికి నొప్పగించి కాకు సేసేవూ

చ. 1: అందుపుఁజెక్కులతోడి యలమేలుమంగ నీ
వంది కైలా గియ్యవయ్య ఆతినికిని
కందువ కన్నులఁ జూచె కరఁగి వుందానవు
యిందుకే యీతఁడు నవ్వీ నిది గదవమ్మా

చ. 2: బంగారువన్నెలతోడిపడఁతి
సంగతి నీపతికొప్పు చక్కఁ బెట్టవో
ముంగిట నాతఁ డుంటెనె మురిసేవూ
చెంగట నాతఁ డేసుద్ది చెప్పీఁ జెలులకూ

చ. 3: కప్పురపువాసనకలికి
యిప్పుడె శ్రీవెంకటేశు నెనసితివి
తప్పక చూచి మఱియుఁ దమకించేవూ ఆతఁ
డప్పటి నిందుకు లో నాయఁ గదవమ్మా

రేకు: 0397-1 దేసాళం సంపుటం: 11-577

పల్లవి: వెఱవకు నిన్ను నంత వేసరించను
నెఱి నీగుణములు నే నెఱఁగనా

చ. 1: చనవు సేసుక నే నీసరుసఁ గూచుంటిఁ గాక
ననుపు చెప్పుక నీతో నవ్వ వచ్చేనా
వెనకటివాఁడవా నీవిధము నే నెఱఁగనా
చెనిక నీతో నేరమి సేసుకొనేనా

చ. 2: కపట మెఱఁగనా కతలు చెప్పితిఁ గాక
నెపమున వావులు నే నీకుఁ జెప్పేనా
కపురుమొకదాకిరి గడించ నీకు వచ్చునా
యిపు డిట్టె నీకు దా యెస పెట్టేనా

చ. 3: కైవసము గాఁగా నిన్నుఁ గాఁగిట నించితిఁ గాక
భావ మెఱఁగక నిన్నుఁ బైకొనేనా
శ్రీవెంకటేశుఁడ నే మెచ్చి తలమేలుమంగను
నీవే నే నని కాక నీక మొక్కేనా

రేకు: 0397-2 కాంబోది సంపుటం: 11-578

పల్లవి: ఇట్టె వీడె మందుకోవు యెందాఁకాను
పట్టపగలే వచ్చితి పరా కేఁటి కోయి

చ. 1: కంటికి నిద్దుర రాక కాచుకుందాన నీరాక
యింటికి రా వే మోయి యెందాఁకనూ
జంట లైనసతులతో జాణతనా లాడఁ బట్టె
వెంటనే తిరుగ కనువేళ గాన నోయీ

చ. 2: నెయ్యమున విందు చెప్పి నే నీకు మొక్కఁగాను
యియ్యకొన వే మోయి యెందాఁకనూ
యియ్యేడ నందరితో నీ కేకతా లాడనే పట్టె
అయ్యో నిన్ను నిష్ఠూరము లాడ నేర నోయీ

చ. 3: కంకి నేసి రతులను కాఁగిటఁ గూడితి నిన్ను
యింకాఁ దనియ వే మోయి యెందాఁకను
అంకెల శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
సంకె లేదు వురుముపై సత మైతి నోయి

రేకు: 0397-3 మాళవి సంపుటం: 11-579

పల్లవి: పో పో నీపొందు చాలు పొసగ దిఁక
వైపు గా దనుచు నాతో వడిఁ బోరాడేనా

చ. 1: అప్పుడే ఆపెమాఁటకు నదలించ వలదా
విప్పుచు నన్నుఁ దిట్టఁగా విందురా నీవు
చెప్ప నేల నీతోడిచెలి మేఁటి చెలిమి
ముప్పిరి చుట్టమ వంటా మొగము చూచేదా

చ. 2: మచ్చురాన నవ్వఁ గాను మానుపంగ వలదా
వొచ్చిన నావేళ నా పెవొద్ద నుందురా
యిచ్చకాన నీకు నాకు నేఁటి మొగమోట మింక
వచ్చినదే పదివేలు వాదులాటే చాలును

చ. 3: పొత్తునఁ గూచుండితేను పొ మ్మనంగ వలదా
అత్తల సరి నేతురా ఆపెను నన్ను
అత్తిన శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
బత్తితో నన్నుఁ గూడితి పంత మేఁటి పంతమూ

రేకు: 0397-4 కన్నడగౌళ సంపుటం: 11-580

పల్లవి: ఎట్టు సేసినా నీచిత్త మింతే కాక
తట్టి నిన్ను వెగ్గళించఁ దగునా మాకును

చ. 1: మంతన మాకెతో నాడి మరి నన్నుఁ గని లేచి
చెంత నా కిచ్చక మాడి చెక్కు నొక్కేవు
యింతటి మగవాఁడవు యేల నీ కింత వెఱపు
కాంతలము యేమి సేయఁ గల మయ్య నిన్నును

చ. 2: యిద్దరూఁ గూ డుండఁగాఁ జూ చిట్టె నేఁ దిరిగి రాఁగా
గద్దించి నాకొంగు వట్టి గడె వెట్టేవు
వుద్దండీఁడవు మాతోడ నూర కనుచర ణేల
అద్దో వూడిగపువార మవుఁ గా దనేమా

చ. 3: యిట్టె యాచెలియఁ గూడి యే మైనాఁ జేసుకొమ్మని
వొట్టుక నాపైఁ దెచ్చి వొళ్లు వేసేవు
నెట్టన శ్రీవెంకటేశ నే నలమేల్మంగను
అట్టడి నిన్నుఁ గూడి యాఱడికి నోపుదుమా

రేకు: 0397-5 రామక్రియ సంపుటం: 11-581

పల్లవి: వేళ గానివేళ వచ్చి వెదకేవు
యేలినరమణునితో నింత రట్టు గలదా

చ. 1: యేచిన నీనాయకుఁడు యింట నున్నాఁ డంటావచ్చి
చూచేవు నలుదిక్కులు సోదించి
యీచాయ నుండె నాతఁడు యిట్టె పిలుచుక వచ్చేఁ
గూచుండవమ్మా నీవు కోపగించుకొనకా

చ. 2: వొద్ద నెవ్వతెఁ బెట్టుక వున్నాఁడో యనుచు
నద్దమరేతిరి పొంచు లాలకించేవు
నిద్దురతో నెం దున్నాఁడో నే నతనిఁ దోడితెంచే
వద్దు వీడె మిందవమ్మ వట్టిచల మేఁటికి

చ. 3: మామాట వినక నీవు మాడుపుటింటిలో చొచ్చి
కామించి శ్రీవెంకటేశుఁగని కూడితి
యే మమ్మ అలమేల్ మంగ యింటికే యీతనిఁ దెచ్చే
ప్రేమాన నా వెంట రావో పెనఁగించుకొనకా

రేకు: 0397-6 రామక్రియ సంపుటం: 11-582

పల్లవి: ఆతని మంచితనము అట్టె నా మంకుఁదనము
ఘాతల నే నెంచుకొంటేఁ గరఁగీ నామనసు

చ. 1: యింటివాకిటఁ దా నుండి యిట్టె నన్నుఁ బిలువఁగ
అంటఁ గాక వున్నదాన ననిపించితి
బంటువలెఁ దా వాకిటఁ బవళించి వుండఁగాను
మంటమారితనమున మాటలాడ నైతిని

చ. 2: పానుపుమీఁదికి వచ్చి పైఁ జేయి వేసితేను
ఆన వెట్టి నిద్ర వచ్చీ నని తోసితి
దానికిఁ గోపించుకోక తతి గాచు కుండఁగాను
లేనగవుతోఁ గొంత లేచి మొక్క నైతిని

చ. 3: బలిమి శ్రీవెంకటాద్రిపతి నన్నుఁ గూడఁ గాను
మెలుపున నాచేయి మీఁదు సేసితి
అలమేలుమంగ నేను ఆతఁడే నన్ను మెచ్చఁగా
కిలకిల నవ్వుకొంటా కిన్నెర మీఁటితిని

రేకు: 0398-1 లలిత సంపుటం: 11-583

పల్లవి: మానవు నీవోజ లింకా మా కేల యింత
కానీలే మగవాఁడవు కాకు సేసేవా

చ. 1: వాసికి నీమీఁద నేను వలపు చల్లితిఁ గాక
యీసుల యెగసక్యాన కింత నవ్వేనా
చేసిన నీచేఁతలు సిర సూఁచుకొంటిఁ గాక
పాసినతమకానకుఁ బగ చాటేనా

చ. 2: యిచ్చగించి నీపైఁ జేయి యిట్టె నే వేసితిఁ గాక
చొచ్చి నీమేనిగురుతు చొప్పు లెత్తేనా
మెచ్చి నీ వీపనులకు మేఁటి వని యుంటిఁ గాక
విచ్చనివిడిగా నిన్ను వెంగె మాడేనా

చ. 3: కందువకు నీవు రాఁగాఁ గాఁగిట నించితిఁ గాక
అంది నిన్ను బలిమి సేయఁగ వచ్చేవా
అందపు శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
విందువలెఁ గూడితివి వేసరించేనా

రేకు: 0398-2 హిజ్జిజి సంపుటం: 11-584

పల్లవి: బోన మెల్లా జల్ల నారి పొద్దు వోయను
పూని నేము నీ కిట్టె బుద్ధి చెప్ప వలెనా

చ. 1: పొత్తుకు నీవు రమ్మంటేఁ బొలఁతి దా సిగ్గువడి
చిత్తములోఁ గొంకి కొంకి చెక్కు చేఁ బెట్టి
హత్తి యాపెకు నీ మీఁద నాన లేల పెట్టేవు
బత్తి గలితేఁ జేయి వట్టి తియ్య రాదా

చ. 2: కడి సేసి చేతి కియ్యఁగా నింతి నవ్వుకొంటా
చిడుముడి మారుమోము సేసుకొని
అడరి రా దాయ నంటా నాపెతో నలుక లేల
కడు నీకు వేడు కైతే కమ్మి మొక్క రాదా

చ. 3: సతిఁ గాఁగిలించి పట్టి చవులు నోటి కియ్యఁగ
రతి బువ్వ మారగించి రమణి మెచ్చె
యిత వై శ్రీవెంకటేశ యీ యలమేలుమంగను
మతకానఁ గూడితివి మరి వేళ లేదా

రేకు: 0398-3 లలిత సంపుటం: 11-585

పల్లవి: ఎంత మొగ మోడి యున్నా నెఱఁగవు నీయంత
పొంతనె నా కిఁక నీవు బుద్ధి చెప్ప వలెనా

చ. 1: మనసు నొవ్వదు గదా మాటలాడే నీతోను
వినుని నిజ మాడెటి వెఱ్ఱిదానను
తనివోక వాడవారిఁ దమకాలు రేఁచి వచ్చి
యెనసి నాతో నవ్వేవు యేది నిజ మయ్యా

చ. 2: సిగ్గు పడవు గదా చెలులఁ దారుకాణించే
కగ్గి కల్ల కోరువనిగబ్బిదానను
వెగ్గళించి వీరి వారి వెంటనె పెట్టుక వచ్చి
అగ్గ మైనవాఁడ నంటా నాన వెట్టే వయ్యా

చ. 3: నెలవి నవ్వవు గదా చేతిలోనే వాసి చూపే
వలచి యెగ్గెంచని భావపుదాననూ
కొలఁది మీఱఁగ నన్నుఁ గూడితి శ్రీవెంకటేశ
అలమేలుమంగను నే నట్టె కావవయ్యా

రేకు: 0398-4 సారంగనాట సంపుటం: 11-586

పల్లవి: ఎటువంటి చుట్టమే నా కెంత కలసినవాఁడే
సటలు సేసి వీని చంద మేమి చందమే

చ. 1: అలుక సేసుక నేనే అవ్వలిమో మై యుండఁగ
పిలిచీ నూరక నన్నుఁ బేరుకొని
పలుక కుండఁగఁ దానె పకపక నవ్వుకొంటా
నిటుచున్నాఁ డిదె వీనినేరు పేమి నేరుపే

చ. 2: ముడిపడ్డ బొమలతో ములుగుతా నుండఁగాను
తడవీ నూరక నన్నుఁ దతి గొని
చిడుముడితో నుండగఁ జేతులు చాఁచుకొంటా
వొడివట్టి నన్నుఁ దీసీ వోరు పేఁటి వోరుపే

చ. 3: పట్టినచలముతో నేఁ బవళించి వుండఁ గాను
వొట్టుక దగ్గరి నామై వొళ్లు వేసీని
అట్టె శ్రీవెంకటపతి అలమేలుమంగ నేను
తిట్టఁగానె కూడె వీనితెగు వేఁటి తెగువే

రేకు: 0398-5 కొండమలహరి సంపుటం: 11-587

పల్లవి: మఱచినవారి నేల మఱవ నియ్యవు మమ్ము
వెఱచినవారి నేల వెఱపించ నేఁటికే

చ. 1: నీకుఁ గట్టినట్టితాళి నీమారు సేసుకొని
యేకచిత్తమున నే నింట నుండఁగా
పైకొని పిలిపించేవు పడఁతుల నంపి నన్ను
దీకొని మమ్మింత సేసి దిమ్ము రేఁచ వలనా

చ. 2: సేస వెట్టిన నీరూపె చిత్తములో నించుకొని
పోసరించి పొద్దు గడపుచు నుండఁగా
ఆస చూపి నీవు నాకు నప్పటి సన్న సేసేవు
వాసితో నుండినవారి వలఁ బెట్ట వలెనా

చ. 3: తప్పక చూడఁగ నీకు దగ్గరనె నిలుచుండి
దప్పులనుఁ బెడఁబాసి తని వొందఁగా
అప్పుడె శ్రీవెంకటేశ అలమేల్మంగను నన్ను
ముప్పిరిగా నిట్టె కూడి మోహించ వలెనా

రేకు: 0398-6 భవుళి సంపుటం: 11-588

పల్లవి: యోగి భోగి నటనం కురు పుల్లాసాననమోహన
సాగరోద్భవకన్యకాపతి సారస శ్రీవెంకటగిరియోగి

చ. 1: లీలా నక్షత్రజాలాధికరండ
మాలాత్త్రివిక్రమాకారయోగి
హలాహలకర కోలాహలకర
శూలాయుదవంద్య పరిపూర్ణయోగి
కాళివినుత ప్రహేళిచరితాహి
మౌళిఘనసారవిన్యస్తయోగి

చ. 2: గరుడపక్షివాహగమనవిహరి
గురునాగశైలేశ గోరక్కు రే
మురళీనాదశృంగ మోహనమురారి రే
కరుణానందసాగరశాయి రే
పరమ శ్రీవెంకటపతియవతార
నరరూపగోపకానాథ గోరక్కు రే

రేకు: 0399-1 సాళంగం సంపుటం: 11-589

పల్లవి: ఆఁడువార మే మనేము అట్టె నీ వేమి సేసినా
నేఁడు పుణ్యాపాపాలు నీచేతిది గాకా

చ. 1: నగుతానె ఆపెనూ నన్నునూ వాదులు వెట్టి
పగ సాదించితిగా పంతగాఁడా
తగవులు చెప్పె నంటా దగ్గరించి మావలపు
తగిలించుకొంటివి గా తక్కరికాఁడా

చ. 2: మచ్చిక నే మాడెటిమాటలు వేలుచుకొని
కుచ్చితాలు సేసితిగా కొయ్యకాఁడా
కొచ్చి కొచ్చి నీ మీఁదఁ గోరి యాన లెల్లాఁ బెట్టి
తెచ్చితిగా నీయింటికి దిమ్మరీఁడా

చ. 3: వాసులు మాకు నెక్కించి వద్దఁ బాయకుండఁ జేసి
సేసలు వెట్టితివిగా సిగ్గరీఁడా
ఆసల శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
నాసరి నాకెఁ గూడితి నాటకీఁడా

రేకు: 0399-2 సామంతం సంపుటం: 11-590

పల్లవి: తరుణి నైనా నేను దయ లేనిదాననా
వెరవుతో నీ వుండఁగా వేగిరింతునా

చ. 1: మొగము చూచి నాకు మందట నిలుచుండఁగా
పొగరుముంపున నిన్నుఁ బో మ్మందునా
నిగిడి నీవొళ్లఁ దొల్లి నేర మేమి గలిగినా
పగటున నప్పు డట్టె పంగింతునా

చ. 2: మంచివానిలె నాతో మాట లిట్టె యాడఁ గాను
చంచలించి నిన్ను వద్దు చాలు నందునా
యెంచుకొని నీ వెవ్వతెయింట నుండి వచ్చినాను
మంచ మెక్కి యింక నీతో మారుకొనేనా

చ. 3: కడుఁ జుట్టమ వై నన్నుఁ గాఁగిటిలోఁ గలయఁగా
జడిసి వేడుక చెల్లించక వుందునా
అడరి శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
వడి నన్నుఁ గూడితివి వాసులు వట్టుదునా

రేకు: 0399-3 రామక్రియ సంపుటం: 11-591

పల్లవి: నిన్ను మెచ్చుకొనేవో నానేరుపు మెచ్చేవో కాని
పన్ని నీవూడిగానకు ప్రొడఁ జుమ్మీ విభుఁడ

చ. 1: చెక్కులు నీవు నొక్కఁగ చిత్తము గరఁగెఁ గాక
యెక్కువ కోప మెం తందు నిందాఁకను
తక్కరీఁడవు నౌదువు తగవరిని నౌదువు
చక్కఁ జాయకు రా నేను జాణఁ జుమ్మీ విభుఁడ

చ. 2: బాసలు నీవు సేయఁగఁ బరిణామ మాయఁ గాక
యీసు నీపై నే మందు నిందాఁకను
ఆస చూప నెరుఁగుదు ఆదరించ నెరుఁగదు
రాసి కెక్క నీ కిచ్చకురాలఁ జుమ్మీ విభుఁడ

చ. 3: మచ్చిక నీవు గూడఁగ మరి నే లో నైతిఁ గాక
యెచ్చుకుందు లెంచుకోవా యిందాఁకను
అచ్చపు శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
తచ్చి కూడితిని మేలుదానఁ జుమ్మీ విభుఁడా

రేకు: 0399-4 కేదారగౌళ సంపుటం: 11-592

పల్లవి: ఇప్పుడే వేరిగ మేల యిందుకుఁ గాను
వొప్పగించితిమి వల పోపరో విభుఁడా

చ. 1: నయగారినీమాటలు నమ్మకుండ నెట్టు వచ్చు
రయమును నీవా రైనరమణులకు
ప్రియము నీవు చెప్పఁగ బిగియఁగ నెట్టు వచ్చు
దయ నీకుఁ గలితేను తానే వచ్చీఁ గాకా

చ. 2: నంటున నీవు నవ్వఁగ నవ్వకుండ నెట్టు వచ్చు
జంట లైన సేసపాలసతులకును
వెంట నీవుదిరుగఁగ విడువఁగ నెట్టు వచ్చు
యింటికి విచ్చేసినప్పు డెనసేము గాకా

చ. 3: చేరి కాఁగిలించుకోఁగా సిగ్గువడ నెట్టు వచ్చు
కోరి నీ కెదురు చూచేకొమ్మలకును
ఆరయ శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
యీరీతిఁ గూడఁగ నిన్ను నియ్యకొనేఁ గాకా

రేకు: 0399-5 సామంతం సంపుటం: 11-593

పల్లవి: అప్పు డెంత లే దని నీ వాన వెట్టినా నమ్మదు
ముప్పిరి నాకుఁ గా నింద మోవ నీకు నేఁటికి

చ. 1: పట్టకురా నీవు మమ్ముఁ బలుమారు నీచేతుల
వెట్ట గాఁగినది మేను విరహనను
అట్టె నెవ్వతె నైన నంటఁ బోతే నాపె మరి
వట్టిసందేహలు నీపై వడిఁ జుట్టుఁ జుమ్మీ

చ. 2: మాటలాడకురా నీ నా మనసులు గలయఁగ
గాఁటపు నామన సెల్లఁ గలఁగినది
యీటున నాకలఁక నీ కిట్టె అంటితేఁ గనక
నాటకుఁడ వ నెవ్వతె నవ్వకుండుఁ జుమ్మీ

చ. 3: చూడకురా నాచన్నులు జొబ్బిలీఁ జెమటచేత
జోడుగా శ్రీవెంకటేశ సోఁకి నిన్నును
కూడితిని నన్ను నిట్టె కోరి యలమేల్ మంగను
యెడ నెవ్వ తైన నిన్ను నిఁక నవ్వుఁ జుమ్మీ

రేకు: 0399-6 ముఖారి సంపుటం: 11-594

పల్లవి: నీ కెదురు చూచి చూచి నెలఁత నన్నంపె నిదే
రాకుండితే నాపె వచ్చీ రావయ్య నీవూ

చ. 1: అప్పుడు నీ వాన వెట్టినది నమ్మినది గాక
తప్పులు వట్ట నేర దాతరుణి నిన్ను
నెప్పున నీ విందుకుఁ గా నీవేల వెరచి రావు
చెప్పేఁ గాని యింటికి విచ్చేయవయ్యా నేఁడు

చ. 2: నీసుద్దుల కెల్ల నాపె నెట్టన నోరిచెఁ గాక
సేసే నంటే నీ వింతిచేఁతకు వేలె
పాసి యిందుకుఁ గా సిగ్గుపడి యీడఁ గొంక నేల
సేసతో మాయింటికి విచ్చేయవయ్య ఘనుఁడా

చ. 3: ముంచి యలమేలుమంగ మొకమోడి కూడెఁ గాక
వంచే నంటే నాపె నీతో వాదు వెట్టదా
యెంచుక శ్రీవెంకటేశ యిందుకుఁ గా నవ్వ వేల
చించితి మాట యింకా విచ్చేయవయ్య యింటికి

రేకు: 0400-1 భూపాలం సంపుటం: 11-595

పల్లవి: అంతయను నిన్నుఁ బొందేయందుకొరకే
వింత సేసుక యిందుకు విసిగేవు సుమ్మీ

చ. 1: అంకెకు రానివేళ నాడుదు మే మైన నిన్ను
పొంకము వచ్చినవేళ పొగడుదుము
సంకె లేని మావంటి సతులకు నిది వోజ
పంకించి నీ విందు కెగ్గు పట్టేవు సుమ్మీ

చ. 2: బగి వాసి వున్న వేళ పగ చాటుదుము నిన్ను
మొగము చూచితేనె మొక్కుదుము
యెగసక్కేలె మావంటి యింతులకు సహజము
అగ డైతి నని నీవు అలిగేవు సుమ్మీ

చ. 3: తక్కించినప్పటివేళ తరిఁ జలపట్టుదము
గక్కనఁ గూడితేనె కరఁగుదుము
దక్కితి శ్రీవెంకటేశ తతి నలవేల్మంగను
వొక్క టైతి విది నాకు వొడఁబాటే సుమ్మీ

రేకు: 0400-2 దేసాక్షి సంపుటం: 11-596

పల్లవి: ఇంక నెన్నఁ డమ్మ నీ యెన్నిక జాణతనము
జంకించి మాటాడకున్న సతులఁ గైకొందురా

చ. 1: సూటిగా నిన్నుఁ దప్పక చూచీ నాతఁడు
వాఁటముగఁ దల యెత్తి వంచుకొంటాను
చీటికి మాటికిఁ దానె సెలసి సెలసి నవ్వీ
నాఁటదాన వాతనితో నౌఁ గా దనకుందురా

చ. 2: వేమరుఁ జేయి చాఁచి వేఁడుకొనీ నాతఁడు
సోమరించి దారిమొనాఁ జూపి చూపి
నేమములుఁ బచరించి నెలఁత లంటేఁ జెనకీ
చే ముంచి యాతని నీవు చిమ్మిరేఁచ కుందురా

చ. 3: సిగ్గు విడిచి కూడెను శ్రీవెంకటేశుఁడు
వొగ్గి తల రాయి సేసు కూర కైనాను
నిగ్గుల నలమేల్మంగ ని న్నతఁడు గలసెను
వెగ్గళించి నీవలపు వెదచల్ల కుందురా

రేకు: 0400-3 రామక్రియ సంపుటం: 11-597

పల్లవి: ఇంట నున్నవారము నే మెందు వొయ్యేము
దంటల మై నిన్ను నేము తప్పు వట్టెమా

చ. 1: నివ్వటిల్ల నీకన్నుల నిద్దుర దొట్టి వున్నది
పవ్వళించ రాదా పానుపుమీఁద
చివ్వన న న్నేల నీవు చేయి వట్టి తీసేవు
దవ్వుల మాతోడిపొందు తప్పి పోయినా

చ. 2: ఆసురుసు రెల్లా నీయంగముపైనే వున్నది
విసరించుకో రాదా వేగినంతాను
రసికుఁడ మ మ్మేల రతికిఁ బిలిపించేవు
వెస నెప్పు డైనా నిన్ను వెగ్గళించేమా

చ. 3: వేడుకలు నీ కెపుడు వెల్లివిరిసి వున్నవి
వీడె మింద రాదా వెర పేఁటికి
ఆడెనె శ్రీవెంకటేశ అలమేల్ మంగను నన్ను
కూడితివి యిఁక నీకు గురి దప్పీనా

రేకు: 0400-4 ఆహిరి సంపుటం: 11-598

పల్లవి: గక్కన నాతనిఁ గని గడ్డము వట్టి వేఁడుక
చెక్కు నొక్కినపుడుగా చింత లెల్లఁ బాసును

చ. 1: యే మని దూరితినో యెంత చిత్తము నొచ్చెనో
ప్రేమాన నాతఁడు నన్ను బిలిపించఁడు
మోము చూచి తనకు నేమొక్కే నన్నా నిందురాఁడు
ఆమని విరహతాప మడ్డ మేల వున్నదే

చ. 2: పాదము లొత్త నైతినో పంత మేమి యెంచినాఁడో
నాదెస చూడఁ జెలి నైనా నంపఁడు
ఆదరించి వచ్చే నంటే నట్టె తెల్లవారదు
సాదించి నావలపులే చలముతో నున్నవి

చ. 3: నివ్వెరగుతో నుంటినో నెప మేమి గలిగెనో
నవుచుఁ గాఁగిట నించి నాలి సేసీని
యివ్వల శ్రీవెంకటేశుఁడే నలమేలుమంగ
నువ్విళ్లూర నన్నుఁ గూడె నొద్దెనె దాఁగీని

రేకు: 0400-5 సామంతం-ఏకతాళి సంపుటం: 11-599

పల్లవి: నీమతకము లన్నియు నే నెరఁగనా
యేమి దలఁచుకొంటివో యింతలో నవ్వితిని

చ. 1: పిలిచినప్పుడె రాక పెనఁగి పెనఁగి నాతో
బలిమి వచ్చిన రాక పట్టఁ బనేది
అలుక సేసుకొంటివి అక్కడికిఁ బోవలసి
తెలుసుకొని యేఁటికో తిరిగి వచ్చితివి

చ. 2: తప్పక నేఁ జూడఁ గాను తల వంచి వంచి నీవు
యిప్పుడు నీవు చూచితే నియ్యకొందునా
అప్పుడే వెఱచితి వేయంగన గనునో యంటా
కొప్పు మాఁటు సేసుకొని గొబ్బునఁ జూచితివి

చ. 3: చెనకినప్పుడె లోఁగి చేతులఁ దప్పించుకొని
వెనక నన్నుఁ గూడితే వింత మానునా
అనుఁగు శ్రీవెంకటేశ అలమేలుమంగ నని
మన సిచ్చి యిప్పుడు గా మగుడఁ గూడితివి

రేకు: 0400-6 పాడి సంపుటం: 11-600

పల్లవి: అందుకే పో నవ్వు వచ్చీ నప్పటనుండి
అందుకు మొక్కఁ బోతేను ఆయములు సోఁకెఁగా

చ. 1: సంగడా లెత్తినచేయి చాఁచేవు మావురముపై
నంగనలము మా చన్ను లంత కోపునా
యెంగిలితమ్మ రాలెను యింతలో నీచేతిమీఁద
సంగతి నేమో సేయఁగ సరి నేమో యాయఁగా

చ. 2: విరులు ముడిచి నట్టిసిరసు మాతొడమీఁద
నెరవుగఁ బెట్టుకొని నిద్దరించేవు
పొరి నాపాదాలమీఁద బూవు లెల్ల రాలఁగాను
దొరతనానకు రాఁగా దొమ్మిపూజ లాయఁగా

చ. 3: గందము పూసినమేను కాఁగిట నన్నుఁ గూడఁగ
చిందే నా చెమట నీపై చిప్పిలఁగను
అందపు శ్రీవెంకటేశ అలమేల్మంగను నేను
కందువఁ గూడితి విట్టె కత లై నిలిచెఁ గా